# గృహవైద్యం

## మూలవ్యాధి

ఆభ్యంతరమైన రూక్షత్వం కారణంగా శరీరంలో అంతర్భాగాలన్నీ ఎండిపోయినట్లే, జీర్ణకోశంలోని భాగాలు ఎండిపోయి సంకోచ వ్యాకోచాలుచేయడం వీలుపడదు.

చక్రం తిరగడానికి అచ్చుమీద కందెన పూస్తాము. కందెన పూయకపోతే చక్రం సులభంగా తిరగకపోవడం మాత్రమేకాక, ఇనుము రాపిడివల్ల వేడిపుట్టి, ఆ వేడివల్ల నిప్పుకూడ పుట్టి, బండి మండిపోవడం కూడా కద్దు. భ్రమణంగాని, సంకోచవ్యాకోచాలుగాని జరిగే ప్రదేశంలో స్నిగ్ధత్వం, లేక స్నేహగుణం అవశ్యమనడానికి ఇది నిదర్శనం.

ఆభ్యంతర రౌక్ష్యంవల్ల అన్నాశయం, మలాశయం, ఆహార పచనపరిణామాలు చేసే ఇతరాశయాలకు సరైన విధంగా తమ తమ పనులు బాగాచేయడానికి శక్తిలేకపోతుంది. ఈ రూక్షత్వం కారణంగా శుష్కత్వం—ఎండిపోవడం— ఏర్పడుతుంది. విపరీతమైన ఉష్ణంకూడ కలుగుతుంది. ఈ ఉష్ణంవల్ల ఆహారం దుర్దగ్ధమై— విపరీతంగా పచనమై— మలం ఎండి రాతిముక్కలవలె,ఇనుపముక్కలవలె గట్టిపడిపోతుంది. అతి కఠినమైన మలబంధం కలుగుతుంది. మూత్రం అత్యల్పమవుతుంది. పొత్తి కడుపులో ఉబ్బరం, భారంగా ఉండడం మొదలయిన బాధలు పుడుతాయి. దుర్భరమైన బాధ ఏర్పడి, మలవిసర్జనకాలంలో మలానికి ముందుగాను, మలంతోను, మల విసర్జనానంతరమూ రక్తస్రావం ఏర్పడుతుంది.

కొన్ని సమయాలలో ఈ రక్తస్రావం అత్యధికంగా ఉంటుంది. మలాశయంలోను, మలద్వారంలోను సహింపరాని బాధ, మంట, పోటు మొదలయినవి కలుగుతాయి. ఈ రూక్షత్వం, వేడి చేరి, మలాశయంలోను, మలద్వారంలోను అభిఘాతం కలిగించి, మొలకలుకూడా పుట్టిస్తాయి. మలాశయంలో ఒక భాగం మల విసర్జనానంతరం మలద్వారం వెలుపలికి వచ్చి, స్వస్థానం పొందలేక నిలిచిపోతుంది. ఆ అవస్థలో మానవునికి నిలవడానికిగాని, కూర్చుండడానికిగాని వీలుపడదు. ఇలా కూర్చోలేక, నిలవలేక నేలమీద రెండు మోకాళ్ళు, రెండు అరచేతులు ఆనించి, నాలుగు కాళ్ళతో నిలబడే అవస్థ ఏర్పడుతుంది. ఇంతటి అవస్థలో మానవుడు ఎంతసేపు తపస్సు చేయుగలడు? నిద్రపోవడం ఎలాగు? వీటన్నిటికీ మూలకారణం ఆభ్యంతర రూక్షత్వం, దానికి సంబంధించిన మలబంధనమూను.

సాధారణ కాలంలో ఏదో కొద్దిగా మలబంధం గల వ్యక్తికి, ఒక విశేష పరిస్థితిలో ఆహారాదులలో కలిగిన అపథ్యంవల్ల, వాహనం దూరం రైలు ప్రయాణాలు చేయడం, రాత్రి ప్రొద్దుటలో నిద్ర పోగొట్టుకొని మేలుకొంటూ ఉండడం మొదలయిన కారణాలవల్ల శరీరంలో వేడి ఎక్కువై పైన చెప్పిన బాధలు కలుగవచ్చు.

ఇలా దినే దినే రక్తస్రావం చిరకాలం వరకూ జరుగుతూంటే, శరీరంలో రక్తం చాలక, చర్మం తెల్లబడి, బలహీనమై, పాండు రోగంగా పరిణమిస్తుంది. భ్రమ, మూర్ఛ మొదలయిన ఉపద్రవాలు, యకృత్సంబంధమైన (లివర్ సంబంధమైన) రోగాలుకూడా పుట్టవచ్చును. ఇదంతా మూలవ్యాధి లక్షణాల వివరణ.

### శ్రీహరి

ఆభ్యంతర రూక్షత్వం నివారించడానికి, పోగొట్టడానికి తీసుకొనవలసిన ప్రతిక్రియను గురించి గడచిన వ్యాసంలో విస్తారంగా చెప్పాను. ఆ ప్రతిక్రియలను అనుసరించి మూలవ్యాధిని నివారించవచ్చును. వచ్చిన వ్యాధినిన్నీ శమనం చేయవచ్చును. మరికొన్ని చికిత్సా విధానాలను



భర్తకు చద్దిమూట

కత్తిరింపు చిత్రం—దాసరి నాగవర్ధనరావు (గుంటూరు)

తెలుపుతున్నాను:

1. లాక్షను (లక్కను) పొడిచేసి రెండు మూడు చిటికెల ప్రమాణం తేనెలో కలిపి పుచ్చుకుంటే, రక్తస్రావం నిలిచిపోతుంది.

2. ధాతకి (అడవి అవిసె) పూవుల కషాయం పుచ్చుకుంటే, రక్తస్రావం నిలిచిపోతుంది.

3. శాల్మలి నిర్యాసం (బూరుగ బంక)ను పాలలో కలిపి, కొంచెం కలకండ చేర్చి పుచ్చుకుంటే రక్తస్రావం నిలుస్తుంది.

4. మర్రి ఊడలుగాని, మర్రి మొలకలుగాని నున్నగా వెన్నవలె కల్కంనూరి, గచ్చకాయంత పాలలో కలిపి పుచ్చుకుంటే, రక్తస్రావం నిలుస్తుంది.

5. జీడిగింజను నాలుగు భాగాలు చేసి, వాటిలో ఒక భాగాన్ని కొద్దిగా నలగగొట్టి ఒక ఆఠాకు నీరు, ఒక ఆఠాకు పాలలో వేసి మందాగ్నిలో కాచి, నీటి భాగం ఇగిరి పాలభాగం మాత్రం మిగిలేట్టుచేసి, దించి, ఆ గింజముక్కను తీసివేసి, ఆ పాలలో కొద్దిగా కలకండ కలిపి చల్లారిన తర్వాత తాగితే చిరకాలంగా ఉన్న రక్తస్రావం నిలిచిపోతుంది. వారానికి రెండుసార్లు కొంతకాలం దీనిని సేవిస్తే రక్తార్శస్సు నిశ్శేషంగా పోతుంది.

6. నీరుల్లిపాయలు అందరికీ తెలిసినవే. వీటిలో తెల్లరంగువికూడా ఉన్నాయి. వెల్లుల్లి అని భ్రమపడేరు. కాదు. తెల్లరంగు నీరుల్లి. ఈ తెల్లరంగు నీరుల్లిని నేతిలో వేయించి, దానికి సమభాగం తాటికలకండను కలిపి రాతిమీద లేహంవలె నూరి నేయి కలిపి భద్రపరచుకొని, పూటకు పావుతులం ప్రకారం ఉదయం సాయంత్రం కొంతకాలం సేవిస్తే, మలబంధం పోయి, రక్తస్రావం ఆగిపోతుంది.

7. కాశిని అనే ఒక ఆకు ముల్లంగి ఆకువలె ఉంటుంది. ఆకు కూరలమ్మే స్థలాలలో దొరుకుతుంది. ఈ ఆకును పెసరపప్పు కలిపి కూరగా వండి భోజనంపాటు తింటే నదీప్రవాహంవలె స్రవించే రక్తంకూడ ఆగిపోతుంది.

8. కాచాకునుకూడ పైనచెప్పినట్టు కూరగా వాడి అప్పటికప్పుడు సేవించడం మంచిది.

9. నీరుల్లిని ఈ విధంగా వాడడం కూడా మంచిది.

మూలవ్యాధి గలవారికి మజ్జిగ శ్రేష్ఠమైన పానీయం. ఈ వ్యాధి గలవారు మలబంధం లేకుండా సర్వ జాగ్రత్తలతో ప్రవర్తించడం అవశ్యకం. ★



# గాంధీజీ కారాగార గాథలు

బిర్లాభవనం, బొంబాయి,
8 ఆగస్టు, '42.

'ఆగస్టు 8 వ తేదీ సాయంకాలం దాదాపు 5—30 గంటలకు బొంబాయి సెంట్రల్ స్టేషనులో బండి ఆగింది. బండి దిగాను. నన్ను పిలుచుకొని వెళ్ళడానికి స్టేషనుకు ఎవ్వరూ రాలేదు. బిర్లా భవనానికి టెలిఫోన్ చేసి ఎవరి నైనా రమ్మందామని అనుకున్నాను. పబ్లిక్ టెలిఫోన్ వాడడం నాకు తెలీదు గనుక ఎన్ క్వైరీ ఆఫీసులోని ఒక ఉద్యోగిని అడిగి, అక్కడి

నంబరు వెదుకుతుండగా పది పన్నెండుమంది పోలీసు ఆఫీసర్లు, మిలిటరీ ఆఫీసర్లు టెలిఫోన్ చేయడానికి వచ్చారు. వాళ్ళ ముఖాలు చూస్తే బిర్రబిగుసుకొని ఉన్నాయి. అరెస్టులు ఆరంభం కాలేదు గదా!—అన్న ఆశంక కలిగింది.

'టెలిఫోన్‌కు జవాబు ఏమీ రాలేదు. స్టేషన్ నుంచి వెలుపలికి వచ్చాను. రెండే రెండు టాక్సీలు కనిపించాయి. ఆ టాక్సీలవాళ్ళు కిరాయి విషయంలో పేచీపెట్టడం ప్రారంభించారు. ఆఖరుకు ఒక పెద్దమనిషి స్టేషన్ వెలుపలికి వెళ్ళి, మీటర్ లెక్కన కిరాయి చెల్లించే ఏర్పాటుతో టాక్సీ కుదుర్చుకొని వచ్చాడు. నేను ఆదుర్దాతో "బాపూజీని పట్టుకోలేదు గదా?" అని ఆ పెద్ద

గానే ఉంది" అని ఆయన సమాధాన మిచ్చాడు.

బిర్లా భవనం చేరేవేళకు పెద్దన్నయ్య ప్యారేలాల్, బాపూ, మహాదేవభాయీ (మహాదేవ దేశాయి) మొదలయినవారంతా కాంగ్రెస్ మహాసమితి సమావేశంలో ఉన్నారు. (1) సోదరి అమ్తుస్సలాం, (2) ప్రభావతి బహెన్ కస్తూర్బా ఇంట్లో ఉన్నారు. తర్వాత (3) లీలావతి బహెన్ కూడ వచ్చింది. ఇక్కడికి నేను ఇచ్చిన టెలిగ్రామ్ చేరలేదు. కనుక నన్ను చూచి అందరూ ఆశ్చర్యపడారు.

* * *

డాక్టర్ సుశీలా నైయర్ ప్రస్తుతం కేంద్ర ప్రభుత్వం ఆరోగ్యశాఖా మంత్రిణి. ఈమెకు స్వాతంత్ర్యోద్యమ సమయంలో గాంధీజీతోపాటు సంవత్సరాంతరబడిఉండే అవకాశం, ఆయన వాత్సల్య విశ్వాసాలను చూరగొనే మహాభాగ్యం కలిగాయి. గాంధీజీ ఆగాఖాన్ మహల్‌లో బందీగా ఉన్నప్పుడు కూడా ఈమె ఆయనతో పాటే ఉన్నారు. మహాదేవదేశాయి ఆ స్తమయానంతరం గాంధీజీ ఆదేశానుసారం కారాగారంలోను ఈమె ప్రతిదినం జరిగే సంఘటనలను డైరీలో పొందుపరచారు. ఆ 21 నెలల కారాగారవాసగాథలు భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో మహిమాన్వితమైనవి. వీటిని గాంధీజీ పరిశీలించి తమ ఆమోదముద్ర వేశారు కూడా.

# "క్విట్ ఇండియా" తీర్మానం

పెద్దన్నయ్య ప్యారేలాల్‌ను ఫోనులో పిలిచాను. ఎంతో కష్టంమీద మాట్లాడాడు. ఫోను ఎత్తగానే నా గొంతుక, పేరూ విని "నీవు రాలేవని ఇప్పుడే మహాదేవ్‌భాయితో పందెంవేసి వచ్చాను" అన్నాడు. సమితి సమావేశంలో పాల్గొనాలని నాకు కూడా ఉందని అన్నయ్యతో అన్నాను. సరేనన్నాడు. నేను వెంటనే స్నానం చేశాను. భోజనం వడ్డిస్తుండగా నన్ను తీసుకొని వెళ్ళడానికి కారు వచ్చింది. భోజనం మానుకుని రెండు అరటిపండ్లు చేతపుచ్చుకుని మోటారులో కూర్చున్నాను. మహాసమితి మండపంలో అడుగు పెడుతుండగా "క్విట్ ఇండియా" తీర్మానంపై ఓటింగు జరుగుతూంది. అన్నయ్య నన్ను వేదికమీదికి తీసుకొనివెళ్ళాడు. దూరం నుంచి బాపూను చూచాను. మహాదేవభాయి నన్ను చూచి, అన్నయ్యతో "నీవు పందెం ఎలా ఓడిపోయావో ఆమెతో చెప్పు" అని ఎత్తిపొడిచారు.

ఓటింగు పూర్తయింది. బాపూ ప్రసంగం ప్రారంభమయింది. బాపూ రెండుంబావు గంటలసేపు ఏకబిగిగా ప్రసంగించారు. అద్భుతమైన ప్రసంగం. ఆయన వాక్కులలోను, వాదంలోను అద్భుతశక్తి పొంగి పొర్లింది. ప్రసంగం పూర్తయింది. బాపూ లేచారు. నేను నమస్కారం చేశాను. ఆయనకు నన్ను చూడగానే చాల ఆశ్చర్యం కలిగింది; సంతోషమూ కలిగింది.

"సరైన సమయానికే వచ్చి చేరావే!" అన్నారు. వల్లభభాయి (పటేల్) కలుసుకున్నారు. "నిన్న వచ్చి ఉంటే మరొక ప్రయోజనంతో బాపూ చేసిన గొప్ప ప్రసంగం వినేదానివి" అన్నారు ఆయన.

బాపూ, వల్లభభాయీ, మహాదేవభాయీ, మణిబహెన్‌లతోపాటు కారులో కూర్చున్నాను. అన్నయ్య మరొక కారులో వచ్చారు. బాపూ టైము ఎంత అని అడిగారు. అప్పుడు రాత్రి పదింబావు. ఆయన ఆశ్చర్యపడారు. తాను రెండుంబావు గంటలసేపు ప్రసంగించాననే ఊహే ఆయనకు లేదు. నావైపు తిరిగి "నేను మాట్లాడడానికి లేచి నిలబడినప్పుడు నేను ఏమి మాట్లాడదలచానో నాకే తెలీదు. నిన్న రాత్రి కన్నుమూయలేదు. దానికి కారణం తెలిసింది. చెప్పవలసిన విషయం ఇంత ఉందే! ఎలా చెప్పగలను?—అని మనసులో పెద్ద బరువు. నాతో మాట్లాడించాలని భగవంతుడు సంకల్పిస్తే నానోరు తెరిపిస్తాడు —అనుకున్నాను. మాట్లాడలేకపోయావా, 'నాకేమీ తోచడం లేదు. నేనేమి చెప్పను?' అని రెండు మాటలు పలికి కూర్చుండిపోవడానికి కూడా సిద్ధపడ్డాను. కాని, ఈశ్వరుడు నా నోరు తెరిపించాడు. ఈశ్వరుడే నాతో మాట్లాడించాడని నా నమ్మకం. ఈనాటితో నా పని సరి—అని కూడా క్షణంపాటు నాకు గాభరా పుట్టింది. కాని, ఈశ్వరుడు నాతో పనిచేయించుకోదలచుకుంటే తానే శక్తి ఇస్తాడు—అని మళ్ళీ అనుకున్నాను. ఆ ప్రకారంగా ఈశ్వరుడు శక్తి ఇచ్చాడు కూడా. నేను నేడు దాదాపు నా అభిప్రాయాలన్నింటినీ చెప్పాను. రేపు జరిగే కాంగ్రెస్ మహాసభలో చెప్పడానికి నాకు ఏమీ మిగలలేదు. నేడు చెప్పిందే మళ్ళీ నెమరువేయవలసి ఉంటుంది" అన్నారు. తర్వాత ఆయనకు జ్ఞాపకం వచ్చింది, 'ఇండియన్ సివిల్ సర్వీస్'ను గురించి చెప్పవలసిన రెండుమాటలు చెప్పడం మరచిపోయానని. "మరేమీ ఫరవాలేదు. రేపుకానీ. ఇలాటివన్నీ చెప్పడానికి ఇంకా ఎన్నో అవకాశాలు వస్తాయి" అన్నారు.

బాపూ నేడు సభనుంచి తిరిగి వచ్చేటప్పుడు శ్రీ మథురాదాస్‌భాయిని (4) చూడాలనుకున్నారు. కాని, రాత్రి చాలా పొద్దుపోవడంవల్ల ఆ ఆలోచన మానుకున్నారు. "రేపు తీరిక చిక్కితే వెళ్ళతాను. కాని, రేపు తీరిక చేసుకోవడమే కష్టం" అని అంటూ, రేపు ఏమేమి చేయాలో ఆలోచించసాగారు. ఉదయం కాంగ్రెస్ కార్యకర్తల సమావేశం. తర్వాత కార్యవర్గ (వర్కింగ్ కమిటీ) సమావేశం జరుగుతుంది. పిదప మరొకటి, ఇంకొకటి, సాయంకాలం బహిరంగ సభ వగైరా.

బసకు చేరుకోగానే ప్రార్థనకోసం వచ్చినవారు కొంతమంది ఇంకా కూర్చుని ఉండడం కనిపించింది. ప్రార్థన సమాప్తమయింది. ఒక గుజరాతీ సోదరి "మారూం మాథు నమావ ప్రభు తారా చరణరజనీతలే" (5) అంటూ భజనగీతం పాడింది.

* * *

మహాదేవభాయీ ఈమెకు గురుదేవుని (రవీంద్రుని) గీతాలు కొన్ని గుజరాతీలోకి అనువదించి ఇచ్చారు. ఈ గీతం వాటిలోదే. మహాదేవభాయియే స్వయంగా ఈ గీతాలకు రాగాలు కుదిర్చారు కూడా. ఆ సోదరి తియ్యని కంఠంతో ఈ భజనగీతం పాడింది. మహాదేవభాయీ కూడా పాడుతుండేవారు.

బాపూ పడుకొనేవేళకు పదకొండున్నర కొట్టింది. నేను అన్నయ్య ప్యారేలాల్‌తో పాటు కాంపౌండులో తిరగడం ప్రారంభించాను. ఆయన దేశ స్థితిగతులను గురించి నాకు కొన్ని మాటలు తెలిపారు. తర్వాత మేము మహాదేవభాయీ గదికి వెళ్ళాము. ఆయన ఇంకా మేల్కొనే ఉన్నారు.

నేను బొంబాయికి ఎలా వచ్చిందీ విని అంతా గేలిచేయడం ఆరంభించారు. "ఎలాంటిదానివి? ఎందుకు గాభరాపడి పరిగెత్తుకుని వచ్చావు? ప్రభుత్వం వెర్రిదిగుందని అనుకున్నావా? కాంగ్రెస్ మహాసభను పూర్తికానిచ్చి, ప్రజలకు ఉత్సాహం మారిపోయనిచ్చి, తర్వాత తీరికగా

(1) ఒక ముస్లిం సోదరి. ఎన్నో సంవత్సరాలుగా గాంధీజీవద్ద ఉండేది. (2) చంపారణ్య సత్యాగ్రహంలో గాంధీజీ పాత సహచరుడు, ప్రముఖ బిహార్ నాయకుడు అయిన శ్రీ బ్రజకిశోర్‌బాబు కుమార్తె. తర్వాత శ్రీ జయప్రకాశ్ నారాయణ్‌ను వివాహమాడింది. ఈమెను తండ్రి చాల చిన్నతనంలోనే గాంధీజీకి అప్పగించారు. ఈమె అప్పటినుంచి గాంధీజీ ఆశ్రమంలోనే ఉండేది. (3) ఒక విధవ బాలిక. గాంధీజీని, ఆశ్రమాన్ని నమ్ముకుని ఉంది. (4) శ్రీ మథురాదాస్‌భాయి గాంధీజీ సోదరపుత్రుడు, సహకార్యకర్త. తర్వాత బొంబాయి మునిసిపల్ కార్పొరేషన్ మేయరయ్యాడు. (5) ఓ ప్రభూ! నీ చరణధూళి కింద నా తలంచాను.

# గాంధీజీ కారాగార గాథలు

అందరినీ పట్టుకుంటుందని అనుకున్నావా?" అన్నారు.

అంతలో డాక్టర్ జీవరాజ్ మెహతా నుంచి ఫోను వచ్చింది. "బాపూను చూడడానికి రేపు ఎప్పుడు రావచ్చు?" అని ఆయన అడిగారు ఫోనులో. నేను అదివరకే బాపూను పరీక్ష చేశాను. ఈరోజు ఇంత శ్రమపడినప్పటికీ ఆయనకు రక్తపుపోటు 186, 116 ఉంది. లోగడ తరచు హెచ్చడాన్ని బట్టిచూస్తే, ఈ రోజు పరిస్థితి చాల మంచిదనే చెప్పవచ్చు. ఎలాగా డాక్టర్ జీవరాజ్ మెహతా, డాక్టర్ గిల్డర్ రేపు బాపూను పరీక్షించడానికి రావాలి. బాపూను అడిగి వారిద్దరినీ రేపు మధ్యాహ్నం రెండు గంటలకు రమ్మని చెప్పాను. తర్వాత డాక్టర్ మెహతా డాక్టర్ గిల్డర్‌కు టెలిఫోన్ చేసినప్పుడు గిల్డర్ నవ్వుతూ, "రేపు రెండు గంటలకు ఎవరిని చూడడానికి వెళ్ళ

మూలం:

డాక్టర్ సుశీలానైయర్

అనువాదం:

తిరుమల రామచంద్ర

తావు?" అని అడిగారు. అయితే, బాపూను ప్రభుత్వం నిజంగా అరెస్టు చేస్తుందని ఎవరూ నమ్మలేదు.

ఒంటిగంటకు నేను పడుకోడానికి వెళ్ళాను. అన్నయ్య మహాదేవ్ భాయీతో కొంచెంసేపు మాట్లాడుతున్నాడు. బాపూను ఉదయమే పట్టుకుంటారని బొంబాయి నగరంలో ఎక్కడ బడితే అక్కడ తీవ్రమైన వదంతి వ్యాపించింది. ఫోను మీద ఫోను మోగసాగింది. "రేపు మనం ఏమి చేద్దాం?" అని అడిగాడు అన్నయ్య మహాదేవ భాయీని. "ఎందుకు నీకు ఫికరు? మనమిద్దరం చెట్టాపట్టాల్ పట్టుకుని వెలుపలికినడుద్దాం. భగవంతుడు మనకు ఏదో కించిత్తు పనైనా చేయడానికి శక్తి ఇవ్వనే ఇస్తాడు" అన్నారు మహాదేవ్ భాయీ.

(సశేషం)

ఆంధ్రప్రభ

సచిత్ర వారపత్రిక

మద్రాసు

ఎడిటర్: నీలంరాజు వెంకటశేషయ్యా

# లాల్ బహదూర్ శాస్త్రి ఎన్నిక

ప్రజాసేవకు సాధనంగా మాత్రమే వినియోగించినప్పుడు అధికారం వహించడం యుక్తం. అధికారం చేజిక్కించుకొనడానికి ప్రయత్నించడమూ తగును. కాని ఈ కోవకు చెందిన వ్యక్తులు అరుదుగా ఉంటారు—ఏదేశంలో అయినా, ఏ కాలంలో అయినా. కనుకనే, అధికారం కోసం తగవులాడుకొనడం పరిపాటి అయింది.

అంతేకాదు ప్రజాస్వామ్యం సుస్థిరంగా పాదుకొన్న దేశాలలో సహితం అధికారం చేతులు మారడం వివాదాలకు, వైరుధ్యాలకు, వైషమ్యాలకు దారితియడం ఎరుగుదుము.

మనదేశంలో ప్రజాస్వామ్యం ఇంకా పొత్తిళ్లలోనే ఉంది ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు విద్యావంతులుకారు. విద్యావంతులందరూ ప్రజాస్వామ్యవాదులూ కారు. ఆర్థికపరిస్థితులు తీవ్రమైనవి. ఇవేమీ ప్రజాస్వామ్యం వృద్ధిచెందడానికి దోహదమిచ్చేవికావు.

భారతదేశం స్వతంత్రమైనది లగాయతు మొన్నటివరకు నిరంతరాయంగా నెహ్రూ నాయకత్వాన పాలన సాగింది నెహ్రూ స్థానం ఆక్రమించు కొనగల వ్యక్తి, అనంతమైన వైవిధ్యం ఉన్న దేశంలో ఏకత సాధించి ప్రజలను ఏకోన్ముఖంగా నడిపించగలవాడు ఎప్పటికైనా తిరిగి దేశంలో ప్రభవిస్తాడా అన్నది సందేహం.

అయితే ప్రజల ఆదరాభిమానాలకు పాత్రులైనవారు, నిస్స్వార్థ సేవాపరులు, దేశభక్తులు అయినవారికి దేశంలో కొదువలేదు. ప్రజాస్వామ్యం నెలకొల్పడానికి జీవితాంతమూ నెహ్రూ చేసిన మహత్తరమైన కృషి విఫలమూ కాలేదు.



నెహ్రూ గతించిన ఆరు రోజులలోనే కాంగ్రెసు పార్లమెంటరీ పార్టీ ఏకగ్రీవంగా శ్రీ లాల్ బహదూర్ శాస్త్రిని నాయకుడుగా ఎన్నుకొనడం భారతీయులకు శుభోదర్కంగా ఉంది. ప్రజాస్వామ్య దేశానికు కనువిప్పుగానూ ఉంది.

శ్రీ శాస్త్రిని తిరిగి కేంద్ర మంత్రిగా నెహ్రూ నియమించిన సమయంలో ఉభయులకు జరిగిన సంభాషణ ఈ సందర్భంలో పేర్కొనదగినది. నేనేమి చేయాలని శ్రీ శాస్త్రి ప్రశ్నించగా నా పని చేయమని నెహ్రూ అన్నారు.

శ్రీ లాల్ బహదూర్ నెహ్రూ అనుచరులలో అగ్రగణ్యుడు. నెహ్రూ విధానాలను కొనసాగించగలడు ప్రజల తోడ్పాటుతో కృతకృత్యుడూ కాగలడు.

శ్రీ లాల్ బహదూర్ ఎన్నిక ముఖ్యంగా కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ కామరాజ్ రాజనీతిజ్ఞతకు, కార్యదక్షతకు నిదర్శనం. ఇందుకు దేశక్షేమం కాంక్షించేవారందరు శ్రీ కామరాజ్‌ను అభినందించకుండా ఉండలేరు.

ఈ ఉభయుల నాయకత్వమూ దేశానికి చిరకాలం లభిస్తుందని ఆశిద్దాము. ★



# గాంధీజీ కారాగార గాథలు

మూలం :

**డాక్టర్ సుశీలానైయర్**

అనువాదం :

**తిరుమల రామచంద్ర**

బిర్లాభవనం, బొంబాయి,
9 ఆగస్టు '42.

మహాదేవభాయి తెల్లవారుజామున నాలుగు గంటలకు ప్రార్థనకు వచ్చినప్పుడు అన్నారు: "రాత్రి రెండు కొట్టేవరకు ఫోన్ నన్ను పతాయిస్తూ ఉంది. రెండు కొట్టిన తర్వాత పడుకున్నాను. బస్! నాయకులను అరెస్టు చేయడానికి ఏర్పాట్లన్నీ పూర్తయాయి. పట్టుకొనడానికి వస్తున్నారు.. ఇదేగొడవ ప్రతిఫోను మోతలోను." దానికి గాంధీజీ "నిన్నటి నా ప్రసంగం తర్వాత నన్ను అరెస్టు చేయనేలేరు. వాళ్ళు అంత మూర్ఖులని అనుకోను. అయినా, నన్ను పట్టుకొంటే, దీని అభిప్రాయం వాళ్ళరోజులు దగ్గర పడ్డాయన్నమాట." అన్నారు.

ప్రార్థన అనంతరం పక్కమీద వాలాను. మూడు రాత్రులుగా ఒకటి, రెండు గంటల సేపే నిద్ర. బాపూ కాలకృత్యాలకు వెళ్ళారు. అన్నయ్యవైపు తిరిగి "అన్నయ్యా! బాపూ ఆరు బయట తిరిగి రావడానికి సిద్ధం కాగానే నన్ను లేపు. ఒక్క కునుకు తీస్తాను" అని, దుప్పటి కప్పుకుంటున్నానో, లేదో, మహాదేవభాయీ లోపలికి వచ్చి, "బాపూ! బాపూ! పట్టుకోడానికి వచ్చారు" అన్నారు. బాపూ స్నానాల గదిలో ఉండగానే పోలీసు అధికారులు ఈ వార్త ఆయనకు అందించారు. "తయారు కావడానికి ఎంత వ్యవధి ఇస్తారు?" అని బాపూ పోలీసు అధికారులను అడిగించారు. "అర్ధగంట" అన్నాడు పోలీసు కమిషనరు. బాపూ స్నానాల గదినుంచి వెలుపలికి వచ్చి వారంట్ చూచారు. మహాదేవదేశాయి పేర, మీరాబహన్ పేర, బాపూపేర భారత రక్షణ చట్టం కింద నజర్ బందీకి (డిటెన్షన్‌కు) ఉత్తరువులు జారీ అయాయి. అన్నయ్య ప్యారేలాల్, కస్తూర్బా ఆ షరతులపైనే బాపూతోపాటు వెళ్లవచ్చునని ఉత్తరువులలో స్పష్టంచేశారు. బాపూ కస్తూర్బాతో "నీవు ఉండజాలకపోతే నాతో రా. అయితే, నేను కోరేదేమిటంటే, నీవు ఇక్కడే ఉండి, సేవాగ్రామ్ వెళ్ళి నేను చేసే పనులు యథావిధిగా నిర్వహించమని" అన్నారు. అన్నయ్యతోనూ ఈ మాటే అన్నారు. "నేను అనే దేమిటంటే, ఊరికే జెయిలుకు రాకండి అని. పని చేస్తూ చేస్తూ పట్టుబడడం వేరే సంగతి" అన్నారు. "ప్రతి సత్యాగ్రహ సైనికుడూ తన భుజానికి (6) "విధి నిర్వహణమో లేక వీరస్వర్గమో" అనే బిళ్ల తగిలించుకోవాలి. దానివల్ల అహింసాత్మకంగా మరణించే ప్రతి స్వాతంత్ర్యయోధుని పైన ఈ మాటలు అంకితమై ఉంటాయి" అని సూచించారు.

బాపూ ఉపాహారం పుచ్చుకున్నారు. బిర్లాజీ మొదలయినవారు కొన్ని ప్రశ్నలు వేశారు. "ఈ ప్రశ్నల కన్నింటికీ జవాబు నేను నిన్నటి ఉపన్యాసంలో ధనికులను గురించి చెప్పిన మాటలలో వచ్చివేసింది" అని బాపూ సమాధానమిచ్చారు. తర్వాత ఘనశ్యామదాస్‌జీ (బిర్లాజీ) అనునయంతో "బాపూ, తొందరపడి నిరశన వ్రతం చేయకండి!" అని ప్రార్థించారు. "లేదు. నేను తొందరపడాలని కోరుకోనే కోరుకోను. సాధ్యమైనంతవరకు ఓర్పుతో వాయిదావేస్తూనే ఉంటాను" అన్నారు బాపూ.

మళ్ళీ ప్రార్థన జరిగింది. మహాదేవభాయీ

(7) "హరినేభజతాం హజీకోఈసీ లాజ్ జతీ సఫీజోఈరే" అనే భజనగీతం పాడారు. తర్వాత రామ్‌ధున్ జరిగింది. అముత్సలాం బహన్ ఖురాన్ షరీఫ్‌నుంచి కొన్ని ఆయతులు (వాక్యాలు) పఠించింది. బాపూ రెండు మూడు భగవద్గీత ప్రతులు, భజనావళి, అరబ్బీ ప్రైమర్ మొదలయిన పుస్తకాలు సర్దుకొన్నారు; పత్తి ఏకేవిల్లు, తక్లీ, ఏకులకట్ట వెంట తీసుకున్నారు. అముత్సలాంబహన్ ఖురాన్ షరీఫ్ ఇచ్చింది. మహాదేవ భాయీ తన సామాను సర్దుకున్నారు. మీరా బహన్ అందరికన్నా ఆఖరున తన సామాను సర్దుకుని తయారయింది. అందరూ బాపూజీకి ప్రణామం చేశారు. "నన్నుగనుక పట్టుకుంటే మీ వద్దకు పంపమని అడగవచ్చునా?" అని నేను బాపూను అడిగాను. "ఊఁ! తప్పక. నేను ఆయనకు మెడికల్ ఎడ్వైజర్ (వైద్య సలహాదారు)ను. నన్ను ఆయన వద్దకు పంపండి అని చెప్పవచ్చు" అన్నారు బాపూ. అన్నయ్య ఖిన్నుడుగా ఉండడం చూచి "ఎందుకు ఖేద పడుతున్నావు? వ్యత్యాస మేమిటంటే మేము ఉదయం అక్కడికి చేరుకుంటాము. నీవు సాయంకాలానికి చేరుకుంటావు. అంతేకాక, మేము ఏమీ చేయకనే వెళ్ళుతున్నాము. నీవు ఏదో కొంత పనిచేసి వస్తావు" అన్నారు మహాదేవభాయీ.

కాంగ్రెస్ మహాసభ సాయంకాలం తప్పక జరుగాలని బాపూ సూచన. కనుక అన్నయ్య మహాసభలో మాట్లాడుతాడని, అరెస్టు చేయబడుతాడని అంచనా.

బాపూ తమ కర్ర తీసుకొని బయలుదేరారు. శ్రీమతి రామేశ్వరదాస్ బిర్లా ఆయన నొసట కుంకుమ తిలకం దిద్దారు. రెండు మోటారు కార్లు సిద్ధంగా ఉన్నాయి. ముందుదాంట్లో బాపూ, మీరాబహన్ కూర్చున్నారు. వెనుకటి కారులో మహాదేవభాయీ. అందరూ పైకి నవ్వుతున్నా, మనస్సులు మాత్రం దుఃఖంతో నిండిపోయాయి. ఈసారి జరుగబోయే లడాయి భయంకరమైనదని అందరికీ తెలుసు. ఎవరు, ఎవరిని, ఎక్కడ కలుసుకుంటారో, అసలు కలుసుకోగలరో, లేరో ఎవరికీ తెలియదు.

• • •

రాత్రి సభనుంచి తిరిగివచ్చిన తర్వాత (8) బాబలా, కను మహాదేవభాయీతో పరిహాసాలాడుతున్నారు. బాబలా అన్నాడుగదా "కాకా, మన మిప్పుడు స్వతంత్రులం. ఇప్పుడు అందరం స్వతంత్రులమని బాపూజీ అన్నారు. కనుక మేము ఇప్పుడు మీ మాటకూడ వినము" అని. మహాదేవభాయీ నవ్వుతూ: "నీకు నా మాట వినడం ఎప్పుడు పడుతుంది గనుక? మీ అమ్మ మాట వినడమే పడుతున్నది" అన్నారు. భగవంతుడే ఈ మాటలు ఆయన నోటితో అనిపించాడు కాబోలు! ఒక్క వారంలోగానే బాబలా తన తల్లిమాట మాత్రమే వినవలసి వస్తుందని ఎవరికి తెలుసు?

# మహానాయకుల అరెస్టు

పోలీస్ కమిషనర్ బాపూను పట్టుకొనడానికి వచ్చినప్పుడు ఐదుమ్మిప్పావు కొట్టింది. బాపూ తన వస్తువులు సర్దుకొని తయారు కావడానికి అరగంటకంటె రెండుమూడు నిమిషాలు ఎక్కువే తీసుకొన్నారు. అందువల్ల "అయాం సారీ, ఐ హావ్ కెప్ట్ యు వెయిటింగ్ ఎ కపుల్ ఆఫ్ మినిట్స్ లాంగర్" (9) అని క్షమాపణ కోరారు.

బాపూ బయలుదేరుతున్నప్పుడు "వీరందరూ అర్ధసేరు మేకపాలు కోరుతున్నారు" అని బిర్లాజీ అన్నారు. బాపూ నవ్వుతూ "నాలుగణాలు తెమ్మనమనండి. పాలు ఇచ్చివేయండి" అన్నారు.

పోలీసులు వచ్చినప్పుడు అంతా నిశ్శబ్దమా? కాని ఎలా తెలిసిందో, ఎక్కడినుంచి వచ్చారో, మాటమాటలోనే పెద్ద గుంపు చేరింది. మోటార్లు బయలుదేరినప్పుడు, బిర్లా భవనం రస్తాలో పెద్ద గుంపు చేరింది. టెలిఫోను కనెక్షన్ తెంచివేశారు పోలీసులు. రాత్రి రెండు గంటలకే తెంచివేశారు. అందువల్లనే మహాదేవ భాయీ రెండు గంటల తర్వాత నిద్రపోగలిగారు. అయినా, బాపూ అరెస్టువార్త మెరుపులాగ నగరమంతటా వ్యాపించింది. బిర్లా భవనం ముందు గుంపులు గుంపులుగా జనం గుమిగూడ సాగినారు. కార్యకర్తలు, మిత్రులు, పత్రికా విలేఖరులు మొదలయినవారంతా రావడం ప్రారంభించినారు.

మేము ఎప్పుడైనా అరెస్టు కావచ్చుననే అనుమానంతో మా మా సామాను సర్దడం ప్రారంభించాము. నేను అత్యవసరమైన సామాను పడకలోను, అటాచీ పెట్టెలోను సర్దుకున్నాను. మెడికల్ బాగ్ (మందుల తోలుసంచి) వెంట తీసుకొన్నాను. కాని, అన్నయ్యకు సామాను సర్దడానికి తీరిక ఎక్కడిది? కలుసుకొనడానికి ఒకరు వస్తున్నారు. అతికష్టంమీద సాయంకాలానికి సామాను సర్దుకోగలిగాడు.

మహాసభలో కస్తూర్బా కూడా ప్రసంగించాలని నిర్ణయమయింది. ఆమె సోదరీమణులకు ఒకటి, సోదర సోదరీమణులకు ఒకటి విడివిడిగా సందేశాలు నాతో వ్రాయించారు. (10) అన్నయ్య చిన్న ప్రసంగం వ్రాసి సిద్ధపరచుకొన్నాడు. ఆ ప్రసంగంలో నేడు ఉదయం జరిగిన సంఘటనలను వర్ణించి, బాపూను కారాగారంనుంచి విడిపించుకొనిరావడం ప్రజల చేతులలో ఉందని అభ్యర్థించాడు. "అయితే బాపూ తాము బతికిఉండగా రెండు విషయాలు మాత్రం సహించరన్న సంగతి మరువకండి—ఒకటి: భారతీయులు అసమర్థులయి ఊరికే కూర్చుని ఉండిపోవడం; రెండవది: భారతీయులు వెర్రి ఆవేశంతో ఇంగ్లీషు మగవారిని, పిల్లలను నరకడానికి పూనుకొనడమూను" అని అన్నయ్య తన ప్రసంగంలో హెచ్చరించాడు.

సుమారు పది గంటలకు టెలిఫోన్ మోగింది. అది వర్ధానుంచి వచ్చిన ట్రంక్ టెలిఫోన్. అన్నయ్య మాట్లాడుతున్నాడు. అవతల మాట్లాడుతున్నవారు కిశోర్‌లాల్‌భాయీ. "నేడు ఉదయం..." అని అన్నయ్య మాట్లాడడం మొదలు పెట్టాడో లేదో సెన్సార్‌వారు లైన్ తెంచివేశారు. తర్వాత మధ్యాహ్నానికి ఫోన్ దొరికింది. వర్ధాలో పోలీసులు అన్నయ్యకోసం ఎదురు చూస్తున్నారట. వినోబాను అరెస్టు చేశారు. క్రిందటి సత్యాగ్రహంలో కొంచెం సంబంధం ఉన్న తక్కినవారినీ అరెస్టుచేశారు. అన్నయ్య పేరిట వారంటు సిద్ధంగా ఉంది. మేము ఇక్కడ నేడు పట్టుబడకపోతే, రేపు సాయంకాలానికి వర్ధా వెళ్ళదామని అనుకున్నాము. అమ్మ అక్కడ మాకోసం ఎదురు చూస్తున్నదన్న వార్తతో మేము ఆలోచనలో పడ్డాము. కాని, ఆలోచించడానికి కూడా ఎక్కువ అవకాశం దొరకలేదు. సాయంకాలానికల్లా ప్రభుత్వం మా విషయంలో నిర్ణయం చేసేసింది.

మహాదేవభాయీ వెళ్ళుతూ వెళ్ళుతూ, బాపూ నిన్న సాయంకాలం చేసిన ప్రసంగం చిత్తుప్రతిని అన్నయ్యకు అప్పగించి, "నీవు దీనిని సరిచేసి ఈరోజే పత్రికలకు ఇచ్చివేయాలి" అని చెప్పారు. స్నానం చేసిన తర్వాత గది తలుపులు వేసుకొని కూర్చుని వ్రాద్దామనుకున్నాడు అన్నయ్య. అయితే, తీరిక ఎక్కడిది? ఆఖరుకు ఆ పనిని అన్నయ్య మరొకరికి అప్పగించవలసి వచ్చింది. ఇంతలో సాదిక్ అలీ (11) వచ్చారు. అన్నయ్య ఆయనకు కొన్ని సూచనలిచ్చి, అందరినీ అభ్యర్థించే ఒక ప్రకటనను టైప్ చేయమన్నాడు. ఆయన టైప్ చేయడంలో ఉండిపోయారు. మృదులా బహన్ (12) వచ్చింది. కొన్ని కాయితాలు అప్పు వేయించడానికి తీసుకొని వెళ్ళింది. కార్యకర్తల సమావేశంకోసం ఉదయం కొందరు వచ్చారు. ఈ సమావేశభారం బిర్లాజీపైన వేయడం ఉచితంకాదని కొందరు భావించారు. అందువల్ల సమావేశం మరొకచోట ఏర్పాటయింది. కాని, ఆఖరుకు కార్యకర్తలు మరొకచోట సమావేశమయితే, అందరూ ఒకేమారు పట్టుబడే ప్రమాదముందిగనుక, వారు తమ తమ ప్రాంతాలకు వెళ్ళిపోయి పనిచేయడం మంచిదని నిర్ణయమయింది. అందువల్ల అన్నయ్య కార్యకర్తలను బృందాలు బృందాలవారీగా కలుసుకొని, ఐదైదు, ఏడేడు నిమిషాలపాటు చర్చించి వారందరినీ ఒప్పించి వచ్చారు.

నగరమంతటా దావాగ్ని వ్యాపించినట్లు ఉన్నదని నగరంనుంచి వచ్చినవారు చెప్పారు. కాంగ్రెస్ కార్యవర్గ సభ్యులు మొత్తం, బొంబాయి రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ ప్రధాన కార్యకర్తలు, స్వయంసేవకదళ ప్రధానసేనాని

ఉదయమే అరెస్టు చేయబడ్డారు. హర్తాళ్ చేసేవారికి రెండుమూడు సంవత్సరాల కఠిన శిక్ష విధించబడుతుందని ప్రభుత్వం ప్రకటించింది. అయినప్పటికీ బొంబాయి నగరంలో దాదాపు పూర్తి హర్తాళ్ జరిగింది. దుకాణాలు బంద్! ట్రాములు బంద్! బస్సులు బంద్! ఉదయం ఎనిమిది గంటలకు గ్వాలియాటాంక్ ప్రాంతంలో ఝండావందనం. అక్కడ మూడు సార్లు పోలీసులు బాష్పవాయువు ప్రయోగించారు; లాఠీ ప్రయోగం చేశారు. అతికష్టంమీద జనాన్ని చెదరగొట్టారు. కాని, కొంచెం సేపట్లోనే జనం మళ్లీ గుమిగూడారు. మృదులా బహెన్ తిరిగి వచ్చింది. ఆమె చేతిమీద మూడు లాఠీ దెబ్బల గుర్తులున్నాయి. మరికొందరు స్వయంసేవకులు, కార్యకర్తలు లాఠీదెబ్బలు తినివచ్చారు. నా టించర్ అయోడిన్ చిన్న సీసా ఖాళీఅయింది.

సాయంకాలం జరిగే సభకు కస్తూర్బావెంట నేను, అన్నయ్య, ఖుర్షేద్‌బహెన్ (13) వెళ్లాలనినిర్ణయ మయింది. బాను పట్టుకునేటట్టయితే, నేను ఆమెవద్దనే ఉండి, ఆమెను జాగ్రతగా చూచుకోవాలనే ఉద్దేశంతో నన్ను ఆమె వెంటనే ఉండమన్నారు. ఆమె దేహస్థితి మరీ మన్నితమైంది గనుక, ఆమె వెంట ఒక డాక్టర్ ఉండడంఅత్యవసరమని భావించబడింది. అంతేకాక, నాకు బొంబాయిలో ఎవరి పరిచయమూ లేదు గనుక, ఖుర్షేద్‌బహెన్ కూడ మా వెంటే ఉండాలనీ నిర్ణయమయింది.

బాపూ ఉదయం వెళ్లిపోయేటప్పుడు "నీవు మధురాదాస్‌ను తప్పక చూచి రావాలి" అని నాతో మరొకమారు అన్నారు. అందువల్ల నేను ఖుర్షేద్‌బహెన్‌ను వెంటబెట్టుకుని మధురాదాస్ ఇంటికి వెళ్లాను. ఆయన చాల సంతోషించారు. ఆయన ఆవేశంతో "చెల్లీ, ఈ ఇంగ్లీషువారు రాక్షసులమ్మా. ఈ రాక్షసులు బాపూజీని ప్రాణాలతో వెలుపలికి రానివ్వరు" అన్నారు. "మీరు శాంతించండి. ఆవేశంవల్ల మీ ఆరోగ్యం ఇంకా చెడిపోతే నేను మీ వద్దకు ఎందుకు వచ్చానా అని పశ్చాత్తాపపడవలసి ఉంటుంది" అని నచ్చజెప్పాను. "మీరు మరీ హెచ్చుగా మాట్లాడుతున్నారు" అని ఆయన భార్య హెచ్చరించింది. అయితే, ఆమెను మధురాదాస్‌భాయి బెదిరించి ఊరుకో ఉండమన్నారు. "నీవు ఊరుకో. నీకు ఏమిటి తెలుసు? నేను ఎప్పుడు ఎవరిని కలుసుకుంటున్నాను? నేను డాక్టర్లందరితోను చెప్పాను మీ మందులన్నిటి కన్నా బాపూను కలుసుకోడం వల్లనే నాకు ప్రయోజనం ఎక్కువ అని" అంటూ ఆయన నావైపు తిరిగి "మీ స్టెతస్కోప్ తెచ్చారా? లేదా?" అని అడిగారు. "లేవడమైతే తెచ్చాను" అన్నాను. "అయితే ఎందుకు వెలుపలికితీయరు?" అన్నారు ఆయన. నేను ఆయునను సమాధాన పెట్టడంకోసం ఆయన రొమ్మును పరీక్షించాను. అన్ని ఎక్స్‌రేఫొటోలూ పరిశీలించాను. పెద్ద కావిటీ (బిలం) ఏర్పడింది. హేమోప్టిసిస్ (ఉమ్మిలో రక్తం పడడం) తీవ్రమయింది. మరి ఎలాటి ఆశ పెట్టుకోగలం? అయినా నేను ఆయనకు ఊరట కలిగించి, వెళ్లిపోడానికి సిద్ధమయ్యాను. "ఈసారిబాపూజీతోపాటుమిమ్మల్ని చూడడానికి వస్తాను" అన్నాను. నా మాటలు విని ఆయనకు మళ్లీ ఉద్రేకం వచ్చింది. నా చేయి పట్టుకుని, "చూడమ్మా చెల్లీ! ఇది గంభీరమైన, పవిత్రమైన వాగ్దానం సుమా? (14) ఇదిగో ఈమె (భార్య) సాక్షి. ఖుర్షేద్ బహెన్ సాక్షి. వీరందరూ ఉంటారు. ఈమె (నర్స్) ఉండదు. అయినా ఇంటినుంచి పిలిపిస్తాను" అన్నారు.

నేను ఆయనను ఐదారు నిమిషాలు పలుకరించి వద్దామనుకున్నాను. కాని, ముప్పావు గంట తర్వాత ఎంతో కష్టంమీద తిరిగి రాగలిగాను. గదినుంచి వెలుపలికి రాగానే ఆయన భార్య "బాగవుతారు కదా?" అని ప్రశ్నించింది. "మీరు ఆశతో ఉండండి. గాభరా పడకండి" అన్నాను. మధురాదాస్ తన ఎదుట గోడమీద ఆంగ్ల చిత్రకారుడు వాట్స్ రచించిన "హోప్" (ఆశ) అనే చిత్రం తగిలించుకున్నారు. "నాకు నిజంగా నిరాశకలిగితే, ఈ చిత్రాన్ని తీసి పారేస్తాను" అన్నారు. ఆయన ఆశకూడ ఇప్పుడు ఆ చిత్రం లాగ ఒక దుర్బలమైన దారంతో వేలాడుతున్నదని నాకు అనిపించింది.

తర్వాత బిర్లా భవనానికి తిరిగి వచ్చాను. పోలీసులు ప్రత్యక్షం. నగరంలో పోస్టర్లు అతికించారట: "బాపూ ఏ సభలో నయితే ప్రసంగించవలసిందో ఆ సభలో కస్తూర్బా ప్రసంగిస్తారు", "ఈ శాంతి విప్లవం 1857 నాటి విప్లవంకన్నా ఎక్కువ సఫలమవుతుంది!" వగైరా వగైరా. కనుక పోలీసులు అడగడానికి వచ్చారు. "కస్తూర్బా నిజంగా సభలో పాల్గొంటారా? ఇది నిజమైతే ఆమెను అరెస్టు చేస్తాము" అన్నారు. కాని, కస్తూర్బా ఒంటరిగా ఉండరు; నేనూ ఆమె వెంట ఉంటాను; ఆమె తర్వాత నేనూ సభలో ప్రసంగిస్తాను— అని పోలీసులకు తెలియగానే, వారిలో ఒకరు నా పేరట వారంట్ తేవడానికి వెళ్లారు. ఒకడు మావద్ద కాపలా ఉన్నాడు. సభకు వేళయింది. కస్తూర్బా, నేనూ బయలు దేరుతుండగా పోలీసు ఆఫీసర్ నాటకంలోని పాత్రలాగ నటించడం ఆరంభించాడు: "మాజీ, మీరు ఇంట్లోనే ఉండాలి. చెల్లీ, మీరు సభకు వెళ్లగూడదు." ఇంకా ఏమిటేమిటో మాట్లాడుతున్నాడు. ప్రజమోహన్‌బిర్లా ఓపిక పట్టలేకపోయారు. "ఈ శిష్టాచారం అవసరమా?" అని అడిగారు. పోలీస్ ఆఫీసర్ నవ్వుతూ, "మీరు వెళ్ళితీరుతానంటే, అరెస్టు చేస్తున్నాను" అన్నాడు. మమ్మల్ని సభకు తీసుకొని వెళ్లడానికి తయారుగా ఉన్న మోటారు కారులోనే జెయిలులో అవసరమైన సామాను పెట్టాము. బిర్లా పత్నిగారు మా ఇద్దరికీ హారతి ఎత్తినొసట కుంకుమ బొట్టు పెట్టింది. నా బొట్టు చూచుకుని నవ్వుకున్నాను. నాకు ఎందు కిది? మళ్లీ అనుకున్నాను—నిన్న ఎక్కడున్నాను? నేడు ఎక్కడున్నాను? బొంబాయికి వెళ్లగానే, నేను ఎక్కడ చేరుకుంటానో నిన్న ఎవరికి తెలుసు?

మోటారు కారు కదులుతుండగా, పోలీస్ ఆఫీసర్ మాలో ఎవరి మాటలో, ఎటునుంచో విని. అంచనా వేశాడు అన్నయ్య (ప్యారేలాల్) సభకు వెళ్లుతున్నాడని. వెంటనే అన్నాడు: "అయితే, మీరు కూడా ఎక్కండి కారు!" అని. అన్నయ్య సామాను కూడా కారులో పెట్టారు. చంపాబహెన్ అన్నయ్య నొసట బొట్టు పెట్టింది. ముగ్గురం బయలుదేరాం. ఘనశ్యామ్‌దాస్ అన్నయ్యతో "ఇదే మంచిదయింది. మీ కాళ్లు, చేతులు విరుగుతాయనే ఫికరు మాకు ఉండదు"



వరికోత

చిత్రం—చంద్ర (హైదరాబాదు)

అన్నారు. కాని, మా మనస్సు నిరాశామయమైంది. ముగ్గురిలో ఒక్కరయినా సభలో పాల్గొని ఉంటే బాగుండేది. ఠాక్కూభాయీ మొదలయిన వారు రోజంతా జరిగిన సమాచారం సంగ్రహంగా వినిపించారు. మమ్మల్ని ముగ్గురినీ సరాసరి బాపూవద్దకే పిలుచుకొని వెళ్తారని అందరూ అనుకున్నారు.

బాబలా, కను ప్రణామం చేశారు. బాబలా ఉదయమే అన్నయ్యతో అంటూ ఉన్నాడు: "ప్యారేలాల్ కాకా, మహాదేవభాయీ కాకా తమ దుశ్శాలువ మరచిపోయారు. మీరు తీసుకొని వెళ్లి ఆయనకు ఇవ్వండి" అని.

తాము ఏమి చేయాలని పొళ్లిద్దరూ అన్నయ్యను అడిగారు. వారు జరూరు కాయితపత్రాలు తీసుకొని, వరాకు వెళ్లడం మంచిద



తుఫానులో తాళత్రయం

చిత్రం — పి. నాగేశ్వరరావు (అన్నినేనిగుంటపాలెం)

అన్నయ్య సలహా ఇచ్చాడు. కను వెళ్ళేముందు నాకు, అన్నయ్యకు 'విధి నిర్వహణమో, వీర మరణమో!' "అనే మంత్రం వ్రాసి ఇచ్చాడు. "నేను ఇలాటి కాయితాలు వందలు, వేలు పంచి పెడుతాను. హనుమంతుడు లంకలో జొరబడి పట్టుబడ్డట్టు పట్టుబడుతాను. ఊరికేనే కాదు" అన్నాడు. బాబలా కూడా ఉత్సాహంతో పొంగి పోతున్నాడు. ఈ ఉత్సాహ పూరిత వాతావరణం లోనే వారిద్దరూ మా అరెస్టు తర్వాత మరునటి రోజు సేవాగ్రామ్ వెళ్ళారు.

అముతుస్సలాం నిన్నటి బాపూ ప్రసంగం వెంటపడింది. బాపూ ముసల్మానులను గురించి చెప్పిన విషయాలను విడిగా నకలు చేయడం మొదలు పెట్టింది. వాటిని ఆమె విడి పత్రికగా ముద్రించి పంచిపెట్టదలచింది. ఆమె నాకు తన చిరునామా వ్రాసి ఇచ్చింది. "నీవు రోజూ బాపూ సమాచారాలు నాకు వ్రాస్తూ

# గాంధీజీ కారాగార గాథలు

ఉండు" అన్నది. "సాధ్యమైతే వ్రాస్తాను" అని నేను సమాధానం చెప్పాను.

లీలావతీబహన్ హైరానాతో ఇటూ అటూ తిరుగుతున్నది. "నేనేమి చేయాలి? చదువు మానవద్దని బాపూ నాతో అన్నారు. కాని, నేను ఎలా చదువుకోను?" అన్నది లీలావతి బహన్.

"అయితే చదువవద్దు. తోటి విద్యార్థులను కూడగట్టుకొని వచ్చివేయి" అన్నాడు అన్నయ్య. కనుభాయికి తమాషా చేయాలని తోచింది. ఒక కాగితం ముక్కపైన "చదువుకుంటాము లేక చనిపోతాము" అని వ్రాసి "ఇదిగో! తీసుకోండి" అని అందించాడు.

మోటార్‌కారు బయలుదేరింది. కస్తూర్బా కళ్ళల్లో నీరు కనిపించింది. ఉదయం బాపూను, అరెస్టు చేసినప్పుడూ ఇలాగే జరిగింది. అప్పుడు కూడ నేనే సమాధాన పరిచాను. ఇప్పుడూ సమాధానపెట్టాను. బా శరీరం తాకాను. వేడిగా ఉంది. ఇంతలోకే మోటార్‌కారు అర్థర్ రోడ్ జెయిలు వద్దకు వచ్చింది. మేము కారుదిగి కింద నిలబడ్డాము. దారివెంట కొందరు కూలీలు వెళ్ళుతున్నారు. వాళ్ళు అలా తొంగి చూచి, తమదారిని తాము వెళ్ళిపోయారు. వీరు కస్తూర్బాను గుర్తుపట్టలేదా? ప్రస్తుతం ఏమి జరుగుతున్నదో వీరికి తెలియదా?— అనుకున్నాను.

(సశేషం)

---

(6) 'డు ఆర్ డై.'

(7) హరిభజనచేస్తున్నవారికిఎవరికీఅవమానం జరిగిందా?—ఇలా ఎవరూ ఎప్పుడూ చూడలేదు.

(8) మహాదేవభాయి కుమారుడు నారాయణ్ దేశాయి.

(9) "మిమ్మల్ని రెండు నిమిషాలు హెచ్చుగా వేచిఉండేట్టు చేసినందుకు చింతిస్తున్నాను."

(10) బా సందేశం ఈ విధంగా ఉంది:—"మహాత్మాజీ మీతో ఎన్నో విషయాలు చెప్పిపోయారు. విన్న ఆయన రెండున్నర గంటలపాటు ఏ.ఐ.సి.సి. సమావేశంలో తమ హృదయంలోని మాటలు తెలియజేశారు. అంతకన్నా ఎక్కువ ఏమి చెప్ప వచ్చు? ఇప్పుడు ఆయన సూచనలను అమలు చేయడం అవసరం. సోదరీమణులు తమ పరాక్రమం చూపవలసి ఉంది. అన్ని వర్గాల సోదరీమణులు ఏకమై ఈ పోరాటాన్ని సఫలంచేయండి. సత్యాహింసా మార్గాలను విడువకుందురు గాక!'

(11) ఏ. ఐ. సి. సి. కార్యాలయ తాత్కాలిక కార్యదర్శి; తర్వాత ప్రధాన కార్యదర్శి.

(12) అహమదాబాద్‌లోని మిల్లుల యజమాని శ్రీ అంబాలాల్ సారాభాయీ పుత్రిక.

(13) స్వర్గీయ దాదాభాయి నవరోజీపౌత్రి.

(14) ఆయనమాటలలో "Solemn Promise"

# ఆంధ్రప్రభ

## సచిత్ర వారపత్రిక

### మద్రాసు

ఎడిటర్: నీలంరాజు వెంకటశేషయ్య

# కేంద్రంలో కొత్త మంత్రివర్గం

ప్రజాస్వామ్యంలో నాయకత్వంలో తరుచు మార్పులు రావడం అవాంఛనీయమైన దేమీ కాదు. సహజం కూడా ఆ మార్పులు కొన్ని అనుకోని పరిణామాలకు దారితీయనూ వచ్చు. ఏమైనా అవి ఏలాంటి మార్పులు ? అవి ఏ విధంగా అమలులోనికి వస్తున్నాయి ? వాటిని ప్రజలు ఏలా ఎదుర్కొంటున్నారు ? అన్న ప్రశ్నలపై ప్రజాస్వామ్యం మనుగడ ఆధారపడి ఉంటుంది.

ప్రజాస్వామ్యం సుస్థిరంగా పాదుకొన్న దేశాలలోనే నాయకత్వంలో మార్పులు విపరీత పరిణామాలకు దోహదం చేయవచ్చు. మన దేశంలో నిన్న మొన్ననే ప్రజాస్వామిక వ్యవస్థను ఏర్పరచుకొనడం జరిగింది.

మరొకటి. స్వతంత్ర భారత దేశం అవతరించినది మొదలు ప్రజాస్వామిక ప్రభుత్వం శ్రీ జవాహర్‌లాల్ నెహ్రూ నాయకత్వం క్రిందనే ఉన్నది. నెహ్రూ నాయకత్వం ప్రజలకు శ్రీరామ రక్షే అయినది. ఇది బాల్య దశలో ఉన్న ప్రజాస్వామ్య వ్యవస్థకు కొండంత బలం. ఒకొక్కప్పుడు బలమే నీరసంగా, లోపంగా భాసిస్తుంది. నెహ్రూ నాయకత్వానికి సహితం ఈ లోపం తప్పలేదు.

ఈ దృష్ట్యా పరిశీలిస్తే కేంద్రంలో వచ్చిన మార్పులు అనేక విధాలుగా ఆశాజనకంగా ఉన్నవి.

ప్రజల ఏకైక నాయకుడు నెహ్రూ అస్తమించిన పక్షం రోజులలోగానే శ్రీ లాల్ బహదూర్ శాస్త్రిని కాంగ్రెసు పార్లమెంటరీ పార్టీ ఏకగ్రీవంగా నాయకుడుగా ఎన్నుకొనడం, శ్రీ శాస్త్రి ప్రధానిగా కేంద్రంలో కొత్త మంత్రివర్గం ప్రమాణం స్వీకరించడం జరిగింది.

వైవిధ్యంలో ఏకత్వం సాధించడానికి అహర్నిశమూ కృషిచేసి, దేశాన్ని ఒక్క త్రాటిమీద నడిపించగల ఏకైక నాయకుడు నెహ్రూ మృతి ప్రజాస్వామ్యానికే గొడ్డలిపెట్టు కాగలదని భయపడిన వారు దేశీయులలోనూ ఉన్నారు. అయినప్పుడు ఇంతటి ప్రధానమైన మార్పులు సమరస పూరితమైన వాతావరణంలో సాధ్యమయ్యేటట్లు చేసిన కేంద్ర నాయకులు ప్రజల కృతజ్ఞతకు అర్హులు.

కొత్తగా మంత్రివర్గంలో చేరిన ముగ్గురూ — శ్రీమతి ఇందిరా గాంధీ, శ్రీ ఎస్. కె. పాటిల్, శ్రీ నీలం సంజీవరెడ్డి — అగ్ర నాయకులు; నెహ్రూ సన్నిహితులు.

కొత్త మంత్రివర్గం నెహ్రూ విధానాలను అనుసరిస్తుందనడంలో సందేహం లేదు. ఈ మార్పు సమష్టి నాయకత్వానికి తొలి మెట్టు అని కూడా చెప్పవచ్చు. నెహ్రూ నెలకొల్పిన ప్రజాస్వామ్యం సాధించిన తొలి ఘన విజయం సహితం ఇదే.

నూతన మంత్రివర్గానికి ఇవే మా శుభాకాంక్షలు. ★

# ఆర్థర్ రోడ్ జెయిలునుంచి ఆగాఖాన్ భవనం జెయిలుకు

జెయిలు తలుపులు తీశారు. మేము ముగ్గురం లోపలికి వెళ్ళాము. మమ్మల్ని ఆఫీసు గదిలో కూర్చోబెట్టారు. మురికి కుర్చీలు, వాటిమీది గద్దెలు కూడ మురికివి. తాకితే గట్టిగా ఉన్నాయి. విశ్రాంతిగా కూర్చోలేకపోయాము. ఆఫీసు అంతా మురికిగాను, అస్తవ్యస్తంగాను కనిపించింది. జెయిలర్ మొదలయిన ఉద్యోగులంతా ఏదో గొప్ప నాటకం చూస్తున్నట్టు మజాగా ఉన్నారు.

కొంతసేపటికి మాకోసం గది తయారయింది. మమ్మల్ని ఆ గదికి పిలుచుకొని పోవడానికి ముప్పైఅయిదు — నలభై ఏళ్ల మరాఠీ మహిళ ఒకామె వచ్చింది. ఆమె పేరు మమా. మేమిద్దరం ఆమె వెంట వెళ్ళాము. మా వెనుక ఉన్న తలుపు మూసివేశారు. అన్నయ్య వెలుపలే ఉండిపోయాడు. అన్నయ్య విడిపోతాడని అంతవరకు నాకు తోచనేలేదు. నేను వెనక్కు తిరిగి ఆయనను చూచాను, కటకటాలనుంచే ఆయనకు వీడ్కోలు చెప్పాను. వెలుపలి కోలాహలంతో పోల్చినప్పుడు, ఇక్కడి నిశ్శబ్ద వాతావరణం విచిత్రమనిపించింది. లోపలినుంచి మరొక తలుపు తెరిచారు. మేము ఆడ ఖైదీలు ఉండే స్థలం చేరుకున్నాము. మా వెనుకనే తలుపులు మూతపడ్డాయి. ఈ తలుపులు సందులు బంధులు లేని ఏకాండమైన తలుపులు. వెలుపలి సంగతి ఏమీ కనిపించేది కాదు.

ఆర్థర్‌రోడ్ జెయిలులోని ఈ మహిళా విభాగం విడిగా ఉన్న ఒక బయలు. నాలుగు వైపులా ఎనిమిది—తొమ్మిది అడుగుల ఎత్తు గోడలు, ఒక చిన్నతోట, ఖైదీలు ఉండడానికి వరుసగా నాలుగు గదులు, గదుల తలుపులకు బలమైన లావుపాటి ఇనుపకమ్ములు. ఆఖరుగది మాది. మొదటి రెండు గదులలోను శిక్షపడిన స్త్రీలు ఉండేవారు. దాదాపు ముప్పైమంది ఉండి ఉంటారు. ఇద్దరు ముగ్గురు చంటిపిల్లల తల్లులు గూడ. మూడవగది పగలంతా ఖైదీలు పనిచేయడానికి ఏర్పాటుచేశారు. రాత్రి అది ఖాళీగా ఉంటుంది. సాయంకాలం ఐదున్నర కొట్టగానే ఖైదీలందరినీ గదులలోపల బంధించి, ఇనుపకమ్ముల తలుపులు మూసి తాళాలు బిగించేవారు. ఆడ ఖైదీలలో ఏడు సంవత్సరాల శిక్షపొందిన ఖైదీ ఒకతె ఉండేది. ఆమే మాకు కావలసిన ఏర్పాట్లు చేసేది. ఆమె పేరు సాకూ. వార్డర్లు అంటే ఎవరో నాకు అంతవరకు తెలీదు. మగఖైదీల వార్డర్లను చూసిన తర్వాత ఈమె ఆడఖైదీల వార్డర్ అని తెలుసుకున్నాను. కాని, ఆమె దుస్తులలో మార్పేమీ లేదు. తక్కిన ఆడఖైదీలలాగే దుస్తులు ధరించేది. మగ ఖైదీల వార్డర్లుమాత్రం పసుపు రంగు తలపాగా చుట్టుకొనేవారు.

మా గదిలో ఒక ఎలెక్ట్రిక్ బెల్ పెట్టారు. అవసరమైనప్పుడు మేము దానిని నొక్కి ఎవరినైనా పిలవవచ్చు. ఆ బెల్ సాకూ గదిలో మోగుతుంది. సాకూ మాకన్నా ప్రహరీగోడకు దగ్గరగా ఉండేది. కనుక గట్టిగా కేకవేసి, సంత్రీని (కాపలావాణ్ని) పిలిచేది. ఆ కాపలావాడు మమ్మల్ని పిలిచేవాడు. అప్పుడు, మాకు అవసరమైన సహాయం లభించేది.

ఈ నాలుగు గదులముందు ఒక పంచ ఉండేది. కాని, చాల ఇరుకు. దానిలోను ఎ. ఆర్.

మూలం :

## డాక్టర్ సుశీలానైయర్

అనువాదం :

## తిరుమల రామచంద్ర

పి. (విమానాల దాడి రక్షణ) కోసమని ఎత్తుగా గోడలు కట్టారు. గది కిటికీలకు అసలే లావుపాటి కమ్ములు. ఆ కిటికీలకు అడ్డంగాను నాల్గింట మూడువంతులవరకు గోడలు. గదిలోకి గాలిగాని, ఎండగాని వచ్చేవికావు. ఎగుడు దిగుడు గచ్చునేల. వెనుకవైపు ఒక ఫ్లష్‌ఔట్ మరుగుదొడ్డి, చిన్న స్నానాలగది ఉండేవి. రెండూ చాల మురికిగా ఉండేవి. మురికినీటిగొట్టాలు కారుతున్నాయి కాబోలు, దుర్వాసన కొట్టేది. మొదటిరోజు మేమిద్దరం—నేను, కస్తూర్బా—చాల అలసిపోయాము గనుక నిద్రపోయాము. రెండవరోజు తెల్లవారగానే గ్రహించింది ఏమిటంటే, ఆ గదిలో కూర్చోడం తలనొప్పి కొని తెచ్చుకోడమేనని.

# గాంధీజీ కారాగార గాథలు

మేము ఆ గదిలో అడుగుపెట్టగానే మాకోసం రెండు కర్ర పలకల మంచాలు వచ్చాయి. వాటిపైన కొబ్బరి పీచు గద్దెలు అమర్చారు. ఈ గద్దెలమీద జెయిలు దుప్పట్లు పరిచారు. అవి నాకు మురికివిగా కనిపించాయి. ఉన్నవాటిలో శుభ్రమైన దుప్పట్లే తెచ్చారు. కాని, అవికూడా నాకు మురికివిగానే అనిపించాయి. ఆగాఖాన్ మహల్ జెయిలుకు వచ్చినమీదట బాపూ అలాటి దుప్పట్లే మేము వాడేట్టు చేశారు. అప్పటినుంచి అవి నాకు శుభ్రమైనవిగానే అనిపించాయి. కాని, ఆరోజుమాత్రం ఆ దుప్పట్లమీద నాకు, బాకు మా వెంటతెచ్చిన పక్కే వేయించాను.

కస్తూర్బాకు 99.6 జ్వరం. ఆమెను పక్కమీద పడుకోబెట్టాను. మమ తినడానికి ఏమైనా కావాలా అని అడగడానికి వచ్చింది. కస్తూర్బాకు ఏమీ అక్కరలేదు. నాకుమాత్రం బాగా ఆకలి వేస్తూ ఉంది. మధ్యాహ్నం అక్కడా ఇక్కడా తిరగడంవల్ల, ఏదో అరకొరగా తిన్నాను. అంతకు వెనుకటిరోజు రైలులో తిండితినే అవకాశమే లేదు. జెయిలులో నియమ నిబంధనల ప్రకారం రెండవరోజుగాని భోజనం దొరకదు. ఇప్పుడు రొట్టెలు కావాలంటే చేయడం కష్టం. కొద్దిగా పాలు తాగి పడుకుందాము అనుకున్నాను. పాలు జెయిలులో దొరకడం కష్టమని నాకేమి తెలుసు? కనుక, ఒక గిన్నెడు పాలు తెమ్మన్నాను. కొంచెం సేపటికి ఒక చిన్న గిన్నెలో నీళ్ళలాగ పలుచని, చల్లని పాలు—మూడు ఔన్సులుంటాయేమో!—పంపారు. పాపం! జెయిలర్ తన ఇంటినుంచి ఈ పాలు పంపాడట. నేను అదే తాగి పడుకున్నాను. కస్తూర్బా అదివరకే పడుకున్నారు. సాయంకాలం ఆరుగంటలు కొట్టి ఉండవచ్చు. చీకటిపడసాగింది. బా లేవగానే ప్రార్థన చేద్దామనుకున్నాను. ఏదో పుస్తకం తీసుకొని చదువడం మొదలుపెట్టాను. చదువుతూ చదువుతూ నిద్రపోయాను. మూడు రాత్రులుగా పూర్తి నిద్రలేదు. ప్రయాణపు బడలిక. దానిమీదట నేటి ఉదయంనుంచి వాతావరణం ఉత్తేజితంగా ఉండడంవల్ల కలిగిన అలసట. ఈ కారణాలవల్ల పడుకోగానే నిద్రపట్టింది. రాత్రి కస్తూర్బాకు మూడు నాలుగుసార్లు విరేచనాలయాయి. రెండోసారో, మూడోసారో మరుగుదొడ్డినుంచి ఆమె తిరిగి వస్తున్న చప్పుడుకు నాకు మెలకువ వచ్చింది. ఆమె పడుతూ లేస్తూ నడుస్తూంది. నేను చటుక్కుని లేచి, ఆమెను పడుకోబెట్టి, పుస్తకం చదువుకోడానికి ప్రయత్నించాను. కాని, ఎ. ఆర్. పి. కారణంగా బల్బుమీద నల్లటి కాయితం అతికించారు. అందువల్ల మంచంమీద పడుకొని చదువడం సాధ్యమయ్యేదికాదు. లేచి, కూర్చోడానికి మనస్సు ఒప్పలేదు. కనుక అట్లాగే పక్కమీద పడి ఉన్నాను. మొదటిరాత్రి మమ మా గదికి వచ్చింది కాబోలు! మేము నిద్రపోతూ ఉండడం చూచి, గది దీపం ఆర్పివేసి, గదికి తాళమూ వేసి

మమ్ములను లోపల బంధించింది.

## అపూర్వానుభవాలు

ఆర్థర్‌రోడ్ జెయిల్,
10, ఆగస్టు 42

ఉదయం ఏడు—ఏడున్నరకు మను మా గదితలుపులు తెరిచింది. అంతకుముందే నేను, బా కాళ్లు చేతులు, ముఖమూ కడుక్కొని ప్రార్థన ముగించాము. బాకు నేడు కూడా జ్వరం తగిలింది. నీరసం కూడా ఎక్కువగానే ఉంది. పలుచగా విరేచనాలు అవుతున్నాయి.

బాపూ అరెస్టు తర్వాత నిన్ననే మేము ఉపవాసం చేద్దామనుకున్నాము. తర్వాత మరుసటి రోజు ఉపవాసం చేద్దామని నిర్ణయించుకొన్నాము. ఎందుకంటే, నిన్న అందరికీ ఈ వార్త తెలుపడానికి అవకాశం లేకపోయింది. ఆ నిర్ణయం ప్రకారం నేను నేడు ఉపవాసం చేశాను. కస్తూర్బాకు 'వెజిటెబుల్ టీ' (కొన్ని మూలికల కషాయం) తయారుచేసి ఇచ్చాను. ఆమె స్నానానికి వేన్నీళ్లు కావాలని కబురు పంపాను. వేన్నీళ్లు రావడానికి రెండుగంటలు పట్టింది. స్నానాదులు ముగించుకొని కూర్చున్నానో లేదో, జెయిలర్ వచ్చాడు. "మీకు ఇప్పుడే దినపత్రిక పంపుతాను. సెన్సార్‌చేసి ఇచ్చామని గట్టిగా చెప్పవలసి ఉంటుంది గనుక, నన్ను స్వయంగా పత్రికలను చూడనివ్వండి" అన్నాడు జెయిలర్. కొంచెం సేపటికి జెయిలర్, సూపరింటెండెంట్ ఇద్దరూ వచ్చారు. "కస్తూర్బా వస్తువులు కొన్ని బిర్లా భవనంలోనే ఉండిపోయాయి. ఆ వస్తువుల కోసం మమ్మల్ని ఫోనుచేయ నివ్వండి. లేకపోతే ఆ సామాను పంపవలసిందిగా మీరైనా ఫోను చేసి చెప్పండి" అని నేను సూపరింటెండెంట్‌తో అన్నాను. "అలాటిదేమీ కుదరదు. మీరు ఇక మీద వెలుపలి ప్రపంచంతో సంబంధం పెట్టుకోలేరు" అన్నాడు ఆయన. "అయితే పత్రిక ఎలా పంపుతున్నారు?" అని ప్రశ్నించాను. "పంపము. మీకు ఏమైనా కావలసి ఉంటే, బజారునుంచి కొని పంపిస్తాము" అన్నాడు. "నాదగ్గర డబ్బులేదు. డబ్బున్నా తెప్పించుకోనివ్వండి, సామానులను మీరన్నా తెప్పించి ఇవ్వండి" అని అడిగాను. "ఈ రెండూ కుదరవు" అన్నాడు ఆయన. దానిమీదట నాకు కొంచెం కోపం వచ్చింది. "అయితే మేము మీ హుకుములను, నిబంధనలను ఎంతవరకు పరిపాలిస్తామో చెప్పలేను" అన్నాను. పాపం! గప్‌చిప్‌గా వెళ్లిపోయాడు. అంతకన్నా ఏమి చేయగలడు? నాకూ ఇదే మొదటి కారాగారానుభవం!




చిత్రం—వి. ఆర్. కొండేపూడి (హైదరాబాదు)

కొంచెంసేపటికి ఒక డాక్టర్ వచ్చి, మా ఎత్తు, బరువు, ఒంటిపైని పుట్టుమచ్చల గుర్తులు చూశాడు, గుర్తు వేసుకొని వెళ్లిపోయాడు. మరి కొంతసేపటికి పెద్ద డాక్టర్ వచ్చాడు. నేను కస్తూర్బాను ఆయనకు చూపించాను. "ఇప్పుడే మందు పంపుతాను" అన్నాడు ఆయన. "అలసట, మానసికమైన భారం—మందుకన్నా, మంచి ఆహారం అవసరం. కనుక మీరు ఆమెకోసం సేబ్‌పండ్లు (యాపిల్‌పండ్లు) తెప్పించండి. ఆమెకు సేబ్‌పండ్లరసం తప్ప మరొకటి ఇవ్వదలచలేదు" అన్నాను. "ఇలాటి వస్తువులు జెయిలులో చాలా తక్కువ దొరుకుతాయి. మీకు కావలసినవి బజారు నుంచి తెప్పించుకోండి" అని అన్నాడు. "కాని, నా వద్ద పైసలు లేవే? మీరే కొని పెట్టండి. బతికి బయటపడితే మీ డబ్బు చెల్లించి వేస్తాను" అని కోరాను. "నేనేమి చేయను? జెయిలులో బట్టు పడ్డవారికి మాత్రమే ఫలానా వస్తువులు ఇస్తారు. తక్కిన వస్తువులను వారు స్వయంగా కొనుక్కోవలసి ఉంటుంది" అన్నాడు ఆయన.

మళ్ళీ నాకు కోపం వచ్చింది. "నేను పనిచేసిన ఆస్పత్రిలో జబ్బుపడినవారికి అవసరమైన అన్ని వస్తువులూ తెప్పించి ఇచ్చేవారు. వ్యాధిగ్రస్తులు డబ్బు చెల్లించవలసిన వస్తువులు మామూలుగా ఉండేవనుకోండి. కాని, వారు డబ్బు చెల్లించలేనప్పుడు, నేను చీటీ కింద 'ఉచితం' అని వ్రాసి నా సంతకం చేసేదాన్ని. వ్యాధిగ్రస్తులకు ఆ వస్తువు ఉచితంగా లభించేది. డబ్బు తెప్పించుకోనన్నా తెప్పించుకోనివ్వండి. లేకపోతే మీ జేబులోని డబ్బుతో వస్తువులు తెప్పించి పెట్టండి. ఏనాటికైనా మీ లెక్కంతా చెల్లించి వేస్తాను" అన్నాను. ఆయన కొంచెం మెత్తబడ్డాడు. "ఏమిటి? మీరు డాక్టరా?

## గ మ ని క

సమీక్షార్థం రెండు ప్రతులు 'ఎడిటర్, ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక, ఎక్స్‌ప్రెస్ ఎస్టేట్స్, మద్రాసు—2'కు పంపవలసి ఉన్నది.

—ఎడిటర్







# గాంధీజీ కారాగార గాథలు

ఎక్కడ పనిచేసేవారు?" వగైరా ప్రశ్నించాడు. తర్వాత "సేబ్ పండ్లు వస్తాయిలెండి" అంటూ వెళ్ళిపోయాడు. కాని, సేబ్ పండ్లు సాయంకాలం దాక మాకు అందలేదు. బాకు పగలు టీ మాత్రమే ఇచ్చారు. జ్వరం, విరేచనాలు ఉండనే ఉన్నాయి. నీరసం ఎక్కువ కాసాగింది.

గదిలో గాలి కొంచెమైనా లేదు. స్తంభించి పోయింది. అక్కడ కూర్చుంటే తలనొప్పి పట్టుకుంటుంది. "మా పంచలో వచ్చి కూర్చోండి" అన్నది మేట్రన్. జముఖానా మొదలయినవి అక్కడ పరుచుకొని, నేను, బా కూర్చు న్నాము. ఇద్దరం నూలు వడికాము. మేట్రన్‌తో కొంచెంసేపు మాట్లాడాము. ఆమె గర్భవతి. ఏడు నెలలు ఉంటాయి. "నేను మీ కాన్పుకు సహాయం చేస్తాను" అన్నాను నవ్వులాటకు. ఆమె మొదట పంతులమ్మ పని చేసేదట. జెయిలు నౌకరీలో ఇంటి వ్యవహారాలు చక్కబెట్టుకోడానికి తీరిక హెచ్చుగా ఉన్నందువల్ల, రెండు మూడు సంవత్సరాలుగా ఈ నౌకరీ చేస్తున్నది. ఆమె భర్త మిల్లులో ఉద్యోగి. మేట్రన్ ఉద్యోగంలో నెల జీతం 75 రూపాయలో, కొంచెం హెచ్చుతక్కువో. అయినా, ఉండడానికి ఇల్లు, పని తేలిక. కనుక ఆమెకు ఈ ఉద్యోగం నచ్చింది.

మధ్యాహ్నం పన్నెండు కొట్టగానే మేట్రన్ తన ఇంటికి వెళ్లింది. బా లోపలికి వెళ్లి పడుకున్నారు. నేను ఆ పంచలోనే కూర్చుని చదువుకుంటున్నాను. సుమారు నాలుగుకొట్టే వేళకు తలుపు తెరిచారు. మేట్రనే. జెయిలు సిపాయి ఎవరిదో పెట్టె, పడక తెస్తున్నాడు. నేను ఉత్కంఠతో లేచాను. మరొక సోదరి వచ్చింది; ఆమె పేరు శ్రీమతి సీతల్‌దాస్. నేను ఆమె వెంటవెళ్ళి సామాను లోపల పెట్టించాను. తర్వాత ఇద్దరం బావద్దకు వెళ్ళి కూర్చున్నాము. ఆమె వయసు ముప్పై—ముప్పై అయిదు ఉంటుంది. నలుగురు పిల్లల తల్లి. ఒక్కడే కుమారుడు, వయస్సు రెండేళ్ళు. జబ్బు పిల్లవాడు. ఆమె ఎప్పుడో లేడీ హార్డింజ్ కాలేజీలో ఎఫ్. ఎస్. సి. చదివింది. డాక్టర్ కోర్సుకు వెళ్ళలేదు. జెయిలుకు మొట్ట మొదటిసారిగా వచ్చింది. ఆమె భర్తకు ఆమె జెయిలుకు రావడం ఇష్టంలేదు. పిల్లవానికి ఆరోగ్యంగా లేనందున ఆమెకుకూడా జెయిలుకు వచ్చే ఉద్దేశ్యంలేదట. అయితే, అందరినీ పట్టుకున్న తర్వాత ఎవరో ఒకరు వెలుపలికి రావాలి కదా— అనుకున్నదట. భర్తకు చెప్పకనే ఉదయం ఝండా వందనంలో పాల్గొన్నది. అక్కడినుంచి తిరిగివచ్చిన మీదట విద్యార్థులను కలుసుకోడానికి వెళ్ళింది. అప్పుడే పోలీసులు

పట్టుకున్నారు. పాపం! సామాను తీసుకొని రావడానికి ఇంటికివెళ్ళింది. పోలీసులు తొందర పెట్టారు. ఒక గిన్నెడు పాలు మాత్రం పుచ్చుకొని బయలుదేరింది. ఉదయంనుంచి మరేమీ తినలేదు. మధ్యాహ్నంతర్వాత వచ్చే ఖైదీలకు మరుసటిరోజు భోజనం ఏర్పాటు చేస్తారని మేట్రన్ నాతో అన్నది ఇదివరకే. అందువల్ల నిన్నరాత్రి నాకు పంపిన కొద్దిపాటి పాలుకూడా జెయిలర్ ఇంటినుంచి వచ్చినట్టివే. అందువల్ల ఆమెకు ఈపూట భోజనం దొరకదు. సాయంకాలం నాకు, బాకు భోజనం పంపారు. నేను, శ్రీమతి సీతల్‌దాస్ భోజనానికి కూర్చున్నాము. బా ఏమీ పుచ్చుకోలేదు. నాకోసం ఉడికించిన ముద్దకూర కొద్దిగా పంపారు. బాకోసం లావుపాటి జెయిలు రొట్టెలు, పప్పు, అన్నం, పాలు, బ్రెడ్డు పంపారు. వెన్నకూడ పంపారు. మేము ఎంతో ప్రయత్నించాము. కాని, ఆ భోజనం గొంతునుంచి దిగడమే కష్టమయింది. ఒకటి రెండు ముద్దలకన్నా మింగలేకపోయాను. కొద్దిగా పాలు తాగాను. ఉపవాసం తర్వాత ఇలాటి భోజనం అనగానే నాకు డోకువచ్చింది. మేమిద్దరం గది వెలుపలికి తిరగడానికి వెళ్ళావ్ము. శ్రీమతి సీతల్‌దాస్ "నేను జెయిలర్‌తో నా పిల్లల సంగతి ప్రస్తావించాను. చిన్న చిన్న పిల్లలు. అందరికన్నా చిన్నవాడు జబ్బువాడు. ఆ జబ్బు పిల్లవాని విషయంలో తీసుకోవలసిన జాగ్రతలను ఆయాకు ఫోనులో చెప్పడానికి అవకాశం ఇవ్వండని కోరాను" అన్నది. ఆ మాటలు విని నేను ఎంత అమాయకురాలు ఈమె అనుకున్నాను. ఇది జెయిలుఖానా అని తెలియదు కాబోలు! ఆమె మనస్సు గట్టిపరచుకోడం కోసం ఉదయం జరిగిన సంగతులు తెలియజేశాను. వెలుపలి వారితో ఎలాటి సంబంధమూ పెట్టుకోనివ్వమని జెయిలర్ ఏమన్నాడో. అయినా, ఆ అమాయకురాలు తనకు ఫోను చేయడానికి అవకాశం ఇస్తారనే నమ్మింది.

జెయిలర్ బస మా గదుల ఎదుటే ఉంది. మేము గదిముందు తిరుగుతూ ఉండడం చూచి జెయిలర్ భార్య, పిల్లలు దూరంగా ఉన్న కిటికీ నుంచి తొంగిచూస్తూ, కస్తూర్బా యోగక్షేమాలు అడిగారు. జెయిలర్ తన పొట్టకోసం ఏమి చేసినా, ఇంట్లోని భార్యా పిల్లలకు బాపూపైన, కస్తూర్బాపైన ఉన్న భక్తిని ఎలా రూపుమాపగలడు?

వర్షం కురవసాగింది. అందువల్ల మేము మా గదిలోకి వెళ్ళవలసి వచ్చింది. గదిలో పడుకోలేకపోయాము. పంచలో పడుకుందామని నిర్ణయించుకున్నాము. ఇక్కడినుంచే జైలు నియమ నిబంధనలను ఉల్లంఘించడం ఆరంభిద్దామని అనుకున్నాము. (1) శ్రీమతి సీతల్‌దాస్‌ను 'బి' క్లాసులో పెట్టారు. మమ్మల్ని 'ఏ' క్లాసులో. భేదమేమిటంటే, మాకు పడుకోడానికి ఇచ్చిన కర్రపలకలమంచం ఆమెకు ఇవ్వలేదు. నేను మేట్రన్ రాకముందే నా పక్క, శ్రీమతి సీతల్‌దాస్‌పక్క పంచలో వేయించాను. బాకు మంచం మీద వేయించాను. మేట్రన్ వచ్చినప్పుడు స్పష్టంగా చెప్పాము—తాళం బిగించిన గదిలో పడుకోము అని. పాపం! ఆమె గాభరాపడింది. జెయిలర్‌వద్దకు పరుగెత్తింది. ఆయన "మంచిదే పంచలోనే పడుకోండి" అని చెప్పి పంపాడు.

శ్రీమతి సీతల్‌దాస్ నిన్నటి సంగతులు చాల చెప్పింది. నిన్న మేము వెళ్ళవలసిన సభలో జనం రాత్రి ఎనిమిది గంటల వరకు కాచుకొని ఉన్నారట. కాని, సభ జరుగలేదు. పోలీసులు చాల సార్లు బాష్పవాయువు ప్రయోగించారు, లాఠీచార్జీకూడా చేశారు. పోలీసులదాడి ఆగగానే జనం మళ్ళీ గుమిగూడేవారు. నేడుకూడా రాకపోకలు చాలవరకు ఆగిపోయాయి. హర్‌తాళ్ కూడా జరిగింది. ప్రజలలో ఎంతో ఉత్సాహం వ్యాపించింది. విద్యార్థులు అంత ఉత్సాహం చూపడంలేదని ఆమె కొంత నిరాశ ప్రకటించింది.

మేము పంచలో (వరండాలో) కూర్చున్నాము. నా స్వాస్థ్యం పూర్తిగా చెడిపోయింది. డోకులు. పడుకున్నాను. శ్రీమతి సీతల్‌దాస్ తన వెంట "హరిజన్" పత్రిక తెచ్చింది. దానిని చదువుతూ చదువుతూ నిద్రపోయాను. బా కూడా నిద్రపోయారు. పాపం! శ్రీమతి సీతల్‌దాస్‌కు తన పిల్లల చింతలో నిద్ర ఎలా పడుతుంది? ఏడుగంటలకు లేచి రాత్రి ప్రార్థన చేద్దామని అనుకున్నాము. కాని, అప్పుడు కూడా బా నిద్రపోతూనే ఉన్నారు. ఎనిమిది ముప్పావుకు మేట్రన్ వచ్చింది. "పడుకోడానికి ముందే మీకు ఒక కబురుచెబుదామని వచ్చాను. కాని, మీరు పడుకొనే ఉన్నారు" అన్నది. ఆ కబురు ఏమిటంటే, బాను, నన్ను ఈరాత్రి ఎక్కడికో పంపుతారట. పదకొండు గంటలకంతా సామాను సర్దుకొని సిద్ధంగా ఉండాలట. నేను లేచి నా పక్క చుట్టి కట్టి పెట్టాను. తక్కిన సామాను సర్దాను. బాను లేపలేదు. శ్రీమతి సీతల్‌దాస్ గాభరాపడసాగింది. "మీతోపాటు కాలం బాగా గడిచిపోతుందనుకున్నాను. మరి మీరు వెళ్ళిపోతున్నారే?" అన్నది ఆమె. నాకు కూడా ఈ మార్పు బాగనిపించలేదు. "మిమ్మల్ని కూడ త్వరగా ఇక్కడినుంచి మార్చివేస్తారు. బహుశా మనం యరవదా (యరవాడ) జెయిలులో మళ్ళీ కలుసుకుందాము" అని నేను ఆమెను సమాధాన పరిచాను.

నేడు ఉదయం సేబ్ పండ్లు తెప్పించడానికి నా వద్ద డబ్బులు లేవు. ఈ సంగతి తెలుసుకొని ఆమె తన పర్సు నాకు అప్పగించింది. దానిలో ముప్పై—నలభై రూపాయలున్నాయి. నేనుఐదు రూపాయలనోటు తీసుకున్నాను. వచ్చేతొందరలో ఆమె చీరలు తక్కువగా తీసుకొని వచ్చింది. అందులోను రంగుచీర ఏదీలేదు. నేను నా చీర ఒక్కటి ఆమెకు ఇచ్చాను. జెయిలులోనే చచ్చిపోతే, ఈమె అప్పు తలమీద పడదుగదా?—అనుకున్నాను.

బా మేల్కొన్నారు. నేను ఆమె పక్కచుట్టి బిగించాను. ఆమెను శ్రీమతి సీతల్‌దాస్ పక్కమీద పడుకోబెట్టాను. తర్వాత ముగ్గురం కూర్చుని ప్రార్థన చేశాము. రామ్‌ధున్ (రామ నామ భజన) జరుగుతూ ఉండగా అడుగుల చప్పుడు వినిపించింది. ప్రార్థన ముగిసింది. జెయిలర్, మేట్రన్ మమ్మల్ని పిలుచుకొని వెళ్ళడానికి వచ్చారు. మేము తయారుగానే ఉన్నాము; బయలుదేరాము. మా వెంట రావలసిన వ్యక్తి వెలుపల ఆఫీసులో నిలబడి ఉన్నారు. "ఎక్కడికి తీసుకుని వెళ్ళుతారు?" అని అడిగాను ఆ వ్యక్తిని. "బాపూజీవద్దకు" అన్నాడు



తథాగతుడు

చిత్రం—దాసరి నాగవర్ధనరావు (గుంటూరు)

ఆయన. బండి పదకొండున్నరకు బయలుదేరుతుంది. ఇంకా పదకొండే కొట్టాయి. ఆఫీసులో గట్టి కుర్చీలో కూర్చోవడం బాకు కష్టంగా ఉంది. ఆమె స్వాస్థ్యంకూడా బాగులేదు. విరేచనాలవల్ల ఆమె మరీ నీరసించిపోయారు. "ఒక ఈజీ చెయిర్ తెప్పించండి" అని అడిగాను. నా మాటకు మా కాపలా వ్యక్తి "స్టేషన్‌కు వెళ్ళుదాము. అక్కడ వెయిటింగ్‌రూమ్‌లో మీరు విశ్రాంతిగా కూర్చోవచ్చు" అంటూ, "బాపూజీకి నా ప్రణామాలు తెలపండి. నేను 1932లో ఆయనతోపాటు ఉన్నాను" అన్నాడు. "అయితే, మీరు బాపూ దళంలో ఎప్పుడు మళ్ళీ చేరుతారు?" అన్నాను. "మిమ్మల్లను అందరినీ చూసుకోడానికి కూడా ఎవరైనా ఉండవద్దా?" అన్నాడు ఆయన నవ్వుతూ. "రాజకీయ ఖైదీల

# గాంధీజీ కారాగార గాథలు

ఎక్కువ ఇబ్బంది పెట్టరు. వారితో కొంచెం తెలివి తేటలతో ప్రవర్తించవలసిన అవసరం ఉంది. కాని, దొమ్మికి, కలహానికి సంబంధించిన ఖైదీలు ప్రమాదమే. హిందూ—ముస్లిం కల హాల సమయంలో నేను పెక్కుమందిని కాపాడాను'' అని అన్నాడు.

మా సామానును జెయిలు మోటర్‌లో పెట్టారు. మేమూ దానిలో కూర్చున్నాము. కొంచెం సేపట్లో స్టేషన్ చేరుకున్నాము. ఏ స్టేషనో తెలియలేదు. అక్కడ వెయిటింగ్‌రూములో కూర్చుని కూర్చుని నాకు నిద్ర కమ్మింది. కాని బాకు నిద్ర ఏదీ? ఆమె ''సుశీలా, చూడు. జనం స్టేషనుకు వస్తున్నారు, పోతున్నారు. సర్కారు పనులన్నీ ఈ విధంగా ఏ సంచలనమూ జరుగనట్టే సక్రమంగా జరిగిపోతున్నాయి. ఈ పరిస్థితిలో బాపూ ఎలా జయిస్తారు?'' అన్నారు. నేను ఆమెకు నచ్చచెప్పి, భగవంతునిపై విశ్వాసం ఉంచాలన్నాను. ఆమె కొంచెం శాంతించారు. పండ్రెండు, పన్నెండుం బాపుకు స్టేషన్ వెలుపలికి వచ్చాము. బాను ఒక కుర్చీమీద కూర్చోబెట్టుకొని బండిలోకి తీసుకొని వెళ్ళారు. స్టేషన్‌లో చాలజనం రద్దీగానే ఉంది. ఏమి జరుగుతున్నదో, ఏమో, నాకు ఏమీ తెలియలేదు.

బండి వచ్చి ఆగింది. ఒక మొదటి తరగతి పెట్టెలో నాకూ, బాకూ స్థలం ఏర్పాటయి ఉంది. బా కింద పడుకున్నారు. నేనుపైన ఉన్నాను. బండి కదిలింది. నేను కాలేజీలో చదివే టప్పుడు 'మనం స్వతంత్రులం కానంతవరకు, మూడవ తరగతిలోనే ప్రయాణం చేస్తాను' అని ప్రతిజ్ఞ చేసుకున్నాను. అయితే, మేము నేడు స్వతంత్రులమే. స్వతంత్రురాలిని అయ్యే మొదటి తరగతిలో ప్రయాణం చేస్తున్నాను!— ఈ విధంగా నేను ఆలోచనల్లో పడ్డాను. బాకోసం తెచ్చిన రెండు పేట్ పండ్లు ఇంకా మావద్దే ఉన్నాయి. నాకు చాలా ఆకలి వేసింది. ఒక పేట్ పండు తిని పడుకున్నాను. రెండవపండు బాపూ వద్దకు చేరింది.

## ఆగాఖాన్ మహల్‌లో

ఆగాఖా మహల్, పూనా,
11, ఆగస్టు '42.

ఉదయం కళ్ళు తెరిచే వేళకు చాల పొద్దెక్కింది. మా సహచరుడు వచ్చి, ఇక ఒక్క స్టేషనే ఉందని చెప్పి పోయాడు. నేను పక్క చుట్టాము. దిగవలసిన స్టేషను వచ్చే వేళకు బా స్నానాల గదిలో ఉన్నారు. రాత్రంతా ఆమెకు విరేచనాలు వెళ్ళాయి. బండి ఐదు నిమిషాలు అదనంగా ఆగవలసి వచ్చింది. మేము దిగాము. ఒక హిందూస్తానీ పోలీసు ఆఫీసరు మమ్ములను తీసుకొని వెళ్లడానికి వచ్చాడు. మోటారు సిద్ధంగా ఉంది. మా యిద్దరినీ దానిలో కూర్చో బెట్టి, జాగ్రత్తగా తీసుకొని వెళ్ళారు. బొంబాయి

నుంచి వచ్చిన సహచరుడు రాత్రి ఇక్కడి రెండవ సహచరుణ్ణి అడిగాడు ''ఇక్కడి పరిస్థితి ఎలా గుంది?'' అని. పూనా సహచరుడు అన్నాడు: ''పరిస్థితి బాగాలేదు. ఈ గండాంతరానికి దూరంగా ఉన్నందుకు సంతోషిస్తున్నాను. ఇక్కడ తుపాకి కాల్పులు జరిగాయి; లాఠీ చార్జీలు జరిగాయి. విద్యార్థులపై తుపాకి కాల్చ గూడదని నేను మా ఆఫీసరుతో అన్నాను. ఆ విద్యార్థులలో ఏడేళ్లవాళ్ళూ, ఎనిమిదేళ్లవాళ్ళూ కూడా ఉన్నారు. పిల్లలపై తుపాకులు ప్రేల్చి ప్రభుత్వం ప్రజల సానుభూతి కోల్పోతుంది. హిందువులు, ముసల్మానులు, శిక్కులు కాంగ్రెసు పూజారులు అయ్యేట్టు చేస్తుంది. విద్యార్థులకు పేము దెబ్బలు అనే తేలికైన శిక్షను సూచించాను. కాని, నా మాట ఎవ్వరూ వినలేదు. గుళ్ళతోను, లాఠీలతోను పని జరుపుకున్నారు. పరిణామ మేమిటంటే, పరిస్థితి విషమించడం.'' ఈ మాటలకు బొంబాయి నుంచి వచ్చిన సహచరుడు ''ఔనౌను. పేము బెత్తాలతో కొట్టడం ఆదర్శమైన శిక్ష'' అన్నాడు. ఆ మాటలకు నాకు నవ్వు వచ్చింది. ''డాక్టర్‌గారు మాతో ఏకీభవించరు'' అన్నాడు బొంబాయి సహచరుడు. ''చిన్న పిల్లలకు పేము బెత్తం దెబ్బలు ఆదర్శమైన శిక్ష అని మీకు తోచడం నాకు ఆశ్చర్యంగానే ఉంది. ఎందుకంటే, పసిపిల్లలకు శారీరకమైన శిక్ష ఇవ్వ రాదనడం ఇప్పుడు ప్రతివారికీ తెలుసు. మంచి పాఠశాలలలో బెత్తంతో కొట్టడం పూర్తిగా



చన్నుకుడిపేవేళ

చిత్రం—[illegible]

నిషిద్ధం'' అని నేను అన్నాను. ''నిజమే. కాని, మీరు సభ్య సమాజం సంగతి చెబుతున్నారు. మాకు బర్బరతతో (అనాగరికతతో) పని బడుతున్నది'' అని వారిద్దరూ అన్నారు. తర్వాత వారి సంభాషణ ఆగిపోయింది. ఈ దమన నీతితో ఎవరికీ ఇష్టంలేదని మొదట్లో వారిద్దరూ తమలో తాము అనుకున్నారు. గుండ్లు పేల్చాలనీ, లాఠీలు విసరాలనీ, అరెస్టులు వగైరా చేయాలనీ ఎవరూ కోరుకోరని వారు అనుకున్నారు.

పది హేను—ఇరవై నిమిషాలకు మా మోటారు కారు ఒక నిర్మానుష్యమైన బాటకు ఓరగా ఒక పెద్ద ద్వారం ముందు ఆగింది. ద్వారం తలుపులు మూసి ఉన్నాయి. మోటారు మరొక పెద్ద వాకిలి వైపు వెళ్ళింది. ఎదుట సైనికులు పహరా తిరుగుతున్నారు. తలుపు తెరిచారు. మేము లోపల ప్రవేశించాము. మేము ప్రవేశించగానే మా వెనుక తలుపులు మూతపడ్డాయి. కొంత దూరంలో ఇనుప ముండ్ల తీగలు చుట్టారు. అక్కడా ఒక ద్వారం ఉంది. సైనికుల పహరాకూడా ఉంది. ఈ రెండవ తలుపు తెరిచారు. మేము లోపలికి వెళ్ళగానే మళ్ళీ బంద్ అయింది. మీరాబహెన్ తోటలోని నీటి బుగ్గ వద్ద కూర్చొని ఏదో రాస్తూ ఉండడం నాకు దూరం నుంచి కనిపించింది. అయితే, ఆమె మమ్మల్ని చూడలేదు. కారు పాలరాతి మెట్ల వద్దకు వెళ్ళి ఆగింది. బా, నేను కారుదిగి, పైకివెళ్ళాము. పంచ (వరండా) పొడుగ్గా ఉంది. ఎదుటఉన్న పంచలోను, తోటవైపున్న పంచలోను మొదటి సగంవరకు పాలరాతి బండలు పరిచారు. తర్వాతి సగంలో మామూలు నాపరాతి బండలు పరిచారు. ఒక ఖైదీ ఊడుస్తున్నాడు. బాపూగది ఎక్కడ ఉందని అతన్ని అడిగాను. ''ఈవరుసలోనే ముందు ఉంది'' అన్నాడు అతడు. బాపూ గదిని సమీపించాము. ఆయన పక్క కాచ్ (మంచం) మీద ఉంది. ఆయన దానిమీద కూర్చుని ఒక కాయితాన్ని పరిశీలిస్తున్నారు. మహాదేవ భాయీ ఆ కాయితం చేతపట్టుకొని పక్కన నిలబడి బాపూతో ఏమిటో చెబుతున్నారు.

మేమురావడం చూచి అందరూ చకితులయ్యారు. బాపూ ముఖకమలిక మీద క్షీణరేఖ స్ఫురించింది. బాతో ''నీవే ఇక్కడికి రావాలని కోరుకున్నావా? వారే తీసుకొనివచ్చారా?'' అని అడిగారు. పాపం! బా పెదవి విప్పలేదు. ఆయన ఏమిటి అడుగుతున్నారో, ఆమెకు అర్థం కాలేదు. బాపూ కనుబొమలు మరికొంత ముడిపడ్డాయి. నేను సమాధానం చెప్పాను: ''పట్టుకుని తెచ్చారు, బాపూ!'' అన్నాను. అప్పటికి బాపూ విచారం తొలగింది. నేను ప్రణామం చేశాను. నవ్వారు. ''నీవు వచ్చి చేరావా?'' అన్నారు. ''బా స్వాస్థ్యం ఏమీ బాగులేదు'' అన్నాను. ఆమె కోసం వెంటనే మంచం తెప్పించారు. బాపూ, మహాదేవభాయీ ఆమె విషయమై జాగ్రత్త

(తరువాయి 58 వ పేజీలో)

# మూసికినారో

## రాష్ట్ర పంచాయతీ ఎన్నికల చరిత్రలో నూతనాధ్యాయం

కోటిన్నర మంది ఓటర్లున్న సుమారు 15,000 పంచాయతీలకు ఎన్నికలు ముగిసినవి. అందులో కొన్నివేల పంచాయతీలకు ఏకగ్రీవంగా ఎన్నికలు జర్గిగాయి. ఇది రాష్ట్ర పంచాయతీ ఎన్నికల చరిత్రలోనే అపూర్వం. ఈ ఏకగ్రీవపు ఎన్నికలకు ప్రధాన కారణం రాష్ట్ర ప్రభుత్వం ప్రకటించిన బహుమతులు.

పంచాయతీ ఎన్నికలలో పోటీలు, కలతలు ఉండడం సర్వసామాన్యమైన విషయం. పట్టు దలలకుపోయి కేవలం ఒక గ్రామంలో పంచాయతీ సభ్యుడు కావడానికి ఎన్నోవేల రూపాయలు ఖర్చుచేసిన ఉదంతాలు ఉన్నాయి.

అంతేగాక ఆ పంచాయతీలలో అభివృద్ధి కార్యక్రమాలు జరగకుండా రెండోవర్గం నిరోధించడం, ఈ కక్షలు కారణంగా గ్రామాలలో ఉద్రిక్త వాతావరణం నెలకొని, గ్రామ వాతావరణం కలుషితం అయిన సందర్భాలు అనేకం ఉన్నాయి.

ఇవన్నీ గమనించే గ్రామాలలో కక్షలులేకుండా ఆరోగ్యకరమైన వాతావరణం నెలకొల్పి, ప్రశాంతంగా అభివృద్ధి పనుల పట్ల అందరి దృష్టి ప్రసరించేటట్లు దోహదం చేయడానికి రాష్ట్ర పంచాయతీరాజ్ శాఖా మంత్రి డాక్టర్ మర్రి చెన్నారెడ్డి గ్రామ పంచాయతీలలో 3000 జనాభాకుపైగా ఉన్నవాటికి రూ. 5,000; మిగిలిన వాటికి రూ. 2,500 ఏకగ్రీవ ఎన్నికలు సాధిస్తే ఇవ్వడానికి సాహసోపేతమైన నిర్ణయం చేశారు. అలాగే ఏకగ్రీవంగా ఎన్నికలు జరిపిన పంచాయతీ సమితులకు రూ. 25,000 బహుమతి ప్రకటించబడింది. ఎన్నికల అనంతరం రాష్ట్రంలో 321 సమితులుంటాయి.

ప్రభుత్వం పంచాయతీ ఎన్నికల ఖర్చుకు సుమారు 50 లక్షలు కేటాయించింది. నిజానికి ఏకగ్రీవ ఎన్నికలు ఇంకా ఎక్కువ సాధించగల్గితే ఎన్నికల ఖర్చు మరింత తగ్గేది. ఆ డబ్బును కూడా ప్రభుత్వం పంచాయతీలకు ఇవ్వగలిగేది.

ఏమైనా, ఇప్పటికి సాధించిన ఏకగ్రీవతకు డాక్టర్ చెన్నారెడ్డి సంతృప్తిని ప్రకటించారు. "ఇది ఇలాంటి ఉత్తమ కృషికి నాంది. ముందు ముందు అనేక సంస్థలకు, స్థానాలకు జరిగే ఎన్నికలపై దీని ప్రభావం పడితే మనం ఎంతో సంతోషించవచ్చు. ఏకగ్రీవంగా తమ ప్రతినిధులను ఎన్నుకొన్న ప్రజలను ఎన్నికైన సభ్యులను అభినందిస్తున్నాను" అని ఆయన అన్నారు.

డాక్టర్ చెన్నారెడ్డి పంచాయతీరాజ్ శాఖకు ఉత్తేజాన్ని కలిగించారు. ఆయన యువకుడు, చాల చురుకైన కరుకైన వ్యక్తి. పంచాయతీ ఎన్నికలలో ఏకగ్రీవతను సాధించిన ఘనత చాలవరకు ఆయనకే దక్కుతుంది.

ఈ ఎన్నికలలో కేవలం స్త్రీలనే—అందరినీ ఏకగ్రీవంగా కూడ—ఎన్నుకొన్న రాజోలుతాలూకా వి. సాహథం, హైదరాబాద్‌జిల్లా మహేశ్‌పేటలాంటి పంచాయతీలలోని ప్రజలు ఎంతో అభినందనీయులు.

ఆవేశాలకు, పట్టుదలలకు పోని స్త్రీల పరిపాలనలో ఆ గ్రామాలు మిగిలిన గ్రామాలకంటె అభివృద్ధి కార్యక్రమాలలో పురోగమించగలవనడంలో సందేహంలేదు. ఇంతవరకూ అందరూ స్త్రీ సభ్యురాండ్రున్న ఏకైక పంచాయతీ—నల్లగొండ జిల్లా మట్టంపల్లి—ఎంతో అభివృద్ధిని సాధించి మొత్తం భారతదేశపు దృష్టినే ఆకర్షించి ఉంది.



తట్టా తలపైపెట్టి

చిత్రం—[illegible]

### కొత్త మంత్రి

కొత్తమంత్రి శ్రీ తోట రామస్వామి స్వాతంత్ర్యసమరంలో పాల్గొని తన ఏభైఏండ్ల జీవితంలో తూర్పు గోదావరి జిల్లాకు ఎంతో సేవచేసిన ఉత్తమ వ్యక్తి. సుప్రసిద్ధమైన తెలగ కుటుంబానికి చెందిన శ్రీ రామస్వామి శీలసంపదకు, ఆర్జవానికి పేరుపడినవారు.

పెద్దాపురం తాలూకా కిర్లంపూడి ఆయన స్వస్థానం. 1952 సాధారణ ఎన్నికలలో కాంగ్రెసులోని హేమాహేమీలు పరాజయాన్ని చెందినా ఆయనమాత్రం శాసనసభకు ఎన్నుకోబడ్డారు. జిల్లా సహకార సెంట్రల్ బాంక్ అధ్యక్షుడుగా, జిల్లా కాంగ్రెసు అధ్యక్షుడుగా, జిల్లా పరిషత్ అధ్యక్షుడుగా ఆయన అనేక సంవత్సరాలు అందరి మన్ననలతో పనిచేశారు.

ప్రత్యర్థులు సహితం హర్షించే విధంగా జిల్లాపరిషత్తును నిర్వహించిన ఘనత రాష్ట్రం మొత్తంలో శ్రీ రామస్వామికే చెందుతుందంటే అతిశయోక్తి లేదు. ఆయన నిగర్వి, సౌమ్యుడు, ఎదుటివారిని ఎన్నడూ నొప్పించడు. ఎన్నడూ తనకు పదవికావాలని కోరలేదు. పదవులే వాటంతటవి ఆయనను వరించినవి. ఆయన గత సంవత్సరం శాసన మండలికి ఎన్నికైనప్పుడే మంత్రి అవుతారని అందరికీ స్పష్టపడిపోయింది.

"పెద్దలు నన్ను ఏ పదవిలో పనిచేయమంటే ఆ పదవిలో నా శక్తికొలదీ, న్యాయంగా, నిష్పక్షపాతంగా పనిచేయడం నా ధర్మంగా భావిస్తాను. రాష్ట్ర ప్రజాభ్యుదయానికి నా భాగం పాటు పడాలనేదే నా ధ్యేయం. అందరి సహకారంతో జయప్రదంగా ఈ కార్యభారాన్ని నిర్వహించగలనని ఆశిస్తున్నాను" అని ఆయన నాతో అన్నారు. ఆ మాటలలోని సరళతను చూడండి.

—కె. తాతారావు

వారన్నట్లు ఈ నాటక పోటీలు ప్రతి ఏడూ ఒకే ఊరిలో, నిర్ణీతమైన తేదులలో జరపడం అందరికీ అనుకూలంగా ఉంటుంది.

—ఎల్. శ్రీకృష్ణ
(వాల్తేరు)

### బొంబాయిలో

నేను రెండురోజుల క్రితం పూనానుంచి

## ఉత్తరాలు

(2 వ పేజీ తరువాయి)

బొంబాయి వస్తుంటే, నా చేతిలో ఉన్న ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక (3-6-64) ముఖచిత్రంచూసి ముగ్ధుడయిపోయాడు, ఓ మరాఠీ మిత్రుడు. పుస్తకం అంతా తిరగ వేశాడు, ఏం అర్థంకాకపోయినా. లోపల ఉన్న చిత్రాలను తెగమెచ్చుకొన్నాడు. 'నివాళి' అన్న శ్రీ వీరిశెట్టి అమృతరావుగారి చిత్రాన్ని చూసి చాల మెచ్చుకొన్నాడు. "మీ తెలుగు పత్రికల్లో చిత్రకళకు ఇంత ప్రాముఖ్యం ఇవ్వడం చాల ముదావహం" అని ఆయన అన్నప్పుడు ఆంధ్రుడుగా నేనెంతగానో గర్వపడ్డాను. తర్వాత తెలిసింది ఆయన బొంబాయిలో ఓ పత్రికకు 'ఆర్టు క్రిటిక్'ట!

ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక కవితలను ప్రచురించి నావంటి సాహిత్యప్రియులకు సంతోషం కలిగించడం కాకుండా, చక్కటి చిత్రాలను ప్రచురించి ఆంధ్రేతరులచేత గాఢ ప్రశంసింపబడటం నిజంగా గర్వకారణం. మా అభిమాన ప్రభకు అభినందనలు.

—శ్యామసుందర్
(బొంబాయి—19)

* * * *

ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక సాహిత్య పత్రిక. ఇందులో కథ సాహిత్యమే కాకుండా, సినిమా, నాటకం, గేయం, చిత్రకళ—అన్నింటిని సమంగా ప్రచురిస్తున్నారు. కావున ముక్కోటి ఆంధ్రులకు ఇది అభిమాన పత్రిక అయింది. చిత్రప్రభలోనే ఆంధ్రలో జరిగే నాటక ప్రదర్శనల గురించి ప్రచురిస్తూ మా కెంతో ఆనందాన్ని కలిగిస్తూ, ఆయా సమాజాల కార్యకలాపాల గురించి సర్వదా తెలియపరుస్తున్నారు. అలాంటిది మొన్న 3-6-64 వ

## గాంధీజీ కారాగార గాథలు

(8 వ పేజీ తరువాయి)

పడడంలో నిమగ్నులయారు.

కస్తూర్బా జబ్బు, హెచ్చుగా, మనోభారం వల్ల కలిగినదే. ఇక్కడికి రాగానే, ఆమెకు మందూ మాకూ లేకనే బాగయినట్టు అనిపించింది. సరోజినీ నాయుడూ వచ్చి మమ్మల్ని పలకరించారు. ఆమె మా అందరి భోజనాల సంగతి చూచేవారు. అందువల్ల భోజనం సంగతి అడిగారు. "నీకు ఏదైనా ప్రత్యేకమైన వంటకాలు కావాలంటే వండుకోవచ్చు" అన్నారు ఆమె. "అయితే మన వంట మనమే వండుకోవాలా?" అని అడిగాను. "కాకపోతే ఇక్కడ ఏమిటి చేస్తావ్? ఎట్లా ఉబుసు పోతుంది?" అని అడిగారు ఆమె. నేను ఊరికే ఉండిపోయాను.

వంటతో కాలక్షేపం అవుతుందన్నది నాకు కొత్త సంగతి. ఎలా కాలం వెళ్ళబుచ్చాలనే ప్రశ్న నాకు ఇంత వరకు ఎప్పుడూ కలగలేదు. దీనికి విపరీతంగా సమయం ఎప్పుడూ చాల త్వరగా గడిచిపోయేది. బాను పడుకోబెట్టిన తర్వాత సరోజినీ నాయుడూ, మహాదేవభాయీ నన్ను భోజనం కోసం బల్లవద్దకు పిలుచుకొని వెళ్ళారు. టోస్టు (బ్రెడ్ ముక్కలు), వెన్న, తాజా తేనీరు—వీటిలో ఆనాడు నాకు కలిగిన రుచి ఎప్పుడూ ఏ పెద్ద విందులోను కలుగలేదు!

(సశేషం)

1. ఈసారి సత్యాగ్రహంలో మున్నుపటి సత్యాగ్రహాలలోవలె కాకుండా జెయిలులలోను ప్రభుత్వ నియమనిబంధనలను వినయంతో ఉల్లంఘించాలని గాంధీజీ సూచన చేశారు. కాని, జెయిలుకు వెళ్ళిన తర్వాత ఆయనకు ఈ విషయంలో శంకలు ఏర్పడ్డాయి. ఆయన సహచరులు కూడా విడివిడిగా ఆలోచించి ఈ నిర్ణయానికి వచ్చారు.

శిష్యవాత్సల్యాన్ని, ప్రేమను మరింత చాటుతుండేకాని మరేంకాదు. నేను మీ రచనలకు విలువ కట్టడం అనే సాహస కార్యానికి పూనుకోలేను. ఇక మీ ప్రేమకూ, ఆదరాభిమానాలకూ వెలకట్టడం నా ఊహాతీతం. కాని— మీ రచనలకు ప్రతిగా గాదు, మీ ఆదరాభిమానాలకు నా కృతజ్ఞతా సూచకంగా ఈ పతకం పంపుతున్నాను. దీన్ని— ఐక్య రాజ్య సమితికొరకు భారతదేశం తరఫున కాంగోలో చేసిన సేవకు మెచ్చుకోలుగా రాష్ట్రపతి బహూకరించారు. 'దీనికి విలువ అంటూ ఉంటే నీ మాతృదేశ భక్తీ, త్యాగనిరతీ, కార్యదీక్షా, దక్షతా ఇందులో ఉన్నాయి' అన్నారు రాష్ట్రపతి వారు మ్రోగుతున్న హర్షధ్వానాలమధ్య నా కోటుకు పతకాన్ని తగిలిస్తూ. మాస్టారూ! దీనిని నిరాకరించక స్వీకరిస్తారనే నా ఆశ, ప్రార్థన!

మాస్టారూ! ఇది సరిహద్దు ప్రాంతానికి ప్రయాణంలో వ్రాస్తున్న ఉత్తరం. ఇప్పుడిక ఇంతకన్నా ఏమీ వ్రాయలేను. తిరిగివస్తే మళ్ళీ మిమ్మల్ని ఉత్తరం ద్వారా కలుస్తా. లేకపోతే మాతృదేశ పాదసేవలో ఒక పూజాపుష్పంగా రాలిపోతే — ఇదే నా ఆఖరు నమస్కృతి మీకు.

విధేయుడు,
—మురళి."

## దుందుభి

(38 వ పేజీ తరువాయి)

ఉత్తరం చదివి, పతకాన్ని పరిశీలిస్తున్న మాస్టారి ముఖంలో ఒక అనిర్వచనీయభావం గోచరించింది. ఆనంద బాష్పమో, ఆవేదనాశ్రువో తెలియని ఒక్క కన్నీటికణం ఆయన కనుకొలకుల్లోంచి జారింది. ఆయన నిదానంగా కళ్ళజోడు తీసి అశ్రువు తుడుస్తుండగా—

"బ్రిగేడియర్ మురళి మరణం. ఏకాంతంగా చిక్కుకొన్న భారత సైనికాధికారిని చైనీయులు చిత్రవధ చేసి చంపిన వైనం" అని కృష్ణ పెద్దగా ఆవేశంతో చదువుతూంటే మాస్టారి సమాధికి భంగం కలిగింది. ఆదుర్దాగా పేపరు తీసుకుని చదివారు.

చైనీయులను ఎదుర్కొనడానికి తన సైనికులతోబాటు మురళి ట్రెంచెస్‌లో పురోగమిస్తున్నాడు. ఆ ట్రెంచెస్‌లోనే చైనీయులు వ్యూహాన్నిపన్ని, అభిమన్యుడిని హతమార్చబోయే కౌరవసేనలాగా మురళిని, అనుచరులను ముట్టడించారు. ముందు నడుస్తున్న మురళికి వెనుక సంగతి తెలీదు. తన పురోగమనంలో శత్రువ్యూహంలో ఇరుక్కుపోయాడు. పాయింట్ బ్లాంక్ దూరంలో చైనీయులు మురళిని అమానుషంగా కాల్చి చిత్రవధచేసి చంపారు. ఇదీ వార్త సారాంశం.

వార్త చదివిన మాస్టారి హృదయంలో ముల్లు గుచ్చుకున్నట్లు అయింది. ముఖం వేదనతో, మేఘాచ్ఛాదితమైన ఆకాశంలా నల్లబడిపోయింది. ఆ పేపరు ఒక చేత్తో, పతకం మరొక చేత్తో పట్టుకుని శూన్యంలోకి చూస్తూ నించున్నారాయన.

అప్పుడే ఆకాశం దద్దరిల్లింది. కత్తిలాంటి మెరుపు తళుక్కున ఆకాశాన్ని ముక్కలుగా కోసింది. ఆకాశం గర్జించింది. ఉరిమిన ఉరుముకు గుండెలదరగా—

"ఎక్కడో పిడుగుపడింది నాన్నా" అన్నాడు కృష్ణ.

"కాదు. మృత్యువీరుడికి స్వాగతం పలుకుతూ దేవతలు మ్రోగించిన దుందుభి." మాస్టారు అన్నారు. ★

ఆంధ్రప్రభ

సచిత్ర వారపత్రిక

మద్రాసు

ఎడిటర్: నీలంరాజు వెంకటశేషయ్య

# పంచాయితీ ఎన్నికలూ, ప్రజాస్వామ్యమూ

అధికారం సంపాదించడం సులభసాధ్యమైనది కాదు. నిలబెట్టుకొనడం మరీ కష్టం. చలాయించడం సాగిస్తే నిలవదని మాత్రం గట్టిగా చెప్పుకొనవచ్చు. వేరొక విధంగా చెప్పాలంటే ఆ అధికారానికి లోబడవలసిన వారి సమ్మతి ఉంటేతప్ప దానిని నిలుపుకొనడం జరగదు.

ఇందుకు ఇటీవలి చరిత్రలో మనకొక గొప్ప దృష్టాంతం ఉంది. దేశం స్వతంత్రమైనది మొదలు తాను ఇహలోకం వీడిపోయే పర్యంతం భారత ప్రభుత్వాన్ని నిర్వహించిన జవాహర్‌లాల్ నెహ్రూ అనుభవించిన అధికారం అది. ప్రజలు తమంత తాముగా కట్టబెట్టిన అధికారం; ప్రజాసేవకు సాధనంగా మాత్రమే ఉపయోగపడిన అధికారం.

అధికారంలో తారతమ్యం ఉంది. అధికారం కోసం ప్రాకులాడడంలో మాత్రం అందరూ సమానులే కావచ్చు. అయినా ప్రజాసేవ అందరికీ లక్ష్యమూ కావచ్చు. కాదనవలసిన పని లేదు. కాని అధికారం సంపాదించడానికి అనుసరించే విధానాలు ఉత్తమమైనవి కాకపోతే చెడు పరిణామాలు సంభవించే ప్రమాదం అధికం.

ఇటీవల ఆంధ్రప్రదేశ్‌లో పంచాయితీ ఎన్నికలు జరిగినవి. సగం పంచాయితీలకుపైగా పోటీ లేకుండా ఎన్నికలు జరగడం చాలా గొప్పవిషయం. ఇందుకు రాష్ట్రప్రభుత్వం తగు ప్రోత్సాహమిచ్చినా పోటీ లేకుండా ఏడువేల పంచాయితీలకుపైగా ఎన్నిక కావడం అపూర్వం. చాలా పంచాయితీలకు స్త్రీలు మాత్రమే ఎన్నికకావడంకూడా ఒక విశేషం. ఇవి పంచాయితీ వ్యవస్థ సాఫల్యానికి తోడ్పడే అంశాలు.

అయితే కొన్ని ప్రదేశాలలో పంచాయితీ ఎన్నికలు కొట్లాటలకు కారణమైనవి. అభ్యర్థులు ఓట్లుకొన్న సందర్భాలు ఉన్నట్లు వార్తలు వచ్చినవి. ఇంకా అనేకమైన లోటుపాట్లు ఉన్నవి. ఈలాంటివి ఎంత శీఘ్రంగా సరిదిద్దుకుంటే గ్రామాలకు అంత మంచిది.

అధికారం చలాయించడానికి అంతగా అవకాశంలేని పంచాయితీ ఎన్నికలలో కేవలం సేవాభావానికి మాత్రమే ప్రాధాన్యం ఉంది. గ్రామం మంచి గ్రామంలోని అందరి మంచి. రాజకీయ విభేదాలు ఎలాఉన్నా గ్రామం మంచికోరడంలో అందరూ ఒకటే అని నిరూపించుకొనడం ముఖ్యం. ఇందుకు కేంద్రరాష్ట్ర స్థాయిలో నాయకులు దోహదం చేయడం ప్రజాస్వామ్యం మన దేశంలో సుస్థిరంగా పాదుకొనడానికి తోడ్పడుతుంది. ★



ఆగాఖాన్ మహల్, పూనా,
15, ఆగస్టు '42.

**ఉదయం** ప్రార్థనకు బాపు, నేను—ఇద్దరమే తెల్లవారుజామున లేచేవారం. మహాదేవభాయి లేవాలని అనుకునేవారు. కాని, రాత్రి నిద్ర విడిపోతే, తెల్లవారి నాలుగు గంటలకు లేవలేకపోయేవారు. నేడు ఉదయంకూడా నేను, బాపు— ఇద్దరమే ప్రార్థన చేశాము. ప్రార్థన పూర్తిచేసి మా పక్కలమీద కూర్చున్నామో లేదో, మహాదేవభాయీలేచారు; ప్రార్థన విషయమై బాపు అడిగారు. "ఇప్పుడిప్పుడే ప్రార్థన ముగిసింది" అని ఆమె సమాధానం ఇచ్చారు. నేడు ప్రార్థనలో పాల్గొందామని మహాదేవభాయీ అనుకున్నారు. కాని, అరగంట ఆలస్యమయింది. అందువల్ల ప్రార్థనకు రాలేక పోయారు. ఆరుగంటలకు బాపూ లేచిరాగానే, మహాదేవభాయీ ఆయనకోసం పండ్లరసం తయారుచేసి ఉంచారు. తర్వాత టోస్టును వెచ్చజేసి, తేనీరు తయారు చేశారు. సరోజిని నాయుడు స్నానంచేసి వెలుపలికి రాగానే, బల్లమీద తేనీరు మొదలయినవి సిద్ధంగా అమర్చి ఉన్నాయి. మహాదేవభాయీ టోస్టును చక్కగా ముక్కలుకోసి, వెచ్చజేసి, అందంగా బల్లమీద పెట్టి, క్షౌరం చేసుకొని బల్లముందు కూర్చున్నారు. ఒక రోజు బాపూ నన్ను అడిగారు: "మీ ఇద్దరిలో ఎవరు బాగా టోస్టు తయారు చేస్తారు, నీవా? మహాదేవా?" అని. నేను ఈవేళ మహాదేవభాయీతో "మహాదేవభాయీ, ఆ రోజు బాపూ అడిగినప్పుడు నాకంటే బాగా మీరు టోస్టు తయారు చేస్తారని ఒప్పుకోదలచుకోలేదు. కాని, ఈరోజు ఒప్పుకోక తప్పదు. మీ ముందు పరాజయం కూడా అంగీకరించక తప్పదు. రొట్టెముక్కలను వెచ్చచేసి, అందంగానూ అమర్చారు" అన్నాను. "నాకు తీరిక ఉంటే అన్నీ చేయగలను. కాని, రోజూ రాత్రి బాగా నిద్రపట్టదు. ఉదయం పొద్దుపోయి లేవడంతో తీరికే ఉండదు. నేడు త్వరగా లేచాను. అందువల్ల ఈ పనులన్నీ చేయగలిగాను" అన్నారు ఆయన.

ఇంతలో సరోజినీనాయుడు వచ్చారు. ఆమెకూడా మహాదేవభాయీని ప్రశంసించారు. మహాదేవభాయీ నవ్వుతూ, "నాకు ఇప్పుడు ఖాన్‌సామా (వంటవాడి) నౌకరి సులభంగా దొరుకుతుంది" అన్నారు. "బాపూ ఇంట్లో. బాపూ ఇంట్లో నీవు ఏమిటి కావు?" అన్నారు సరోజినీనాయుడు. మహాదేవభాయీ నా పక్కనే కూర్చుని ఫలాహారం చేస్తున్నారు. ఆయన ప్లేటులో ఒక టోస్టు పడిఉంది. కాని, ఆయన అందరి మధ్యన ఉన్న ప్లేటునుంచి మరొక టోస్టు ముక్క తీసుకున్నారు. బాపూ మహాదేవభాయీని కవి అనేవారు. కనుక మాటల్లో తన ప్లేటులో టోస్టు ముక్క ఉన్న సంగతి మరచిపోయి ఉంటారనుకుని, ఆయన ప్లేటులోని ముక్కను నేను తీసుకున్నాను. కాని, మహాదేవభాయీ దానిని కూడా తిందామనే ఉంచారు. నేను తీసుకున్న ముక్కను వెనక్కు పెట్టబోయాను. "వద్దు. నీవే తీసుకో!" అన్నారు ఆయన. సామెత ఉండనే ఉంది "దానే దానేపర్ మొహర్ హైఖానేవాలే కా" (గింజ గింజమీద భగవంతుని ముద్రఉంటుంది) అని. మహాదేవభాయీ లెక్క పూర్తయింది. కనుక, ఆయన ప్లేటులో, ఆయన ముందున్న టోస్టు ముక్కకూడా ఆయనకు దక్కలేదు— ఎగిరిపోయింది.

మహాదేవభాయీ క్షౌరం చేసుకోడం సరోజినీ నాయుడు ప్రస్తావించి, "నేను ఈరోజు స్నానం కోసం వెళ్ళినప్పుడు మహాదేవభాయి పెద్ద అద్దంముందు కూర్చుని క్షౌరం చేసుకుంటున్నారు. మీసాలు కత్తిరించుకొంటున్నారు. గోళ్ళు కత్తిరించుకుంటున్నారు" అన్నారు. 'మహాదేవభాయీకి ఈవాళ ఏమిటయింది? ఆకస్మాత్తుగా ఈ విధంగా ముస్తాబు కావాలని ఎలా తోచింది?' అనుకున్నాను. ఇంతకూ, దైవమే ఆతనితో ఈ సన్నాహమంతా చేయిస్తున్నది.

"కరలే సింగార చతుర అలబేలీ,
సాజనకే ఘర్ జానా హోగా."
(ఓ చతుర సుందరీ, సింగారించుకో.
ప్రియుని ఇంటికి పోవలసి వస్తుంది.)

నేను బాపూతోపాటు తోటలో తిరగడానికి బయలుదేరినప్పుడు, మహాదేవభాయీ తోట ఎదుటఉన్న మూలనుంచి మా ఎదుటికి వచ్చి, "ఈ కర్ర కటకటాల పని కొత్తది. ఇది కొత్తది అనడానికి నాకు మరొక సాక్ష్యంకూడా దొరికింది. ఇదిగో చూడండి. ఈ కర్రబద్దలు గుట్టగా పడిఉన్నాయి. వీటిని నేను ఉపయోగపరుస్తాను" అన్నారు.

తోటలో తిరుగుతున్నప్పుడు మహాదేవభాయి వల్లభభాయి సంగతులు చెప్పడం ప్రారంభించారు. "వల్లభభాయీకి గుడ్డలంటే చాల సరదా. ఆయన వృత్తిలో సాఫల్యం పొందిన బారిస్టరు. నెలలో ఎనిమిది పదిరోజులు కోర్టుకు వెళ్ళేవారు.

తక్కిన రోజులలో క్లబ్‌లో కూర్చుని బ్రిడ్జి ఆడేవారు. అయినప్పటికీ, నెలకు వెయ్యి, పదిహేనువందలు సంపాదించేవారు. ఒకసారి ఆయన ఒక స్నేహితునితో బ్రిడ్జి ఆడుతున్నారు. స్నేహితుని చేతిలో పేకముక్కలున్నాయి. ఏక్‌దమ్ ఆ మిత్రుడు వెనక్కు తగ్గాడు, తల కుర్చీపీపుపై వాలిపోయింది. ముక్కలు చేతిలోనే ఉన్నాయి. అతని ప్రాణాలు ఎగిరిపోయాయి. అప్పటినుంచి వల్లభభాయికి చీట్లపేక అంటే ఇష్టంలేదు." మేమిద్దరం ఈ మాటలన్నీ వింటూనే ఉన్నాము. రెండు గంటల లోపల మహాదేవభాయికి కూడా ఇలాటి పరిస్థితే వస్తుందని ఎవరికి తెలుసు?

ఈరోజు మహాదేవభాయి చాల ప్రసన్నులుగా ఉన్నట్టు కనిపించారు. బాపూ నిద్ర గురించి అగిడినప్పుడు "నేడు మొదటి రోజునే గాఢమైన నిద్ర పట్టింది. అందువల్లనే త్వరగా లేవగలిగాను. అన్ని పనులూ ఉదయనే చేసుకున్నాను. ప్రార్థనలోను పాల్గొందామనుకున్నాను. కాని, కొంచెం ఆలస్యమయింది. ప్రార్థన పూర్తయిందో లేదో నేను లేచాను" అన్నారు మహాదేవభాయి. ఆయన చాల ఉత్సాహంతో ఉన్నారు. రోజు సవ్యంగా ఆరంభమయింది. అందువల్ల చాల ఖుషీగా ఉన్నారు. "ప్రార్థన ఉండనే ఉందిలే. నీ నిద్ర చక్కబడితే, అంతా సరిపోయినట్టే" అన్నారు బాపూ. తర్వాత అక్కడి సంగతులు, ఇక్కడి సంగతులు చెప్పసాగినారు. ఈరోజు తోటను శుభ్రం చేయడం రోజుకంటే ఎక్కువ శ్రద్ధతో జరుగుతున్నది. "ఈ రోజు ఇన్‌స్పెక్టర్ జనరల్ తనిఖీకి వస్తారు. అందువల్లనే ఈ శుభ్రమంతా" అన్నారు మహాదేవభాయి. "ఆరోగ్యానికి సంబంధించిన పత్రికలేవైనా నా కోసం ఇన్‌స్పెక్టర్ జనరల్‌ను అడగండి" అన్నాను నేను. "నీవే ఖుద్దున అడగరాదూ?" అన్నారు ఆయన. "అప్పుడు బహుశా నేను బాపూజీకి నూనె మాలిష్ చేయడంలో ఉంటానేమో! అందువల్ల మిమ్మల్ని అడగమన్నాను" అని సమాధానం చెప్పాను. మాటల సందర్భంలోనే నేను "మహాదేవభాయీ, ఒక విధంగా ఈ జెయిలు బాగానే ఉంది. బాపూ అలసిపోయారు. మీరూ అలసిపోయారు. ఇక్కడ బలవంతంగా విశ్రాంతి దొరుకుతున్నది. వెలుపలికి వెళ్లేవరకూ మీరూ, బాపూ వెలుపలి పనులకోసం ఎంతో శక్తిని కూడదీసుకుంటారు" అన్నాను. ఆ మాటలకు ఆయన ముఖం గంభీరమయిపోయింది. నావైపు చూచి "ఆ సంగతి నాకు తెలియదు" అన్నారు.

తోటలో తిరిగి మేము పైకి వచ్చాము. నేను మాలిష్ చేయడంకోసం బాపూతో పాటు వెళ్లాను. ఇంతలో ఇన్‌స్పెక్టర్ జనరల్ వచ్చినట్టు సవ్వడినిబట్టి తెలిసింది. ఏదో వస్తువు తీసుకోవడానికి నేను నా గదిలోకి వెళ్లాను. మహాదేవభాయి సరోజినీ నాయుడు

# మహాదేవభాయి అస్తమయం

గారి స్నానాలగదినుంచి వస్తున్నారు. చంకలో 'ఆర్ట్ ఆఫ్ లివింగ్' (జీవనకళ) అనే పుస్తకం ఉంది. ఆయన నాతో ఒక్క పలుకైనా పలుకకుండా వెళ్ళిపోయారు. ఇది కొంచెం అసాధారణమైన విషయం. ఎందుకంటే, ఆయనను నేను ఎక్కడ కలుసుకున్నా, ఏదో మాట పలుకకుండా ఉండరు. అన్నయ్య ఇక్కడ లేడు గనుక, నాకు అన్నయ్యలేనిలోపం ఎంత పూరించగలిగితే అంత మంచిదని ఆయన మనస్సులో ఉండేది. భోజన సమయంలోను నాకోసం ఎదురుచూచేవారు.

నేను రాకముందు బాపూ భోజనపాత్రలు, గుడ్డలు ఒక ఖైదీ శుభ్రంచేసేవాడు. మహాదేవభాయి ఒకప్పుడు తన గుడ్డలు తానే ఉదుక్కొనేవారు. ఒకొకప్పుడు ఉదికించుకొనేవారు. మీరాబహెన్ తరచు తన గుడ్డలు తానే ఉదుక్కునేది. ఖైదీలు బాపూ పనులు చేయడంలో సంతోషపడేటట్టయితే, వారినే చేయమనడం మంచిదని మీరాబహెన్ అన్నది. ఖైదీలతోను, జెయిలు సిపాయీలు (వార్డర్లు) తోను పనిచేయించుకోడం బాపూజీకి ఇష్టం లేదని నేను ఆయన మాటలవల్ల గ్రహించాను. "మనను వీరంతా సర్దార్లని (నాయకులని) అనుకోడం నాకు ఇష్టంలేదు. మనమూ వాళ్ళలాగే ఖైదీలం. నాకేమో నా పని నేను చేసుకోడం, లేకపోతే నా సహచరులతో చేయించుకోడం ఇష్టం" అనేవారు బాపూ. కనుక, నేను బాపూ భోజన పాత్రలను శుభ్రం చేయడం ప్రారంభించాను. నా గుడ్డలు నేను ఉతుక్కునేదాన్ని; బాపూ గుడ్డలు కూడా ఉతకడం ప్రారంభించాను. బాపూ స్నానంచేసి వచ్చిన తర్వాత, ఆయన గుడ్డలు ఉతికి, నేను స్నానం చేసేదాన్ని. మహాదేవభాయి బాపూజీకోసం భోజనం తీసుకొని వచ్చేవారు, తర్వాత, నా కోసం ఎదురుచూచేవారు.

రెండు స్నానాల గదుల మధ్యన ఉన్న గోడ కప్పువరకు లేదు. కనుక, ఒక స్నానాల గదిలోని చప్పుడు మరొక స్నానాల గదికి వినిపించేది. కుడి పక్కన ఉన్న స్నానాల గదిని బాపూ ఉపయోగించేవారు. తక్కినవారు కూడా ఇష్టం ఉంటే వాడుకోవచ్చు. ఈ స్నానాల గదిలో కమోడ్‌కు పైన దీపం ఉంది. బాపూ మరుగు దొడ్డికి వెళ్లేటప్పుడూ చదివేవారు. కనుక ఈ స్నానాల గది ఆయనకు నచ్చింది. ఈ గదిలో ఒక నిలువుటద్దం కూడా ఉండేది. ఇది బాపూజీకి ఏమీ ఉపయోగం లేనిది. రెండవ స్నానాల గదిని సరోజినీనాయుడు వాడేవారు. దీనినే ప్రాయశః కస్తూర్బా, మీరా బహెన్‌కూడా వాడేవారు. దాదాపు రోజూ నేను స్నానం చేసేటప్పుడు గాని, గుడ్డలు వేసుకొనేటప్పుడు గాని మహాదేవభాయి రెండవ స్నానాల గదినుంచి వెలుపలికి వస్తూ "ఏ! సుశీలా! ఇంకా ఎంతసేపు అవుతుంది నీకు?" అని కేకవేసేవారు. మొట్టమొదటి రోజున ఆయన చాల ఆకలితో ఉన్నారు. బాపూ పట్టుదలతో నేను రావడానికి నాలుగైదు నిమిషాలు ముందుగానే ఆయనను భోజనానికి పంపివేశారు. తర్వాత బాపూ నన్ను పిలిచి "నీవు చాల పొద్దు చేస్తావు. మహాదేవ్ ఎంత సేపటినుంచి నీకోసం కాచుకొని ఉన్నాడో తెలుసా?" అన్నారు. నేను మహాదేవభాయితో అన్నాను: "నాకోసం కాచుకోకండి. భోజనానికి వేళకు వెళ్ళిపోండి. నేను మీ తర్వాత వస్తాను." మరునటి రోజు ఆయన స్నానాల గదినుంచి వెలుపలికి వస్తున్నప్పుడు ప్రత్యేకంగా వెళ్ళి "మీరు భోజనానికి వెళ్ళండి. నాకు పొద్దవుతుంది" అని చెప్పాను. కాని, నేను స్నానంచేసి వచ్చి చూతునుగదా, మహాదేవభాయి నాకోసం కాచుకుని కూచున్నారు. ఒంటరిగా భోజనం చేయడం నాకు ఇష్టం లేదని ఆయనకు తెలుసు. భోజనాల బల్ల సరోజినీనాయుడు గదిలో ఉండేది. ఆమెతో నాకు పరిచయం ఇక్కడికి రాకముందు లేదన్నట్టే అనుకోవాలి. అందువల్ల మహాదేవభాయి భోజన సమయంలో నాతోపాటు ఉండేవారు. ఇతర పనుల్లోను సహాయం చేయగలిగితే చేసేవారు.

మహాదేవభాయి సరోజినీనాయుడు గదిలోకి వెళ్ళి ఇన్‌స్పెక్టర్ జనరల్‌తో సంభాషించడం ప్రారంభించారు. నేను బాపూజీకి తైలం రాచి మాలిష్ చేస్తున్నాను. వారి మాటల మధ్యన నవ్వులు వినిపించేవి. నేను ఒక కాలికి మాలిష్‌చేసి, రెండవ కాలికి నూనె రాచాను. ఇంతలో "సుశీలా, రామ్మా ఇక్కడికి!" అని సరోజినీనాయుడు పిలుపు వినిపించింది.

'ఇన్‌స్పెక్టర్ జనరల్ అందరినీ చూడదలచ

## గాంధీజీ కారాగార గాథలు

మూలం :

డాక్టర్ సుశీలానైయర్

అనువాదం :

తిరుమల రామచంద్ర

# గాంధీజీ కారాగార గాథలు

కున్నాడేమో! రెండవ కాలికి మాలిష్ త్వరగా ముగించి తుడిచి వెళ్ళిపోదాము' అనుకున్నాను. కాని, ఇంతలో రెండవ పిలుపు వినిపించింది. దాని వెంటనే కస్తూర్బా పరుగుతో, ఎగ ఊపిరితో వచ్చి "మహాదేవ్‌కు ఏమిటో అయింది. అతనికి మూర్ఛ వచ్చింది. అపస్మార వ్యాధిలాగ ఉంది" అన్నారు. నేను బాపూ పాదం వదలి పరుగెత్తుతూ వెళ్ళాను. మూడవసారి సరోజినీనాయుడు పిలుపు వినిపించింది. నేను ఆమె గది చేరాను. నేను చేరడానికి ఎక్కువయితే ఒక్క నిమిషం పట్టి ఉంటుంది.

వెళ్ళిచూస్తే, మహాదేవభాయీ సరోజినీనాయుడు గదిలో పట్టెమంచంమీద పడుకొని ఉన్నారు, స్పృహలేకుండా. ముఖం తిరిగిపోయింది వికారంగా. నేను చూస్తుండగానే తలనుంచి పాదాలవరకు ఒక్క కుదుపులాగ కుదిపింది. నేను నాడి చూచాను. దొరకలేదు. రక్తపు పోటును చూడడానికి ప్రయత్నించాను. ఏమీ లేదు. గుండెమీద స్టెతస్కోపు పెట్టి చూచాను—నిశ్శబ్దం! గుండెకొట్టుకోడమే వినబడలేదు. "బాపూను పిలవండి. ఈయన వెళ్ళిపోతున్నాడు" అన్నాను! ఆయన పెదవులమీద నురగలాగ కట్టింది. ఊపిరి ఆగి ఆగి ఆడుతున్నది. నేను నా మందుల పెట్టె తెచ్చాను; అది తెరవడమే కష్టమయింది. బిగుసుకుని పోయింది. దానిని తెరవడానికి ప్రయత్నిస్తూనే "బ్రాందీ తీసుకొని రండి. గుండెకు మందివ్వండి" అంటూ సూచనలూ చేశాను.

మహాదేవభాయీ కాళ్ళు, చేతులు చల్లబడసాగాయి. మందు దగ్గరలో లేదు. తీసుకొని రావడానికి భండారీ (ఇన్‌స్పెక్టర్ జనరల్) వెళ్ళారు. సరోజినీ నాయుడు యుడికొలోన్, తేనె తెచ్చి యిచ్చి, "ఇవి బ్రాందీ పనిచేస్తాయి" అన్నారు. నేను మాలిష్‌కోసం బ్రాందీ అడిగాను. కాని, సరోజినీ నాయుడు ఇచ్చిన మిక్చర్‌ను మహాదేవభాయి నోటిలో పోశాను. ఆయనకు మందు మింగేశక్తి ఇంకా ఉంది. మింగారు. మిస్టర్ కటేలీ నా మందుల పెట్టె తాళం పగులగొట్టి తెరిచారు. పెట్టెలో కాల్షియం గ్లూకోనేట్ మాత్రం దొరికింది. గుండెకు బలం కలిగించే ఒక్క మందైనా లేదు. నేను ఢిల్లీనుంచి తొందరగా రావడం వల్లను, బొంబాయిలో తొందర పనులలో తిరగడంవల్లను, నా మందుల పెట్టెలో సమయానికి ఉపయోగించే మందులు సేకరించి పెట్టుకోలేకపోయాను. నేను మహాదేవభాయి చేయి ఎత్తాను. పూర్తిగా ఢీలా పడింది. నరాలలో కేల్షియం గ్లూకోనేట్ ఇంజక్షన్ ఇచ్చాను. ఇంతలో భండారీ బ్రాందీ తీసుకొని వచ్చారు. "కార్డియాక్ స్టిమ్యులెంటస్ ఎక్కడ?" అని అడిగాను. భండారీ మళ్ళీ కిందికి పరుగెత్తారు. ఈలోగా నేను బ్రాందీ మహాదేవభాయీ నోట్లో పోశాను. అప్పటికే మింగేశక్తి తగ్గిపోయింది. బ్రాందీ చాల సేపు నోట్లోనే ఉండిపోయింది. తర్వాత బాపూ నాతో "నీ చేయి అడ్డే పట్టుకుందామని అనుకున్నాను. కాని, మళ్ళీ ఊరుకున్నాను. నీవుకాక మరొకరు అయి వుంటే, బ్రాందీ ఇవ్వనిచ్చేవాడినే కాను" అన్నారు.

మహాదేవభాయీకి వాంతి ఆరంభమయింది. కాని, అది వెలుపలికి రావడం కష్టమయింది. నేను వాంతి బయటికి రావడంకోసం దవడలను నిమిరాను. శ్వాసనాళంలో వాంతి అయ్యే పదార్థం వెళ్ళకుండా తల ఒక పక్కకు వంచాను. బాపూ, నేను పిలిపించగానే రెండు మూడు నిమిషాలలోనే వచ్చారు. మహాదేవభాయీ చేతులు పట్టుకుంటూ, తలను నిమురుతూ, ఆయన కళ్ళవైపే నిదానించి చూస్తూ నిలబడ్డారు. "మహాదేవ్ ఒక్కమారు నావైపు చూస్తే తప్పక లేచి నిలబడుతాడని నా విశ్వాసం" అన్నారు.

సరోజినీనాయుడు నన్ను పిలిచినప్పుడు, భండారీతో మాట్లాడడానికి నన్ను ఆమె పిలుస్తున్నదని అనుకున్నారు బాపూ. ఆమె నన్ను పిలుచుకొని వెళ్ళడానికి వచ్చినప్పుడు కూడ మహాదేవభాయీకి ఏదో అనారోగ్యం అయిందన్న మాట ఆయన వినలేదు. ఆయన ఏదో చదువుతున్నారు. భండారీని కలుసుకొనడానికే నన్ను పిలుస్తున్నారని అనుకున్నారు. నామాట మీద పిలవడానికి వెళ్ళినప్పుడు కూడా భండారీతో మాట్లాడడానికే తమను పిలుస్తున్నారనే ఆయన అర్థం చేసుకున్నారు. తర్వాత మహాదేవభాయీకి ఏమిటో అయిందని విన్నప్పుడు ఏదో పెద్ద దుర్ఘటన జరిగిందని ఆయన అనుకోలేదు. ముందు కూడా అప్పుడప్పుడు మహాదేవభాయీకి తల తిరిగినట్టు, మైకం రావడం ఉండేవి. అలాగే ఇప్పుడూ వచ్చి ఉంటుంది. కొంతసేపటికి బాగవుతుంది—అనుకున్నారు.

సరోజినీనాయుడు బాపూజీకి వివరించింది: గది మధ్యన మహాదేవభాయీ నిలబడి ఉన్నారు. భండారీ, సరోజినీనాయుడు కుర్చీలలో కూర్చున్నారు. మహాదేవభాయీ ఏదో మాట్లాడుతున్నారు. ఏదో హాస్యం, ఎగతాళి సాగిపోతున్నాయి. అందరూవిరగబడి నవ్వుతున్నారు. ఈ నవ్వులు మాకు వెలుపలికి వినబడుతున్నాయి. కొంతసేపు అయిన తర్వాత మహాదేవభాయీ నాకోసం భండారీని ఆరోగ్యానికి సంబంధించిన పత్రికలు అడిగారు. తర్వాత వెంటనే "నాకు తల తిరుగుతూంది" అన్నారు. "అజీర్ణం అయి ఉంటుంది. పడుకోండి" అన్నారు భండారీ. మహాదేవభాయీ లేచి మూడు నాలుగు గజాల దూరంలో ఉన్న పట్టెమంచం వద్దకు వెళ్ళి దానిమీద పడుకున్నారు. భండారీ నాడి చూచారు. బలహీనంగా ఉంటూ, చాల తీవ్రంగా కొట్టుకుంటూంది. ఆయన నన్ను పిలవమని సరోజినీనాయుడుకు చెప్పి, ఫోనులో సివిల్ సర్జన్‌ను పిలవడానికి పైకి వెళ్ళారు. మహాదేవభాయీ మాట్లాడుతున్నప్పుడు, ఉన్నీ వాస్కట్ (నెహ్రూ కోటు) తొడుక్కున్నారు.



పల్లె మేలుకొంది

చిత్రం—ఎస్. బాలు (మద్రాసు-26)

మంచంమీద పడుకునేటప్పుడు దానిని తీసివేశా రేమో! నేను వెళ్ళిచూచినప్పుడు, వాస్కట్ సగం విప్పి ఉంది.

వాంతి కావడంతో పాటు ఆయన మూల్గడం కూడా మొదలు పెట్టాడు. భయంకరమైన మూలుగు; ఏదో గుహనుంచి వెలువడినట్టు వినిపించేది! ఆ మూల్గును బాపూ సహించలేక పోయారు; మేమూ సహించలేక పోయాము. ఊపిరి ఆగి ఆగి బయటికి వచ్చేది. బిగుసుకుని పోవడం తీవ్రంగా లేకపోయినా, మధ్య మధ్య జలదరింపు వచ్చేది. ఒక్క భాగానికి పక్షవాతం తగిలినట్టుగా ఒకమారు ముఖం పూర్తిగా వంకర అయింది. ఈ మార్పువల్ల ఈయన వికలాంగుడై పోడుగదా! అని మనస్సులో అనుకున్నాను. కాని, మహాదేవభాయీ వంటి సుకృతాత్ముడు వికలాంగుడు ఎందుకవుతాడు? అకస్మాత్తుగా పెద్ద కుదుపు వచ్చింది. ఎముకలు విరిగిపోతాయా అన్నట్టుగా దవడలు ఒకదాని కొకటి కరుచుకుని పోయాయి. అప్పుడు నేను ఆయన దవడలు పట్టుకొని ఉన్నాను. తర్వాత దవడలు పట్టువదలి పడలిపోయాయి. మూలుగు తగ్గిపోయింది. ఊపిరి మందగించింది. నేను బాపూతో "బాపూ, జమనాలాల్‌జీ లాగ ఈయనా వెళ్ళిపోతున్నారు" అన్నాను. "వెళ్ళిపోతున్నారు" అని నేను ఎప్పుడైతే అన్నానో, అప్పుడు నిజంగానే పరిస్థితి తీవ్రమైనదని, మహాదేవభాయీ వెళ్ళిపోతున్నారని బాపూ గ్రహించారు. మహాదేవభాయీ ఒక్కమారు కళ్ళు తెరిచి మాట్లాడడానికి ప్రయత్నించినట్టు అనిపించింది. "ఫరవాలేదు. సర్దుకుంటున్నారు" అని నేను సంతోషంతో అన్నాను. కాని, అది కేవలం అనుకోడంగానే ఉండిపోయింది. మళ్ళీ కళ్ళు మూతపడ్డాయి. ఊపిరి ఇంకా మందగించింది. ఒళ్ళు చల్లబారుతున్నది.

బాపూ రెప్పలు ఆర్పకుండా ఆయన కళ్ళపైపే చూస్తున్నారు. ఒక్కమారు మహదేవ్ చూపు తన చూపుతో కలిస్తే, మహదేవ్ లేచి కూర్చుంటారు— అనే భావంమీద తమ శక్తినంతా కేంద్రీకరించారు. ఒక్కమారు కళ్ళు కొంచెం తెరుచుకున్నాయి కాని, కదలకుండా పోయాయని బాపూ అన్నారు. చూడడానికే శక్తి లేనప్పుడు, మాట్లాడడానికి ఎలా ప్రయత్నిస్తారు? కేవలం మూలుగే వినిపించేది.

వ్రాయడానికి ఇంతసేపు పట్టింది కాని, ఇదంతా, విద్యుద్వేగంతో జరిగింది. నాకేమో మొదటినుంచి ఆఖరు వరకు ఒక్క క్షణంలో జరిగినట్టే అనిపించింది. నేను బ్రాందీ చెమ్చాతో నోట్లో పోశానో లేదో భండారీ మందులు తీసుకువచ్చారు. నేను ఇంజెక్షన్ ఇవ్వబోగా, ఆయన ఆపి, "ఒక్కటి నరాలలోను ఇవ్వండి" అన్నారు. నేను ఒక ఇంజెక్షన్ పిరుదుల మీద, మరొకటి నరంలోను ఇచ్చాను.

మహాదేవభాయీ చెమటతో తడిసిపోయారు. మొదటినుంచే ఆయన ముఖమూ, చేతులూ చలువరాయిలాగ తెల్లబడ్డాయి. ఆ తెల్లటి చలువ రాళ్ళమీద చెమట ముత్యాలు కట్టాయి. ఇంజెక్షన్ ఏవీ ప్రయోజనం లేకపోయింది. నాడి మొదటిలోనే ఆగిపోయింది. శ్వాసకూడా ఆగిపోయింది. సివిల్ సర్జన్ వచ్చారు. అప్పటికే పిట్ట ఎగిరి పోయింది. అంతా ముగిసిపోయింది. "హై బ్లడ్ ప్రెషరా?" అని అడిగారు సివిల్ సర్జన్. "లేదు" అన్నాను నేను. "అయితే, కరోనరీ థ్రాంబోసిస్ అయి ఉంటుంది. ఎప్పుడయినా నొప్పి వచ్చేదా?" అని అడిగారు. "లేదు. తల తిరిగి మైకం వచ్చేది. ఈమారుకూడా కరోనరీ థ్రాంబోసిస్‌కు ముఖ్యలక్షణమైన నొప్పేమీ లేదు" అన్నాను. "నాకు విచారంగా ఉంది" అంటూ ఆయన వెళ్ళిపోయారు.

(సశేషం)

# మూసికినారో

## బస్సు రాకడ, ప్రాణపోకడ

రాష్ట్ర రహదారి రవాణా సంస్థ సరిగా హైదరాబాదు నగరపాలక సంస్థకు నకలుగా తయారవుతున్నది. బస్సుల రాకపోకల పరిస్థితి ఇప్పుడు రాజధానిలోనేకాక, రాష్ట్రంలో జాతీయం చేసిన అన్ని మార్గాలలోనూ అధ్వాన్నంగానే ఉన్నది.

వాన రాకడా, ప్రాణ పోకడా తెలియవంటారు పెద్దలు. అదేమోకానీ బస్సుల రాకడ, పోకడకూడా తెలియటం లేదు మన రాష్ట్రంలో. బస్సులు సకాలంలో రావు. వస్తే సకాలంలో పోవు. ఒక్కొక్కప్పుడు వెనకనుంచి ఎవరో బెత్తం పుచ్చుకుని తరుముతున్నట్లు పొలోమనిఊరేగింపుగావస్తాయి. లేకుంటే సమ్మె చేసినట్లు, బెట్టు చేస్తున్నట్లు గంటల తరబడి దర్శనం ఇవ్వకుండా పోతాయి. 'బస్సాక్షాత్కారం'కోసం ప్రయాణీకులు ఎండనక, వాననక 'తబస్సు' చేస్తూ ఉంటారు. బస్‌స్టాప్‌ల దగ్గర అచ్ఛాదనలు లేవు.

మన బస్సులు అసలే నీరసంగా నడుస్తూ ఉంటాయి. పాపం వాటికి మార్గమధ్యంలో ఎక్కడో చెప్పా పెట్టకుండా జబ్బు చేస్తుంది. వైద్యం చేసేందుకు స్పేర్ పార్టులు ఉండవు సమయానికి. ఈ స్పేర్ పార్టులు లేక ఎన్నో బస్సులు దీర్ఘవ్యాధితో కార్ఖానాలలో పడి ఉంటాయి.

ఈ బస్సులను నడిపేవారిని గురించికూడా అనేక ఫిర్యాదులు రవాణా సంస్థకు రవాణాఅవుతూ ఉంటాయి.

తెలంగాణాలోని తొమ్మిది జిల్లాలలోనూ, సర్కారులలోని పశ్చిమ గోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాలలోనూ బస్సు మార్గాలను పూర్తిగా జాతీయం చేశారు. మిగిలిన ఎనిమిది జిల్లాలలో శ్రీకాకుళం, విశాఖపట్టణం మినహా మిగతా వాటిలో ఏవో కొన్ని మార్గాలలోనైనా ప్రభుత్వపు బస్సులు దర్శన మిస్తాయి. శ్రీకాకుళానికి, విశాఖపట్టణానికి కూడా త్వరలో హైదరాబాద్ నుంచి సరాసరి బస్సులు నడుపుతారు. కర్నూలు జిల్లాలో మార్గాలన్నింటినీ తిరిగి త్వరలో జాతీయం చేస్తారు.

పూర్వపు హైదరాబాదు రాష్ట్రంలో ప్రభుత్వం 1932 లో రహదారి రవాణాను జాతీయం చేసింది. అప్పట్లో బస్సులు చాలా కొద్దిగా ఉండేవి. 1942 నాటికి వాటిసంఖ్య 300 అయింది. ఆంధ్రప్రదేశ్ అవతరించిన తర్వాత రహదారి రవాణాశాఖ రహదారి రవాణా కార్పొరేషన్‌గా రూపొందింది. ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి దీనికి పార్ట్‌టైమ్ అధ్యక్షుడుగా ఉంటూ వచ్చారు. దరిమిలా, దీని వ్యవహారాలను విచారించిన అనంత రామకృష్ణన్ సంఘం సిఫార్సు చేయగా ఫుల్‌టైం ఉపాధ్యక్షుని నియమించడం జరిగింది.

సుమారు సంవత్సరంనర క్రితం ఫుల్‌టైం అధ్యక్షుని కూడా నియమించారు. ఈ చర్యలన్నీ కార్పొరేషన్ వ్యవహారాలు బాగుపడాలనే తీసుకున్నారు.

అయితే ఇంతవరకూ చెప్పుకోదగ్గ అభివృద్ధి కనబడలేదు. 18 నెలలు కార్పొరేషన్ అధ్యక్షుడుగా ఉండి కొంతవరకూ వ్యవహారాలను చక్కబరిచిన వైస్ అడ్మిరల్ ఆర్. డి. కటారీ క్రిందటి నెలలో బర్మాలో భారత రాయబారి పదవిని స్వీకరించారు. ఆయన వెళ్లేరోజున ప్రత్యేక గోష్ఠిలో ఇలా తెలియజేశారు:

"రహదారి రవాణా కార్పొరేషన్‌ను 300 బస్సులతో ఆనాడు ప్రారంభించారు. ఇప్పుడు బస్సుల సంఖ్య దాదాపు రెండు వేలవరకూ పెరిగింది. ఏటా అదనంగా 300 బస్సులను వేస్తున్నాము. కార్పొరేషన్‌సిబ్బంది సంఖ్య14,000కు పెరిగింది. అయినా పరిపాలనా వ్యవస్థలో ఎలాంటి మార్పూజరగలేదు! ఈలోపాలకుముఖ్యకారణంఇదే! ఇప్పుడు మొత్తంపరిపాలనా వ్యవస్థను మార్చివేయాలి. నిజానికి కార్పొరేషన్ అందుకు పూనుకొన్నది కూడా. అన్ని స్థాయిలలోనూ సిబ్బందికి శిక్షణ గరపాలి. అయితే ఈపని పూర్తికాకుండా మధ్యలో వెళ్ళి పోతున్నందుకు విచారిస్తున్నాను."

రవాణాశాఖ మంత్రి శ్రీ బి. వి. గురుమూర్తితో ఈ విషయాలు చర్చించగా ఆయన ఇలా చెప్పారు: "శ్రీ కటారీ తన 18 మాసాల పదవీ కాలంలోనే తన సూచన లన్నిటినీ అమలు జరిపి ఉండవలసింది. కాలికి కురుపువేస్తే అక్కడ మందు వేయాలనుకుంటాం. కాని ఆయన నౌకా బలాధిపతిగా పనిచేసి వచ్చినందున అక్కడ మందు వేయడంగాక మొత్తం శరీరాన్ని పరిశీలించి అసలు ఎందుకు కురుపు వేసిందీ తెలుసుకోవాలంటారు. ఆయన పద్ధతే మంచిది కావచ్చు. కాని వెంటనే ఫలితాలు కనిపించవు."

ఏమైనా ప్రయాణీకుల కష్టాలను తొలగించి జాతీయాకరణపై ప్రజల విశ్వాసాన్ని పెంపొందింప జేయటం, తద్వారా ఏటా నష్టాన్ని పొందుతున్న కార్పొరేషన్ ఇకముందు లాభాలను గడించటం అవసరం. అందుకోసం శ్రీ కటారీ సూచనలను త్వరగా అమలు జరపడం మంచిది.

### బస్సుల అడుగుజాడల్లో టాక్సీలు

బస్సుల పరిస్థితివలె నగరంలో టాక్సీల పరిస్థితి కూడా అధ్వాన్నంగానే ఉంది. హైదరాబాద్, సికిందరాబాద్‌లలో 453 టాక్సీలు ఉన్నా, కావలసినప్పుడు అవి అందుబాటులో ఉండవు. చీకటి పడితే అందులో చాల భాగం కేవలం నగరానికి వచ్చే రసికులకే పరిమితమౌతాయి. మిగిలినవారికి ససేమిరా ఒప్పుకోడు టాక్సీఅయ్యా.

హైదరాబాద్‌లో యజమానులు రోజు కిరాయి లెక్కన డ్రైవర్లకు టాక్సీలిస్తారు. అందువలన చిన్న చిన్న దూరాలు గాక ఒకేసారి 15, 20 రూపాయలు వచ్చే గిరాకీల కోసం ఈ డ్రైవర్లు చూస్తారు. ఈ పరిస్థితిని మార్చనిదే నగరంలో టాక్సీ సమస్య పరిష్కారం కాదు.

—కె. తాతారావు



రైతు జీవితం — చిత్రం—పీనపల్లి కృష్ణస్వామి (హైదరాబాదు)

# ఆంధ్రపత్రిక

## సచిత్ర వారపత్రిక

మద్రాసు

ఎడిటర్: నీలంరాజు వెంకటశేషయ్య


## కైరాన్ నిష్క్రమణ

ముఖ్యమంత్రి పదవికి రాజీనామా ఇచ్చి శ్రీ ప్రతాప్‌సింగ్ కైరాన్ అధికారంనుంచి వైదొలగడంతో సరిహద్దు రాష్ట్రమైన పంజాబ్ చరిత్రలో ఒక అధ్యాయం ముగిసింది.

శ్రీ కైరాన్ నిష్క్రమణకు కారణమైన పరిస్థితులు ఒక ఎత్తు; చివరికి ఆయన రాజీనామా ఇచ్చిన ఉదంతం ఒక ఎత్తూను. ఈ సంఘటనలనుంచి రాజకీయవాదులు, ముఖ్యంగా అధికారం చలాయించేవారు నేర్చుకొనవలసిన పాఠాలు అనేకం.

లోగడ శ్రీ కైరాన్‌పై తీవ్రమైన ఆరోపణలు జరిగినవి. పంజాబ్‌లో అలజడి రేగింది. కడకు ఆ ఆరోపణలను రాష్ట్రపతికి నివేదించడం జరిగిన తరువాతగాని వాటిని గురించి నిష్పాక్షికమైన విచారణ జరపడానికి నిర్ణయించలేదు.

శ్రీ కైరాన్ సమర్థుడైన పాలకుడు. పంజాబ్ సత్వరాభివృద్ధికి కారకుడు. ఆయన నిష్క్రమణం ఆ రాష్ట్రంలో అస్థిరత్వం ఏర్పడడానికి దోహదమివ్వవచ్చునని కేంద్రం అప్పట్లో అభిప్రాయపడింది.

ఇదంతా నిజమే అయినా అలాంటి ఆరోపణలు జరిగే పక్షంలో బాధ్యత కలిగిన పదవులలో ఉన్నవారు ముందుగానే ఆయా పదవులనుంచి వైదొలగి విచారణ నిష్పాక్షికంగా జరగడానికి తోడ్పడడం ఒక సత్సంప్రదాయం ఏర్పడడానికి కారణం అవుతుంది. ప్రజాస్వామ్య సాఫల్యానికి ఈలాంటి సంప్రదాయాలు దోహదం ఇవ్వగలవు.

శ్రీ కైరాన్ ఆలాంటి చర్య జరపలేదు. శ్రీ ఎస్. ఆర్. దాస్ విచారణ సంఘం నిర్ణయాలు తెలియవచ్చినా ఇంకా తన అధికారానికి అంటిపెట్టుకొని ఉండడానికి, రాష్ట్ర శాసనసభ కాంగ్రెసు పక్షంలో తన ప్రాబల్యం నిలబెట్టుకొనడానికి ప్రయత్నించారు. దాస్ సంఘం నివేదికను కేంద్రం ప్రచురించడంతో ఆయన ఆట కట్టుపడింది.

అధికార దుర్వినియోగం జరిగినదని విచారణ సంఘం అభిప్రాయపడినప్పుడు తదుపరి చర్యలు జరపడంలో జాప్యం కూడదు. ఇది మరొక పాఠం.

ఒక ముఖ్యమంత్రిపై ఇలాంటి విచారణ జరగడం స్వతంత్ర భారతదేశంలో ఇది మొదటిసారి. ఇది మంత్రి పదవులలో ఉన్నవారికి ఒక హెచ్చరికగా ఉపకరిస్తుంది.

శ్రీ కైరాన్ ఆట కట్టించడంలో కేంద్ర నాయకత్వం తన ప్రాబల్యం నిలబెట్టుకొంది. నెహ్రూ తరువాతి కాలంలో పరిణామాలకు ఇది సూచనప్రాయంగా ఉంది.

మొత్తంమీద శ్రీ కైరాన్ విషయంలో కేంద్రం వ్యవహరించిన విధం అభినందించదగినది. పంజాబ్‌లో సమర్థమైన నాయకత్వం రూపొందేటట్లు చేయడానికి, స్థిరత్వం పాదుకొల్పడానికి కూడా కేంద్రం తగు కృషి చేయగలదని ఆశించవచ్చు. ★



మహాదేవభాయీకి ఊపిరి ఆగిపోగానే, నా కన్నీళ్ళు ఎవరూ చూడరాదనే ఉద్దేశంతో నేను మరొక గదికి వచ్చాను. కాని, కస్తూర్బా నా వెంటనే వచ్చి "మహాదేవ్ పరిస్థితి ఎలాగుంది?" అని అడిగారు. నేను ఏమి చెప్పను? ఊరికే ఉండిపోయాను. బా ధైర్యం సడలిపోయింది. ఎంతో ఆవేదనమీదట నేను బా భుజంమీద చేయిపెట్టి "బా, ఆయన వెళ్ళిపోయారు!" అన్నాను. బా చీత్కారం చేశారు—"ఆః! మహాదేవ్ వెళ్ళిపోయాడా? ఎక్కడికి వెళ్ళాడు? అరే మహాదేవ్! ఎక్కడికి వెళ్ళావు?" అంటూ వెక్కి వెక్కి ఏడ్చారు. బా వెంట బాపూజీ కూడా వచ్చారు. ఆయన బాను సమాధాన పరిచారు. మేమందరం మహాదేవ భాయీ వద్దకు ( ఆయన ఎక్కడున్నాడు? ఆయన శవంవద్దకు ) వెళ్ళాము. మహాదేవభాయీ ఒక్క కాలు చాచుకొని ఉన్నారు; రెండవకాలు ముడుచుకుని ఉంది. నేను దానిని సరిగా చాచాను. కళ్ళు సగం తెరుచుకొని ఉంటే, వాటిని మూసివేశాను. మహాదేవ భాయీ కళ్ళు మూయవలసి వస్తుందని కలలో నైనా అనుకున్నానా? ఆయన ముఖంపై అపూర్వమైన శాంతి వ్యాపించింది. ఎవరో యోగీశ్వరుడు సమాధిలో ఉన్నట్లు ఉన్నారు. పక్కనే ఆయన తువ్వాలు పడి ఉంది. దానితోనే నేను ఆయన ముఖం తుడిచాను. "మహాదేవ్ జేబులు ఖాళీచేయి" అన్నారు బాపూ. ఇది నాకు కఠినమైన పని. ఆయన లాల్చీ జేబులో చేయి పెట్టగానే, చేయి విరిగిపోతుందేమోనని అనిపించింది! మహాదేవభాయీ నిజంగానే వెళ్ళిపోయారా? నేను ఆయన జేబులు ఖాళీ చేస్తున్నానే! లాల్చీ జేబులు ఖాళీగానే ఉన్నాయి. జాకెట్ (వెయిస్ట్ కోట్) సగం కింద పడింది. చాల కష్టంతో తక్కిన సగం ఆయన కిందినుంచి పక్కకు లాగాను. ఒక జేబునుంచి కలం బయటికి తీశాను. మరొక జేబునుంచి గీతాజీ (భగవద్గీత). "వైష్ణవ జనతో పాడండి. రామ్‌ధున్ (రామనామం) జపించండి" అన్నారు బాపూ. నేను నా భజనావళి పుస్తకం తీసుకొని వచ్చాను. సరిహద్దు రాష్ట్రం నుంచి తిరిగి వచ్చేటప్పుడు, ఢిల్లీ స్టేషనులో నేను, అన్నయ్య ప్యారేలాల్ మహాదేవభాయీతో విడిపోయినప్పుడు, మహాదేవభాయీ ఈ భజనావళి పుస్తకాన్ని నాకు ఇచ్చారు. ఆ పుస్తకం మధ్యన ఆయన ఖాళీ తెల్లకాయితాలు వేయించి బైండు చేయించారు. ఆ పుస్తకం నాకు ఇవ్వడానికి ముందు, దానిలో లేని, నాకు ఇష్టమైన భజన గీతాలను వ్రాశారు. వాటి అనుక్రమణిక కూడా సిద్ధపరిచారు. ఆ స్మృతులన్నీ నేడు మనసులో కొత్తవిగా స్ఫురించాయి. ఈ భజనావళిని నేను మహాదేవభాయి ఎదుటే వెలుపలికి తీసి ఉంటే, ఆయన ఎంతో సంతోషించేవారు. తను ఇచ్చిన భజనావళి ఈ జైలుకు వచ్చి చేరిందని ఆయన ఎప్పుడూ తెలుసుకోలేరు. కాని, ఇప్పుడు అదంతా ఆలోచించడమే వ్యర్థం. అందరం మహాదేవభాయీ మంచంవద్ద కూర్చుని ప్రార్థన చేశాము. భగవద్గీత పన్నెండవ అధ్యాయం పారాయణం చేశాము.

బాపూ కర్నల్ భండారీతో "వల్లభభాయీని, ఖేర్‌ను, తక్కినవారిని యరవడా జైలునుంచి నావద్దకు పంపండి. తర్వాత మహాదేవ్ భౌతిక దేహాన్ని ఎవరికి అప్పగించాలో ఆలోచిస్తాను" అన్నారు. భండారీ వెళ్ళిపోయారు. ఆయన ప్రభుత్వానికి ఈ విషయం తెలియపరచి, ముందు ఏమిచేయాలో అనుమతిపొందాలి.

"ఇప్పుడు నేను వెళ్ళి స్నానం చేస్తాను. వల్లభభాయి మొదలయినవారు వచ్చేలోగానే నేను సిద్ధంగా ఉండదలచాను" అని బాపూ అంటూ స్నానం చేయడానికి వెళ్ళారు. కాని, వెంటనే తిరిగి వచ్చి, "నేను మొదట మహాదేవ్‌కు స్నానం చేయించి, తర్వాత నేను స్నానం చేస్తాను" అన్నారు.

భండారీతోపాటు వచ్చి, ఇంతవరకు ఉన్న మేజర్ అడ్వానీ, మిస్టర్ కటేలీ, కొందరు సిపాయీలు ( వార్డర్లు ) కలిసి మహాదేవ భాయీ భౌతిక దేహాన్ని ఎత్తి తీసుకొనివెళ్ళారు. బాపూ దానిని స్నానాలగదిలో తొట్టిపక్కన పెట్టించారు. కాకతాళీయంగా మహాదేవభాయీ శిరస్సు ఉత్తరంవైపున ఉంది. హిందూ ఆచారం ప్రకారం శవం శిరస్సు ఉత్తరంవైపు ఉండాలని తర్వాత తెలిసింది. శవంమీది గుడ్డలు తీసివేయండని బాపూ అన్నారు. ధోవతి సులభంగా వచ్చింది. కాని, కటేలీ, అడ్వానీ లాల్చీని తీసివేయలేకపోయారు. వారు దానిని పోటుగా లాగుతూ ఉండడం చూచి నేను ఉండలేకపోయాను; వెళ్ళి వారికి తోడ్పడ్డాను. లాల్చీ వచ్చివేసింది. భౌతిక కాయం తాకితే ఎంతో వేడిగా ఉంది. నా తల తిరగసాగింది. "బాపూ, మహాదేవభాయీ ఇంకా బతికి ఉండలేదు గదా?" అని బాపూతో అన్నాను. "అది నీకే తెలుసు" అన్నారు ఆయన. నేను మళ్ళీ స్టెతోస్కోప్ తెచ్చి పరిశీలించాను. అంతా నా మూర్ఖత! గుండె చప్పుడు ఎప్పుడో ఆగిపోయింది. అద్దం తెచ్చి, మహాదేవభాయీ ముక్కు ఎదుటపెట్టాను. ఏమీ కదలికలేదు. "మీరు కూడా పరీక్ష చేయండి" అని అడ్వానీతో అన్నాను. కాని, అక్కడ ఏమైనా జరిగితే కదా! డాక్టర్ అయినప్పటికీ, నేను నా స్థైర్యాన్నే కోల్పోయాను. "బతికి ఉంటే, వేడినీరు పడగానే లేచి కూర్చుంటాడు" అని బాపూ అన్నారు. వార్డర్లు ఎప్పుడో వెళ్ళిపోయారు. "మేము వెళ్ళిపోమా?" అని అడిగారు, అడ్వానీ, కటేలీ. "ఆహా! వెళ్ళిపొండి"

అన్నారు బాపూ. "నేనూ వెళ్ళిపోనా?" అని అడిగాను. "సరే" అన్నారు బాపూ. నేను తిరిగి వచ్చి నా గదిలో నిలబడ్డాను. నీటి డబ్బా ఎత్తేటప్పుడు బాపూ చేతులు జోరుగా వణికిపోవడం, ఆపాదమస్తకం శరీరం వణికిపోవడం చూచాను. బాపూ కిందపడిపోతారేమోనని అనిపించింది. అందువల్ల ఆయన వద్దని అన్నప్పటికీ, మళ్ళీ ఆయనవద్దకు వెళ్ళాను. ఆయన నన్ను పొమ్మన లేదు, ఉండనిచ్చారు. నిజంగానే ఆయనకు సహాయం అవసరం. నా అంతట నేనే వెళ్ళి పోదలచుకున్నానని, అందువల్లనే వెళ్ళడానికి అనుమతి కోరానని ఆయన మొదట్లో అనుకొని ఉంటారు.

నేను నీళ్ళుపోయడం ప్రారంభించాను. బాపూ తువ్వాలుతో రుద్ది రుద్ది భౌతిక కాయానికి స్నానం చేయిస్తున్నారు. ముఖం మీద నీళ్ళుపోశాను. బలంగా కరుచుకునిపోయిన పెదవులపై నీళ్ళు పడగానే, మహాదేవభాయీ, స్వయంగానే బలంగా పెదవులు బిగిస్తున్నట్టు అనిపించింది—పిల్లలు స్నానం చేయించేటప్పుడు ముఖం, కళ్ళు బలంగా మూసుకొంటారే, ఆ విధంగా. నీళ్ళు పడినప్పుడు ముఖంమీద చిరునవ్వు తొణికిసలాడినట్టూ అనిపించేది. బాపూ ప్రతి అంగమూ విడివిడిగా శుభ్రం చేశారు. నేను ఆయన పాదాలు శుభ్రంచేశాను. మహాదేవభాయీ తరచు పాదరక్షలు లేకుండా తిరిగేవారు. అందువల్ల అరికాళ్ళు రంగువేసినట్టు ఉన్నాయి. బాపూ వాటిని చూచి "పాదాలు పూర్తిగా శుభ్రంకావాలి" అన్నారు. ఎంతటి కరుణ దృశ్యం! తండ్రి హృదయవేదనకు, ప్రేమకు ఆ మాటలు సూచనాప్రాయాలు. నేను తువ్వాలుకు సబ్బురాచి పాదాలను బాగా రుద్దాను. ఎంతోసేపటికి పాదాలు తెల్లబడ్డాయి. "నీవు ఇతనిని పక్కకు పొర్లించి పట్టుకో. నేను శుభ్రం చేస్తాను" అన్నారు బాపూ. మహాదేవభాయీ శరీరం మొదట్లోనే భారీది. ఇప్పుడు మరింత బరువెక్కింది. నేను స్నానాల తొట్టి వెనుకవైపు అనరాతో ఎంతో కష్టంమీద పక్కకు పొర్లించి పట్టుకొన్నాను. పక్కకు పొర్లించేటప్పుడు నాకు ఊపిరి తీసుకున్నట్టు శబ్దం వినబడింది. నేను అదరిపడి, "బాపూ, మహాదేవభాయీ ఊపిరి తీసుకొన్నారు" అన్నాను. ఆయన నవ్వి "నీవు వెర్రి బాగులదానివి. అంతా నీ కల్పన!" అన్నారు. అయితే అది నా కల్పన కాదు. పక్కకు తిప్పడం వల్ల కింది పుపుసం అణగిపోయి, బరువు పడడంవల్ల లోపలి గాలి వెలుపలికి వచ్చింది.

స్నానం సమాప్తమయింది. మహాదేవభాయీ నిన్న స్నానం చేసినప్పుడు నేడు స్నానం తర్వాత వేసుకోడానికి గుడ్డలు ఉతుక్కుని పెట్టారు. వాటిలోనుంచి ఒక్క ధోవతిని నేను తీసుకొని వచ్చాను. తువ్వాలు వంటి తుడవడానికి వాడాము. కనుక, ఒళ్ళు తుడవడానికి బాపూ వేరే తువ్వాలు తెమ్మన్నారు. మా వదినె నా కోసం నూలు

# మహాదేవభాయీ అంత్యక్రియలు

తువ్వాలు పంపింది. అది బాపూజీకి ఉపయోగిస్తుందని అట్టేపెట్టాను. బాపూ దానిని వాడారని విని మురిసిది (వదినె) ఎంతో సంతోషపడుతుంది—అనుకున్నాను. కాని, ఆ తువ్వాలు ఉపయోగం మరొకటని వ్రాసి ఉంది. నేను ఆ తువ్వాలును బాపూజీకి తెచ్చి యిచ్చాను. దానితో మేము మహాదేవభాయీ దేహం తుడిచాము. ఇప్పుడు శవాన్ని వెలుపలికి తీసుకొనిరావాలి. మిస్టర్ కటేలీ వార్డర్లను పిలిచారు. భూరా, మగన్ అనే ఖైదీలను పిలిస్తే బాగుండునని అనుకున్నాను. వారే వచ్చారు. ఇద్దరూ శవాన్ని ఎత్తుకున్నారు. బాపూ గదికి, సరోజినీ నాయుడూ గదికి మధ్యన ఒక చిన్న గది ఉంది. నేడు ఉదయం మహాదేవభాయీ ఈ గదిలో కూచునే క్షౌరం చేసుకున్నారు. మొన్న సాయంకాలం ఈ గదిలోనే కూర్చుని నూలు వడికారు. ఎంతో శ్రద్ధగా

## గాంధీజీ కారాగార గాథలు

"మారీ నాడ్ తమారే హాథే హరి సంభాలజోరే,
దివస రహ్యా ఛేటాంచా వాలజోరే."

నానాడి నీ చేతులలోనే ఉంది. నీవే ఆదుకోవాలి. ఇక కొన్నాళ్ళే మిగిలి ఉన్నాయి—అని పాడుతున్నారు.

ఈ గదిలోని కుర్చీలు బల్లలు తీసివేసి, శవాన్ని ఈ గదిలో పెట్టాము. బాపూ ఒక జెయిలు దుప్పటి క్రింద పరిపించారు. మరొకటి పైన కప్పించారు. "ఇతడు బందీ, బందీగానే వెళ్ళాలి" (హి ఇజ్ ఎ ప్రిసనర్ అండ్ హి మస్ట్ గో యాజ్ ఎ ప్రిసనర్) అన్నారు. బాపూ ముఖం ప్రశాంతంగా ఉంది. కాని, గంభీరంగాను ఆలోచనామగ్నంగాను ఉంది. స్వరం మంద్ర

మూలం :

డాక్టర్ సుశీలానైయర్

అనువాదం :

తిరుమల రామచంద్ర

మయింది. కాని, ఎవరి ఎదుటా ఆయన తన గొంతుకలో వణుకు కాని, కన్నీళ్ళు గాని కనిపించనివ్వలేదు.

లాహోర్‌లో గిర్‌ధారీభాయి నాకు ఒక చందనపు కర్ర ముక్క బహూకరించారు. ఆయన కొన్ని చందనపు కర్రముక్కలను బార్డోలీనుంచి తెచ్చారు. అందరికీ పంచిపెట్టారు. అప్పటి నుంచి ఆ ముక్క నా హేండ్‌బాగ్‌లో పడి ఉంది. నేను దానిని మీరాబహెన్‌కు ఇచ్చాను. ఆమె దానిని రాచి గంధం తీసింది. బాపూ ఆ గంధాన్ని మహాదేవభాయీ ఫాలంమీద, పక్షస్థలంలోను పూశారు. తోటనుంచి పూలుతెప్పించి మీరాబహెన్, మరెవరో దండగుచ్చారు. బాపూ దానిని మహాదేవభాయీ మెడలో వేశారు. మీరాబహెన్ దేహంపై పూవులు అలంకరించింది. బాపూ స్నానానికి వెళ్ళారు. స్నానానంతరం శవం దగ్గర కూర్చున్నారు. "నీవూ స్నానం చేసిరా. మహాదేవ్ గుడ్డలు నీవు ఉదకాలి. మరొకరిని ఉదకనివ్వకూడదు" అన్నారు బాపూ నాతో. బాపూ మహాదేవభాయీ దేహాన్ని తుడిచిన తువ్వాలుతోనే తమ శరీరం తుడుచుకొని, దానిని నాకు అందించారు. "దీనిని కూడా ఉదికి మహాదేవ్ బట్టలతోపాటు బాబలాకోసం భద్రపరచు" అన్నారు.

నేను స్నానంచేసి వచ్చేవేళకు మీరాబహెన్ పూలు అలంకరించడం పూర్తయింది. శవాన్ని పైకి ఎత్తినప్పుడు ఈ పూవులన్నీ కదలిపోవచ్చుననే అనుమానంతో శవాన్ని తీసుకొని వెళ్ళేటప్పుడు పాడెమీద పూలువేయడానికి మగన్, భూరా పూవులపెజ్జ అల్లుతున్నారు. బాపూ శవందగ్గర కూర్చుని గీతాపారాయణం ఆరంభించారు. పన్నెండవ అధ్యాయంతో పారాయణం ఆరంభమయింది. నేను స్నానంచేసి రాగానే గీతను నాకు అందించారు. పద్దెనిమిదవ అధ్యాయం వరకూ పారాయణం జరిగింది.

ఇంతలో భండారీ వచ్చారు. ఆయన ముఖం ఎండిపోయింది. మాటలు పెగలడంలేదు. "వల్లభభాయీ వస్తున్నారా?" అని బాపూజీ ఎవరితోనో భండారీని అడిగించారు. "ఆయన ఇక్కడ లేరు" అన్నారు భండారీ. "ఖేర్ వస్తున్నారా?" అని మళ్ళీ అడిగించారు. ఆయన కూడా రాలేకపోయారు. "ఒక లారీ వచ్చింది. ఒక బ్రాహ్మణుడు (పురోహితుడు) వచ్చాడు" అన్నారు ఎవరో. బాపూ అదిరిపడ్డారు. "ఎందుకు?" అని అడిగారు. "ఇక్కడ ఏదైనా కర్మకలాపం, పూజాపాఠం జరుగవలసి ఉంటే, దానికి" అని ఎవరో సమాధానమిచ్చారు. "ఇక్కడి పూజాపాఠం అంతా అయిపోయింది" అన్నారు బాపూ.

భండారీ బాపూ వద్దకు వచ్చారు. ఆయన బాపూతో మాట్లాడలేక సరోజినీ నాయుడుతో

# గాంధీజీ కారాగార గాథలు

ముందుకు తోస్తున్నారు. "ఏమి కబురు తెచ్చారు?" అని అడిగారు బాపూ. ఆయన సంకోచిస్తూ "నేను ఏర్పాట్లన్నీ చేశాను" అన్నారు. "ఏమి ఏర్పాట్లు చేశారు? నేను శవాన్ని మిత్రులకు అప్పజెప్పవచ్చునా?" అని అడిగారు బాపూ. భండారీ మళ్ళీ సరోజినీ నాయుడును ముందుకు తోశారు. ఆయనకు ఏర్పాట్లను గురించి స్వయంగా వివరించడానికి ధైర్యం లేకపోయింది. ప్రభుత్వంవారు శవాన్ని ఎవరికీ ఇవ్వదలచుకోలేదని, భండారీ స్వయంగా దహనఘట్టానికి వెళ్లి దహన సంస్కారం చేయించి వస్తారని సరోజినీనాయుడు తెలిపారు. "మాలో ఎవరైనా శవంతోపాటు శ్మశానానికి రావచ్చునా?" అని అడిగారు బాపూ. "కూడదు!" అని సమాధానం వచ్చింది. "అయితే నేను ఇక్కడే, నా ఎదుటే దహన సంస్కారం చేయవచ్చునా?" అని బాపూ భండారీని అడిగి "నేను శవాన్ని మీకు ఎలా అప్పగించగలను? ఏ తండ్రయినా తన కుమారుని శవాన్ని అపరిచితులకు అప్పగిస్తాడా?" (నో ఫాదర్ కాన్ హేండ్ఓవర్ ది బాడీ ఆఫ్ హిస్ సన్ టు స్ట్రేంజర్స్) అన్నారు.

భండారీ మళ్ళీ బొంబాయి ప్రభుత్వానికి ఫోను చేయడానికి వెళ్ళారు. బాపూ ఇలా అన్నారు: "శ్రద్ధానందస్వామీజీని హత్యచేసినవాని శవాన్ని ఉరి శిక్ష తర్వాత జనానికి అప్పగించింది ప్రభుత్వం. జనం అతనిని వీరుణ్ని చేసింది. శవాన్ని ఊరేగించింది. దానివల్ల హిందూ—ముస్లిం కలహాలు కూడా చెలరేగేవి. కాని, ప్రభుత్వం లెక్క చేయలేదు. నేడు మహాదేవ్ శవాన్ని ఇవ్వదలవలేదు. ఈ ప్రశ్నపై పోట్లాడడమా, లేక చేదు మింగినట్లు మింగి ఊరుకొని ఉండడమా— అనే విషయంపై ఆలోచిస్తున్నాను. 'శవాన్ని మిత్రులే దహనం చేస్తారు' అని మొండి కెత్తగలను. కాని, ఇలా చేయడంవల్ల, మహాదేవ్ మృత్యువుకు రాజకీయపు రంగుపూసి ఫాయిదా పొందినట్లు అవుతుంది. తండ్రి తన కుమారుని మరణాన్ని ఇలా ఎలా ఉపయోగించుకోగలడు?"

భండారీ ఏమిటి సమాధానం తెస్తాడో అని ప్రతివారూ ఊపిరి బిగబట్టి కాచుకొని ఉన్నారు. కటేలీ, అద్వానీ వెలుపల కూర్చుని ఉన్నారు. భండారీ మేడమీదనున్న కటేలీ గదినుంచి ఫోనులో మాట్లాడుతున్నారు. అగ్ని సంస్కారం ఇక్కడే జరిగేట్లు భండారీని ఒత్తిడి చేయండని నేను కటేలీకి, అద్వానీకి నచ్చచెప్పడానికి ప్రయత్నించాను. "బాపూ అడిగినది చాల చిన్న విషయం. దీనికి కూడా కాదు కూడదు అని సమాధానం వస్తే, ఆయనపై ఎలా పరిణమిస్తుందో, ఎవరికి తెలును? ఉపవాసం మొదలు

లయినవాటికి పూనుకుంటే మనమంతా ఇబ్బం
దిలో పడిపోతాము" అని నేను వారితో చెబుతూ
శ్రద్ధానంద స్వామీజీ హంతకుని సంగతి కూడా
తెలిపాను. వారిద్దరూ పైకి వెళ్లారు. కొంత
సేపటికి భండారీ వచ్చారు. శవానికి ఇక్కడే
దహన సంస్కారం జరుపడానికి అనుమతి
లభించింది. ఎంతో కష్టంమీద భండారీకి ఈ
అనుమతి దొరికిందని సరోజినీ నాయుడు,
తర్వాత కటేలీ, నాతో అన్నారు.

దహన సంస్కారానికి తగిన ప్రదేశం వెదక
వలసి వచ్చింది. సరోజినీ నాయుడు, భండారీ,
అడ్వానీ మొదలయినవారు స్థలం చూచివచ్చారు.
ఇనుపతీగలకు వెలుపల, దగ్గరలోనే ఒక గడ్డి
పెరిగిన పొలం ఉంది. గడ్డి తీయించి స్థలం
శుభ్రం చేయించారు. పక్కన ఒకవైపు రెండు
మూడు ఎత్తైన పొదలున్నాయి. ఎదుట పర్వ
తాల సుందర దృశ్యం. మహాదేవభాయీకి ఈ
స్థలం చాల నచ్చేది. గడ్డి తీయించినమీదట
బ్రాహ్మణుడు నీళ్లు ప్రోక్షించి శుద్ధిమంత్రాలు
పఠించాడు. మెట్లవద్ద కింద ఉన్న తోటలోని
చెట్ల కొమ్మలు విరిచి, పాడె తయారు చేస్తు
న్నారు. బాపూ శవం పక్కన కూర్చుని, తాము
గీతా పారాయణం చేసేవారు, నాతో చేయించనన్నా
చేయించేవారు. మీరాబహన్ ఒక గిన్నెలో
ధూపం, చందనం మొదలయిన సుగంధద్రవ్యాలు
ముట్టించి శవం తల దగ్గర పెట్టి, అక్కడే
కూర్చుని దానిలో చందనం, కర్పూరం వేస్తూ
ఉంది. మహాదేవభాయీది భారీ శరీరం. ఇటీవల
కొంతకాలంగా ఆయన మెడ కొంచెం వంకరచేసి
నడిచేవారు. శవం పూర్తిగా నిటారుగా పడి
ఉన్నందున, బహుశా శరీరంలోని స్నాయువులు
మొదలయినవి శిథిలమైపోయినందున బతికి
ఉన్నప్పటికంటే పొడుగ్గా కనబడేది. ముఖం
మీద అపూర్వమైన శాంతి, అపూర్వమైన
శోభ వెలుగొందాయి. బాపూ శవానికి ఎడమ
పక్కన కూర్చున్నారు. మహాదేవభాయి ఎడమ
కన్ను సగం తెరుచుకొని ఉండడం చూచాను.
ఇది అకస్మాత్తుగా జరిగి ఉంటుంది. మర
ణించిన తర్వాత రెండు కళ్లూ మూసివేశాను.
మరి ఎడమకన్ను ఎలా సగం తెరుచుకొందో
నాకు అర్థంకాలేదు. మహాదేవభాయీ మరణించి
కూడా బాపూజీ దర్శనం చేసుకోదలచినట్లు
కనిపించింది.

గీతాపారాయణం పన్నెండవ అధ్యాయం
నుంచి పద్దెనిమిదవ అధ్యాయంవరకు పూర్త
యిన తర్వాత ప్రథమాధ్యాయంనుంచి ప్రారం
భించవలసిందని బాపూ అన్నారు. ప్రథమా
ధ్యాయం పూర్తయింది. రెండవ అధ్యాయం
సగం అవుతూ ఉండగా, బ్రాహ్మణుడు వచ్చి
"అంతా తయారుగా ఉంది" అన్నాడు. గీతా
పారాయణం ఆగిపోయింది. ముఖ్య పురోహితుడు
కాక నలుగురు బ్రాహ్మణులు వచ్చారు. అందరూ
తమ టోపీలు తీసివేసి, యజ్ఞోపవీతాలు ప్రాచీనా
వీతి చేసుకొని, మంత్రాలు పఠిస్తూ శవాన్ని
పాడెపై పెట్టారు. తర్వాత శవాన్ని పగ్గాలతో
బిగించారు. శవాన్ని పాడెపై పెట్టడం నేను
ముందెప్పుడూ చూడలేదు. పగ్గాలతో బిగిం
చడం నా మనస్సును పొడిచినట్లయింది. నేను
నివారించదలచగా, బాపూ అడ్డువచ్చి "శవాన్ని
బిగించక తప్పదు" అన్నారు. బ్రాహ్మణుడు
మిల్లు శాలువను ఒకదానిని శవంపై కప్పాడు.
"ఏమిటి మిల్లు దుప్పటే కప్పాలా?" అని
బాపూను అడిగాను. "ఔను, జరుగనీ" అన్నారు
ఆయన. ఖైదీల హోదాలో ఈ విషయాలను
తప్పుపట్టే హక్కు మనకు లేదని ఆయన అను
కున్నారేమో!

పాడెను ఎత్తుకుని మెట్లకిందికి వచ్చారు.
అక్కడ దానిని భుజాలపై పెట్టుకోసాగారు.
ఆరుగురు అతి కష్టంతో భుజాలపై మోసు
కొన్నారు. తక్కినవారందరూ వెనుక నడిచారు.
బాపూ అగ్ని ఉన్న కుండను పట్టుకున్నారు.
కస్తూర్బాను సమాధానపరుస్తున్నారు. శవాన్ని
చితిపై పెట్టారు. కస్తూర్బాకోసం దూరంగా
ఒక కుర్చీ వేశారు. ఆమె చితికి నిప్పుపెట్టడం
చూడలేకపోయారు; దుఃఖంతో పిచ్చివారయి
పోయారు. అశ్రుభరితమైన కళ్లతో, రెండు
చేతులూ జోడించి ఆకాశంవైపు చూస్తూ,
"భాఈ తుం జ్యాం జబే సుఖీ రహేజే. భాఈ,
తుం సుఖీ రహేజే. తేం బాపూజీనీ ఘణి సేవా
కరీఛే. బధానే సుఖ పహోంచాడ్యుంఛే. తుం
సుఖీ రహేజే." (భాఈ, నీవు ఎక్కడికి వెళ్లినా
సుఖంగా ఉండు. భాయీ, నీవు సుఖంగా ఉండు.
నీవు బాపూజీకి గొప్పసేవ చేశావు. అందరికీ
సుఖం కలిగించావు. నీవు సుఖంగా ఉండు) అని
పెక్కుసార్లు పలవరించారు. బ్రాహ్మణుడు
అపరమంత్రపఠనం పూర్తిచేశాడు. శవంమీద
కర్రలు పేర్చుతున్నారు. ముఖంమీద కర్రలు
పేరుస్తున్నప్పుడు నేను, బాపూజీ యంత్ర
వత్తుగా రెండు అడుగులు ముందుకు వేశాము.
బ్రాహ్మణుడు చేతులు అడ్డుపెట్టాడు. ఆఖరు
సారిగా మహాదేవభాయి దర్శనం చేసుకొని మేము
వెనక్కు తగ్గాము. కర్రలు పేర్చారు. ఆఖరుకు
బాపూ నిప్పుపెట్టారు. ఈ విధంగా ప్రథ
మాహుతి పూర్తయింది.

బాపూ గంట—గంటన్నర నిలబడే ఉన్నారు.
తర్వాత ఎంతో బలిమాలగా, కుర్చీలో కూర్చు
న్నారు. మావైపు చితిని పేర్చడంలో పెద్ద
కర్రలు అట్టడుగున, తర్వాత మధ్యన చిన్న
కర్రలు, పైన మరల పెద్దకర్రలు. ఇక్కడ
వీరు కింద పెద్దకర్రలు పేర్చి, పైన అన్నీ
సన్నటి పుల్లలు పేర్చారు. పై కర్రలు త్వరగా
కాలి బూడిదవుతున్నాయి. ఈ కర్రలతో శవం
పూర్తిగా కాలదని నేను రెండు మూడుసార్లు
చెప్పాను. కాని, ఎవరూ వినిపించుకోలేదు. నేను
చితిని చూస్తున్నాను. అగ్నిజ్వాలలో అడుగున
ఒక పచ్చని ముక్క కనిపించింది. ఆ ముక్క
పెద్దదవుతూ వచ్చింది. పైన ఉన్న కర్రలు
మండి బూడిదకాగానే, ఈ పచ్చని తేపవద్ద
పేగుల గుంపు ఉబికి ఇటు అటూ వ్యాపిస్తూ
వెలుపలికి వచ్చింది. నేను వశంతప్పి, "బాపూ,
పేగులు!" అని పెద్దగా అరిచాను. ఆ దృశ్యం
భయానకంగాను, కరుణామయంగాను కని
పించింది. ఇద్దరు ముగ్గురు పరుగెత్తుకొని
వెళ్లి మాకోసం—ఖైదీలకోసం పెట్టిన కర్రల
నుంచి కొన్ని కర్రలు లాక్కొనివచ్చి, చితిపై
వేశారు. జ్వాల భగ్గుమంది. అందరి హృద
యాలు దుఃఖంతో నిండి ఉన్నాయి. అందరూ
మహాదేవభాయీ వెంట వెళ్లేవారా అన్నట్లు
అగుపించింది. నేను కటేలీవైపు తిరిగి "మాలో
ఒక్కరయినా ప్రాణాలతో ఇక్కడినుంచి వెలు
పలికి వెళ్లకపోతే, ఈ స్థలాన్ని మీరు మహాదేవ
భాయి కుమారునికి చూపవలసి ఉంటుంది"
అన్నాను. అడ్వానీ కూడా ఈ మాటలు విన్నారు.



పొలానికి

చిత్రం — వై. బాలయ్య (నారాయణరావుపేట)

వారుకూడా చాల దుఃఖపడ్డారు. నేటి ఈ
ఘటనను ఎదుర్కొనడానికి ఎవ్వరూ ముందుగా
సిద్ధంగా లేరు.

బాపూజీ చితి బాగా మండేట్లు చూడండని
బ్రాహ్మణులకు చెప్పి, మూడు గంటల తర్వాత
తిరిగి వచ్చారు. కస్తూర్బా రోదిస్తున్నారు. బాపూ
ఆమెను సాంత్వనపరుస్తున్నారు. టన శూన్యంగా
కనిపించింది. ఇంతవరకు అందరం వృత్తుల
మయినట్లుగా అనుకున్నాము.

బాపూ బైబిల్ చదివించేవారు. ఆయన
హెచ్చరికలేకుండా మహాదేవభాయీ వద్దకు వచ్చి
నప్పుడు, మహాదేవభాయి అనంత నిద్రలో
మునిగిపోయినప్పుడు నేను మనస్సులో అను
కున్నాను 'క్రీస్తు తన భక్తులను రక్షించేవాడట.
బాపూ రక్షించలేరా?' అని. డాక్టర్ కావడంవల్ల

# గాంధీజీ కారాగార గాథలు

నేను ఇలాటి ఆలోచనలకు స్థానమివ్వడమే సిగ్గుచేటు. అయితే మన ఇష్టజనులకు ఏదైనా విపత్తు వచ్చినప్పుడు—వారి వియోగం సంభవించినప్పుడు—మానవుడు స్థైర్యం కోల్పోతాడు.

బాపూ అనేవారు "భావుకతే మహాదేవ్ భోజనం" అని.

బాపూజీ ఉపవాసచింత మహాదేవభాయీ తలపై నిరంతరం సవారయ్యే ఉండేది. ఆయన నాతో ఎన్నోసార్లు "నేను భగవంతుని ఉద్దేశించి చేసే ఏకైక ప్రార్థన ఏమిటంటే, బాపూజీ కంటే ముందుగా నన్ను తీసుకొని వెళ్లవలసిందని. భగవంతుడు నా ప్రార్థనను ఎప్పుడు తోసివేయలేదని, నిరంతరం పూరించాడని కూడా చెబుతాను" అనేవారు.

భండారీతో సంభాషించేటప్పుడు ఆయనకు ఏ ఆయువు పట్టుకు తగిలిందో! ఏకాయెకిని ఆయన అలా అయిపోవడానికి ఎలాటి ఆలోచన మనసులో మెరిసిందో! పాపం! ఇంజెక్షన్ నష్టమూ కలిగించలేదు, లాభమూ కలిగించలేదు. రక్తప్రసారం ఆగిపోయినప్పుడు నరాలలో ఇచ్చిన ఇంజెక్షన్ ప్రయోజనమే లేదు. అది హృదయంవరకు ఎలా చేరుతుంది? గుండెకు (హృదయానికి) చేరడానికి హృదయపు మాంసపేశికి (ఇంట్రాకార్డియల్) ఇంజక్షన్ ఇచ్చి ఉంటే ప్రయోజనం ఉండేది. అయితే, నా తలపైన భూతం ఎక్కి కూచుందే! గుండెకే ఇంజక్షన్ ఇచ్చి ఉంటే, ఆయన లేచి కూర్చునేవారు. ఈ ఆలోచన నాకు చాల అశాంతి కలిగించింది. ఈ విషయం బాపూతోను అన్నాను. "అలా చేయదలచుకున్నప్పటికీ, నేను చేయనిచ్చేవాడిని కాను. ఇంతవరకు చికిత్స చేయనిచ్చినందుకే నాకు విచారంగా ఉంది. మహాదేవ్ బ్రతకాలనే వాంఛను వదలిపెట్టాడు. జీవించే వాంఛను వదలిపెట్టే మానవునికి దేహం దానంతట అదే వదలిపోతుందని నేను ఎప్పుడూ చెబుతూనే ఉన్నాను" అన్నారు బాపూ.

మొదట భండారీ మొదలయినవారు ఇక్కడ దహనక్రియ జరుపడాన్ని ప్రతిఘటించారు. "వర్షం వస్తే ఏమిచేద్దాం?" అని వారన్నారు. ఆకాశం మేఘాచ్ఛన్నం కావడం నిజమే. పొద్దెత్తేవరకు మాత్రమే చినుకులు పడ్డాయి, ఆకాశం కూడా అశ్రువులు రాల్చినట్లు. చితికి అగ్నిసంస్కారం చేయడానికి వెళ్లినప్పుడు, వాన ఒక్క చినుకన్నా పడలేదు. చితివద్దకు వెళ్లినప్పుడు ఆకాశంలో అంధకారం కమ్ముకొన్నట్లు కనిపించింది. నేను తల పైకెత్తి చూచాను; మిడుతల దండు ముసురుకున్నదా అనిపించింది. కాని, అది మిడుతల దండుకాదు; అడవి ఈగల

(తరువాయి 67 వ పేజీలో)

# గాంధీజీ కారాగార గాథలు

(8 వ పేజీ తరువాయి)

దండు. అంతకుముందుగాని, ఆటుతర్వాత గాని అన్ని ఈగలు కనిపించలేదు.

దహన సంస్కారంనుంచి తిరిగి వచ్చాము. అందరూ అప్పుడు భోజనం చేయాలని బాపూ ఉత్తరువు చేశారు. ఐదుగంటలు కొట్టారు. రెండు గంటలకు ముందు ఎక్కడ భౌతిక కాయం ఉందో, ఎక్కడైతే మహాదేవభాయీ బాపూజీకోసం పండ్లరసం తయారుచేశారో, అక్కడే కూర్చుని నేను బత్తాయి పండ్లు పిండి రసం తీశాను. బాపూ పాలు, పండ్లరసం పుచ్చుకున్నారు. మేమందరం భోజనంకోసం సరోజినీ నాయుడు గదిలోకి వెళ్లాము. టోస్ట్, పాలు, తేనీరు మొదలయినవి పుచ్చుకున్నాము. చాయ్ దానీ (టీ జగ్) పైన కొత్త టీకోజీ (చాయ్ దానీ ఆవరణం) ఉంది. మహాదేవభాయో, మరొకరో తేనీటికి ఉదయం కొంచెం ఆలస్యంగా వచ్చేవారు. "తేనీరు చల్లారిపోకుండా ఒక 'టీకోజీ' తయారుచేయి" అన్నారు సరోజినీ నాయుడు. నిన్న నేను నా పాత రంగు బ్లౌజు చింపి 'టీకోజీ' కత్తిరించాను. ఆర్థర్ రోడ్ జెయిలునుంచి వచ్చేటప్పుడు శ్రీమతి సీతల్‌దాస్ నాకు కొంచెం పత్తి ఇచ్చింది! ఆ పత్తి కూరి 'టీకోజీ' తయారు చేశాను. సాయంకాలం తేనీటి వేళకు 'టీకోజీ' బల్లమీద సిద్ధంగా ఉంది. మహాదేవభాయీ దానిని చూచి చాల సంతోషించి, తలమీద టోపీలాగ పెట్టుకున్నారు. "రంగు తాజాగా ఉంది. ఇప్పుడే బజారునుంచి వచ్చిందా అన్నంత బాగా తయారయింది" అన్నారు ఆయన. నేను ఆయన తలమీదినుంచి దానిని లాక్కుని, "మీరు మరీ విదూషకులయి పోతున్నారు" అన్నాను. ఆయన తన హద్దులలోనే ఉంటూ, తను సంతోషంగా ఉంటూ, ఇతరులను సంతోషపెట్టదలచేవారు.

సాయంకాలం వాహ్యాళికి బయలుదేరాము. నేను, బాపూ—ఇద్దరమే. అయితే, మహాదేవభాయీ మాతోపాటే నడుస్తున్నట్టు అనిపించేది. నిజంగా ఆయన ఆత్మ ఇప్పుడు ఇక్కడ తిరుగాడుతున్నదో, లేక ఎంతో ముందుగానే పుణ్యలోకాలు చేరిందో!—భగవంతునికే ఎరుక!

మళ్లీ నా తలపైన అదే ప్రశ్న బరువుగా పడినట్టు అనిపించింది—నేను బాపూతో అన్నాను: "గుండెకు ఎడ్రినలిన్ ఇచ్చి ఉంటే మహాదేవ భాయీ నేడు ఈవిధంగా వెళ్లిపోయి ఉండరు." బాపూ అన్నారు: "అదేమీకాదు, ఆ మందు నీవద్ద ఉన్నా, నేను ఇవ్వనిచ్చేవాడిని కాను."

ఎడ్రినలిన్ తయారు చేయడంతో ప్రాణి హత్య జరుగుతుంది. నిరామిషంగా తయారయ్యేది కూడా ఉందే! నేను ఎందుకు దానిని నావద్ద భద్రపరచుకోలేదు? మళ్లీ అనుకున్నాను—నావద్ద ఎడ్రినలిన్ ఉన్నప్పటికీ—అదొక్కటే ప్రాణాలు రక్షించేదని నాకు తోస్తున్నది గనుక—బాపూను అడగకుండా మహాదేవభాయీకి వాడను. అయినా బాపూ చెప్పేదే సరి. ఆయుస్సు ఉన్నప్పుడే అన్నీ కలిసి వస్తాయి. భగవంతుడు చేయదలచుకొనేదానికి సాధనాలు కూడా కల్పిస్తాడు. "జైసీ హో భవితవ్యతా, తైసీ మిలే సహాయ్" (భవితవ్యత ఎలాంటిదో, అలాటి సహాయమే లభిస్తుంది).

ప్రార్థన జరిగింది. మహాదేవభాయి తర్వాత ప్రార్థన చేయించే పని నామీద పడింది. గొంతు బాగులేదు. దానిమీద ఇంతటి అలసట. భజన గీతాలు పాడడం, రామధున్ చేయించడం, రామాయణ పారాయణం, అంతా కఠినమయింది. రామధున్ మీరాబహన్ ఆరంభించింది. భజన గీతాలు పాడడం, రామాయణపఠనం నాపాల పడ్డాయి. ప్రార్థనకు వెళ్లేముందు సివిల్ సర్జన్ వచ్చారు. ఆయనే; మహాదేవభాయి మరణానంతరం వచ్చినవారే. చితిని ముట్టించి తిరిగి వచ్చినమీదట, నేను తాత్కాలికావసరాలకు ఉపయోగపడే మందుల జాబితా ఒక్కటి భండారీకి అందజేశాను. బాకు ఎప్పుడైనా కరోనరీ థ్రాంబోసిస్ (హృదయనాడులలో అడ్డంకి ఏర్పడడంవల్ల రక్తప్రసారం తక్కువ కావడం, లేక ఆగిపోవడం జరిగే వ్యాధి) ఏర్పడవచ్చు. బాపూజీకి కార్డియాక్ ఆస్థ్మా (హృదయంలోని మాంసపేశీలపై ప్రభావం చూపించే ఉబ్బసం). నేటిలాగ ప్రమాదంలో పడడం—తప్పులు చేయడం—నాకు ఇష్టంలేదు. ఇక్కడి పరీక్షా సమయం గడచిపోయిందనీ, మళ్లీ ఇక్కడ ఇలాటి పరీక్ష రాదని తోచినప్పటికీ, మందులు తెప్పించాను.

ఈవేళ సాయంకాలం సివిల్ సర్జన్ బాపూను పరీక్షిస్తే మంచిదని తోచింది. ఎందుకంటే, నాలో ఆత్మ విశ్వాసం పూర్తిగా పోయింది. నేను నిష్ప్రయోజకురాలననే అభిప్రాయమూ ఏర్పడింది. బాపూను సివిల్ సర్జన్ పరీక్షించడం మంచిదని భండారీతో అన్నాను. అందుకోసమే ఆయన సివిల్ సర్జనును పంపాడు. పాపం! ఆయన శ్రద్ధగా వచ్చి, కుశల ప్రశ్న అడిగి, బాపూ నాడి పరీక్షించి వెళ్లిపోయారు.

ఎనిమిది ఎనిమిదిన్నరకు బాపూ పక్కమీద చేరారు. తొమ్మిది గంటలకు భండారీ మహాదేవభాయి పత్ని చిరునామాకోసం కబురుపంపారు. శవానికి స్నానం చేయించినమీదట మధ్యాహ్నం బాపూను అడిగారు "మహాదేవభాయీ ఇంటికి కబురు పంపదలచుకున్నారా?" అని. "ప్రభుత్వం పంపదలచుకుంటే, త్వరగా పంపగోరితే, నా సందేశం త్వరగా, కోతలు, వాతలు లేకుండా పంపాలి" అని అప్పుడే బాపూ సమాధాన మిచ్చి



నీదే నా హృదయం

చిత్రం—ఎ. నాగభూషణం (హైదరాబాద్)

చిమన్‌లాల్ భాయి పేర తంతి వ్రాశారు: "సారీ, మహాదేవ్ డైడ్ సడన్‌లీ" (మహాదేవ్ హఠాత్తుగా మరణించినందుకు విచారిస్తున్నాను) అని వ్రాసి ఆగారు. విచారం ఎందుకు? మహాదేవభాయీ తన ధర్మం నిర్వహిస్తూ మరణించారు. కనుక 'సారీ' అనేమాట కొట్టివేసి ఈవిధంగా వ్రాశారు: "మహాదేవ్ ఆకస్మాత్తుగా మరణించాడు. ముందుగా అలాటి సూచన లేవీ కనిపించలేదు. రాత్రి బాగా నిద్రపోయాడు. ఉదయం అల్పాహారం పుచ్చుకున్నాడు. నాతోపాటు వాహ్యాళికి వచ్చాడు. సుశీల, జెయిలు డాక్టర్లు చేయగలిగినదంతా చేశారు; కాని, ఈశ్వరేచ్ఛ మరొకవిధంగా ఉంది. సుశీల, నేను శవానికి స్నానం చేయించాము. శరీరం శాంతంగా పడి ఉన్నది; పూలతో కప్పాము. ధూపం వెలిగించాము. సుశీల, నేను గీతాపారాయణం చేస్తున్నాము. మహాదేవ్ యోగిగా, దేశభక్తుడుగా మరణించాడు. దుఃఖపడవద్దని దుర్గకు, బాబలాకు, సుశీలకు చెప్పండి. ఇలాటి గొప్ప మరణానికి హర్షించడం తప్ప మరొక్కటి ఉండరాదు. అంత్యక్రియలు నా ఎదుట జరుగుతున్నాయి. చితి భస్మం భద్రపరుస్తాను. ఆశ్రమంలో ఉండమని దుర్గకు సలహా ఇవ్వండి. కాని, ఆమె వెళ్లడమే తప్పదనుకుంటే తమవారివద్దకు వెళ్లవచ్చు. బాబలా ధైర్యవంతుడై మహాదేవ్ స్థానాన్ని తగినట్టు పూరించడానికి తనను తాను సిద్ధంచేసుకుంటాడని ఆశిస్తున్నాను. ప్రేమతో—బాపు."

తంతి భండారీకి అందించారు. తర్వాత బాపూ నన్ను పంపించి మళ్లీ చెప్పారు: "తంతి ఉన్న దున్నట్టు పంపాలని, త్వరగా, సరాసరి వెళ్లే

# మూసేశారో

## పాఠశాలలో సీటు ఖరీదు 500 రూపాయలు మాత్రమే!

హైదరాబాదులో ప్రతి జూన్‌లోనూ పాఠశాలల వద్ద పొడుగాటి 'క్యూ'లు దర్శనమిస్తాయి. ఈ 'క్యూ'లు ఎంత పొడుగ్గా ఉంటే రాజధానిలో విద్యాసక్తి అంత ఎక్కువగా ఉన్నట్టు లెక్క. అంతే కాదు. పాఠశాలల కొరతకు కూడా అదే దాఖలా. ఇది గర్వించదగిన, గర్హించదగిన విషయం.

ప్రతి జూన్‌లోనూ పిల్లల తలిదండ్రులకు ఇది ఒక సమస్య. కొత్తగా పాఠశాలల్లో చేరేవారి సంఖ్య ఆ యేటికాయేడు పెరుగుతున్నది. ఈ నిష్పత్తిలో పాఠశాలల సంఖ్య పెరగటం లేదు. ప్రభుత్వం విద్యాశాఖకు ఇవ్వవలసినంత ప్రాధాన్యం ఇవ్వటం లేదు. బడ్జెట్ కోతకు విద్య బలి అయిపోతున్నది. కొత్తగా పాఠశాలలను తెరవడానికీ, ఎక్కువ మంది ఉపాధ్యాయులను నియమించడానికీ అవకాశం లేకుండా పోతున్నది.

హైదరాబాదులో ఎదురయ్యే ఇంకొక సమస్య ఇంగ్లీషు మీడియం పాఠశాలలు. ఈ పాఠశాలలంటే చాలామందికి మోజు. వాళ్ళకు తమ పిల్లలను ఈ పాఠశాలల్లో చేర్చాలని ఉబలాటం. కొందరు తెలుగు మీడియంలోనో, ఉర్దూ మీడియంలోనో చదువుతున్న తమ పిల్లలను మధ్యలో ఇంగ్లీషు మీడియంలోకి మార్చాలని కూడా అనుకుంటున్నారు. ఈమాట విద్యాశాఖ డైరెక్టర్ శ్రీ ఎల్. బుల్లయ్యగారే చెప్పారు.

ఈ ఏడాది ప్రభుత్వం ఇంగ్లీషు మీడియం పాఠశాలల్లో సెక్షన్ల సంఖ్య పెంచింది. అయినా అట్టే ప్రయోజనం లేకపోయింది. ఎందుకంటే ఇంగ్లీషు మీడియం మీద మోజుగలవారిలో చాలామందికి తమ పిల్లలను ప్రభుత్వ పాఠశాలల్లో కాక ప్రైవేటు పాఠశాలల్లో చేర్చాలని కోరిక. ప్రైవేటు పాఠశాలల్లో విద్యా ప్రమాణాలు ఉన్నతంగా ఉంటాయని ఒక నమ్మకం. అందుకని నగరంలోని ఐదారు మిషనరీ పాఠశాలలకు గిరాకీ పెరిగింది.

గిరాకీ పెరిగితే ధర పెరగటం సహజంకదా! ఈ సహజ సూత్రాన్ని పురస్కరించుకుని ఆ పాఠశాలలవారు సీటు ఒక్కింటికి 250 రూపాయల నుంచి 500 రూపాయల వరకు రేటు పెట్టి అమ్ముతున్నారు. మోజు, అందుకు తగ్గ స్తోమతు గలవారు కొనుక్కుంటున్నారు. ఇదేమీ లోపాయికారీగా జరుగుతున్న పనికాదు. బహిరంగంగానే జరుగుతున్నది. ఇంకా కొన్నాళ్ళు పోతే సీట్లను వేలంవేసే పరిస్థితి కూడా వస్తుందేమో చూడాలి.

విద్యాశాఖలోని ఒకానొక అధికారిని ఈ విషయమై ప్రశ్నిస్తే ఆయన "ఏం చెయ్యమంటారు చెప్పండి? మా మేనల్లుడిని చేర్పించాలని నా భార్య వెళ్తే ఆ డబ్బు ఇచ్చి సీటు కొనుక్కోమని ఒక పాఠశాల ప్రిన్సిపాల్ ఖండితంగా చెప్పాడు. మన పిల్లలను వాటిల్లో చేర్చకుండా ఉండటమే దీనికి పరిష్కారం" అని చెప్పారు.

ప్రభుత్వ పాఠశాలల్లో ఈ బాధ లేదనీ, ప్రవేశం కోరిన ప్రతివిద్యార్థికి సీటు లభిస్తుందనీ, అవసరంతా పాకలువేసి అయినా సరే తరగతులు నిర్వహిస్తామనీ విద్యాశాఖ డైరెక్టర్ శ్రీ బుల్లయ్య తెలియజేశారు. ఈ ఏడాది కొత్తగా నాలుగు వేలమంది ఉపాధ్యాయులను నియమిస్తున్నట్లు కూడా ఆయన చెప్పారు.

### వ్యవసాయ విశ్వవిద్యాలయం

హైదరాబాదులో వ్యవసాయ విశ్వవిద్యాలయం జూన్‌నుంచి పని ప్రారంభించింది. దీనికి లాంఛనప్రాయంగా ప్రారంభోత్సవం అంటూ ఏమీ జరగలేదు. దక్షిణాదిన ఇది మొదటి వ్యవసాయ విశ్వవిద్యాలయం.

హైదరాబాదుకు పదిమైళ్ళ దూరంలో ఉన్న రాజేంద్రనగర్‌లో దీనికోసం విశాలమైన భవనాలు నిర్మిస్తారు. అంతవరకూ దీని కార్యాలయం హైదరాబాదులోనే ఉంటుంది.

రాష్ట్రంలోని మూడు వ్యవసాయ కళాశాలలనూ, రెండు పశువైద్య కళాశాలలనూ, గృహవిజ్ఞాన శాస్త్ర కళాశాలనూ ఈ విశ్వవిద్యాలయానికి అనుబంధించారు. రాష్ట్రంలో ముఖ్యంగా గ్రామీణ ప్రజలకు వ్యవసాయ, పశువైద్య, గృహవిజ్ఞాన శాస్త్రాల్లో విద్యా సౌకర్యాలను పెంపొందించటం, ఈ రంగంలో విస్తరణ

## గాంధీజీ కారాగార గాథలు

పోతే నాకు తిప్పి పంపాలని రెండోసారి ఆయనతో చెప్పు. ఎక్స్‌ప్రెస్ తంతి పంపాలి." నేను భండారీని వంటింటివద్ద పట్టుకున్నాను. ఆయన ఒక ఇంగ్లీష్ పోలీసు ఆఫీసరుకు ఆ తంతి అందిస్తున్నారు. నేను ఆయనకు బాపూ అన్న మాటలను తెలియజేశాను. "ఈ విషయం నా చేతిలో లేదు" అన్నారు భండారీ. "అయితే తంతి వెనక్కు ఇచ్చేయండి" అన్నాను. "ఇప్పుడది పరాసరి వెళ్ళిపోతున్నది. పోలీస్ ఆఫీసరుకు అప్పగించాను" అన్నారు ఆయన. తంతి వెంటనే వెళ్ళాలని ఆయన పోలీస్ ఆఫీసరుకు చెప్పారు. "ఇది సర్కారీ తంతిగా వెళ్ళాలి—ఎలాటి కోతలూ గీతలూ లేకుండా. అలాకాకపోతే గాంధీజీ దీనిని పంపగోరటంలేదు" అని నేను రెండవమారు అన్నాను. కాని, రాత్రి మళ్ళీ మహాదేవభాయి వద్ది చిరునామా కావాలని భండారీ కబురు చేసినప్పుడు నాకు ఆశ్చర్యం కలిగింది. బాపూజీ నాకు నచ్చచెప్పారు: "ఆ తంతి మనవైపునుంచి వెళ్ళిపోయింది గదా? ప్రభుత్వం తనవైపు నుంచి కూడా కబురు పంపాలి కదూ! అందుకోసం చిరునామా అడిగి ఉంటారు" అని. మేము పేరు, ఊరు తెలియజేశాము.

పడకమీద పడుకున్నానో లేదో, నా కళ్ళముందు మహాదేవభాయి మరణ దృశ్యమే. మహాదేవభాయి గదిగుండా సరోజినీనాయుడు స్నానాల గదికి వెళ్ళవలసి ఉంది. ఆమె ఆ గదిలో దీపం వెలిగించాలని చెప్పారు. మరణించినచోట పదిరోజులపాటు దీపం వెలిగించే ఆచారం ఉంది.

బాపూ తమ పక్కమీద పడుకుని పొర్లుతున్నారు. కస్తూర్బా రోజూ లోపల పడుకునేవారు—నేడు వెలుపల పడుకున్నారు. నేను నా మంచం బాకు ఇచ్చాను. మహాదేవభాయి పడుకునే మంచం నాకు దొరికింది. "నీకు భయం కలిగేట్టయితే ఆ మంచం నాకు ఇచ్చి, నా మంచం నీవు తీసుకో" అన్నారు బాపూ. కాని, నాకు మహాదేవభాయి అంటే భయమెందుకు? పడుకునేముందు నేను మహాదేవభాయి బల్ల సొరుగులాగి, ఆయన డైరీ వ్రాసే కాయితం పైకి తీశాను. దానిలో చిన్న చిన్న నోట్స్‌లాగ వ్రాశారు ఆయన. నేను ఆ కాయితం కింద నే 15 వ తేదీ డైరీ వ్రాయడం ప్రారంభించాను. ఈవిధంగా 15 వ తేదీనుంచి నియతంగా డైరీ వ్రాయడం ఆరంభించాను. అంతకుముందు జరిగిన విషయాలను తర్వాత జ్ఞాపకం చేసుకొని, మహాదేవభాయి నోట్స్ సహాయంతోను వ్రాశాను. ఇక్కడ 15 వ తేదీన జరిగిన విషయాలు అసలు డైరీనుంచే నకలు చేశాను. ఆ రోజు అలసిపోయినందున వివరాలు వ్రాయలేకపోయాను. తర్వాత అన్నయ్య చెప్పినమీదట వ్రాశాను.

(సశేషం)

ఆంధ్రప్రభ

సచిత్ర వారపత్రిక

మద్రాసు

ఎడిటర్: నీలంరాజు వెంకటశేషయ్య


# నెహ్రూ స్మారక నిధి

జూన్ నెల ఆఖరి వారంలో జరిగిన రెండు నిర్ణయాలు భారతీయు లందరికీ ఆనంద దాయకాలు. నెహ్రూ స్మారక నిధి ప్రారంభించడానికి నిశ్చయించినట్లు తొలుత రాష్ట్రపతి డాక్టర్ ఎస్. రాధాకృష్ణన్ ప్రకటించారు. రాజధాని నగరంలో 16 సంవత్సరాలపాటు ప్రధాన మంత్రి నెహ్రూ నివాసంగా ఉండిన తీన్ మూర్తి భవనాన్ని స్మారక చిహ్నంగా ఉంచడానికి భారత ప్రభుత్వం నిశ్చయించినట్లు ప్రధాని శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రి ప్రకటించారు.

భారతదేశ చరిత్రతో పెనవేసుకొని ఉన్నది నెహ్రూ జీవితం. భారతదేశం మనినంత కాలమూ నెహ్రూకు వేరొక స్మారక చిహ్నం అవసరంలేదు. కాగా ఈ నిర్ణయాలు నెహ్రూపట్ల తరతరాల భారతీయులకు ఉన్న అశేషమైన ప్రేమాభిమానాలకు తార్కాణాలు మాత్రమే.

నెహ్రూ నివాసగృహం తీన్ మూర్తి భవనంలో ఆయన నిత్య జీవితం తలపింపజేసే విధంగా ఆయన ఉపయోగించిన వస్తువులను ప్రదర్శించడం; ఆయా ఏర్పాట్లకు భంగకరం కాని విధంగా దేశదేశాలవారు దానిని దర్శించడానికి తగు పద్ధతి రూపొందించడం అవసరం. భారతీయులకు అదొక పవిత్ర యాత్రాస్థలం.

ఏయే ఆదర్శాల సాధనకు నెహ్రూ జీవితం అంకితమైనదో ఆయా ఆదర్శాలకే నెహ్రూ స్మారకనిధి ఉపయోగపడడం సముచితం.

మాతృదేశంపట్ల నెహ్రూకు ఉన్న అఖండమైన ప్రేమను, అందరికన్న మిన్నగా ఆయన ప్రేమించిన బాలబాలికలలో చిగురింపచేయడానికి; అనాథలు, అంగ వికలులు అయిన బాల బాలికల జీవితాలు చక్కబరచడానికి; శాస్త్ర పరిశోధనకు దోహదం చేయడానికి — ఇలా నెహ్రూ లక్ష్యాలు నెరవేరేటట్లు చేయడానికి నెహ్రూ స్మారక నిధి తోడ్పడడం ముఖ్యం.

ఈ కృషి అనంతం ఇందుకు ఎంతైనా ద్రవ్యం అవసరం. నెహ్రూ స్మారకనిధి తరగరాదు. భారతీయులు తమ కర్తవ్యం నిర్వర్తించి నెహ్రూ స్మారక నిధికి విరాళాలు ఇవ్వడం ద్వారా నెహ్రూ పట్ల, ఆయన ఆదర్శాలపట్ల తమకు ఉన్న ఆదరాభిమానాలు వ్యక్తం చేసుకొనగలరు

నెహ్రూ స్మారక చిహ్నాలుగా నడిచే కార్యకలాపాలు అన్నీ ఏవిధమైన ప్రాంతీయ కులమత విభేదాలకు లోనుకాకుండా, దేశమంతటికీ వర్తించే విధంగా నిర్వహించడం అవశ్యకం. అంతేకాదు. విశ్వమానవ సౌభ్రాత్రం, ప్రపంచశాంతి లక్ష్యాలు కావాలి.

ఈ లక్ష్యాలు నెరవేరుతవని, నెహ్రూ కన్నకలలు నిజం అవుతవని ఆశిద్దాము. ★

# గాంధీజీ కారాగార గాథలు

ఆగాఖాన్ మహల్ జైలు,
16, ఆగస్టు '42.

రెండున్నరకు బాపూ లేచారు. నేను మేలుకొనేఉన్నాను. బాపూ ఒక్క క్షణంకూడ నిద్రపోలేదు. నేనూ నిద్ర పోలేదు. బాపూ లేచి దంతధావనం చేశారు. వేడినీళ్ళు పుచ్చుకున్నారు. మేము ప్రార్థన చేశాము. నేడు ఆదివారం. ఉత్తరాయణంలో శుక్ల పక్షంలో పుణ్యాత్ములు శరీరత్యాగం చేస్తే తిరిగి ఈలోకానికి రారని భగవద్గీత ఎనిమిదవ అధ్యాయంలో చదివాను. ప్రస్తుతం శుక్లపక్షం, ఉత్తరాయణం కూడా.

ప్రార్థన తర్వాత బాపూ అరగంట సేపు నాతో మాట్లాడుతూ ఉన్నారు. ఆయన నన్ను సమాధానపరచి, శత్రువులను ఎదుర్కొనడానికి తయారు చేస్తున్నారు. మృత్యువును గురించిన తత్త్వవిషయాలు తెలిపారు. సోదరుడు పోయినప్పటికీ, నేను మనస్సును ఎంత నిబ్బరంగా పెట్టుకోవాలో తెలిపారు. "మనం ఒకరి తర్వాత ఒకరం వెళ్ళిపోయినా సరే. మీరు మాత్రం ఆరోగ్యంగా ఉండి, విజయపతాకను ఎగురవేస్తూ వెలుపలికి వెళ్ళాలి. ఇదే నేడు నా హృదయంనుంచి వెలువడే ప్రార్థన" అన్నాను.

మూడు ముప్పావుకు బాపూ మరల పడకమీద పడుకున్నారు. కొంచెంసేపు నిద్రపోయారు. నేడు రాత్రల్లా రెండు గంటలు గూడ ఆయన నిద్రపోయి ఉండరు. నేను కూడా ప్రార్థన తర్వాత కొంచెంసేపు పడుకున్నాను.

ఉపాహారం తర్వాత బాపూ చితి ఉన్న స్థలానికి వెళ్ళారు. చితి ఇంకా మండుతూనే ఉంది. నిప్పులు కణకణలాడుతున్నాయి. మన ఇష్టుల అంతం ఇదే. పిడికెడు బూడిద, బొగ్గులు! ప్రభూ! నీవు ధన్యుడివి. నీ లీల ధన్యమైనది. వారం ముందు ఈరోజునే బాపూ, మహాదేవభాయీ స్వాతంత్ర్య సమరం ఆరంభం కాకముందే బొంబాయిలో పట్టుబడ్డారు. నేడు మహాదేవభాయీ స్వతంత్రులయ్యారు. ఆయనను ఇప్పుడు ఎవరు నిర్బంధంలో ఉంచుతారు?

బాపూజీ చెప్పడం వల్ల చితివద్ద నిలబడి గీత పన్నెండవ అధ్యాయం పఠించాను. "తుల్య నిందాస్తుతిః మౌనీ" (నిందాస్తుతులను రెండింటిని సమానంగా గ్రహించేవాడు, మౌని) అనే శ్లోకం చదువుతున్నప్పుడు, కళ్ళ ఎదుట తుల్యనిందాస్తుతిర్మౌని అయిన మహాదేవభాయీ భౌతికదేహం కనిపించింది. ఆ భౌతికకాయం ముఖపు అపూర్వకాంతి, కాంతి కళ్ళెదుట కాన వచ్చాయి.

గీతా పారాయణం తర్వాత మేము వెనక్కు వచ్చాము. బాపూజీకోసం ఉదయపు కూర వండే పని మీరాబహెన్ స్వీకరించింది; సాయంకాలం కూర నేను వండేదాన్ని. పండ్లరసం పిండడం నావని. సాయంకాలపు కూర వండడం కోసం వంటసాలకు మధ్యాహ్నం వెళ్ళగానే ఖైదీలు కూడా, మగన్ వాడవద్దకు వచ్చి నిలబడ్డారు.



"బహెన్, ఆశ్చర్యమైన సంగతి. నిన్న మేము ఒక్కరమూ భోజనం చేయలేదు. నిన్న పూవులు కోసుకొని రండని మాకు చెప్పగానే, మేము మాతాజీ (కస్తూర్బా) జబ్బుగా ఉంది, ఆమె పోయిందేమోనని అనుకున్నాము. మమ్మల్ని పైకి పిలిచినప్పుడు నిజమైన సంగతి తెలిసింది. చాల ఘోరం జరిగిపోయింది బహెన్! ఖైదీలు, వార్డర్లు వణికిపోతున్నారు" అన్నారు.

సివిల్ సర్జన్ మరల నేడు వచ్చారు. "ఏమిటి పరిస్థితి?" అని అడిగారు. "బాపూ చాల అలసి పోయారు. నిన్నటి అలసట, రాత్రి నిద్రపోక పోవడం దీనికి కారణాలు. బాపూ నాడి ఆగి ఆగి కొడుతున్నది" అని వివరించాను. పాపం! ఆయన ఏమి చేస్తారు? "ఆయనకు పగలు నిద్ర పడుతుందని, కొంత తేలికయినట్టు భావిస్తారని అనుకుంటాను" అని అంటూ వెళ్ళిపోయారు సివిల్ సర్జన్.

ఏ "తలపై వేలాడే కత్తి" (ఉపవాస వ్రతం) భయంతో మహాదేవభాయీ వెళ్ళిపోయాడో, ఆ కత్తి ఆయన వెళ్ళిపోయిన తర్వాత మా తల మీదినుంచి లేచిపోయినట్టే మాకు అనిపించింది. మహాదేవభాయీ బలిదానం బాపూ ఉపవాసాన్ని ఆపింది. "మహాదేవ్ బలిదానం చిన్న సంగతి కాదు. అది ఒక్కటే పెక్కు పనులు చేయగలదు" అని బాపూ అన్నారు కూడా.

"ఎవడైనా మరొకని కోసం తన ప్రాణాలు వదలినవాడు ఉన్నాడంటే, అతడు మహాదేవభాయీయే. బాపూ బతకడం కోసం ఆయన ఏసుప్రభువు వలె మరణించాడు. ప్రాణాలు అర్పించడం కన్నా గొప్పసేవ ఒక మానవుడు మరొక మానవునికి ఏమి చేయగలడు?" అని ప్రశంసించారు సరోజినీనాయుడు.

సాయంకాలం వాహ్యాళి వెళ్ళినప్పుడు బాపూ తిరిగి చితి ఉన్న ప్రదేశానికి వెళ్ళారు. ఆయన దాని నుంచి కొంత భస్మం సేకరించుకొని రాదలచారు. రేపు ఎలాగూ బ్రాహ్మణులు అస్థిసంచయనం, భస్మ సంచయనం చేయడానికి రానేవస్తారు; అయినా, రాత్రి వర్షం వస్తే, భస్మం రంగు మారిపోతుంది. అందుకోసం బాపూ నేడే కొంత భస్మ సంచయనం చేయదలచారు. నేను నా శ్నో సిరాబుడ్డి, అది పెట్టుకొనే అట్ట డబ్బాలతో పాటు వెళ్ళాను. చితిపైన ఉన్న తెల్లటి భస్మాన్ని డబ్బాలో నింపుకున్నాను. భస్మం పిడికిలితో పట్టుకోగానే తెలిసింది, ఇంకాదానిలో మండే బొగ్గులున్నాయని. ఒక స్పూను తెప్పించి, మండే నిప్పులు లేని బూడిదను వేరు చేశాను. అయినా, చిన్న చిన్న నిప్పు కణికలు వచ్చాయి. దానివల్ల డబ్బా కొంచెం అక్కడక్కడ కాలిపోయింది. నిజానికి ఈ బూడిదలో కొన్ని అస్థులుకూడ ఉన్నాయి; అవి బొగ్గులలాగ కనిపించాయి.

బాపూ ఆ డబ్బాను తమవద్ద బల్లపైన పెట్టుకొని, భస్మం చేతో తీసుకొని నుదుట పూసుకున్నారు. కాలగతి ఎలాటి రంగులు (వింతలు) చూపిస్తుంది! తులసీదాస్ ఎంత చక్కగా చెప్పారు:

"జిన చరననకీ చరన పాదుకా
భరత రహ్యో లవలాఈ,
శివ సనకాదిక అరు బ్రహ్మాదిక
శేష సహసముఖ గాఈ,
తులసీదాస మారుతసుతకీ ప్రభు
నిజముఖ కరత బడాఈ."

"ఎవని చరణ పాదుకలను భరతుడు మోసుకొని వెళ్ళి పూజించాడో, ఎవనిని శివుడు, సనకాది మునులు, బ్రహ్మ, సహస్రముఖుడైన శేషుడు స్తుతిస్తున్నారో, అలాటి ప్రభువు మారుతసుతుని గొప్పదనాన్ని నోరారా వర్ణిస్తున్నారు."

సాయంకాలం ప్రార్థన సమయంలో నిన్నటిలాగే జరిగింది. ప్రార్థనలోగాని, పక్కమీదగాని నేను కళ్ళుమూసుకోలేక పోయాను. కళ్ళు మూసుకున్నానో, మరణశయ్యపై కొట్టుకుంటున్న మహాదేవభాయీ స్వరూపం ఎదుట కనబడేది.

# ఆగాఖాన్ భవన కారాగారంలో విపరీత విషాదచ్ఛాయలు

కటేలీ రాత్రి ఒక్కక్షణమైనా కన్నుమూయలేదు. పాపం! ఆయనకు గట్టి దెబ్బే తగిలింది. మహాదేవభాయీ మాట మాటలోనే మమ్మలను వదలిపెట్టి వెళ్ళిపోతారని ఎవ్వరూ ఊహించనైనా ఊహించలేదు.

మహాదేవభాయీ గుడ్డలను ఆయన పెట్టెలో పెట్టాము. పెట్టెలోని సామాను తమ ఎదుట పెట్టమన్నారు బాపూ. "బేటిల్ ఫర్ ఏషియా" అనే పుస్తకం ఒక్కటి ఉంది సామానులో. అగాథా హేరిసన్ మహాదేవభాయీకి బహూకరించిన బైబిలు ఉంది. "ఈవెనింగ్ న్యూస్" ఆగస్టు 9వ తేదీ సంచిక, "పసిఫిక్ ఎఫేర్స్" ఒక సంచిక, గురుదేవ్ రవీంద్రుని "ముక్తధారా" నాటకం, "సిల్వర్ స్ట్రీమ్", "ఎ చైనీస్ ప్లే" అనే నాటకం, కొన్ని గుడ్డలు—ఇవి పెట్టెలోని సామాను.

బాపూ "దీనిలో ఆరునెలలు నేర్చుకోనే సరుకు ఉంది" అంటూ బైబిలు చదవడం ప్రారంభించారు. "బేటిల్ ఫర్ ఏషియా" కూడ పైకి లాగారు. "ముక్తధారా" చదవడం కూడా ఆరంభించారు.

"నేటినుంచి, లేకపోతే ఎప్పుడు వచ్చావో అప్పటినుంచీ డైరీ వ్రాయడం ప్రారంభించు" అన్నారు నాతో బాపూ. "నిన్నటినుంచే వ్రాస్తున్నాను" అంటూ, మహాదేవభాయీ వ్రాసిన విషయాలు— నోట్సు—కూడా బాపూజీకి చూపాను. బాపూ నా డైరీ తీసుకొని చదివారు. ఒకటి రెండు మాటలు వ్రాయడం మరచిపోయాను. వాటి విషయం నాకు తెలిపారు, నా దృష్టి వాటిపైపు మరల్చారు. ఆ విషయాలు ఏమంటే గీతాపారాయణం చేయడం మొదలయినవి.

17, ఆగస్టు '42.

నేడు మూడవ రోజు. బాపూ బాగా నిద్రపోయారు. నేను నేడు కూడా నిద్రపోలేకపోయాను. మిస్టర్ కటేలీ కూడ నిద్రపోలేదు. రాత్రి ఆయన డాబాపై తిరిగే అడుగుల చప్పుడు వినిపించింది.

ఐదు గంటలకు బాపూ లేచారు. ప్రార్థన చేశారు. అల్పాహారం తర్వాత చితి ఉన్న స్థలానికి వెళ్ళారు. రాత్రి చినుకులు పడ్డాయి. చితి బూడిద రంగు నల్లబడింది.

మహాదేవభాయీ మరణానికి రెండు మూడు రోజుల ముందు రంగు రంగుల ఒక మేకపిల్లను బాపూజీ వద్దకు తీసుకొని వచ్చారు. మహాదేవభాయీ దానిని చాల ప్రీతితో మాచేవారు. దాని మూతి ముద్దుపెట్టుకొనేవారు. ఆ మేకపిల్ల చాల అందంగా ఉండేది. దానికి కూడా కొంతకు కొంత అర్థమయి ఉంటుంది. మేము చితిస్థలం వద్దకు వెళ్ళడానికి కిందికి రాగానే, అదివచ్చి మాకాళ్ళకు చుట్టుకొనేది. నేను దానిని ఎత్తుకొని చితి స్థలానికి తీసుకు వెళ్ళాను. అక్కడ నేను గీత పన్నెండవ అధ్యాయం పారాయణం చేయాలి. (ఈ పారాయణం తర్వాత రోజూ ఉదయం నియమమయింది.) నేను పారాయణం చేయబోగా, మేకపిల్ల అరవడం ఆరంభించింది. నేను దానిని కిందికి దించివేస్తుండగా, మీరాబహన్ దానిని నా చేతులలో నుంచి తీసుకుంది. నేను పారాయణం ప్రారంభించగానే, మేకపిల్ల ఎంతో శ్రద్ధతో వింటున్నట్టే శాంతంగా ఉండిపోయిందని మీరాబహన్ తర్వాత చెప్పింది.

స్నానానంతరం బాపూ చితిభస్మంతో నొసట తిలకం దిద్దుకున్నారు. "ఈ భస్మాన్ని నేను దుర్గ వద్దకు తీసుకొని వెళ్ళుతాను. ఆమె రోజూ దీనిని నొసట పెట్టుకోని" అన్నారు.

బ్రాహ్మణుడు వచ్చాడు. బాపూజీతో అపరకర్మ, పిండప్రదానం, తర్పణం మొదలయినవి చేయించాడు. శాంతిపాఠం చేశాడు. ఈ క్రియలు చేస్తున్నప్పుడు బాపూజీ ముఖం మహా గంభీరంగాను, బిగుసుకుని పోయినట్టు ఉండేదని తర్వాత సరోజినీనాయుడు నాకు తెలిపారు. నేను క్రియలు జరుగుతున్నప్పుడు వాటినే చూస్తున్నాను. శాంతిపాఠం అర్థం చేసుకోడానికి ప్రయత్నం చేస్తున్నాను. కనుక బాపూవైపు శ్రద్ధగా చూడలేదు. ఇరవై నిమిషాలలో క్రియాకలాపం పూర్తయింది. తండ్రి పుత్రునికి ఉత్తర క్రియలు జరపడం అన్నిటికన్నా దుఃఖకరమైన విషయం. మహాదేవభాయీ బాపూజీకి పుత్రునికన్నా కూడా హెచ్చు. కాని, బాపూజీకూడా సర్వసాధారణుడైన తండ్రియా? నిన్న ఆయన అన్నారు: "ఈశ్వరుడు నన్ను ఎలాటి ఒరపిడి రాయిపై పెట్టి రాస్తున్నాడు? నేను ఈ విషయాలతో విచలితుడిని అయితే, నా పని ఎలా జరుగుతుంది?"

మధ్యాహ్నం భోజన సమయంలో బొంబాయి గవర్నర్ నుంచి జాబు వచ్చింది. చాల పెద్దజాబు. దాని భాష కూడ ఉద్ధతం. "వల్లభభాయీని పంపడానికి వీలులేదు. పత్రికలు వగైరా సరఫరా చేయడానికి కూడా ప్రభుత్వం ఇంకా సంకల్పించుకోలేదు." ఇది దాని సారాంశం. నేను భయపడుతూ భయపడుతూ ఆ ఉత్తరం బాపూ ముందు పెట్టాను. దానివల్ల ఆయనలో ఎలాటి పరిణామాలు కలుగుతాయో ఎవరికి తెలుసు? కాని, ఇలాటి ఉత్తరం వస్తుందని బాపూ మొదటనే సిద్ధపడి ఉన్నారు.

నేడు సోమవారం; మౌనదినం. మధ్యాహ్నం మీరాబహన్ ఏమిటో అడిగింది. దానికి సమాధానంగా బాపూ "నేను ఉపవాసం గురించి ఆలోచించడం లేదు. బయట ఏమి జరుగుతున్నదో కూడ ఆలోచించడం లేదు. ఇక్కడ నేనేమి చేయాలి, ఏమిటి అభ్యసించాలి, మొదలయిన విషయాలే ఆలోచిస్తున్నాను" అని వ్రాసి చూపారు. ఈ మాటల వల్ల అందరికీ ఆశ్చర్యమూ కలిగింది; ఆశ్వాసనమూ లభించింది. మహాదేవభాయీని ఎప్పుడూ, బాపూజీ ఎప్పుడు ఉపవాసం ప్రారంభిస్తారో అనే చింతే తినివేసేది. ఆయన బ్రతికి ఉన్నప్పుడు బాపూ ఈ మాటలు అని ఉంటే ఆయనకు ఎంత సంతోషం కలిగేది! బాపూ ఇలాటి మాటలు నేడు వ్రాయడం బహుశా మహాదేవభాయీ మరణించడంవల్లనో ఏమో!

మహాదేవభాయీ మరణం తలచుకుంటే, రకరకాల ఆలోచనలు మనసులో తుపానులాగ చెలరేగుతాయి. ఆయన వ్యాధిని గురించిన విదానం విషయంలో సందేహమేమీ లేదు. అది స్టోక్స్ యాడమ్స్ సిండ్రోమ్ (హృదయానికి సంబంధించిన ప్రత్యేక వ్యాధి). కాని దానికి కారణమేమిటో గట్టిగా చెప్పలేము. ఎడ్రినేలిన్ ఇంజక్షన్ సరాసరి గుండెకే ఇచ్చి ఉంటే? ఈ శుష్క తర్క వితర్కంతో ప్రయోజనమేమిటి? శక్యమైన చికిత్స చేశాము. నేడు బాపూజీయే అన్నట్టు మన పరిస్థితిలో సాధ్యమైనంత మనం చేశాము. అయినా, ఇలాటి రోగికి జరుగవలసిన చికిత్స జరుగలేదనే కొదవ మాత్రం మనస్సు నుంచి తొలగడం లేదు.

బాపూజీ 'ముక్తధారా' చదవమన్నారు నన్ను. "నేను తర్వాతి పుటలలో గుర్తులు పెట్టాను; మొదటి పుటలలో పెట్టలేదు. నీవు నేను పెట్టిన గుర్తులు చూచి మొదటి పుటలలోను గుర్తులు పెట్టాలి" అన్నారు. నేను 'ముక్తధారా' చదివాను. చాల రంజకంగా ఉంది. బాపూజీ తత్త్వమంతా దానిలో నిండి ఉంది.

"మేమంతా మరణించినప్పటికీ మహాదేవభాయీ చితిస్థలం బాబలాకు మీరు చూపాలి!" అని నేను అన్నమాట జ్ఞాపకం ఉంది కాబోలు! మిస్టర్ కటేలీ చితిస్థలం నాలుగు మూలలలోనూ గుంజలు నాటి పగ్గాలు చుట్టించాడు, ఆ స్థలం సులభంగా తెలుసుకోడానికి గుర్తుగా.

నేడు నేను బాపూజీ పాదాలకు నూనెరాచి మాలిష్ చేసేటప్పుడు ఆయనతో అన్నాను "మహాదేవభాయీ బహుశా ఇక్కడే తిరుగుతున్నారేమో! మరణానంతరం కూడ ఆయన మీకు దూరంగా వెళ్ళలేరు." "నీవు మహాదేవ్ పుణ్యాత్ముడని ఒప్పుకుంటున్నావా? లేదా?" అని ప్రశ్నించారు ఆయన. "ఔను! ఒప్పుకుంటున్నాను" అన్నాను

మూలం :

**డాక్టర్ సుశీలానైయర్**

అనువాదం :

**తిరుమల రామచంద్ర**

# గాంధీజీ కారాగార గాథలు

నేను.

"అయితే అతని ఆత్మ ఎందుకు ఇక్కడ తిరుగాడుతుంది?" అన్నారు బాపూ.

"అయితే ఆయన మరొక జన్మ తీసుకోడానికి వెళ్ళారని మీరు ఒప్పుకుంటారా? ఒక శరీరం విడిపోతే, మరొక శరీరం సిద్ధంగా ఉందని పలువురు అంటారే?" అని అడిగాను.

బాపూ సమాధానం చెప్పారు: "ఆత్మ స్థూల శరీరం వదలిన తర్వాత లింగ శరీరం గ్రహించి ఇహలోకం నుంచి అన్యలోకాలకు వెళ్ళిపోతుందని అంటారు. చాలకాలం అక్కడ ఉండి, సమయం వచ్చినప్పుడు ఆ ఆత్మ మరల జన్మ తీసుకుంటుంది."

## సమాధియాత్ర

18, ఆగస్టు '42

ఉదయం— సాయంకాలం బాపూ మహాదేవ భాయీ సమాధి వద్దకు వెళ్ళుతున్నారు. బాపూ దీన్ని తీర్థయాత్ర అంటారు. వెళ్ళకపోతే, ఉండలేరు. వర్షంవస్తే గొడుగువేసుకొని వెళ్ళుతారు. నేను కొద్దిగా పూవులు తీసుకొని వెళ్ళుతున్నాను. మహాదేవభాయీ ఆఖరురోజు వాహ్యాళికి వెళ్ళినప్పుడు పూలతీగలు, మొక్కలు మొగ్గలతో నిండి ఉండడం చూచి, "ఇకపూవులు బాగాపూస్తాయి" అన్నారు. ఆ పూవులు ఇప్పుడు బాగా పూశాయి. కనుక కొద్దిగా తీసుకొని వెళ్ళుతున్నాను. మనిషి బతికి ఉన్నప్పుడు మనం గౌరవించము. మరణానంతరం అందరూ శ్రద్ధాంజలి సమర్పణకు తయారవుతారు. మహాదేవభాయీ విలువను ఆయన జీవించి ఉన్నప్పుడు కూడా గుర్తించాము. కాని, ఆయన విలువ పూర్తిగా తెలుసుకోలేదని ఆయన మరణానంతరం తెలుసుకొన్నాము.

సాయంకాలం సివిల్ సర్జన్ వచ్చారు. బాపూ స్నానాల గదిలో ఉన్నారు. సివిల్ సర్జన్ కాచుకొని కూర్చున్నారు. నేను ఇక్కడి మెడికల్ స్కూలును గురించి అడిగాను. ఆయన తెలుపుతున్నారు. కాని మాటల్లో అన్నారు: "ఇప్పుడు మా దృష్టి చదువు మీద లేదు. చదువు చెప్పడంలో ఆనందమే లేదు." నాకు అర్థమయింది; విద్యార్థులు లేనప్పుడు ప్రొఫెసర్లకు తమ ఉపన్యాసాలలో రసం ఏమిటి ఉంటుంది? బాపూ వచ్చారు. "ఎలా ఉన్నారు?" అని మాత్రమే ప్రశ్నించి సివిల్ సర్జన్ వెళ్ళిపోయారు.

మావద్ద కేలెండర్ లేదు. బాపూజీ ఆగస్టు 9 వ తేదీ, ఆదివారం పట్టుబడ్డారు. ఆ లెక్కన కేలెండర్ తయారు చేయవలసిందని బాపూ నాతో అన్నారు. నేడు ఉదయం కేలెండర్ తయారు చేయడానికి కూర్చున్నాను. బాపూజీ కూడా తోడ్పడ్డారు. నేను మూడుసార్లు కేలెండర్

తయారు చేయవలసి వచ్చింది. ఎక్కడో ఒక్క చోట తప్పు దొర్లేది. ఆఖరుకు ప్రార్థన తర్వాత కేలెండర్ తయారయింది. కేలెండర్ ప్రత్యేకంగా ఎందుకు అవసరమైనదంటే,కస్తూర్బాకు ఏకాదశి మొదలయినవి తెలుపడం కోసం.

19, ఆగస్టు '42

మహాదేవభాయీ సమాధికి నేను రోజా పుష్పాంజలి సమర్పించేదాన్ని. నేను మిస్టర్ కటేలీ వార్డరుకు చెప్పి ఆకునిండ పూవులు నింపి సిద్ధ పరిచారు. మిస్టర్ కటేలీపైనకూడ మహాదేవ భాయీ ఆకర్షణీయమైన వ్యక్తిత్వపు ప్రభావం ప్రత్యేకంగా పడింది. ఆయన తన విధ్యుక్తధర్మం నిర్వహిస్తూ, మాతో ఎంత సానుభూతి చూప వచ్చో, చూపేవారు. "మహాదేవభాయీ మరణ వార్తతో చాలమంది గుండెలు పగిలిపోతాయి" అనేవారు బాపూ.

ఈమాట అక్షరాలా నిజం. కొద్దిపాటి సహ వాసం ఉన్నవారికే ఆయన మరణంవల్ల ఇంత దుఃఖం కలిగినప్పుడు, సన్నిహిత మిత్రవర్గం పరిస్థితి,దగ్గరి చుట్టాల పరిస్థితి ఎలా ఉంటుందో ఎవరు చెప్పగలరు? బాపూ ప్రతిదినం స్నానం చేసిన తర్వాత మహాదేవభాయీచితిభస్మం నొసట ధరిస్తున్నారు. "శంకరుడు శ్మశాన భస్మం పూసుకునేవాడు. మానవుడు ఇలా చేయడం చూడలేదు!" అనేవారు బా. కాని బాపూజీ బాపూజీయే.

మేము మహాదేవభాయీ సమాధివద్ద భగవద్గీత పన్నెండవ అధ్యాయం పారాయణం చేస్తున్నాము. పారాయణం చేస్తున్నప్పుడు కళ్ళఎదుట చితిపై నిద్రిస్తున్న మహాదేవభాయీ లేచి నిలబడి నట్టు, మాతోపాటే నిలబడి పారాయణం చేస్తున్నట్టు తోచేది! పనిచేస్తున్నప్పుడైతే, తరచు ఆయన ఎదుట ఉన్నట్టే అనిపించేది. ఇది మంచిదే. మహాదేవభాయీ స్మృతి మా ఎదుట సదా సర్వకాలం నవనవోన్మేషంగా ఉండనీ! మనం ఆయన జీవితంనుంచి ఎల్లప్పుడూ పాఠాలు నేర్చుకుందాము! ఆయన సేవాభావం, భక్తి అందరికీ సర్వకాలం పదార్థ పాఠం కానీ!

"ఈ సంగతి ఇంతవరకు అన్నయ్యకు తెలిసిందో, లేదో, ఎవరికి తెలుసు?" అని అప్పుడప్పుడు అనిపించేది.

సాయంకాలం వాహ్యాళి వెళ్ళినప్పుడు బాపూజీ ఇలా అన్నారు: "మహాదేవ్ పేర యాభైవేల రూపాయల నిధి ఉంది. అది ప్రజలకోసం. దానికొక ట్రస్ట్ (ధర్మకర్తృ సంఘం) ఏర్పాటు చేయమని ఆయనను కోరాను. కాని, చేయలేకపోయాడు. ప్రజల సొమ్ము ఒక్క క్షణంకూడ మనవద్ద ఉంచుకోరాదని ఎప్పుడూ చెబుతూనే ఉన్నాను. ఎప్పుడు మృత్యువు వచ్చి అణగార్చి వేస్తుందో ఎవరికి తెలుసు? ఇలని విషయంలో అలాగే అయింది కదూ? ఇప్పుడు చిక్కు వచ్చింది. మహాదేవ్ తన కాయితాలలో దీనిని గురించి ఏమైనా వ్రాశాడేమో! ఇక్కడ ఉన్న అతని కాయితాలన్నీ చూడాలి. రామేశ్వరదాస్,బాబలా,దుర్గా—



పల్లె పడతులు చిత్రం—పిరిశెట్టి అచ్యుతరావు (కుని)

వీరినుంచి కూడా ఈ విషయమై కొంత అచూకీ తెలియవచ్చు. వారినీ అడగాలి. తర్వాత మరచి పోతానేమోనని ఈరోజు నీకు ఈ విషయం చెబుతున్నాను. మనలో ఒక్కరైనా విడుదలై వెలుపలికి వెళ్ళలేకపోతే, ఇతరులకు ఈ విషయం తెలియ దానికి ఇప్పుడే ఒక్క నోట్ (యాదాస్తు) తయారు చేసి పెట్టాలి."

నేడు మధురాదాస్‌భాయీ నుంచి ఉత్తరం వచ్చింది. మహాదేవ్‌భాయీ మరణంతో ఆయనకు పెద్ద ఆఘాతమే కలిగింది. "ఆయన జీవితం ధన్యం! కాని, త్వరగా దాటిపోయారు. ఆయనతో మీకు ఉన్న సంబంధంతో ఆయన స్థానం ఎవరు పొందుతారు? పరమ కారుణికుడైన బుద్ధునికి ఒక్క శిష్యుడుండేవాడు.అలాగే మీకుమహాదేవ్" అనిఆయన వ్రాశారు.మధురాదాస్‌భాయీదస్తూరీ మంచిది. "జబ్బు పడక ముందు మధురాదాస్ దస్తూరీ ఎంత మంచిదో అంత మంచిది ఈ ఉత్తరంలో" అన్నారు బాపూ. "మానవునికి తీవ్రమైన ఆఘాతం ఏర్పడినప్పుడు, క్షణంసేపు అతని శరీరంలో విశిష్టమైన శక్తి పుంజీభూత మవుతుంది" అన్నాను నేను. ఈశ్వరుని లీల అపారం.

20, ఆగస్టు '42.

నేను స్నానం చేసిన తర్వాత నేను, బాపూ

# ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక

ఆంధ్రప్రభ సచిత్ర వార పత్రిక 1964 ఆగస్టు 15 వ తేది సంచిక జన్మదిన సంచిక. బాల బాలికల ప్రత్యేక సంచికగా వెలువడుతుంది. ఈ సందర్భంలో లోగడవలెనే బాలబాలికల కథలపోటీ నిర్వహిస్తున్నాము.

## బాలబాలికల కథలపోటీ

మొదటి బహుమతి రు 100 లు

రెండవ బహుమతి రు 60 లు

మూడవ బహుమతి రు 40 లు

### పోటీ నిబంధనలు

పదహారు సంవత్సరాలలోపు బాలబాలికలు మాత్రమే పాల్గొనవచ్చు. స్వీయరచనలే కాని అనువాదాలు, అనుసరణలు పంపరాదు. రచన నాలుగు పావుతావు పేజీలకు మించరాదు. కాగితానికి ఒక ప్రక్కనే వ్రాయాలి. బహుమతి పొందని కథలను ప్రచురించే హక్కు మాకు ఉన్నది. కథలను పంపేటప్పుడు 'బాలబాలికల కథలపోటీకి' అని కవరుమీద స్పష్టంగా పేర్కొనవలసి ఉన్నది. కథలు త్రిప్పిపంపడం జరుగదు. కనుక స్టాంపులు పంపరాదు.

బహుమతి పొందిన కథలను బాలబాలికల ప్రత్యేక సంచికలో ప్రచురించగలము

**కథలు మాకు చేరవలసిన ఆఖరుతేది - 1964 జులై 15**

ఎడిటర్

## గాంధీజీ కారాగార గాథలు

పూవులుతీసుకునిసమాధికి బయలుదేరుతున్నాము. మీరాబహెన్ కూడా ఉదయమైతే వస్తున్నది. మిస్టర్ కటేలీ రెండుపూటలా(ఉదయం, సాయంకాలం) ఖైదీలతోపాటు రావడం జరుగుతున్నది. మిస్టర్ కటేలీ కొంచెం బెదురుతూ బెదురుతూ "ఇక్కడికి మూడు రోజులపాటు రావడానికి భండారీ సాహెబ్ అనుమతి ఇచ్చారు. ఇక రోజూ ఇక్కడికి రావడంలో ఇబ్బంది ఏర్పడుతుంది" అన్నారు. ఈ మాటలతో బాపూజీకి పెద్ద ఆఘాతం కలిగింది. అయితే,ఆయన విశాలహృదయుడు. కష్టాన్ని అణచుకుని, "అయితే, నేడు రావడం ఆఖరు రావడం" అన్నారు. ఈ మాటలకు మిస్టర్ కటేలీకి కష్టం కలిగిందేమో! "నేను పూవులు అక్కడికి పంపిస్తూ ఉంటాను. మీరు చెబితే స్వయంగావెళ్ళి సమాధికి అర్పించి వస్తూంటాను. ఫోనులో ఇలాటి మాటలు మాట్లాడడం వడదు గనుక భండారీసాహెబ్ నన్ను ఇంటికి పిలిపించారు. "ఈవిధంగా ముళ్ళతీగలకు వెలుపల రోజూ వెళ్ళనివ్వడం వల్ల ప్రమాదం ఏర్పడవచ్చు. ఈసారి ప్రభుత్వనైఖరి విభిన్నం" అన్నారు. ఆ మాటలకు బాపూ "నిజమే. అది నాకు తెలుసు. నేను మిమ్ముల్నిగాని, భండారీనిగాని కష్టంలో పడవేయ దలచుకోలేదు. కాని, భండారీకి ఇబ్బంది లేకపోతే, ఈ విషయమై తప్పక పోడిగించ దలచుకున్నాను. ఆయన ఏ హద్దువరకు వెళ్ళుతారో సూచనచేస్తే మంచిది. ఈ సమాధికి నాలుగు వేపులా మీరు రాళ్ళు పెట్టించారు. ఈ విషయం కూడా ఆక్షేపించవచ్చునని నేనంటాను" అన్నారు.

మిస్టర్ కటేలీ గప్‌చిప్‌గా వింటున్నారు. బాపూ మళ్ళీ అందుకుని, "నేను అనే ప్రతిమాట ఈశ్వరుడే పలికిస్తున్నాడని నేను నమ్ముతున్నాను. లేకపోతే, నేనెంతటివాడిని? దుర్బలుడైన మానవుణ్ని! ఇంత పెద్ద సామ్రాజ్యంతో యుద్ధంచేసే శక్తి నాకు ఉందా? కర్రకూడా చేతిలోలేని హిందూస్తాన్ ప్రజలకు ఇలాటి శక్తి ఎక్కడిది?" అన్నారు.

మిస్టర్ కటేలీ సమాధి నాలుగు వైపులా చిన్న చిన్న గోడలు కట్టించారు. చితి స్థలంలో రాయి పెట్టించారు. కస్తూర్బా దానిని చూచి "ఇదేమిటి గోరీలాగ తయారయిందే?" అన్నారు. అందరూ నవ్వారు. ఆమె చెప్పింది నిజమే. దాని ఆకారాన్ని బట్టి ఎవరైనా దానిని ఏదో గోరీ అనుకుంటారు. కాని, చితిస్థలం అని గుర్తుగా ఉండాలనే మొదట్లో ఏదోచిహ్నం పెట్టదలచడం.

21, ఆగస్టు '42

ఈరోజు బాపూ వ్రాసి చూపించారు, సోమవారం సాయంకాలం ఆరుగంటల వరకు మౌనం ఉంటుందని. అంతా కలిపితే 91 గంటల మౌనం అవుతుంది. నాకేమో బాగనిపించలేదు. కాని ఏమన్నా ప్రయోజనం లేదు. ప్రార్థన తర్వాత బాపూ పడుకున్నారు.

ఉపాహారానంతరం మేము రోజులాగే పూవులు తీసుకొని సమాధి వద్దకు వెళ్ళాము. తీగల దర్వాజా తెరిచే ఉంది. కాని మేము దానిని దాటి వెలుపలికి వెళ్ళలేదు. వార్డర్ పూవులు తీసుకొని వెళ్ళాడు. మేము దర్వాజాకు ఇవతల నిలబడి భగవద్గీత పారాయణం చేశాము. సాయంకాలం కూడా పూవులు తీసుకొని వెళ్ళాము. ఈసారి దర్వాజా తెరిచి ఉండలేదు. తీగల సందునుంచి వార్డర్ పూవులు తీసుకొనివెళ్ళి సమాధికి అర్పించాడు.

బాపూ మౌనంతో మాకు ఊపిరి ఆడడం లేదు.

సాయంకాలం మేక పాలు పిండడం నేర్చుకున్నాను. నాకిప్పుడు పూర్తిగా పనే అయింది: ఉదయం నాశ్తా (ఉపాహారం) తయారుచేయడం, వాహ్యాళి తర్వాత ఉదయానికి కూర వండడం, బాకు మాలిష్ చేయడం, బాపూజీకి మాలిష్ చేయడం, గుడ్డలు ఉతకడం, బాపూ భోజనం తీసుకొని రావడం, పాత్రలు కడగడం, మధ్యాహ్నం బాపూజీ కాళ్ళు రుద్దడం, సాయంకాలానికి కావలసిన కూర వండడం, సాయంకాలం మేకపాలు పితకడం, పండ్లరసం పిండడం, పాత్రలు కడగడం, రాత్రి బాపూ తల, పాదాలు తోమడం, పిసకడం. నేను భోజనం తీసుకొని రావడం సాయంకాలంనుంచే ప్రారంభించాను.దినమంతా పనిలో గడచిపోతుంది. ఇది నాకెంతో బాగనిపించింది.వ్యర్థమైన ఆలోచనలకు, వ్యర్థమైన మాటలకు అవకాశం ఉండదు. ఉదయం, సాయంకాలం వాహ్యాళిలో మహాదేవభాయీసంగతులే వచ్చేవి. బాపూజీకి ముందే వెళ్ళిపోయిమహాదేవభాయీబాపూజీకిపూజ్యులయ్యారు.

(తరువాయి 57 వ పేజీలో)

# గాంధీజీ కారాగార గాథలు

(8 వ పేజీ తరువాయి)

భగవంతుడు భక్తపరాధీనుడు గదా! కనుక బాపూ భక్తుని సమాధికి నమస్కరించారంటే ఆశ్చర్యమేమిటి?

నేడు మధ్యాహ్నం "సిల్వర్ స్ట్రీమ్" పూర్తి చేశాను.

కస్తూర్‌బా అన్నారు: "చూడు సుశీలా! మహాదేవ్ వెళ్ళిపోయారు. బ్రాహ్మణుడు మరణించాడు. అపశకునం కాదూ? ఇంత పెద్ద అధికారాన్ని బాపూ ఎదిరిస్తున్నారు. ఎలా గెలుస్తారు?" బాపూ ఈ మాటలు విన్నారు. "నేను దీనిని శుభ శకునంగా భావిస్తున్నాను. పరిశుద్ధమైన బలిదానం జరిగింది. దీని ఫలితం— పరిణామం— అశుభం కాజాలదు." అన్నారు.

## పుణ్యస్మరణం

22, ఆగస్టు' 42

మహాదేవభాయి వెళ్ళిపోయి నేటికి వారం పూర్తయింది. నేడు సరోజినీనాయుడుకూడా తీగల వరకు వచ్చారు. ఆమె ఆరోగ్యం సరిగా ఉండడంలేదు. అందువల్ల ఆమె రోజూ కిందికి దిగరు. వారానికి ఒక్కసారి కిందికి దిగదలచారు.

బాపూ మౌనం అవలంబించారు. నేను 24 గంటలు ఉపవాసం చేశాను. గీతాపారాయణం చేశాను. గీతాపారాయణం మంత్రం నాకు మహాదేవభాయీ నుంచి లభించింది. ప్రతి శని వారం ఉపవాసం ఉండి, గీతాపారాయణం చేద్దామనుకున్నాను.

అణేసాహెబ్ (అనే) నుంచి సానుభూతి తెలిపే తంతి వచ్చింది. "వేంకొలదీ తంతులు, ఉత్తరాలు వచ్చి ఉంటాయి. వాటిలో మధురాదాస్ ఉత్తరం ఒక్కటి, అణేజీ తంతి ఒక్కటి మనకు అందజేశారు. ఎందుకంటే మధురాదాస్ బొంబాయి మేయరుగా ఉండినవారు, బొంబాయి ప్రభుత్వంలో అందరినీ ఎరిగినవారు. అణేజీ, అయితే ఇప్పుడు సర్కారువారే" అన్నారు బాపూ.

బాపూజీ మౌనం వాతావరణం ఊపిరి ఆడనివ్వనంత దారుణంగా పరిణమించింది.

"విమెన్ కాల్డ్ వైల్డ్" చదువుతున్నాను. హాలిడే హటీట్ వర్ణన బాపూజీకి చదివి వినిపించాను. బాగుంది.

23, ఆగస్టు' 42

బాపూ ఇక్కడికి వచ్చి నేటికి రెండు వారాలు పూర్తయాయి. మహాదేవభాయీ ఇక్కడ ఒక్క వారమైనా గడపలేదు!

నేడుకూడా బాపూ మౌనం పాటించారు. ఇది నాకు మనస్కరించలేదు. రాత్రి ఎనిమిది గంటలకు బాపూజీ రక్తపుపోటు చూశాను. సరిగా ఉంది— 156—96, నాడి 66.

నేడు ఉదయం పూనా కలెక్టర్, ప్రాల్ అనే కొత్త సివిల్ సర్జన్ వచ్చారు. ఇద్దరూ బుంగమూతి పెట్టుకున్నారు. యంత్రాలలాగ "మీరు ఎలా ఉన్నారు?" అని ప్రశ్నిస్తూ తిరిగారు. సరోజినీనాయుడు "నా ప్రకృతి మామూలు లాగే ఉంది" అన్నారు.

బస్! ఇద్దరూ ఆ మాట పట్టుకున్నారు. అందరినీ ఆ మాటే అడుగడం ప్రారంభించారు. బాపూను కూడా ఆ మాటే అడిగారు. సరోజినీ నాయుడు తన గది ఎంతో చక్కగా అలంకరించారు. తాజా పూవులు తెచ్చి పెట్టారు. కాని, వారు ఒక్క నిమిషంకూడ గదిలో కూర్చోలేదు; మాట్లాడలేదు. సరోజినీ నాయుడుకు చాల కష్టమనిపించింది. వారి ప్రవర్తన ప్రతి వారికీ కష్టమనిపించింది.

మహాదేవభాయీ మరణ వార్తతో అన్నయ్య, దుర్గాబహెన్, బాబలాలపరిస్థితి ఏమిటి? అన్నయ్య ఏమనుకొని ఉంటాడు? ఈ పోరాట పరిణామం ఏమిటి? దీనిలో ఎవరెవరిది అంతిమాహుతి? ఇంత జరిగినా, ఆఖరుకు బాపూజీకి విజయం లభిస్తే చాలు— రోజంతా ఈ ఆలోచనలే తలలో తిరుగుతున్నాయి.

24, ఆగస్టు' 42

నేటికి పదిరోజులు పూర్తయాయి. ఉదయం, సాయంకాలం మేము పూవులు తీసుకొని వెళ్ళి ముళ్ళతీగలవద్ద నిలబడేవారము. వార్డరు మా చేతులలోని పూవులు తీసుకొని సమాధికి అర్పించేవాడు. పూవులు గాలికి ఎగిరిపోయేవి. అందువల్ల వార్డరు సమాధి తలవద్ద, పాదాలవద్ద రాళ్ళు నిలబెట్టి చిన్నగాడిలాగ, గుహలాగ చేశారు. ఒక వైపు నుంచిచూస్తే, అది మహాదేవభాయీ మందిరం లాగ కనిపించేది. మరొకవైపునుంచి చూస్తే, ఏదో శవం పడినట్లు, కాళ్ళు, తల పైకి లేచినట్లు కనిపించేది. ముళ్ళ తీగలకు, చితిస్థలానికి మధ్య ఒకటి రెండు పొదలవంటి గుబుర్లు ఉండేవి. సమాధిస్థలం చూడడానికి అడ్డని వాటిని మిస్టర్ కటేలీ కొట్టించి వేశారు. ఇప్పుడు తీగలనుంచే పూర్తి దృశ్యం కంటబడుతుంది. తీగల లోపలనుంచే బాపూ మహాదేవభాయీకి పుష్పాంజలి సమర్పించడం భావి చిత్రకారులెవరికైనా చిత్రించడానికి మంచి విషయం.

సాయంకాలం ఆరుగంటలకు బాపూ మౌనం పూర్తయింది, 91 గంటల తర్వాత. ఎంతో హాయి అనిపించింది.

దైవం మహాదేవభాయీకి మరి పదిపదిహేను సంవత్సరాలు ఆయుష్షు ఇచ్చిఉంటే, ఏమి పోయేదవి నేడు నా మనస్సులో అభిప్రాయం కలిగింది. బాపూతోపాటు వాహ్యాళి వెళ్ళినప్పుడు ఈ ఆవేదనే నా ముఖంనుంచి వెలువడింది. తర్వాత, సాయంకాలం బాపూ "మహాదేవ్ పని పూర్తయింది. అతడు 50 సంవత్సరాలలో నూరు సంవత్సరాలపనిని పూర్తి చేశాడు. మరి ఎందుకు ఆగుతాడు? భగవంతుడు అతనిని ఎందుకు ఆగనిస్తాడు?" అన్నారు.



కోతి, నాతి

చిత్రం—జె. కిరీటి (కారెంపూడి)

మేము లైబ్రరీ నుంచి పుస్తకాలు తీసుకోవచ్చునని మిస్టర్ కటేలీ నేడు కబురు తెచ్చారు. పుస్తకాలు తీసుకోడానికి వీలులేదని మొదట తెలిపారు. "తాము ఇంత దిగజారిపోతున్నామేమిటని తర్వాత వారు సిగ్గుపడి ఉంటారు!" అన్నారు బాపూ.

నేడు కూడా అన్నయ్య ఇక్కడికి వచ్చే కబురేమీ లేదు. మహాదేవభాయీ వెళ్ళిపోయిన తర్వాత, అన్నయ్య త్వరగా వస్తాడనే మనస్సుకు తోచేది. కాని, రోజులు గడిచిన కొద్దీ, అన్నయ్య వచ్చే ఆశ తగ్గిపోసాగింది. మనస్సులో చింతకూడ బయలుదేరింది ఆయన పరిస్థితి ఏమిటోనని? ఉపవాసం ఏమైనా ప్రారంభించాడా? అందుకోసమే వీరు ఇక్కడికి తీసుకొని రావడం లేదేమో!

25, ఆగస్టు' 42

కొన్ని రోజులుగా బాపూజీకి కూడ మేడమీదే వండేదాన్ని. బొగ్గులు తక్కువగా ఉండడం వల్ల ఈ రోజునుంచి కింద వంటసాలలోనే వండడం మొదలు పెట్టాము. మహాదేవభాయీ వంటసాల నుంచే వండితెచ్చేవారు. ఉదయం నేను మాలిష్‌లో ఉంటాను. కూరగాయలు తరిగి పాత్రలో వేసిపెడతాను. వంటచేసే ఖైదీ ఆ గిన్నె తీసుకొని వెళ్ళి పొయ్యిమీద ఎక్కించేవాడు. రెండు మూడురోజులపాటు నేను వంట వగైరా చూడడానికి వెళ్ళాను. ఇప్పుడు, బాపూజీ మాలిష్ అయిన తర్వాత, ఆయన కమోడ్‌పై వెళ్ళినప్పుడు నేను పొయ్యిమంట

చూసి వస్తాను. బాపూ స్నానానికి బయలు దేరినప్పుడు, వంటచేసే ఖైదీ కూర పైకి తీసు కొని వచ్చేవాడు. నేను ఆ సమయంలో స్నానాల గదిలో ఉన్నాను. "చూడు సుశీలా! బాపూ భోజనం ఇప్పుడు ఖైదీలు తెస్తున్నారు. మహా దేవ్ ఉంటే, అతనే తెచ్చేవాడు" అంటున్నారు కస్తూర్బా.

నిన్న రాత్రంతా నాకు నిద్రలేదు. మనస్సులో రకరకాల ఆలోచనలు:— నేను బాపూ వద్ద ఉన్నాను. ఎన్ని రోజులు ఉంటానో ఎవరికి తెలుసు? ఈ ఆలోచన రాత్రి చీకటిలో ఉగ్ర రూపం దాల్చింది. మహాదేవభాయీ మరణ దృశ్యం ఇంత వరకు కళ్ళముందు నుంచి తొలగ డమే లేదు. ఈ రెండూ నా నిద్రను మింగి వేశాయి.

వాహ్యాళి వెళ్ళినప్పుడు మహాదేవభాయీ ప్రస్తావనే ఇంకా. "ఈ విషయంలో ఇక నీవు ఆలోచనలు చేయుగూడదు. మహాదేవ్‌ను గురించికాని, స్వాతంత్ర్య సమరం గురించికాని, నా గురించికాని చింత పడకూడదు. నేను కావాలని చావదలచుకోను. కాని, అలాటి పరిస్థితి వస్తే ఏమి చేస్తానో చెప్పలేను. నీవు తప్పక ఆలోచించవలసిందే. కాని, ఆ ఆలోచన కార్య రూపం దాల్చకపోతే నిష్ప్రయోజనం. అందు వల్ల నీవు ఏదైనా వ్రాయాలని నేను కోరు తున్నాను. 'మానే శిఖామన్' (తల్లికి శిక్షణ) అనే పుస్తకమొక్కటి గుజరాతీలో చూచాను; అది మంచి పుస్తకం; అలాటి పుస్తకం నీవు వ్రాయాలని ఇంతకు ముందు ఒకసారి నీతో అన్నాను. అలాటి పుస్తకంవల్ల చెల్లెండ్లకు, పిల్లలకు తమ స్వాస్థ్యానికి సంబంధించి అత్యవ సరమైన జ్ఞానం కలుగుతుంది. నేను కూడా వ్రాయడం మొదలు పెడతాను. నోటు పుస్తకాలు తెప్పించు" అన్నారు బాపూ.

26, ఆగస్టు '42

నేడు భండారీ వచ్చారు. "మీరు ఏ యే పుస్తకాలు తెప్పించదలచారో నాకు తెలుపండి. నేను ఖరీదుచేసి పంపిస్తాను. తర్వాత ఆ పుస్త కాలు జెయిలు లైబ్రరీకి ఉపయోగపడు తాయి" అని ఆయున మాతో అన్నారు. ఆయన చాల పుస్తకాలు, ఆరోగ్య సంబంధమైన పత్రి కలు తెచ్చారు.

సాయంకాలం బాపూ పక్కమీద వాలారో లేదో, మిస్టర్ కటేలీ బొంబాయి ప్రభుత్వం హోమ్‌శాఖ కార్యదర్శి పంపిన ఉత్తరువుతో వచ్చారు. బాపూజీకి పత్రికలు అభిస్తాయని, ఆయన ఏ యే పత్రికలు కావాలో జాబితా వ్రాసి యివ్వాలని, మేము మా ఇంటివారికి ఇంటి సంగతులను గురించి ఉత్తరాలు వ్రాసుకో వచ్చునని ఆ ఉత్తరువులో ఉంది.

బాపూ రాత్రి బాగా నిద్ర పోలేకపోయారు. ఏ షరతులమీద ఉత్తరాలు వ్రాయడానికి అనుమతి లభించిందో, ఆ షరతులు ఆయనకు నచ్చలేదు.

# గాంధీజీ కారాగార గాథలు

బాపూ నేడు "ఆరోగ్య కీ చాబీ" (ఆరోగ్య కుంచిక) అనే పుస్తకానికి ప్రస్తావన వ్రాశారు. ఇది బాపూజీ వ్రాసిన "గైడ్ టు హెల్త్" అనే పాత పుస్తకం పునః ప్రచురణ కావచ్చు. "నేను వ్రాసేవన్నీ నీవు చదువవలసి ఉంది. ఏమైనా సూచనలు ఇచ్చేటట్లయితే, ఇవ్వు. అంతేకాక ఇది నీ విషయం. దీనిని నీవు మహాదేవ్ కంటే కూడా చక్కగా చేయగలవు" అన్నారు బాపూ.

నేడు మహాదేవభాయీ బ్రతికిఉంటే, పత్రి కలు సరఫరా అవుతాయనే వార్తకు, బాపూ ఒక పుస్తకం వ్రాస్తున్నారనే సంగతికి ఎంత సంతోషించేవారో!

బా ఆరోగ్యం చాల బాగుంది. బాపూతో పాటు ఉదయం, సాయంకాలం అరగంట, ముప్పావుగంట వడిగా నడిచివస్తున్నారు. కాని, ఊపిరి సలుపుకోలేరు. నేను ఒకటి రెండుసార్లు చెప్పానుగూడ ఇది మంచిదికాదని, తక్కువ దూరం నెమ్మదిగా నడవాలని. అయితే, బా కాని, బాపూజీ కాని నా మాట వినడానికి సిద్ధంగా లేరు.

నేడు నా కన్ను ఎందుకో చాల నొచ్చింది.

27, ఆగస్టు '42

నేడు బాపూ మాకు కావలసిన పత్రికల జాబితా ప్రభుత్వానికి పంపారు. దినపత్రికలు, వారపత్రికలు, మాస పత్రికలు మొత్తం కలిపి 16 పత్రికలు జాబితాలో ఉన్నాయి. తర్వాత బొంబాయి ప్రభుత్వానికి ఉత్తరం వ్రాశారు. తాము సంవత్సరాలుగా ఇల్లు వదలి ఆశ్రమవాసి అయ్యామని, అందువల్ల ప్రభుత్వం తెలిపిన షరతులపై ఉత్తరాలు వ్రాయడానికి పొందిన అనుమతిని ఉపయోగించుకోలేమని ఆ ఉత్తరంలో తెలిపారు. ఆ ఉత్తరంలో అన్నయ్య సంగతి కూడా ప్రస్తావించారు. "ప్యారేలాల్‌ను నా వద్దకు



దిగులు

చిత్రం—[illegible], సుగుణ (కరీంనగరం)

పంపడానికి మీరు సిద్ధంగా ఉన్నారు. కాని, అతనిని ఇంతవరకు ఇక్కడికి పంపలేదు. ఇంత జరిగినమీదటకూడా నేను అతనికి ఉత్తరం వ్రాయలేకపోతే, ఉత్తరాలు వ్రాయడానికి ఇచ్చిన అనుమతివల్ల నాకేమిటి ప్రయోజనం? దుర్గా బహన్ మొదలయినవారికి ఉత్తరాలు వ్రాయ లేను. నావల్ల చికిత్స పొందుతున్న వల్లభ భాయి ఆరోగ్యం గురించి అడగలేను. మరి ఎవరికి ఉత్తరం వ్రాయను?" అని ఆ జాబులో తీవ్రంగా ప్రశ్నించారు.

రాత్రి వైస్‌రాయ్‌నుంచి జాబు వచ్చింది. భాష తియ్యగా ఉంది. కాని, అసలు జవాబు పూర్తిగా నిరాకరణమే. మీరాబహన్ భాషను ప్రశంసించింది. బాపూజీకి కూడా తియ్యని భాష మంచిదనిపించింది; కాని, వీరు (ప్రభుత్వాధి కారులు) ఎలాటి ఖర్చు లేకుండా తియ్యని భాష వాడేచోట వాడుతారు అన్న సంగతి మాకు తెలుసు.

28, ఆగస్టు '42

బాపూ అరబ్బీ ప్రయిమర్, రెండు ఉరుదూ పుస్తకాలు జెయిలునుంచి తెప్పించారు. ప్రతిదినం అరబ్బీ, ఉరుదూ, ఖురాన్ షరీఫ్, బైబిలు— నియతంగా నేర్చుకొనేవారు. ఉరుదూ చదివేటప్పుడు నన్నుకూడా తమతోపాటు కూర్చో పెట్టుకొనేవారు. నేడు ఆయనకు డిక్టేషన్ చెప్పి వ్రాయించాను.

వాహ్యాళిలో, కూడా బాపూ ఏదో ఆలోచనలో నిమగ్నులై ఉండడం నాకు బాగనిపించలేదు. ఎందుకంటే ఆయన పగలంతా ప్రాయశః ఊరికేనే కూర్చుని ఉంటారు. అయితే, నే నేమిటి మాట్లాడను? మహాదేవభాయీకి చాల విషయాలు తెలుసు. నా జ్ఞానమెంత? అందు వల్ల నేను ఉదయం వాహ్యాళిలో భగవద్గీత పన్నెండు, పదమూడు అధ్యాయాల శ్లోకాల అర్థం చెబుతూ నడిచాను.

సాయంకాలం వాహ్యాళిలో మిస్టర్ కటేలీ మాతోపాటు వచ్చారు. బాపూ ఆయనకు చంపారణ్యం సంగతులు చెప్పారు. ఆయన కొద్ది మాటలలో చంపారణ్య సత్యాగ్రహం చరిత్రంతా కటేలీకి చెప్పారు. భారతదేశంలో బాపూ తొలి సమరం అదే.

సాయంకాలం ప్రార్థనతర్వాత రామాయణంలో అర్థంకాని విషయం బాపూను అడిగేదాన్ని. ఆయన దానిని ఎంతో రసవంతంగా వివరించే వారు. "రామాయణం మన ఆహారం. దాని భాష ఎంతో మధురం. అందువల్లనే ఎన్నిసార్లు చదివినా విసుగు రాదు; అరుచి పుట్టదు" అంటారు ఆయన.

నేడు ఉదయం కొళాయి నీరు ఆగి పోయింది. అందువల్ల బాపూ రాత్రి పడుకొనే ముందు స్నానం చేశారు. దీనివల్ల పడుకోడం ఆలస్యమయింది.

బాకు గుండెలో కొంచెం నొప్పివచ్చింది.

# ఉత్తరాలు

(2 వ పేజీ తరువాయి)

అనంతపురంలో జరిగిన ఆంధ్రనాటకకళాపరిషత్తులోనూ ప్రదర్శనకు, రచనకు, నటనకు ఉత్తమ బహుమతులు పొందిన విద్యానగర్ కల్చరల్ అసోసియేషన్ (హైదరాబాద్)లో నటులందరూ ఎం.ఎ.లు, బి. ఎల్.లూను. ఈ సమీక్షలో సావిత్రి గారికి సువర్ణకంకణాలిచ్చి, అద్దంకి వారికి కాశ్మీరు శాలువలిచ్చి బహూకరించిన చర్యలో—ఈ నాటక పోటీలు జరిపేవారికి నాటక కళంటే ఎంత అభిమానముందో అర్థమవుతుంది. మొన్న అనంతపురం పరిషత్తులోనూ ఇలాంటిదే జరిగింది.

—కె. రామారావ్
(కాకినాడ)

* * *

'శంఖుతీర్థం' సీరియల్ సమాప్తమయేసరికి ఈ ఉత్తరము వ్రాయాలనిపించింది. 'చక్రభ్రమణం', 'శాంతినికేతనం' నవలలకంటే 'శంఖుతీర్థం' ఎంతో బాగుందని చెప్పేందుకు సాహసిస్తున్నా. అలా అని వాటిని కించపరచడము కాదు. మునుపు వ్రాసిన రెండు నవలలు మణిపూసలైతే ఇది ఆణిముత్యం. గ్రామములలోని పెద్దమనుషుల వ్యవహారాలను, కుళ్లను, కులతత్వాలను, పార్టీల పేరుతో జరిగే ఘోరాలను వాస్తవికంగా చిత్రీకరించి గ్రామాభ్యుదయానికి దోహదమిచ్చునట్లు కథా వస్తువును ఎన్నుకొనుట ప్రశంసనీయము.

మరణ సన్నివేశముతో మంగ పాత్ర పాఠకుల సానుభూతిని చూరగొన్నది. వందనాదేవి పాత్ర చెరగని ముద్ర. మాధవయ్య పాత్ర చివర వరకు ఎలా పోషింపబడుతుందో అనుకుంటున్న పాఠకులకు చక్రధరం స్వప్నముతో ముగింపు కూడ తెలిసిపోయింది.

ఆశ్రమ వర్ణన, సంస్కృత శ్లోకాలు ప్రత్యేక ఆకర్షణ. 'శంఖుతీర్థం' సీరియల్‌లో మాధవయ్యచేత శ్లోకాలు పలికించినపుడంతా సుమారు ఆరు సంవత్సరాల క్రితము కోడూరి కౌసల్యాదేవిగారు రచించిన 'దేవాలయం' కథానికలో (11—6—58 ఆంధ్రప్రభ సచిత్ర వార పత్రికలో ప్రచురింపబడినది) రచయిత్రి చొప్పించిన శ్లోకాలు జ్ఞప్తికి వచ్చినాయి.

ప్రభ రాగానే బొమ్మలు కూడ చూడకుండ చదివింపచేసి, చదివినంతసేపు పాఠకులను ఆకట్టుకునే విధముగా రచించిన కుమారి కోడూరి కౌసల్యాదేవిగారికి నా హృదయపూర్వకమైన అభివందనములు.

—కె. భార్గవి
(తిరుపతి)

* * * *

కుమారి కోడూరి కౌసల్యాదేవిగారు రచించిన 'శంఖు తీర్థం' సీరియల్ పూర్తిగా చదివాను. కథ చాలా రసవత్తరంగా నడిచింది. ముగింపులో మాత్రం అందరినీ చంపకుండా దుర్మార్గులనే అంతమొందించి వందనతోపాటు చక్రధరం తల్లిని కూడా బ్రతికించి ఉంటే న్యాయం చేకూరేదేమో? రచయిత్రి చక్కటి శ్లోకాలతో సహజ సిద్ధంగా అనుభవ పూర్వకంగా వ్రాయగలిగినందుకు ధన్యవాదాలర్పించకపోతే తప్పిదమని భావిస్తాను.

—డేవిడ్ మరియన్
(బిలాస్‌పూర్)

* * * *

'శంఖు తీర్థం' నవల ఆమూలాగ్రం చదివాను. నవల సమాప్తమయిందంటే ఎవరినో సన్నిహితుణ్ణి కోల్పోయినట్లనిపించింది.

ఒక ఉత్తమ నవలకు ఉండవలసిన సర్వ లక్షణాలు 'శంఖు తీర్థం' కలిగి ఉత్తమ నవల అనిపించు కొంటుందనుటలో ఆశ్చర్యం లేదు.

ఇంత మంచి నవలను ప్రచురించిన వారు ధన్యులని వేరే చెప్పనక్కర లేదు. రచయిత్రికి నా 'వందన' శతములు.

—ఆర్. భూపాల్‌రెడ్డి
(ధర్మపురం)

* * * *

'శంఖంలో పోస్తేగానీ తీర్థంకాదు. కష్టాలలో మునిగి తేలనిదే మానవ జీవితం కాదు!' అనే జీవిత సత్యాన్ని తెలియజేసే విధంగా భావగర్భితమైన శీర్షికగల 'శంఖు తీర్థం' సీరియల్ అతి సహజంగా ఉండి పాఠకులలో వారం వారం చదవాలనే ఆసక్తిని పెంపొందించిందనటంలో అతిశయోక్తి లేదు.

తీసుకున్న కథావస్తువులో నూతనత్వం లేకపోయినా ఎంతో నేర్పుగా చిత్రీకరించారు రచయిత్రి. ముఖ్యంగా ముగింపు నన్నాకర్షించింది.

—కుమారి ఎ. పద్మావతి
(కాకి) ★

## మీకు తెలుసా?

### జవాబులు

1. దక్షిణ, ఉత్తర రోడీషియాలు, న్యాసాలాండు.

2. (అ) జాన్ వాకర్ (ఆ) 1827.

3. 100 మైళ్లు.

4. ఆల్సేస్ లోరెయిన్.

5. కాస్మీ ఫంక్.

6. దానిని కనుగొన్నవారు హెన్రీ హడ్సన్ (1611లో.) ★

---

నేడు వాహ్యాళికి రాలేదు. నిన్న నేను వద్దన్నప్పటికి 55 నిమిషాలు బాపూతోపాటు వడిగా నడిచారు. దానివల్లనే ఈ నొప్పి కాబోలు!

29, ఆగస్ట్ 42

బాపూ తరచు బెల్లం తినేవారు. బజారు బెల్లంపైన ఈగలు, దోమలు ముసురుతాయి. కనుక బజారు బెల్లం వేడిచేసిశుద్ధిచేస్తారు. దానిలో మట్టిబెడ్డలు, గడ్డిముక్కలు కూడా ఉంటాయి. అందువల్ల మొదట బెల్లాన్ని నీటిలో కరిగించి, గాలించి మట్టిబెడ్డలు మొదలయినవి తీసివేసి, పొయిమీద పెట్టి వేడిచేసి నీటిని ఇగిరించేవారు. దీనివల్ల బెల్లం శుభ్రమూ అవుతుంది, శుద్ధమూ అవుతుంది. నేను బెల్లం కాచేటప్పుడు నీటికి మారు పాలు పోశాను. మంచి టాఫీ (ఒక ఇంగ్లీషు మిఠాయి) లాగ తయారయింది.

నాకు చదవడానికి తీరిక తక్కువగా దొరుకుతూంది. ఉదయం ప్రార్థన తర్వాత పడుకోకపోతే, ఒక గంట తీరిక ఉంటుంది.

నేడు శనివారం. మహాదేవభాయి మరణించి రెండు వారాలు పూర్తయాయి. నేను ఉపవాసం చేయదలచాను. కాని, బాపూ వారించారు. "ఇలా చేయడంవల్ల, మరణించిన వ్యక్తికి న్యాయం చేయలేము. ఒకవిధంగా అతనిని మనం కట్టేసుకుంటాము" అని అన్నారు ఆయన. తర్వాత మహాదేవభాయి మృత్యువుకు కారణాలు ఏవి అయి ఉంటాయని చర్చచేశారు. అందువల్ల నేడు భగవద్గీత పారాయణం జరగలేదు. నాకు ఈ సందర్భంలో పాత విషయం జ్ఞాపకం వచ్చింది. జమనాలాల్‌జీ ఒకరోజు ఇలాగే కూర్చున్నారు. "ఇది పునర్జన్మకు సంబంధించిందే. లేకపోతే నీ వెక్కడ? మేమెక్కడ? బాపూ ఎక్కడ?" అన్నారు. నిజం. మనమంతా ఎలా ఇక్కడ చేరాము!

రాత్రల్లా వానకురిసింది. ఉదయంకూడా కొద్దిగా జల్లు పడుతూనే ఉంది. అయినా, బాపూ మహాదేవభాయీ సమాధికి పుష్పాంజలి సమర్పించడానికి వెళ్ళనే వెళ్ళారు. వెళ్ళడం ముళ్ళ తీగల వరకే. అక్కడ గొడుగులకింద నిలబడి భగవద్గీత పారాయణం చేశారు. తర్వాత తిరిగివచ్చి పైన వరండాలో అటూ ఇటూ తిరిగారు.

నేడు ఖైదీమంటవారు—ముగన్, భూదా—ఇద్దరూ రాలేదు. వారిని గడువుకు ముందే విడుదలచేశారట. జైలులో రాజకీయ ఖైదీలకు స్థలం అవసరముంది.

(సశేషం)

# కొత్త పుస్తకాలు

## కవిరాజ దర్శనం

[వ్యాససంపుటి. ప్రచురణ: కవిరాజ సాహితీ సమితి, విజయవాడ-2. క్రౌన్ 840 పుటలు. వెల ఆరురూపాయలు.]

హేతువాదానికి ఆంధ్ర దేశంలో పతాకవంటి వారు కవిరాజు శ్రీ త్రిపురనేని రామస్వామి చౌదరి గారు. పుక్కిటి పురాణాలను నమ్మక, ప్రతి సంఘటనను హేతువాద రీత్యా పరిశీలించే ధోరణి విప్లవాత్మకమైనది. కనుకనే రామస్వామి విప్లవకవిరాజు:

"బుద్ధిగట్టినట్టి మూఢ
మనస్తత్వ పిశాచమ్ము
వద్దు విరుగ గొట్టినావు
గొడ్డలి వంటి విమర్శల" అన్న పంక్తులు వ్రాశారు. ఈ సంపుటికి తొలిపలుకు వ్రాసినవారు అన్నట్టు "మత మౌఢ్యాలకు స్వస్తి చెప్పి మానవతకు పట్టాభిషేకం చేయాలని రామస్వామిగారు కోరారు." ఆయన ప్రతి రచనలో విశిత పరిశోధనా దృష్టి కనిపిస్తుంది.

ఈ సంపుటిలో ప్రముఖ రచయితలు శ్రీ రామస్వామిగారి వ్యక్తిత్వాన్ని వివిధ కోణాలనుండి పరిశీలించి వ్రాసిన చక్కని వ్యాసాలు ఉన్నవి. కవిరాజు హేతువాద దృక్పథాన్ని గురించిన అచ్యుత రావ్ వ్యాసం సమగ్రమైనది. అలాగే 'నిహిలిజము— కవిరాజు' అన్న వ్యాసాన్ని డా. త్రిపురనేని వెంకటేశ్వరరావు గారు ఎంతో వివరంగా వ్రాశారు. 'ఖూనీ', 'శంబూక వధ', 'సూత పురాణం', 'భగవద్గీత' మున్నగు కవిరాజు రచనల సమగ్ర పరిశీలన గల వ్యాసాలు ఈ సంపుటిలో పొందుపరచబడినవి.

"అన్నా! పూర్వాచారము
లన్నియు మనకండ్ల యెదుట అతివేగముగా
మన్నయి పోవుచు నుండెను
భిన్నాభిన్నంబులగుచు, చెప్పగనేలా?"

కవిరాజు రచనలు, రచనలను గురించి వివిధ విమర్శకుల అభిప్రాయాలు ఈనాటికీ ఆంధ్ర దేశం నలుమూలలా పాఠకులకు అందవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. కులమతాల గుద్దులాటలు ఇంకా నశించలేదు. మతమౌఢ్యం పోలేదు. సంకుచితత్వం సన్నగిల్లలేదు. రామస్వామిగారి విప్లవ శంఖారావం ఇంకా బలంగా వినాలి. దానికి అభ్యుదయ భావుకులంతా పూనుకోవాలి. కవిరాజు సాహిత్య విహారం వారి ఈ కృషి ప్రశంసించదగినది. ఈ సంపుటి పాఠకులకు కవిరాజు ఆత్మస్వరూపాన్ని స్పష్టంగా ప్రదర్శించగలదు.

భావ విప్లవ నాయకులైన రామస్వామిగారి రచనలు ఆనాటికీ ఈనాటికీ ఏనాటికీ ఆంధ్ర జాతికి ఉపాదేయములే. వాని బహుళప్రచారము అత్యంత ఆవశ్యకం.

## లావణ్య

[మహిళల మాసపత్రిక. ఉగాది సంచిక. సంచాలకుడు: శ్రీ కనక మేడల. వెల: 60 న. పై. ప్రాప్తిస్థానం: కోడంబాకం, మద్రాసు 24.]

చక్కని ముఖచిత్రంతో, చిన్ని కథలతో, గేయాలతో, హాస్య చిత్రాలతో ఆకర్షకంగా ఉంది లావణ్య ఉగాది సంచిక. శ్రీ కనకమేడల స్వయంగా ఉత్తమ రచయిత. కనుక రచనలు ఎన్నుకోడంలోను, పత్రిక నిర్వహించడంలోను చక్కని ప్రతిభను కనపరిచారు. సంచాలకులు సంపాదకీయం వ్రాస్తూ "మహిళలు పత్రికను ఏవిధంగా కోరతారో ఆ విధంగా తయారు చేయగలను. సమగ్రమైన సలహాలు, సూచనలు పాటిస్తాను. వీలైనంతవరకు మహిళా సమస్యలకు, మహిళా రచనలకు ఈ పత్రికలో చోటు ఎక్కువగా ఇస్తాను" అన్నారు. మన దేశంలో మహిళలకుగా ప్రత్యేకంగా పత్రికలు చాలా తక్కువ. కనుక 'లావణ్య'ను అభివృద్ధి పరచడంలో అందరూ తోడ్పడతారని ఆశించుతాను.

## కృష్ణాపత్రిక

[వజ్రోత్సవ సంచిక సంపాదకులు: శ్రీ ముదిగొండ సుబ్రహ్మణ్యశర్మ 280 పుటలు. వెల. మూడు రూపాయలు. ప్రాప్తిస్థానం: బి 11-20, జాంబాగ్ రోడ్డు, హైదరాబాదు-1.]

1902 లో ప్రారంభమైన ఈ కృష్ణాపత్రికా స్రవంతి ఇంకిపోకుండా 1964 లో వజ్రోత్సవం జరుపుకోగలగడం ఆంధ్రుల అదృష్టం. పూజ్యశ్రీ ముట్నూరి కృష్ణారావు గారి లేఖిని అమర కృష్ణానదియై ప్రవహించి ఆంధ్రులను ఆనాడు ఉత్తేజపరిచింది. ఆయన సంపాదకీయాలు, రచనలు చదవడానికి ఉగ్రరాతలుగాని అక్షరాస్యుడు ఆంధ్ర దేశంలో ఉండలేదంటే అతిశయోక్తి కాదు. నిజానికి వజ్రోత్సవం చేసుకున్న మొదటి తెలుగు పత్రిక కృష్ణాపత్రికేనేమో? కృష్ణాపత్రిక మాట వచ్చినప్పుడు శ్రీ ముట్నూరి కృష్ణారావుగారిని స్మరించుకున్నట్టే మనం ప్రస్తుత సంపాదకులు శ్రీ ముదిగొండ సుబ్రహ్మణ్య శర్మగారిని మరువలేము. యశశ్శరీరం మాత్రమే కలిగి భౌతికశరీరం శిథిలమై ఉన్న కృష్ణాపత్రికను పునరుద్ధరించి ఎన్నో వ్యయప్రయాసలకోర్చి ఆంధ్రులకు కృష్ణాపత్రికా జీవనది ఇంకకుండా కాపాడిన శ్రీ శర్మగారికి ధన్యవాదాలు.

వజ్రోత్సవ సంచిక సర్వాంగ సుందరంగా వెలువడింది. ప్రముఖ నాయకులు, రచయితలు, పాత్రికేయులు ఎందరెందరో తమ అమూల్య రచనలతో ఈ సంచికను అలంకరించారు. ఇందులోని త్రివర్ణ, ద్వివర్ణ, ఏకవర్ణ చిత్రాలు ఎంతో కన్నుల పండువుగా ఉన్నవి. ఇందులో నలభైనాలుగు వ్యాసములు, ఇరవై కవితలు, పదకొండు విమర్శన వ్యాసములు, పదకొండు కథానికలు, ఒక నాటిక ఉన్నవి. ప్రతి తెలుగింటిని అలంకరించతగిన ఉత్తమ సంచిక ఇది.

## సిరయ్యా పదాలు

[కవిత. రచన: శ్రీ ఎ. వి. సత్యనారాయణరావు. ప్రాప్తిస్థానం: తెలియదు. డెమ్మీ 40 పేజీలు: వెల ఒక రూపాయి.]

కూనలమ్మ పదాలకు అనుకరణగా వెలువడుతున్న వాటిలో ఇదొకటి. దీనికి మకుటం "ఓ కూనలమ్మా" కాదు, "ఓహో సిరయ్యా". సిరయ్య అనగా లక్ష్మికి భర్త అను అర్థం చెప్పుకోవలసిందిగా రచయిత ఆదేశించారు. ఆశీస్సులు కూర్చిన నారాయణరెడ్డిగారు కూడా "సిరయ్య" అంటే శ్రీపతి అనుకోవాలి అన్నారు. కాని ఎలా అనుకోవడమో అర్థం కాదు. అయ్య అంటే తండ్రి అనిఅర్థంవస్తుందిగాని భర్త అని అర్థంవస్తుందా? మున్నుడి వ్రాసిన శ్రీ పేర్వారం జగన్నాథంగారు కాని, ఆశీస్సులు సమకూర్చిన వారుగాని ఈ కూనలమ్మ పదాలను పునరుద్ధరించి అనేకుల అనుకరణకు అవకాశమిచ్చిన ఆరుద్రగారిని గూర్చి ఒక్క ముక్కైనా వ్రాయక పోవడం అన్యాయం. ఈ రచనా ప్రక్రియ సాగడానికి కారణభూతులు ఆరుద్రగారు. మరుగున పడిన కూనలమ్మపదాలకు ప్రాణప్రతిష్ఠ చేసింది ఆయన. ఆయన పేరు చెప్పుకోకుండా ఈ రచనా ప్రక్రియకు స్థానం లేదు. ఈ రచన పేలవంగా ఉంది. యతులగతి దేవుడెరుగును గాని ప్రాసకోసం కవి పడ్డబాధ అంతింత కాదు.

—శ్రీరామ్

Printed and published on behalf of Andhra Prabha Ltd., by S. V. SWAMY, B.A., at the Dinamani Press, Express Estates, Madras-2, Editor: NILAMRAJU VENKATASESHAIAH

# ఆంధ్రప్రభ

## సచిత్ర వారపత్రిక

మద్రాసు

ఎడిటర్: నీలంరాజు వెంకటశేషయ్య


## మానవస్వత్వాల పునరుద్ధరణ

జూలై నెల అమెరికా సంయుక్త రాష్ట్రాల చరిత్రలో రెండువిధాల విశేషమైన ప్రాముఖ్యం సంతరించుకొన్నది. జూలై 4 అమెరికా స్వాతంత్ర్యదినం. ఈ ఏడాది జూలై 2 న అధ్యక్షుడు శ్రీ లిండన్ బి. జాన్సన్ సంతకం చేయడంతో సమగ్రమైన పౌరస్వత్వాల చట్టం అమలులోనికి వచ్చినది.

ఈ రెండు పరిణామాలకు అవినాభావ సంబంధం ఉన్నది.

ఒకదేశం స్వాతంత్ర్యం సముపార్జించుకొనడం ఎంత ప్రధానమైనదో, ఆ దేశంలోని ప్రజలందరికీ ఆ స్వాతంత్ర్యం అనుభవంలోనికి రావడంకూడా అంతే ప్రధానమైనది.

అమెరికాలో నీగ్రోలు చిరకాలం రెండవ తరగతి పౌరులుగా, సవతి తల్లి బిడ్డలుగా ఉన్నారు. సమానత్వం అనేది వారికి ఎప్పటికీ దుర్లభమైనదిగా కనుపించినది. అంతే కాదు. నీగ్రోలు అనేకమైన కష్టనష్టాలకు గురిఅవుతూ వచ్చారు.

ప్రజాస్వామ్యానికి అంకితమైన అమెరికాలో నెలకొన్న ఈ స్థితి ప్రపంచ దేశాల నిరసనకు గురిఅయినది. ముఖ్యంగా ఆసియా, ఆఫ్రికా దేశాలవారు ఆ స్థితిపట్ల ఏవిధంగానూ సానుభూతి చూపలేక పోయారు.

ఈనాడు నీగ్రోలకు సమానమైన అవకాశాలు కల్పించడానికి, పౌరస్వత్వాలు హక్కుభుక్తాలు అయ్యేటట్లు చూడడానికి చట్టరీత్యా చర్యలు జరపడంతో అమెరికా తిరిగి ప్రపంచ దేశాల సద్భావం పొందడానికి అవకాశం ఏర్పడినది.

కొందరికి మాత్రమే పరిమితమైన స్వాతంత్ర్యం పరుగురి స్వాతంత్ర్యానికి గొడ్డలి పెట్టు. జాతివివక్షణ, విభేదము సమతా సామరస్యాలకు సోపానాలు కావు; సంఘర్షణకు మాత్రమే దోహదం చేసేవి. సంఘర్షణలో నుంచి జనించేది శాంతి కాదు; సంఘర్షణే.

ఈ స్థితి చక్కబరచడం కేవలం చట్టంతోనే జరిగేది కాదు. ప్రజల దృక్పథం మార్పు చెందడం అవసరం. అమెరికా కాంగ్రెసులో ఉభయపక్షాల సహకారంతో ఈ చట్టం రూపొందడం అటువంటి పరిణామం సూచిస్తున్నది. ఇది ఆశాజనకంగా ఉన్నది.

అన్నిటినీ మించి శ్రీ లిండన్ జాన్సన్ చెప్పినట్లుగా ఈ చట్టం కొరకు పోరాడిన శ్రీ జాన్ ఫిట్జిరాల్డ్ కెన్నెడీకి దానిని అమలు పరచడంకన్న గొప్ప స్మారక చిహ్నం మరొకటి ఉండదు. ★

# గాంధీజీ కారాగార గాథలు



ఆగాఖాన్ భవనం జెయిలు,
5 సెప్టెంబరు 42.

కస్తూర్బా రొమ్మునొప్పికి కారణం గుండె జబ్బు. నొప్పి నేడు ఎక్కువయింది. నేను ఈ విషయమై మిస్టర్ కటేలీతో మాట్లాడుతూ, "ఈ విషయంలో నేను డాక్టర్ల సలహా తీసుకోడం అవసరం" అన్నాను. ఆయన భండారీకి ఫోను చేశాడు. భండారీ రాత్రి వచ్చారు. తర్వాత డాక్టర్ శాహ వచ్చారు. ఆయన ఆగాఖాన్ చుట్టం. సజ్జనుడు. ఎమిల్ నైట్రైడ్ గొట్టాలు దగ్గర ఉంచుకోవాలని చెప్పారు. నైట్రోగ్లిసరిన్ మాత్రలు నావద్ద ఉన్నవి. లిక్విడ్‌కోరామీన్ కూడా తెప్పించి పెట్టుకున్నాను; సమయానికి అన్నీ అవసరమని.

6, సెప్టెంబర్ 42.

నేడు సివిల్ సర్జన్, కలెక్టర్ మళ్లీ వచ్చారు. వ్యాధిగ్రస్తులను చూచిరమ్మని భండారీ చెప్పడం వల్ల సివిల్ సర్జన్ బాను, బాపూను, సరోజినీ నాయుడును చూచారు. "కస్తూర్బాకు పుప్పుసం పలుచని పొరకు సంబంధించిన నొప్పి" అన్నారు ఆయన. "ఈ నొప్పికి శ్వాసతో సంబంధంలేదు; దగ్గులోను లేదు. నొప్పి హృదయంనుంచి వ్యాపిస్తున్నది" అన్నాను. అప్పుడు ఆయన "హిస్టరీ టికెట్" (రోగి రోగ చరిత్రకు సంబంధించిన కాయితం) మీద, "నొప్పి పుప్పుసం పై పలుచని పొరకు సంబంధించింది. ఈ నొప్పిలో కొంత గుండెకు సంబంధించింది కూడ ఉండవచ్చు. గుండెలో విశేషమైన వికారం గాని, దోషంగాని లేదు" అని వ్రాశారు.

నాకు ఆశ్చర్యమయింది. కస్తూర్బా గుండె పరిస్థితి సాధారణంగా ఉన్నదని అనడం ఎంత ఆశ్చర్యమైన సంగతి? ఆమెకు శ్వాసనాళిక వాచి, కఫంచేరే పాత జబ్బు ఉండనే ఉంది. అందువల్ల ఊపిరి తీసుకుంటున్నప్పుడు కఫం గరగరలాడుతుంది. సివిల్ సర్జన్ ఈ కఫం సవ్వడిని పుప్పుసాలమీది పలుచని పొర ఘర్షణవల్ల కలిగిన సవ్వడి అని అనుకున్నాడు కాబోలు! భగవంతుడికే తెలుసు. గుండెకు సంబంధించిన మాంసపేశీలు బలహీనంగా ఉన్నాయి. గుండె ఎడమకొన తన స్థానంనుంచి కొంచెం ఉబ్బింది. గుండె పొర ముడుచుకొన్నప్పుడు స్పష్టంగా చప్పుడు వినిపిస్తుంది. గుండె జబ్బు అని అనుమానం ఉన్నప్పుడు సివిల్ సర్జన్ కొంచెం శ్రద్ధగా చూడవలసింది.

వారు వెళ్లిపోయిన తర్వాత డాక్టర్ శాహ వచ్చారు.

బా నిన్నటినుంచి పక్కమీదే ఉన్నారు. డాక్టర్లు రావడంవల్ల కలిగిన మేలు ఏమిటంటే, బా తాము నిజంగానే జబ్బుగా ఉన్నామని, మంచం నుంచి కదలరాదని నమ్మడం డాక్టర్లు రాకపోతేనేను ఎంత ప్రయత్నించినా, ఆమెను నేటివరకు పక్కమీద పడుకోబెట్టలేకపోయాను.

7, సెప్టెంబరు 42.

నేడు ఉదయం కర్నల్ శాహ, భండారీ వచ్చారు. "ఇకమీద ఇక్కడికి ఈయనే వస్తూ ఉంటారు. సివిల్ సర్జన్ రారు" అన్నారు భండారీ. శాహమీద నాకు విశ్వాసం ఉంది. ఈయన చేయివాసి మంచిది.

బా గుండె కొట్టుకోడం వివరాలు తెలుసుకొనడానికి గ్రాఫ్ (హెచ్చు తగ్గులు తెలిపే పటం) తయారు చేయవలసిందని తెలిపాను. మధ్యాహ్నం డాక్టర్ కోయాజీ వచ్చి, ఈ గ్రాఫ్ తయారు చేశారు. సాధారణంగా ఈవిధంగా నాలుగుచోట్ల ఎలెక్ట్రిక్ తీగ పెట్టి తయారు చేస్తారు. ఆయన మొదటి మూడు స్థానాలలో మాత్రం ఎలెక్ట్రిక్ తీగ పెట్టి గ్రాఫ్ తయారు చేశారు. నాలుగవ స్థానంనుంచి తీసుకోమని నేను కోరాను. ఆయన నా మాట వినిపించుకోలేదు.

రోడ్డు - పక్కనుంచి "మహాత్మా గాంధికీ జయ్" నినాదాలు వినిపించాయి. ఈ రోజు ఏదో పెద్ద సభ జరుగుతుంది కాబోలు !

ఖైదీలతో కిటకిటలాడే మూడు లారీలు రోడ్డుమీద వెళ్లాయి. ప్రభుత్వం జాలుము బాగా చేస్తున్నట్టు తెలుస్తున్నది. అయితే ఇంతవరకు ప్రజలు కూడా ధైర్యసాహసాలు చూపుతున్నారు. అక్కడక్కడ హింసాచర్యలు కూడా జరుగుతున్నట్టు కనిపిస్తుంది. హింస చెడ్డది.

కాని, నామర్దాగా ఉండడం ఇంతకన్నా పెద్దది కదూ !

భండారీ నేడు నాతో మాట్లాడేటప్పుడు "ఒకటి రెండు రోజులలో మీకు సహాయం జరుగుతుందని మీరు ఆశించవచ్చు" అన్నారు. బహుశా అన్నయ్య ఈ జెయిలుకు బదిలీ అయి వస్తున్నాడేమో! ఈ విషయమై నేను బాపూతో ప్రస్తావించగా, "అతడు వచ్చే ఆశ నాకు చాలకొద్ది. ఎదుటవచ్చి నిలబడితే వచ్చాడని అప్పుడు ఒప్పుకుంటాను" అన్నారు. కాని, తర్వాత అన్నయ్య వచ్చి తనవద్ద కూర్చున్నట్లు నేడు కూడ స్వప్నం వచ్చిందని బాపూ అన్నారు. "స్వప్నమేమిటి? నేను అర్థంకంటే హెచ్చుగానే జాగ్రదవస్థలో ఉన్నాను. ప్యారేలాల్ ఎదుట నిలబడినట్టే కనిపించింది. చేతిలో ఏదో కాయితం పట్టుకున్నాడు. 'నన్ను వీళ్లు (సర్కారువాళ్లు) మీతోపాటు ఉండనివ్వరు. నాకు నా మనస్సులో ఉండే విషయాలన్నీ చెప్పడానికి అవకాశం దొరకదని, అన్నీ ఈ కాగితంలో వ్రాశాను. మీరు దీనిని చదవండి' అన్నాడు. మొదటనేమో మహాదేవ్ మాట్లాడుతున్నాడేమోనని అనిపించింది. కాని, మళ్లీ చూస్తే ప్యారేలాల్. అతడు కాయితం నాచేతికిచ్చి త్వరత్వరగా చెప్పడం ప్రారంభించాడు. వెలుపలి వార్తలన్నీ తెలిపాడు. పోరాటం బాగా సాగుతున్నది. ఆర్యనాయకం బాగా పని చేస్తున్నారు. శ్రీమన్నారాయణ్ కలానికి అద్భుతమైన శక్తి వచ్చింది. అతడు కూడా చాలా పని చేస్తున్నాడు. ప్రభుత్వం చాల కఠినంగా ప్రవర్తిస్తున్నదనే విషయం జనం మనసులో ఇల్లు కట్టుకుంది. ప్రజలు సర్కారుకు ఎదురుగా ఏకమై నిలబడ్డారు. మీపైన కూడా సర్కారువారు దౌర్జన్యం చేయదలచారు. నన్ను మీవద్ద ఉండనివ్వరు. సుశీల మీవద్దే ఉందిగా. ఆమెకు తల్లి, తండ్రి, సోదరుడు అంతా ఇప్పుడు మీరే. ఆమెపైన దయ ఉంచండి. నేను ఎక్కడ ఉన్నా మీపనే చేస్తూంటాను. నేను మీ పద్ధతిలోనే పనిచేస్తున్నాను—చేస్తూనే ఉంటాను. నా పనుల వల్ల మీకు ఎప్పుడూ తలవంపులయ్యే పరిస్థితి రాదు; ఈ విషయంలో నమ్మకంగా చెబుతున్నాను'—ఈవిధంగా చెప్పి మాయమయ్యాడు. నేను మేల్కొన్నాను."

మరునటిరోజు 'సర్వోదయ్', 'రాష్ట్రభాషా సమాచార్' మొదలయిన మాసపత్రికలు వచ్చాయి. అన్నయ్య వెలుపలి పోరాటం గురించి స్వప్నంలో చెప్పిన విషయాలు చాలవరకు నిజమయినవేనని ఆ పత్రికలవల్ల తెలిసింది. వర్ధాలోని కామర్స్ కాలేజిని ప్రభుత్వం మూయించి వేసింది. ఆర్యనాయకంజీ, శ్రీమన్నారాయణ్ జీ పట్టుబడ్డారు. సర్కారు జులుం తీవ్రంగానే ఉంది. అయినా ప్రజలు యథాశక్తి పోరాడుతూనే ఉన్నారు.

8, సెప్టెంబర్ 42.

నేడు కస్తూర్బా స్వాస్థ్యం కొద్దిగా బాగుంది.

# కస్తూర్బా అస్వస్థత

డాక్టర్ శాహ్ వచ్చారు. డాక్టర్ కోయాజీ నిర్ణయించిన మందు ఆయనకు నచ్చలేదు. "మందు ఇవ్వకండి. గుండె యథాశక్తి పని చేస్తున్నప్పుడు, నడుస్తున్న గుర్రాన్ని చబుకుతో కొట్టడం ఎందుకు?" అన్నారు డాక్టర్ శాహ్.

పగలంతా ప్రశాంతంగా గడిచింది. ఇక్కడ ఆలసిపోయేంత శాంతి లభిస్తుంది. వెలుపలికి వెళ్ళితే ఏమౌతుందో! భగవంతునికే ఎరుక! ఇంతకూ వెళ్ళినప్పుడు గదా!

ఎప్పుడు వెళ్ళతాము—ఎలా వెళ్లతాము. ఇవన్నీ భవిష్యత్తుపై ఆధారపడి ఉన్నాయి. మహాదేవభాయీ గొప్పవారు; ఈ జంజాటం నుంచి విడిపోయారు. ఆయన ఇలా దగాచేసి పోగూడదు—అని ఒక్కొక్కప్పుడు తిడుదామని బుద్ధిపుడుతుంది. కాని, అలా చేయడం న్యాయం కాదు. ఆయన తన జీవితకార్యం పూర్తిచేసి వెళ్లారు. మే మింకా చేయవలసి ఉంది.

9, సెప్టెంబర్ 42.

కస్తూర్బా నేడు కూడా బాగున్నారు. డాక్టర్ శాహ్, భండారీ వచ్చారు. మొదట మూడు గ్రాఫ్‌లు తయారు చేయబడ్డాయి. వాటిలో గుండెలోని దోషమేదీ కనిపించలేదు. మొదటి మూడు గ్రాఫ్‌లలో కనిపించని దోషం నాల్గవ గ్రాఫ్‌లో కనిపించడం నేను పెక్కుసార్లు చూచాను. కనుక నాల్గవ గ్రాఫ్ కూడా తయారు చేయవలసిందిగా భండారీతో అన్నాను. ఆరోజు డాక్టర్ కోయాజీతో కూడా అన్నాను. కాని, ఆయన ఎందుకు తీసుకోలేదో తెలీదు. నా మాటలకు డాక్టర్ శాహ్ "వాస్తవమైన సంగతి ఏమిటంటే, నేను, ఈమెను (నన్ను), ఈమె వంటి కొత్త కొత్త డాక్టర్లను నమ్మను" అన్నారు.

సరోజినీ నాయడు మూత్రపిండాలను పరీక్షించాలన్నప్పుడు కూడా డాక్టర్ శాహ్ ఆధునిక విజ్ఞాన ప్రగతి మొదలయిన విషయాలను అశ్రద్ధగా చూచి, విషయం దాటవేశారు.

10, సెప్టెంబర్ 42.

నేడు 'బాంబే క్రానికల్' పాత సంచికలన్నీ వచ్చాయి. మహాదేవభాయీ మృత్యువును దేశం గప్‌చిప్‌గా సహించినట్లు తోస్తుంది. ఈ విషయం బాపూజీకి బాగా తగిలింది. వాహ్యాళి సమయంలో బాపూ ఆవేదనతో ఇలా అన్నారు: "ఆఖరుకు మహాదేవ్ పిరి జెయిలులో మరణించాడు కదూ? మహాదేవ్ హత్యాపాతకం పిరి నెత్తిమీద ఉంది. నేను ఆనాడే గవర్నర్‌కు వ్రాయదలచాను. కాని, వ్రాసి, సగంలో కొట్టివేశాను. బతికి ఉంటే, ఏనాడైనా మహాదేవ్ మరణానికి కారణం తమరేనని తప్పక గవర్నర్‌తో అంటాను. మహాదేవ్ జెయిలుకు రాకపోతే కనీసం ఈ సమయంలోమరణించనే మరణించడని నా నమ్మకం. వెలుపల రకరకాల పనులలో నిమగ్నుడయి ఉండిపోయేవాడు. ఇక్కడ అతడు ఒకే ఆలోచనలో మునిగిపోయాడు. ఒకే చింత అతని తలపైకి ఎక్కింది. ఆ చింత అతనిని తినివేసింది. అతని భావన అతనిని మింగించివేసింది. దేశం అతనికోసం ఏమీ చేయలేదు. పైకుంత మేహతా శ్రద్ధాంజలి, బరేల్వీ శ్రద్ధాంజలి మామూలుగా వచ్చేవే. కాని, మహాదేవ్ యావద్దేశానికీ చెందినవాడు. దేశంకోసమే అతడువెళ్ళిపోయాడు. భగత్సింగ్ మరణానంతరం నేను లార్డ్ ఇర్విన్‌తో సంధి చేసుకొని కరాచీ వెళ్లుతున్నప్పుడు, ప్రతి స్టేషన్‌లోను జనం గుంపులు, గుంపులుగా చేరి 'భగత్సింగ్‌ను తీసుకొనిరండి!' (లావో భగత్‌సింహ కో) అని నినాదాలు చేశారు. ఆవిధంగానే ఇప్పుడు కూడా వారు ప్రభుత్వానికి 'లావో మహాదేవ్ కో!' అని చెప్పగలరు. ప్రభుత్వం ఎక్కడినుంచి తెస్తుంది? 'ఇంత భావుకుడు, ఇంత విశ్వుష్ట మనస్కుడు, ఇంత సానుభూతి గలవాడు జెయిలుకు ఎందుకు రావాలి? రాకుండా ఉండని' వగైరా వగైరా మాటలంటుంది. కాని, ఇప్పుడు ప్రభుత్వంతో జరుగుతున్న సంకుల సమరంలో మరొక విషయం ఆలోచించడానికి అవకాశం ఎక్కడ ఉందని ప్రజలు అనుకుంటున్నారేమో!" "చేయదగినదంతా చేశామని మీరే తంతిలో వ్రాశారుగదా! ఈ కారణంవల్ల కూడా ప్రజలు శాంతంగా ఉన్నారేమో! ఇది స్వాభావికమైన మృత్యువని, ఎక్కడైనా జరిగేదేనని అనుకున్నారేమో!" అన్నాను. "అది సరే. కాని, మరణం ప్రభుత్వం జెయిలులో గదా సంభవించింది!" అన్నారు నా మాటలకు బాపూ.

కస్తూర్బా ఆరోగ్యం కుదుటబడుతున్నది. బాపుజీకి నేడు ఒక్కమారు నీళ్ల విరేచనం అయింది. రెండు మూడు రోజులుగా, బంగాళా దుంప (ఉర్లగడ్డ), చిలగడ దుంప (గెనుసు గడ్డ) తినడం ఆరంభించారు. బహుశా దాని ప్రభావమే అయి ఉంటుంది.

మూలం :

**డాక్టర్ సుశీలానైయర్**

అనువాదం :

**తిరుమల రామచంద్ర**

# గాంధీజీ కారాగార గాథలు

## "అన్నయ్యా వచ్చిచేరాడు"

11, సెప్టెంబర్ 42.

ఈరోజు మధ్యాహ్నం భోజనంచేసి కూర్చున్నానో లేదో, ఎవరో అన్నారు, ప్యారేలాల్ వచ్చాడని. నేను తల ఎత్తి చూచాను. అన్నయ్య ఎదుట వరాండాలో నిలబడి ఉన్నాడు. బాపూ అన్నయ్య వస్తాడన్న ఆశ వదలుకున్నారు. మహాదేవభాయీ వెళ్ళిపోయినాలుగువారాలు కావచ్చాయి. అన్నయ్య వచ్చేవాడయితే, త్వరగానే వచ్చేవాడని అప్పుడప్పుడు తోచేది. బాపూ నిన్న కూడా అన్నారు: "అతడు వచ్చి నాముందు నిలబడితేనే వచ్చినట్లు అని ఒప్పుకుంటాను"

మహాదేవభాయీ మరణం అన్నయ్యకు పెద్ద దెబ్బ. "వెళ్ళిపోదామని నేను అనే వాణ్ణి. ఆయనే వెళ్ళిపోయారు" అన్నాడు అన్నయ్య.

మహాదేవభాయీ మరణించిన నాటి ఉదయం దాదాపు ఎనిమిదిన్నరకు అన్నయ్యకు ఉపవాసం చేద్దామనే బుద్ధిపుట్టిందట. (ఇక్కడ ఆగాఖాన్ భవనంలో సుమారు ఎనిమిదిన్నరకే మహాదేవభాయీ స్వాస్థ్యం చెడింది. ఇక్కడ ఏమి జరిగిందో అన్నయ్యకు తెలీదు.)

"ఈసారి నీకు ఇక్కడ భగవద్గీత, బైబిల్ (న్యూటెస్టమెంటు) నేర్పుదామనుకున్నాను" అన్నారు. కాకతాళీయంగా ఈ రెండూ బాపూజీ నాకు నేర్పుతున్నారు. ఈ మాటలు బాపూ వినినప్పుడు "దేవుడి ఇచ్ఛ ఏమిటో చూద్దాం" అని అన్నారు.

నెల రోజుల తర్వాత మిస్టర్ కటేలీకి మాట్లాడడానికి అవకాశం దొరికింది. ఆయన చాల సంతోషించారు. భోజనానంతరం చాల సేపు అన్నయ్యతో మాట్లాడుతూ ఉండినారు.

చర్చిల్ ప్రసంగం బాపూజీకీ, మా అందరికీ చాల ఆఘాతం కలిగించింది. ఇలాటి ప్రసంగాలు ప్రజలను మరింత రెచ్చగొడుతాయని, కఠినములుగా చేస్తాయని మనస్సులో భావన కలిగింది.

మహాదేవభాయీ మరణించినప్పుడు బాపూజీ పంపిన తంతి నేను పత్రికలలో ప్రచురింపబడింది. కాని, సెన్సార్ అయింది. రెండు మూడు వాక్యాలు తీసివేయబడినాయి. ఆ వాక్యాలేమిటంటే, మహాదేవభాయీ దేశ భక్తుడు గాను, యోగిగాను మరణించాడు—అనేదీ, అతని కుమారుడు అతని స్థానం అలంకరించడానికి తనను తాను తయారు చేసుకుంటాడని బాపూ ఆశాభావం ప్రకటించినదీని. ఉత్తరాలు వ్రాసినట్లు వెళ్ళకపోతే పంపనక్కరలేదని బాపూ స్పష్టంగా చెప్పారు. నేను కొట్టివేసిన వాక్యాలు చూపగానే, ఆయన చాల రేగిపోయారు.

"పత్రికల వాళ్ళు తీసివేశారేమో! ఇక్కడి నుంచి పూర్తిగా వెళ్ళిందే" అన్నది మీరాబహెన్. "ఇంత వరకు—జెయిలు అధికారులే— సెన్సారు చేసి ఉంటారు" అన్నారు బాపూ. "మనం జెయిలు నుంచి వెలుపలికి వెళ్ళినప్పుడే నిజం బయట పడుతుంది" అన్నది మీరాబహెన్. ఆ మాట లకు "Don't you see I get out only as a free man. Either India wins her freedom, or I go to lie by Mahadev's side." (నేను స్వతంత్రుడిని అయ్యే వెలుపలికి వెళ్ళుతాను. భారతదేశం స్వాతంత్ర్యం సంపాదించ నన్నా సంపాదించాలి, లేకపోతే నేను మహదేవ్ పక్కన సమాధిఅన్నా కావాలి) అన్నారు బాపూ.

నేడు బాపూజీకి రక్తపుపోటు బాగా హెచ్చింది (188—112—116). "అసత్యం ఏది జరిగినా, బేఈమానీ ఏమి జరిగినా నా స్వాస్థ్యం చెడుతుంది" అన్నారు ఆయన. చర్చిల్ ప్రసంగంపై ఈ సూచన.

12, సెప్టెంబరు 42.

పగలు ప్రత్యేకమైన వార్తలేమీ లేవు. అన్నయ్య అక్కడి కబుర్లు, ఇక్కడి కబుర్లు చెప్పారు. వెలుపలి వార్తలు సంతోషదాయకంగా ఉన్నాయి. ఇలాటి ఉద్యమం, నాయకులు లేనప్పుడు, ముఖ్యంగా నాయకులందరినీ ప్రభుత్వం ఏకదమ్ముగా ఉడాయించుకొని పోయినప్పుడు—భగవత్సహాయం లేక ముందుకు సాగదని బాపూ విశ్వాసం.

వాహ్యాళి సమయంలో నేను అన్నాను: "బాపూ, ఇప్పుడు మన ఉద్యమం సఫలం కావడమనేది అత్యాశ్చర్యకరమైన విషయం. ముస్లిములు మొండికెత్తి కూచున్నారు; ప్రభుత్వంకూడా వారిని నెత్తికి ఎక్కించుకుంటున్నది. ఈ పరిస్థితిలో మన సఫలత కఠినమే."

దానికి బాపూ "నీవు చెప్పేమాట నిజమే. కానీ, సత్యం ఉన్నచోట ఆశ్చర్యమూ ఉంటుంది. ఒకింత నూతన పద్ధతితో పనిచేస్తున్నదని నేను ఇదివరకే చెప్పాను. ప్రజలు ఊరికే కూర్చోక పోతే, అంతా బాగవుతుంది" అన్నారు.

13, సెప్టెంబరు 42.

నేడు కమిషనర్, సివిల్ సర్జన్ రావలసిన రోజు. కాని, సివిల్‌సర్జన్‌కు బదులు డాక్టర్ షాహ్‌గారే వచ్చారు. అన్నయ్య తనకు తెలుసని అన్నారు ఆయన. కమిషనర్ కూడా వచ్చినప్పుడల్లా ఏదో మాట్లాడుతారు. సరోజినీ నాయుడు కమిషనర్, సివిల్ సర్జన్ వచ్చిన మొదటిరోజు చాల రుసరుసలాడారు, కాని, ఈరోజు సంతోషంగా ఉన్నారు.

సాయంకాలం వాహ్యాళి సమయంలో అన్నయ్య వెలుపలి సంగతులు చెబుతున్నారు. "ప్రభుత్వం మనను పట్టుకొని జెయిలులోతోసి పొరపాటు చేసింది. ఈ పొరపాటు చేయకపోతే, ఉద్యమం ఈ రూపం ఎప్పటికీ దాల్చేదేకాదు. నేను ఒంటిగా వెలుపల ఉన్నా నిర్వహించుకునేవాణ్ణి. అయితే నేను ఒంటిగా వెలుపలికి పోదలచుకోలేదు"

అన్నారు బాపూ. "ఎందుకు?" అని ప్రశ్నించాను నేను. "నేను ఈ ఉద్యమాన్ని నిర్వహించవలెనే శ్రద్ధకూడా అప్పుడు ఉండినది, శక్తికూడ ఉండినది" అని ఆయన సమాధానమిచ్చారు. "కొంచెం వివరంగా చెప్పండి" అని కోరాను. "ఇచ్ఛ ఉంటే శక్తి కలుగుతుంది, శ్రద్ధ పుడుతుంది. ఇచ్ఛలేనప్పుడు, శక్తి ఎక్కడినుంచి వస్తుంది? నేనేమో నా ఇచ్ఛనుకూడ ఈశ్వరాధీనం చేశాను. ఈశ్వరుడు నాతో, ఎప్పుడు ఏమిచేయవలసిఉండో చేయిస్తాడు. అంటే, నేడు ఈశ్వరుడు నాకు ఏలాటి ఇచ్ఛనూ కలిగించడం లేదు. నిజమే, ఉద్యమం ఈ విధంగానే నడువగలదని ఈశ్వరుడు భావించాడేమో" అని వివరించారు.

ప్రార్థనలో మీరాబహెన్ భజనగీతాలు పాడింది. తర్వాత బాపూ మౌనం ఆరంభమయింది.

14, సెప్టెంబరు 42.

నేడు బాపూజీ మౌనదినం. మహదేవభాయీ సమాధిపైన పెట్టిన రాళ్ళు గోరీ ఆకారంలో ఉన్నాయి. బాపూజీకి ఈ విషయం కష్టమని పించింది. మాకు కూడా. ఈ కారణంవల్ల దానిని చతురస్రాకారంగా చేయించి రెండు రోజులయింది. రఘునాథ్ మొదలయినవారు పేడతో అక్కడ అలికారు. సమాధిమీద పూవులతో ఓం అని అమర్చారు. పూవులు అలంకరించడానికి సమాధిమీద అక్కడక్కడ రంధ్రాలు కూడా చేశారు. అలంకరించిన తర్వాత ఎంతో అందంగా ఉంది. "బాపూ, మహదేవభాయీఉంటే ఎంతో సంతోషించేవారు. 'ఎంత అందంగా కనిపిస్తుందని' అనేవారు" అన్నాను.

బాపూ పంపిన తంతిని దుర్గాబహెన్ మొదలయిన వారికి పంపనేలేదని నేడు పత్రికలవల్ల తెలిసింది. సెప్టెంబరు 4 వ తేదీన తంతిని ఢిల్లీ నుంచి తపాలులో పంపారట. దీనివల్ల మా అందరికీ ఎంతో కష్టం కలిగింది. ప్రభుత్వం దుర్గాబహెన్ మొదలయిన వారితో క్షమాపణ కోరింది. కాని, క్షమాపణ కోరవలసింది బాపూజీని.

కస్తూర్బా నేడు ఆరోగ్యంగా ఉన్నారు. బాపూజీ స్వాస్థ్యంకూడా బాగుంది. వర్షర్తువు ముగిసింది. పగళ్ళు మంచి ఎండలు. రాత్రుళ్ళు నక్షత్రాలతో మెరిసిపోతున్నాయి. "నేను నక్షత్రాల నీడన పడుకొనగలిగితే నాట్యం చేస్తాను" అన్నారు బాపూ. "మాకు ఆకాశ దర్శనం చేయించండి" అని అడిగాను నేను. "జ్ఞాపకం ఉన్నంతవరకు చేయించగలను. యెరవడాలో నేను ఆకాశం చాలా భాగం చూచేవాణ్ణి" అన్నారు బాపూ.

15, సెప్టెంబర్ 42.

నేడు సమాధికి భగవద్గీతను తీసుకువెళ్ళడం మరచిపోయాను. పన్నెండవ అధ్యాయం కంఠస్థం అయిపోయింది. అందువల్ల పారాయణం చేయడంలో ఇబ్బంది ఏమీ ఉండదనే అనుకున్నాను. కాని, పారాయణం చేసేటప్పుడు ఒకటి, అర

శ్లోకాలు తడుముకోవలసి వచ్చింది. వాహ్యాళి సమయంలో బాపూజీ "పన్నెండవ అధ్యాయం పూర్తిగా నీకు ఒక్క శ్లోకంలాగ కంఠోపాఠం అయిపోవాలి. అప్పుడు ఒక్క తప్పురాదు. అంతేకాక, అంతా జ్ఞాపకం ఉందనే గర్వం కూడా నీకు ఉండరాదు. ఫాదరీలకు చిన్నప్పటినుంచే బైబిల్ సంతా చెప్పి నేర్పిస్తారు. అయినప్పటికీ వారు పుస్తకం ఎదుట పెట్టుకునే సంఘ ప్రార్థనలలో చదువుతారు. ఎందుకంటే, ఒక్క పొరపాటు జరిగినా సంఘ ప్రార్థన సరళి అంతా తెగిపోతుంది" అన్నారు.

ఈ మాటల సందర్భంలోనే వెలుపలికి వెళ్ళిన తర్వాత ఏమవుతుందనే విషయమై నేను ఊరికే ఉండలేక ఏవో మాటలు అన్నాను. కాని ఇంతలోనే సవరించుకొని "ఇంతకూ వెలుపలికి వెళ్ళి



నీలాటి రేవుకు

చిత్రం—వై. బాలయ్య (నారాయణరావుపేట)

నప్పుడు గదా ఆ మాట! ఎవరికి తెలుసు మహదేవభాయీతో పాటు అందరూ ఇక్కడే ఉంటామేమో ఏమో!" అన్నాను. "అది ఎలాగా ఉండేదే! మనమంతా ఇక్కడే ఉండిపోతే నాకు ఎంతో బాగనిపిస్తుంది" అన్నారు బాపూ. "మీరు వద్దు. మీరు తప్ప మేమంతా" అన్నాను నేను. ఈ మాటకు బాపూ కొంచెం కోపగించుకున్నట్లనిపించింది. "ఎప్పుడూ ఇలా అనడం మంచిదికాదు. ఈవిధంగా మాట్లాడి మీరు నా శుభ సంకల్పానికి అఘాతం కలిగిస్తున్నారు. ఈ పొరపాటు చేసే మహదేవ్ వెళ్ళిపోయాడు. నీవూ ఆ పొరపాటే చేస్తున్నావు" అన్నారు ఆయన. "మీరు కోపగించుకోకపోతే నానోటినుంచి ఇలాటి మాటలు ఎందుకు వెలువడ్డాయో చెబుతాను. ఏ సేనాపతీ—జనరల్— గాని, తాను, మరణించే స్థానానికి వెళ్ళడు. తన సైనికులను, ఆఫీసర్లను పంపు

తాడు. ఇలాగే మీరూను. మీరు గనుక ఉంటే స్వాతంత్ర్యసమరం కొనసాగిస్తూ ఉంటారు. అహింసా సమరం మీతోపాటేదే" అన్నాను. "నీవు జనరల్‌కు పైన సూపర్ జనరల్‌వు. ఈ సంగతే నేను మహాదేవ్‌తో అన్నాను. ఎవరిని ఎక్కడికి పంపాలో, తను ఎక్కడికి వెళ్ళాలో జనరల్‌కు తెలుసు. నీవు ముక్తధార చదివావు. దానిలో యువరాజా తన సోదరుని ఎలా అడ్డగిస్తాడు? నేనే ఈపనికోసం వెళ్ళాలి. నీవు కాదు" అన్నారు బాపూ. తర్వాత ఆయన విలియమ్స్ ఆఫ్ ఆరంజ్ కథ చెప్పి "నేను వెళ్ళితీరాలి. కాని, మీరు నన్ను అడ్డగించడం, నా శక్తిని క్షీణింపజేయడమేనని అనుకుంటున్నాను. నేనిప్పుడు కర్తవ్యమూఢుడు కాదలచుకోలేదు. నాకు అనిపించవచ్చు— ఏమని? మహాదేవ్ చెప్పేవాడు. సుశీలా, బా, ప్యారేలాల్ అందరూ చెబుతున్నారు. వారు చెప్పేదే నిజమవుతుందేమోనని. వందమందికి భోజనం పెట్టేవాడు ఉండాలి. భోజనం చేసే వారు యాభైమంది మరణించినా ఫరవాలేదు. భోజనం పెట్టేవాడు వెళ్ళిపోతే అందరూ ఆకలితోమాడిచస్తారు— అని మత గ్రంథాలుకూడా చెబుతున్నాయి. అందువల్ల నేను బ్రతికి ఉండడం అవసరం. ఒక విధంగా ఇది సరే. కాని, భోజనం పెట్టేవాడు నేను బ్రతికి ఉన్నా ఇతరులకు భోజనం పెట్టించలేను, కేవలం భూభారంవంటి వాణ్ణవుతాను అని చెబితే, అలాటి వాడిని నీవు మరణించవద్దు అని అడ్డగించడంలో ప్రయోజనమేమిటి? ఇంత మాత్రాన నేను మరణించదలచుకున్నానని కాదు. నేను పదహారు సంవత్సరాల కుర్రవాడి ఉత్సాహంతో ఉరుదూ నేర్చుకోవడం, మరొకటి నేర్చుకోడం మీరు చూడడం లేదూ? నీతో ఆడుకుంటున్నాను. రసాస్వాదనకు యోగ్యమైన వస్తువు లన్నిటి రసాన్ని నేను పీల్చివేస్తాను. అయితే, నేను నిస్సహాయ స్థితిలో ఉన్నప్పుడు ఏమిచేయగలను?" అన్నారు. "మానవుడు ఆత్మాభిమానంతో బతకలేని పరిస్థితి వస్తుందనుకోండి. అలాంటప్పుడు బ్రతికి ఏమి ప్రయోజనం? అయితే, అలాటి పరిస్థితి రాకపోవచ్చు. వస్తుందని అనుకోడంలో తప్పేముంది?" అని అడిగాను. దానికి బాపూజీ అన్నారు: "ఉపవాసం చేయడమే విధ్యుక్త ధర్మం కాగలఅవకాశంవస్తుందని మహాదేవ్‌కూడా అనుకునేవాడు. అయితే ఈ భావం అతని హృదయంలో స్థిరపడలేదు. ఇచ్ఛలు ఉండడంలో తప్పులేదు. వాటిని మన మనసులోనే పెట్టుకోవాలి." "మీరు చెప్పేది బాగుంది. అంటే ఆ ఇచ్ఛలను గురించి మీతో అనకూడదనేనా మీ అభిప్రాయం? మూగగా మనసులోనే ఉండాలన్న మాట ఇచ్ఛ!" అన్నాను. "అవును. మూగ ఇచ్ఛ ఈశ్వరుని వద్దకు వెళ్ళుతుంది. దానిని గురించి మనం చర్చిస్తే, దానిశక్తి తగ్గిపోయి, మనదారికి ఆటంకాలుకూడా కలిగించవచ్చు. కనుక నీ ఇచ్ఛను ఈశ్వరుని వద్ద ఉంచు. అతడు ఏమి చేయదలచుకుంటే, అది చేస్తాడు. నీతో, నాతో ఏమి చేయించాలో అదే చేయిస్తాడు" అన్నారు బాపూ.

# గాంధీజీ కారాగార గాథలు

వాహ్యాళి సమయం పూర్తయింది. అన్నయ్యే ఇప్పుడు బాపూజీకి మాలిష్ మొదలయినవి చేస్తున్నాడు. నేను కస్తూర్బా పనులు చూచుకుంటాను. భోజనాల ఏర్పాటు మొదలయిన పనులతో నాకు తీరిక లేకుండా నిండుగా ఉంటూంది. మధ్యాహ్నం భోజనానికి అన్నయ్యతోపాటుకూర్చుంటాను. అన్నయ్య చాల నెమ్మదిగా భోజనం చేస్తాడు. ఆ వేళకు నేను భోజనం ముగించి కూరలుకూడా తరిగి పెడతాను. ఈరోజు కూడా అలాగే చేశాను. అందువల్ల బాపూజీ పాదాలు రుద్దడానికి వెళ్ళడంలో కొంచెం ఆలస్యంఅయింది. చీవాట్లు తగిలాయి. "మనవద్ద చేయవలసిన పని ఉన్నప్పుడు మనం భోజనంచేసి బల్లమీద ఊరికే కూచోలేము" అన్నారు బాపూ.

సాయంకాలం వాహ్యాళిలో వెలుపలి విషయాలపై చర్చ జరిగేది. బాపూ బైబిల్ ఓల్డ్ టెస్టమెంట్ గురించి మాట్లాడుతున్నారు. "దానిలో రక్తపాతం అడుగడుగునా వస్తుంది. ఈశ్వరుని శరణు పొందేవారిని, సామాన్యంగా పొరపాట్లు చేసినా, ఈశ్వరుని ఆశ్రయం కోరేవారిని ఈశ్వరుడు రక్షిస్తాడు. వారి శత్రువులను చంపివేస్తాడు. ప్లేగును పంపుతాడు—మొదలయినవి. నేను వీటినుంచి గ్రహించే సారమేమిటంటే, ఈశ్వరునిపై శ్రద్ధ వహించడం గొప్ప విషయం, ఈశ్వరుడు సర్వశక్తిమంతుడు. అతడు చేయవలసింది ఎవరిద్వారా సయినా చేయిస్తాడు. భారతదేశంలోను, వాడు చేయించవలసింది చేయిస్తాడు; చేస్తాడు — అని,

16, సెప్టెంబర్ 42

నేడు వాహ్యాళి సమయంలోనూ వెలుపలి విషయాలు చర్చకు వచ్చాయి. "సైనికులు, పోలీసులు కూడా పితూరీ చేస్తారన్న ఆశ ఫలించలేదు. తక్కిన ప్రజాసామాన్యమంతా ఉద్యమంనడుపుతున్నారు" అన్నాడు అన్నయ్య. "నేనెప్పుడూ సైనికులపైన, పోలీసులపైన ఆశ పెట్టుకొనలేదు. రష్యాలో సైనికులు, పోలీసులు ప్రజలతో కలిశారనడం నిస్సందేహం. కాని, అక్కడ జరిగిన క్రాంతి హింసకమైంది. మనది అహింసాత్మకమైనది. హింసకు ప్రతిరూపమైన సైన్యం అహింసాత్మకమైన మన పోరాటంలో ఎలా చేరుతుంది? ప్రభుత్వం ప్రజల చేతికి వచ్చినప్పుడు సైన్యం ప్రజలతో పాటు చేరుతుంది. ఎందుకంటే గత్యంతరం ఉండదు గనుక. సైన్యంలోనివారు జడులు. చదువుకున్నవారు కమిషన్ ఉద్యోగాలు సంపాదించుకొని ఉన్నారు గదా, ఎవడైనా కమిషన్ ఉద్యోగం వదిలాడా? ఇదే వారి జడతకు గుర్తు" అన్నారు.

రామేశ్వరీ నెహరూను రెండుమార్లు అరెస్టు చేయడం, అంబాలాల్ సారాభాయి కుమార్తెలను, ఇతరత్రా మరి కొందరు స్త్రీలను అరెస్టు చేయడం పత్రికలలో చదివి బాపూజీ వ్యాఖ్యానిస్తూ, "కొన్నిచోట్ల హింసాఘటనలు జరిగినప్పటికీ మొత్తం మీద ఉద్యమం అహింసాత్మకమనే నేను నిర్ణయిస్తాను. అహింసాత్మకం కాకపోతే, ఇందరు స్త్రీలు— కులీనస్త్రీలు— దీనిలో పాల్గొనలేరు." అన్నారు.

నూలు వడికేటప్పుడు బాపూజీకి బైబిల్— న్యూటెస్టమెంట్— చదివి వినిపిస్తున్నాను. దీనివల్ల నేను కూడా బైబిల్ అభ్యసించినట్టు అవుతుంది.

నేడు మేథ్యూకథ పూర్తయింది. బాపూ మనస్సుపై దాని ప్రభావం తీవ్రంగా పడింది. సాయంకాలం మీరాబహన్‌తో "When I survey the wond'rous cross' (నేను అద్భుతమైన సిలువవైపు దృష్టి ప్రసరింపజేసినప్పుడు) అనే భజన గీతం పాడగలవా? నేడు మేథ్యూ కథ పూర్తయింది. విని మనస్సు ఆనందంతో నిండింది. నేను దానితో నిండిపోయాను" అని కోరారు. కాని, క్రైస్తవ మత ప్రభావం యూరోపియన్ జన్మప్రభావం చుట్టుపట్ల జనానికి తెలిసే ఏ పనినీ మీరాబహన్ చేయడానికి ఇష్టపడదు. అందువల్లనే బాపూజీ ఆమెను క్రైస్తవ మత గీతం పాడగలవా లేదా అని అడిగారు. "నేను మీ ఎదుట పాడుతాను. మీకు ఎలాటి దురభిప్రాయం కలుగకూడదు. వెలుపల వెళ్ళినతరువాత ఇతరుల ఎదుట పాడను." అన్నది మీరాబహన్. ఆమె ఆ గీతాన్ని చాలా మధురంగా పాడింది. రాత్రి బాపూ పడుకోడానికి వెళ్ళినప్పుడు, మీరాబహన్ వెళ్ళి "బాపూ, మళ్ళీ పాడనా?" అని అడిగింది. "ఊ! తప్పక!" అన్నారు బాపూ. మీరాబహన్ రెండు పర్యాయాలు ఆ గీతం పాడింది. ఆ ధ్వనిని చెవులలో నింపుకొని బాపూ నిద్రపోయారు. బాపూ నిద్రపోయిన తర్వాత కొంతసేపటికి కస్తూర్బా వేడినీళ్ళు అడిగారు. మాలో ఎవ్వరూ ఆమెవద్ద లేరు. మేమింకా లోపల మాట్లాడుతూ ఏవో పనులు చేస్తున్నాము. అందువల్ల బాపూయే లేచి వేడినీళ్ళిచ్చారు. బా కు ఈ రాత్రి బాగా గడవలేదు. ఆహారంలో ఏదో నియమభంగం కలిగింది. ఉదయం లేచిన తర్వాత వాంతి చేయించాను. అప్పుడు ఆమె పరిస్థితి కొంచెం మెరుగయింది.

(సశేషం)



నెలవంక తెరచాప

చిత్రం—ఎస్. లలితకుమారి (కొవ్వూరు)

# ఆంధ్రప్రభ

సచిత్ర వారపత్రిక

మద్రాసు

ఎడిటర్: నీలంరాజు వెంకటశేషయ్య


## పాఠ్యగ్రంథాలు

మహారాష్ట్ర ప్రభుత్వం ఆమోదించి ప్రవేశపెట్టిన ఒకానొక పాఠ్యపుస్తకం తప్పుల తడక అని, దానిలో వ్యాకరణ దోషాలు కొల్లలని ఇటీవల వెల్లడి కావడం దిగ్భ్రమ కలుగజేసింది.

ఇది కేవలం ఒక్క రాష్ట్రానికి మాత్రమే పరిమితమైన జాడ్యం కాదు. దేశవ్యాప్తంగా ఉన్నది.

ఈ జాడ్యం నిర్మూలించడానికి దేశమంతటికి వర్తించే సమగ్రమైన పథకం ప్రాతిపదికగా కృషి జరగడం ఆవశ్యకమని ప్రస్తుత పరిస్థితి రుజువు చేస్తున్నది.

పాఠ్య గ్రంథాల నిర్ణయం రాష్ట్ర ప్రభుత్వాల అధికారానికి లోబడిన విషయం. స్థానిక అధికారులు, ప్రచురణ కర్తలు లాలూచీ అయి పాఠ్య పుస్తకాలను ప్రవేశపెట్టడం ఈ అనర్థానికి మూలకారణం.

ఈ విషయం కేంద్రప్రభుత్వ అధికారానికి కూడా లోబడినదిగా చేయడానికి అవసరమైతే రాజ్యాంగచట్టం సవరణ చేయడం ఆలోచించదగిన అంశం. రాష్ట్రాలలోను, కేంద్రంలోను కూడా పాఠ్యపుస్తకాల రచనను, నిర్ణయాన్ని పర్యవేక్షించే స్థాయి సంఘాలను ఏర్పాటు చేయడం మంచిది. విజ్ఞులు, అనుభవజ్ఞులు అయినవారి సహాయ సహకారాలతో ఉత్తమమైన పాఠ్య పుస్తకాలను రూపొందించడానికి ఈ చర్యలు తోడ్పడవచ్చు.

అన్నివిధాలా ఉత్తమమైన పాఠ్యపుస్తకాలు మాత్రమే బాలబాలికలకు నిర్ణయించడం ఎంత ముఖ్యమైనదో వేరుగా వివరించవలసిన పనిలేదు. లేతమననులను తప్పులకు, దోషాలకు ఆలవాలం చేయడం బలవంతంగా అన్యాయంగా ఒకరిని హత్య చేయడంకన్న దారుణమైన నేరం. హంతకులను శిక్షించడానికి చట్టాలు ఉన్నవి. బాలల మనసులు కలుషితంచేసి ఉజ్జ్వలంగా ఉండవలసిన వారి భవితవ్యాన్ని మొదట్లోనే నాశనం చేయ నమకట్టినవారు తప్పించుకొని పోవడం సహించడానికి వీలులేదు.

నేరం చేసినవారిని శిక్షించడం ఒకఎత్తు; అది జరుగకుండా చూడడం ఒకఎత్తు.

భావి పౌరుల భవితవ్యం స్వప్రయోజనపరుల చేతులలో నాశనం కాకుండా చూడడానికి, వారి భవిష్యత్తు ఉజ్జ్వలంగా తీర్చిదిద్దడానికి ఎంత ఖర్చు అయితే దేశానికి అంత మంచిది. ★

# గాంధీజీ కారాగార గాథలు



30, సెప్టెంబర్ 42.

బాపూజీ జన్మదినోత్సవంనాడు ఏమి చేయాలనే విషయమై మేమంతా నేడు చాలసేపు చర్చించాము. సరోజినీనాయుడు ఈ విషయం మొదలుపెట్టారు. తర్వాత ఒక్కరొక్కరు తమ అభిప్రాయాలు చెప్పడం ప్రారంభించారు. రాత్రి నేను వచ్చేవేళకు ఎనిమిది కొట్టి పది నిమిషాలు గడిచాయి. బాపూ సంగతేమిటో గ్రహించారు. "ఏమిటో గాలిమేడలు కడుతున్నారే?" అంటూ నవ్వారు. నేనుకూడ నవ్వుతూ, "చాల మంచి విషయాలమీదే చర్చ జరుగుతున్నది. దీనిలో బైబిల్ కూడ ఉంది. ఇక్కడ ఉండేవారి సాధారణ జ్ఞానం (జనరల్ నాలెడ్జి) పరీక్షించడం మంచిదని సరోజినీనాయుడు అభిప్రాయపడుతున్నారు. అందుకని ప్రశ్న పత్రాలు తయారుచేస్తున్నారు. దానిలో బైబిల్ ఉద్ధరణలు (ఉదాహరణలు) కూడా ఉంటాయి" అన్నాను.

కస్తూర్బా ఈ రాత్రి బాగా గడపలేదు. ఆహారంలో ఏదో వైషమ్యం కలిగిందని బాపూ అనుమానం.

1, అక్టోబర్ 42.

రేపు బాపూజీ జన్మదినం. బాపూ వాహ్యాళికి వెళ్ళిన తర్వాత పూలదండలు అలంకరించడంకోసం గోడలకు మేకులు కొట్టాము. బాపూ మధ్యాహ్నం నన్ను పిలిచి "అందరితోను చెప్పు. అలంకారం గిలంకారం ఉండగూడదు. అలంకరణ హృదయాంతరాళంలోనే ఉండాలి" అన్నారు. నేను నవ్వాను. రేపు సాయంకాలం మూడు గంటలకు బాపూ మరొక పని పెట్టుకోకుండా ఖాళీగా ఉండాలని బాపూతో చెప్పమన్నారు సరోజినీ నాయుడు. ఈ మాట చెప్పేటప్పుడు బాపూజీ అలంకారం, ఆడంబరం వద్దన్నమాట తెలిపారు. "మూడు గంటలకు ఏమిటి చేస్తారు?" అని ప్రశ్నించారు. అన్నయ్య అన్నాడు "అది చాల రహస్యం" అని. అలంకారం, ఆడంబరం వద్దని బాపూ అన్నారని సరోజినీ నాయుడుతో నేను అన్నప్పుడు ఆమె "బాపూజీ మనం, ముఖ్యంగా నేను వినోదంగా గడపడాన్ని అడ్డగించలేరు" అని నవ్వారు.

"బాపూ అలా అంటున్నప్పుడు పూవులదండల అలంకరణను మానివేద్దాము" అన్నది మీరా బహన్. "అక్కరలేదు. మీరు తప్పంతా నాపైన తోసివేయండి. జెయిలులోనూ గాంధీజీ హుకుము పాలించాలని ఆదేశం ఎవరిచ్చారట!" అన్నారు సరోజినీ నాయుడు.

"బాపూజీ జన్మదినంనాడు మేము ఎప్పుడూ బీదలకు అన్నదానం చేసేవారం. ఈసారి అలా చేయలేము" అని బా రెండు మూడు రోజులుగా అంటున్నారు. "ఎందుకు చేయలేము?" అని అడిగాను నేను. "ఇది జెయిలు. సర్కారు డబ్బులు ఈ విధంగా ఖర్చుచేయడానికి వీలులేదు—అని బాపూ అన్నారు" అని చెప్పారు కస్తూర్బా. మేము మా డబ్బులతో సామాను తెప్పిస్తున్నామనీ, సర్కారు డబ్బుతో కాదనీ, కనుక అన్నదానం చేయవచ్చునని బాకు వివరించాను. ఆమె సంతోషించారు. మాలిష్ సమయంలో బాపూజీ కూర్చునే గద్దెకు పైగా గోడమీద పూవులదండ వేయడంకోసం మేకులు కొట్టడానికి పెట్టిన గుర్తులను చూచి బా "ఇక్కడ పూవుల దండలు కట్టవద్దు. దర్వాజావద్ద తోరణాలు కట్టుకోండి. ఇక్కడ, లోపల ఈ ఆడంబరం వద్దు" అన్నారు. మేకులు కొట్టడానికి వచ్చిన జెయిలు వార్డరు అప్పటికి వెళ్ళిపోయాడు. తర్వాత వచ్చి, మేకులు కొట్టాడు. లేడీ డాక్టర్‌నుంచి కూరగాయల బుట్ట తెచ్చాను. మొదట తేనె తెప్పించాను; తర్వాత బెల్లం. బెల్లపు టాఫీలు నిన్ననే నేను తయారుచేశాను. బాపూజీతో సరోజినీ నాయుడు అన్నారు: "బాపూ, రేపు మీకు సభ్యుడైన మనిషికి వడ్డించే భోజనం వడ్డిస్తాము" అని. బాపూ నవ్వుతూ "అది ఏమిటి? ఎలాగు?" అన్నారు. "ప్రత్యేకమైన సూప్, గోబీ పూవుల (కాలీఫ్లవర్) కూర, చపాతీ, పచ్చి కూరలు మొదలయిన పదార్థాలు వంతులు వంతులుగా, మంచి పద్ధతిలో వడ్డిస్తాము" అన్నారు ఆమె. బాపూ నవ్వారు. సరోజినీ నాయుడు మాటలను కాదనలేకపోయారు.

జెయిలు సూపరింటెండెంట్ చాల పూవులు తెచ్చారు. మేము వాటిని దండగా గుచ్చాము. బాపూ పడుకొన్నమీదట, ఆయన గది దర్వాజాకు, ఆయన కూర్చునే గద్దె ఉన్న స్థలంమీద, ముందున్న అల్మారామీద, మహాదేవ భాయీ గది లోను, సరోజినీ నాయుడు గది గుమ్మానికి

# కారాగారంలో బాపూజీ ప్రథమ జన్మదినోత్సవం

మూలం :
**డాక్టర్ సుశీలానైయర్**
అనువాదం :
**తిరుమల రామచంద్ర**

దండలు కట్టాము. పెట్టెమీద నేను, అన్నయ్య తెల్లని ముగ్గుపిండితో "జీవేమ శరదశ్శతం" మంత్రం వ్రాశాము. అన్నయ్య మొదట బొగ్గుతో వ్రాశాడు. అతని అక్షరాలు చాల చక్కగా ఉంటాయి. నేను వాటిమీద ముగ్గు పిండి చల్లాను. ఒక్కొక్క పెట్టెమీద ఒక్కొక్క పంక్తి ఇలా వ్రాశాము:

"జీవేమ శరదః శతం,
పశ్యేమ శరదః శతం,
శృణుయామ శరదః శతం,
ప్రబ్రవామ శరదః శతం,
భూయశ్చ శరదః శతం."

రెండవవైపు పెట్టెమీద ఇదే విధంగా "అసతో మా సద్గమయ, తమసో మా జ్యోతిర్గమయ, మృత్యోర్మా అమృతం గమయ" అనే మంత్రాన్ని అన్నయ్య వ్రాశాడు. దీని మొదటి మంత్రం లోపల, ముందు పాదాలు తర్వాత వ్రాశాము. బాపూజీ దిగివెళ్ళేటప్పుడు ఒక్క మంత్రం చదువుకొంటారు; ఎక్కి వచ్చేటప్పుడు మరొక మంత్రం. రెండు వైపుల పెట్టెమీద ముగ్గులతో చిత్రాలు వేశాము. వసారాలో "సుస్వాగతం" వ్రాశాము. ఇవన్నీ వ్రాయడానికి, వ్రాయించడానికి రాత్రి 12—0 గంటలు కొట్టాయి. బాపూజీ లేచి కోపించుకుంటారేమోనని నేనూ, అన్నయ్యా భయపడ్డాము. "మిగిలింది వదిలి పెట్టు. ప్రొద్దుట చూద్దాం" అన్నాడు అన్నయ్య.

ఉదయం లేచి చూచేవేళకు ముగ్గుపిండి ఖతం. అందువల్ల రాత్రి ముగియకుండా మిగిలి పోయిన ముగ్గులు అల్లాగే ఉండిపోయాయి. సరోజినీ నాయుడు రాత్రి పదకొండున్నరకు తేనీరు చేయించుకొచ్చారు. తేనీరు తాగితే తాజాగా అవుతారు అన్నారు ఆమె. మహాదేవ భాయీ సమాధికి పూవులు తీసుకొనివెళ్ళే బుట్టలో పండ్లు, బాదాంపప్పు, టాఫీలున్న సీసా, తేనె సీసా మొదలయిన వస్తువులు పెట్టుకున్నాము. ఆ బుట్టను కూడా మీరాబహన్ పూవులతో అలంకరించింది. ఆమెలో కళాదృష్టి సహజం గానే ఉంది. అన్నిచోట్ల పూలదండలు అలంక రించే భారం ఆమె వహించింది. మొత్తం మీద కార్యకలాపాల పరిశీలన బాధ్యత సరోజినీ నాయుడు వహించారు. ఆమె కూర్చున్నట్లు గానే రాత్రి పదకొండున్నరవరకు రేపటికోసం పచ్చి బఠాణీ కాయలనుంచి గింజలు విడిపించారు.

ఉదయం భోజన సమయంలో మీరాబహన్ ఒక సూచన చేసింది—మేకపిల్లలను తీసుకొని వచ్చి, బాపూజీకి ప్రణామం చేయించాలని. ఆ మేకపిల్లల మెడలో 1) 'సహనావవతు' మంత్రం అట్టముక్కమీద వ్రాసి వ్రేలాడగట్టాలని అన్నయ్య సూచించాడు. ఈ సూచన మీరాబహన్‌కు నచ్చలేదు. ఏవో సాకులు చెబుతూ వచ్చింది. ఒకరి అభిప్రాయాలతో మరొకరు జోక్యం చేసుకోకపోవడం మంచిదని సరోజినీ నాయుడు అన్నమీదట అన్నయ్య తన సూచన ఉపసంహ రించుకొన్నాడు. ఇది నాకు కొంచెం కష్టమనిపించింది. "నీ అభిప్రాయంతో ఏకీభ వించకపోవడం విచారకరం. బాపూ ఎంతో సంతోషించేవారు. బాపూజీకి మేక పిల్లలతో నమస్కారం చేయించడం ఎంతో శోభాయ మానంగా ఉంటుంది" అన్నాను అన్నయ్యతో. "మేకపిల్లలతో ఐక్యానికి బాపూ ఎంతో సంతో షిస్తారు. కాని, దానిని వదలిపెట్టడమే మంచిది. ఇంతకూ, ఈ రోజు ఉద్దేశ్య మేమిటి? అందరూ ఏకాభిప్రాయంతో, పరస్పరం సౌహార్దంతో ఉండ డమే కదా! ఇతరులు ఇష్టపడని దానిని సంతో షంతో వదలిపెడదాము" అన్నాడు అన్నయ్య.

రాత్రి నేను పడుకొన్న తర్వాత మీరా బహన్ తనంతట తాను అన్నయ్యవద్దకు వచ్చి, మేకపిల్లల మెడలో 'సహనావవతు' మంత్రం వ్రాసిన అట్టలు వ్రేలాడగట్టాలని నిర్బంధిం చింది. ఆమె ఒక ఖాళీ సబ్బుపెట్టె తెచ్చింది. అన్నయ్య దానిలోని తమలపాకుల రంగులో ఉన్న అట్టను కత్తిరించి, దానిపైన 'సహనా వవతు' మంత్రం వ్రాశాడు. ఆ మంత్రంకింద "మోటాభాయీ ఘణుజీవో!" (పెద్దన్నయ్యా, చాలకాలం జీవించు!) అనే మాటలూ వ్రాశాడు. ఈ అట్టముక్కలు మేకపిల్లల మెడలో వ్రేలాడ గట్టాలి. బాపూ మేకపాలు తాగుతారు గనుక మేకపిల్లలకు పెద్దన్నయ్య అయ్యారుగదూ! నేను పన్నెండు, పన్నెండున్నరకు పక్కమీద దొర్లు తున్నాను. కళ్ళు మండుతున్నాయి. అన్నయ్య కళ్ళు చల్లగా ఉండడంకోసం కళ్ళమీద వేసుకో డానికి మట్టి పట్టీ తయారుచేశారు. దానిని కళ్ళమీద వేసుకున్నాను. అయినా, నిద్ర పట్ట లేదు. ఒంటిగంట తర్వాత నిద్రపోగలిగాను. 3—20 కి బాపూ ప్రార్థనకోసం లేపారు. మట్టి పట్టీతో కళ్ళకు ఎంతో హాయి కలిగింది.

2, అక్టోబర్ 42.

నేడు ప్రార్థనకు తప్పక లేవవలసిందిగ సరోజినీ నాయుడు, మీరాబహన్ నాతో అన్నారు. నేను లేవడానికి వెళ్ళేవేళకు సరోజినీ నాయుడు మేలుకొనే ఉన్నారు. ఆమె రాత్రల్లా నిద్రపోనే లేదు. మీరాబహన్ గాఢంగా నిద్రపోతున్నందున, లేపవలసి వచ్చింది. బాపూజీకి మొదటి ఆశ్చర్యం అందరూ ప్రార్థనకు రావడం; రెండవ ఆశ్చర్యం గుమ్మంపైన పూవుల అలంకరణ. మీరాబహన్ "జాగియే రఘునాథ్ కుంవర!" అనే భజన గీతం పాడింది. ప్రాతఃకాల భజన గీతాలలో ఇదొక్కటే లెనకు వస్తుందని ఆమె నాతో అన్నది. ప్రార్థన తర్వాత నేను చూడగా, ఒక జెయిలు వార్డరు ముగ్గుపిండి తెచ్చి నింపుతున్నాడు. కస్తూర్బా కూడ నేడు ప్రార్థనకోసం తొందరగా లేచారు. మీరాబహన్ ప్రార్థనకు ముందే బాపూజీకి ప్రణామం చేసింది. నేను, అన్నయ్య, కస్తూర్బా ప్రార్థన తర్వాత ప్రణామం చేశాము. ప్రార్థన తర్వాత బాపూ, కస్తూర్బా పడు కున్నారు. సరోజినీ నాయుడు, మీరా బహన్, అన్నయ్య, నేను స్నానం చేశాము. నేను బాపూజీ కోసం బత్తాయి పళ్ళరసం పిండుతుండగా ఆయన లోపలికి వచ్చారు.

ప్రార్థన సమయంలో గోడమీద కట్టిన పూల దండలను చూచి ఆయన కస్తూర్బాతో "నీవు వద్దనలేకపోయావా?" అని అడిగారు. "నేను వద్దనే అన్నాను. కాని, వాళ్ళు ఒప్పుకో లేదు" అని బా సమాధానం చెప్పారు. సరోజినీ నాయుడు పూలదండలు తీయించి పెట్టెదగ్గర పెట్టించారు.

బాపూ ఫలాహారానికి వచ్చారు. పళ్ళబుట్ట కూడా పూవుల అలంకరణతో సిద్ధంగా ఉంది. సరోజినీ నాయుడు బాపూజీకి పూలదండ వేశారు. మీరా బహన్ వడికినదారపు దండ వేశారు. జెయిలు సూపరింటెండెంటు మిస్టర్ కటేలీ కూడా పూలదండ వేశారు. హరిజన సేవకోసం 74 రూపాయలు కానుక ఇచ్చి, ఆదరంతో ప్రణామం చేశారు. నేనొక వడుకు దారపు దండ తయారుచేశాను. అన్నయ్య వచ్చి నాకొక దండ తయారుచేసి ఇమ్మన్నాడు. అతడు పండ్లరసం తయారుచేస్తుండగా, నేను అతని కొక మాలు దండ, కస్తూర్బా కొక నూలుదండ తయారు చేశాను. నేను ఆ దండలమీద రంగు ముగ్గు పిండితో 74 అంకె వ్రాశాను. కింద ఒక్క కొండుముల్లెపూవు గుచ్చాను. "మహాదేవ భాయీ వడికిన మాలు లేదా?" అని అడిగాడు అన్నయ్య. నేను వెంటనే ఆయన వడికిన దారం తీసి, ఒక దండ సిద్ధపరచాను.

బాపూ ఫలాహారం చేస్తుండగా, మీరా బహన్, అన్నయ్య చెరిఒక మేకపిల్లను పట్టుకొని

# గాంధీజీ కారాగార గాథలు

నవ్వారు. రెండింటి మెడలోను, పూవులు పత్రి దండలతోపాటు, 'సహనావవతు' మంత్రం వ్రాసిన అట్ట వేలాడుతున్నది. మీరా బహన్ ఆ మేక పిల్లల తరఫున చిన్న ప్రశంసావాక్యం చెప్పి, వాటి ముందుకాళ్ళు జోడించి, నమస్కారం చేయించింది. తర్వాత బాపూజీ చేతులతో వాటికి రొట్టె ఇప్పించింది. కాని, అంతకుముందే ఆ మేకపిల్లలు వాటి మెడలోని దండలలోని పూవులను, చిగురుటాకులను తినడం ప్రారంభించాయి. బాపూ మనసార నవ్వారు. నేను బాపూజీకి, కస్తూర్బాకు స్వయంగా తయారుచేసిన వడుకు మాలు దండ వేశాను. అన్నయ్య తన దండ వేశాడు. తర్వాత వాహ్యాళికి బయలుదేరాము. దారిలో బాపూజీ మేము ముగ్గుపిండితో మెట్ల మీద వ్రాసిన మంత్రవాక్యాలు చూచారు. పూల మాలలు, బుట్టలోని పూవులు మహాదేవ భాయీ సమాధివద్దకు తీసుకొని వెళ్ళాము. అక్కడి గోడ పైన అన్నిటినీ అలంకరించాము. రోజూచేసే ప్రార్థన చేశాము. ప్రార్థనకుముందు అన్నయ్య మహాదేవ భాయీ వడికిన మాలుతో తయారు చేసిన దండను బాపూజీకి వేశాడు. బాపూజీ కళ్ళు, అన్నయ్య కళ్ళు చెమ్మగిల్లినాయి. మేము, ముఖ్యంగా ప్రార్థన సమయంలో మహాదేవ భాయీ మాతోపాటే నిలబడి ప్రార్థన జరుపుతున్నట్టే అనిపించింది.

వాహ్యాళి సమయంలో బాపూ "నీవు భర్తృహరి కథ విన్నావా?" అని నన్ను అడిగారు. "జీహాఁ. విన్నాను" అన్నాను. బాపూ వివరించడం ప్రారంభించారు: "భర్తృహరి యోగి అయిన తర్వాత తన పత్నివద్దకు భిక్షకు వెళ్ళవలసి వచ్చింది. వెళ్ళుతాడు. తన సోదరుని



# కారాగారంలో బాపూజీ ప్రథమ జన్మదినోత్సవం

దండలు కట్టాము. మెట్లమీద నేను, అన్నయ్య తెల్లని ముగ్గుపిండితో "జీవేమ శరదశ్శతం" మంత్రం వ్రాశాము. అన్నయ్య మొదట బొగ్గుతో వ్రాశాడు. అతని అక్షరాలు చాల చక్కగా ఉంటాయి. నేను వాటిమీద ముగ్గు పిండి చల్లాను. ఒక్కొక్క మెట్టుమీద ఒక్కొక్క పంక్తి ఇలా వ్రాశాము:

"జీవేమ శరదః శతం,
పశ్యేమ శరదః శతం,
శృణుయామ శరదః శతం,
ప్రబ్రవామ శరదః శతం,
భూయశ్చ శరదః శతం."

రెండవవైపు మెట్లమీద ఇదే విధంగా "అసతో మా సద్గమయ, తమసో మా జ్యోతిర్గమయ, మృత్యోర్మా అమృతం గమయ" అనే మంత్రాన్ని అన్నయ్య వ్రాశాడు. దీని మొదటి మంత్రం పైకి, ముందు పాదాలు తర్వాత వ్రాశాము. బాపూజీ దిగివెళ్ళేటప్పుడు ఒక్క మంత్రం చదువుకొంటారు; ఎక్కి వచ్చేటప్పుడు మరొక మంత్రం. రెండు వైపుల మెట్లమీద ముగ్గుతో చిత్రాలు వేశాము. వసారాలో "సుస్వాగతం" వ్రాశాము. ఇవన్నీ వ్రాయడానికి, వ్రాయించడానికి రాత్రి 12—0 గంటలు కొట్టాయి. బాపూజీ లేచి కోపించుకుంటారేమోనని నేనూ, అన్నయ్యా భయపడ్డాము. "మిగిలింది వదిలి పెట్టు. ప్రొద్దుట చూద్దాం" అన్నాడు అన్నయ్య.

ఉదయం లేచి చూచేవేళకు ముగ్గుపిండి ఖతం. అందువల్ల రాత్రి ముగియకుండా మిగిలిపోయిన ముగ్గులు అల్లాగే ఉండిపోయాయి. సరోజినీ నాయుడు రాత్రి పదకొండున్నరకు తేనీరు చేయించారు. తేనీరు తాగితే తాజాగా అవుతారు అన్నారు ఆమె. మహాదేవ భాయీ సమాధికి పూవులు తీసుకొనివెళ్ళే బుట్టలో పండ్లు, బాదాంపప్పు, టాఫీలున్న సీసా, తేనె సీసా మొదలయిన వస్తువులు పెట్టుకున్నాము. ఆ బుట్టను కూడా మీరాబహెన్ పూవులతో అలంకరించింది. ఆమెలో కళాదృష్టి సహజంగానే ఉంది. అన్నిచోట్ల పూలదండలు అలంకరించే భారం ఆమె వహించింది. మొత్తం మీద కార్యకలాపాల పరిశీలన బాధ్యత సరోజినీ నాయుడు వహించారు. ఆమె కూర్చున్నట్టుగానే రాత్రి పదకొండున్నరవరకు రేపటికోసం పచ్చి బటానీ కాయలనుంచి గింజలు విడిపించారు.

ఉదయం భోజన సమయంలో మీరాబహెన్ ఒక సూచన చేసింది—మేకపిల్లలను తీసుకొని వచ్చి, బాపూజీకి ప్రణామం చేయించాలని. ఆ మేకపిల్లల మెడలో 1) 'సహ నావవతు' మంత్రం అట్టముక్కమీద వ్రాసి వ్రేలాడగట్టాలని అన్నయ్య సూచించాడు. ఈ సూచన మీరాబహెన్‌కు నచ్చలేదు. ఏవో సాకులు చెబుతూ వచ్చింది. ఒకరి అభిప్రాయాలతో మరొకరు ఐక్యం చేసుకోకపోవడం మంచిదని సరోజినీ నాయుడు అన్నమీదట అన్నయ్య తన సూచన ఉపసంహరించుకొన్నాడు. ఇది నాకు కొంచెం కష్టమనిపించింది. "నీ అభిప్రాయంతో ఏకీభవించకపోవడం విచారకరం. బాపూ ఎంతో సంతోషించేవారు. బాపూజీకి మేక పిల్లలతో నమస్కారం చేయించడం ఎంతో శోభాయమానంగా ఉంటుంది" అన్నాను అన్నయ్యతో. "మేకపిల్లలతో ఐక్యానికి బాపూ ఎంతో సంతోషిస్తారు. కాని, దానిని వదిలిపెట్టడమే మంచిది. ఇంతకూ, ఈ రోజు ఉద్దేశ్యమేమిటి? అందరూ ఏకాభిప్రాయంతో, పరస్పరం సౌహార్దంతో ఉండడమే కదా! ఇతరులు ఇష్టపడని దానిని సంతోషంతో వదలిపెడదాము" అన్నాడు అన్నయ్య.

రాత్రి నేను పడుకొన్న తర్వాత మీరా బహెన్ తనంతట తాను అన్నయ్యవద్దకు వచ్చి, మేకపిల్లల మెడలో 'సహనావవతు' మంత్రం వ్రాసిన అట్టలు వేలాడగట్టాలని నిర్బంధించింది. ఆమె ఒక ఖాళీ సబ్బుపెట్టె తెచ్చింది. అన్నయ్య దానిలోని తములపాకుల రంగుతో ఉన్న అట్టను కత్తిరించి, దానిపైన 'సహనావవతు' మంత్రం వ్రాశాడు. ఆ మంత్రంకింద "మోటాభాయీ ఘణుజీవో!" (పెద్దన్నయ్యా, చాలకాలం జీవించు!) అనే మాటలూ వ్రాశాడు. ఈ అట్టముక్కలు మేకపిల్లల మెడలో వ్రేలాడగట్టాలి. బాపూ మేకపాలు తాగుతారు గనుక మేకపిల్లలకు పెద్దన్నయ్య అయ్యారుగదూ! నేను పన్నెండు, పన్నెండున్నరకు పక్కమీద దొర్లుతున్నాను. కళ్ళు మండుతున్నాయి. అన్నయ్య కళ్ళు చల్లగా ఉండడంకోసం కళ్ళమీద వేసుకోడానికి మట్టి పట్టీ తయారుచేశారు. దానిని కళ్ళమీద వేసుకున్నాను. అయినా, నిద్ర పట్టలేదు. ఒంటిగంట తర్వాత నిద్రపోగలిగాను. 3—20 కి బాపూ ప్రార్థనకోసం లేపారు. మట్టి పట్టీతో కళ్ళకు ఎంతో హాయి కలిగింది.

2, అక్టోబర్ 42.

నేడు ప్రార్థనకు తప్పనిసరిగా లేపవలసిందిగా సరోజినీ నాయుడు, మీరాబహెన్ నాతో అన్నారు. నేను లేపడానికి వెళ్ళేవేళకు సరోజినీ నాయుడు మేలుకొనే ఉన్నారు. ఆమె రాత్రల్లా నిద్రపోనే లేదు. మీరాబహెన్ గాఢంగా నిద్రపోతున్నందువల్ల, లేపవలసి వచ్చింది. బాపూజీకి మొదటి ఆశ్చర్యం అందరూ ప్రార్థనకు రావడం; రెండవ ఆశ్చర్యం గుమ్మంపైన పూవుల అలంకరణ. మీరాబహెన్ "జాగియే రఘునాథ్ కుంవర!" అనే భజన గీతం పాడింది. ప్రాతఃకాల భజన గీతాలలో ఇదొక్కటే తనకు వస్తుందని ఆమె నాతో అన్నది. ప్రార్థన తర్వాత నేను చూడగా, ఒక జెయిలు వార్డరు ముగ్గుపిండి తెచ్చి నింపుతున్నాడు. కస్తూర్బా కూడ నేడు ప్రార్థనకోసం తొందరగా లేచారు. మీరాబహెన్ ప్రార్థనకు ముందే బాపూజీకి ప్రణామం చేసింది. నేను, అన్నయ్య, కస్తూర్బా ప్రార్థన తర్వాత ప్రణామం చేశాము. ప్రార్థన తర్వాత బాపూ, కస్తూర్బా పడుకున్నారు. సరోజినీ నాయుడు, మీరా బహెన్, అన్నయ్య, నేను స్నానం చేశాము. నేను బాపూజీ కోసం బత్తాయి పళ్ళరసం పిండుతుండగా ఆయన లోపలికి వచ్చారు.

ప్రార్థన సమయంలో గోడమీద కట్టిన పూల దండలను చూచి ఆయన కస్తూర్బాతో "నీవు వద్దనలేకపోయావా?" అని అడిగారు. "నేను వద్దనే అన్నాను. కాని, వాళ్ళు ఒప్పుకోలేదు" అని బా సమాధానం చెప్పారు. సరోజినీ నాయుడు పూలదండలు తీయించి మెట్లదగ్గర పెట్టించారు.

బాపూ ఫలాహారానికి వచ్చారు. పళ్ళబుట్ట వాడా పూవుల అలంకరణతో సిద్ధంగా ఉంది. సరోజినీ నాయుడు బాపూజీకి పూలదండ వేశారు. మీరా బహెన్ వడికినదారపు దండ వేశారు. జెయిలు సూపరింటెండెంటు మిస్టర్ కటేలీ కూడా పూలదండ వేశారు. హరిజన సేవకోసం 74 రూపాయలు కానుక ఇచ్చి, ఆదరంతో ప్రణామం చేశారు. నేనొక పడుకు దారపు దండ తయారుచేశాను. అన్నయ్య వచ్చి నా కొక దండ తయారుచేసి ఇమ్మన్నాడు. అతడు పండ్లరసం తయారుచేస్తుండగా, నేను అతని కొక నూలు దండ, కస్తూర్బా కొక నూలుదండ తయారు చేశాను. నేను ఆ దండలమీద రంగు ముగ్గు పిండిలో 74 అంకె వ్రాశాను. కింద ఒక్కొక్క కొండుమల్లెపూవు గుచ్చాము. "మహాదేవ భాయీ తీసిన నూలు లేదా?" అని అడిగాడు అన్నయ్య. నేను వెంటనే ఆయన వడికిన దారం తీసి, ఒక దండ సిద్ధపరచాను.

బాపూ ఫలాహారం చేస్తుండగా, మీరా బహెన్, అన్నయ్య చెరిఒక మేకపిల్లను పట్టుకొని

మూలం :

**డాక్టర్ సుశీలానైయర్**

అనువాదం :

**తిరుమల రామచంద్ర**



గురుశిష్యులు

చిత్రం—ఎస్. రాజారావు (ఖర్గపూర్)

ప్రవర్తన, అతని ఎడల తన ప్రవర్తన జ్ఞాపకం వచ్చి, 'అరే! యోగి అయినప్పటికీ, ఈ గాయం మాయలేదే!' అనుకుంటాడు. ఈ మాట మహాదేవ్ వెళ్ళిపోయినందువల్ల ఏర్పడిన గాయానికి కూడా వర్తిస్తుంది." బాపూ తమ దుఃఖాన్ని పైకి కనబరచకపోయినా, ఆయనకు పెద్ద గాయమే తగిలింది.

కస్తూర్బాకు మాలీష్, స్నానం చేయించి నేను సరోజినీ నాయుడుకు సహాయం చేయడానికి వెళ్ళాను. ఆమె బటాణీల పులావ్ చేయమన్నారు. వంకాయ పెరుగుపచ్చడి చేశాను. బాపూ భోజనానికి ఏర్పాట్లు చేశాము. మీరా బహెన్ టేబిల్ పైని గుడ్డ అంచులలో పూవులతో అందంగా స్వస్తికం గుర్తు అమర్చింది. వాకిట్లో ఎర్ర ముగ్గుపిండితో స్వస్తికం ముగ్గు వేశాము. ఒక చిన్న పళ్ళెంలో పూవులు అలంకరించిన పళ్ళు పెట్టాము. మీరా బహెన్ పచ్చికూరలు కూడా అందంగా అమర్చింది. టొమాటో పండ్లను గులాబీ పూవుల ఆకారంలో తరిగింది.

పదిన్నరకు కలెక్టర్, డాక్టర్ శాహ వచ్చారు. డాక్టర్ శాహ బాగా మాట్లాడారు. కలెక్టర్ "మీ జన్మదినోత్సవంనాడు మీరు ఎలా ఉన్నారు?" అని మాత్రమే ప్రశ్నించారు. బాపూజీ కుర్చీలో కూర్చున్నారు. వారు రాగానే లేచి నిలబడి కరస్పర్శ చేశారు. కింద గద్దెమీద కూర్చుని లేవడమంటే ఆయనకు కష్టం. కలెక్టర్ రాగానే నిలబడి కరస్పర్శ చేయడం నాకు నచ్చలేదు. కలెక్టర్ కోసం బాపూ నిలబడడంఎందుకు? ఏమి చేద్దాం? బాపూ మూర్తీభవించిన మర్యాద. చేయవలసిన పనిలో పొరపాటు చేయరు. రెండవ పని చేయలేరు. ఖైదీ హోదాలో ఆయన కలెక్టరును గౌరవించాలి. ఫలాహారం చేసేటప్పుడు బాపూ "నేను పుట్టిన రోజున ఉపవాసం చేస్తాను. ఇతరులతోపాటు వారి పుట్టిన రోజు పండుగలనాడు ఉపవాసం చేయిస్తాము. కనుక నేడు నన్ను పండ్లు, కూరగాయలు మాత్రం పుచ్చుకోనివ్వండి" అన్నారు. "అలా కాదు. పండ్లు, పాలు పుచ్చుకోండి" అన్నాను నేను. "కూర తినకతప్పదు" అన్నారు సరోజినీ నాయుడు. ఆఖరుకు బాపూ రొట్టె మినహా తక్కినవన్నీ స్వీకరించారు. బాపూ భోజనానంతరం అరికాళ్ళకు మానెరాయించుకొన్న తర్వాత పడుకున్నారు. కస్తూర్బా కూడ నేడు ఉత్సాహంలో ఉన్నారు. నేటి కోసం ఆమె చిన్న తలంటి స్నానం చేశారు. కొత్త బొట్టు పెట్టుకున్నారు; పూవులు ముడుచుకున్నారు. బాగా భోజనం చేశారు. నేను, మీరా బహెన్, కస్తూర్బా మధ్యాహ్నం బాగా నిద్రపోయాము. అందరం అలసిపోయాము.

సరోజినీ నాయుడు మధ్యాహ్నం విశ్రమించలేదు. వార్డర్లకోసం, ఖైదీలకోసం వేయించిన పప్పు, సేమియాలు, దూద్‌పేడా, జిలేబీ, అరటిపళ్ళు తెప్పించారు. అన్నిటినీ భాగాలు చేసిపెట్టారు. ఇవన్నీ ఆమె డబ్బు, మీరా బహెన్ డబ్బు, నా డబ్బు వెచ్చించి తెప్పించారు. మూడు కొట్టగానే ఖైదీలందరూ వచ్చి బారులుతీరి కూర్చున్నారు. బాపూ వచ్చి వారికి దర్శనమిచ్చి, నమస్కరించారు. కస్తూర్బా తినుబండారాలను, మిఠాయిలను అందరికీ పంచిపెట్టారు. ఆమె చాల సంతోషంగా ఉన్నారు. ఖైదీలు మిఠాయి తినడం చూచి బాపూజీ కూడ సంతోషపడ్డారు. నేడు ఉదయం వార్డర్లందరూ బాపూజీకి నమస్కరించడానికి వచ్చారు. వారందరికీ బాపూ ఏదో ఒక పండు ఇచ్చారు. వాహ్యాళి సమయంలో "వార్డర్లకు పళ్ళిచ్చాము. ఖైదీలకు ఏమీ ఇవ్వలేదే?" అన్నారు బాపూజీ. "ఇస్తాము. మీరు చూస్తూ ఉండండి" అన్నాను నేను. మధ్యాహ్నం ఖైదీలకు తినుబండారాలు ఇవ్వడం చూచి ఆయన చాల సంతోషించారు. జెయిలులో ఖైదీలు మామూలు వస్తువుల కోసమే అంగలారుస్తారు. మిస్టర్ కాటేలీ అందరికీ ఐస్‌క్రీములు తయారు చేశారు. బాపూజీకోసం మేకపాలతో తయారుచేశారు. స్వయంగా ఐస్‌క్రీం మిషన్ తిప్పారు. సాయంకాలం భోజన సమయంలో—మూడు సంవత్సరాల తర్వాత—బాపూజీ సరోజినీ నాయుడు బతిమాలడంవల్ల కొంచెం ఐస్‌క్రీం తిన్నారు. మేము అంతా కడుపునిండా తిన్నాము. వార్డర్లకూ, ఖైదీలకూ ఇచ్చాము. బాపూ చాల ఆనందించారు; "వీళ్ళకు జెయిలులో ఇలాటి వస్తువులు చూడడానికి కూడా దొరకవు" అన్నారు. సాయంకాలం మహాదేవ భాయీ సమాధిమీద కొత్త పూవులు పెట్టివచ్చాము.

సాయంకాలం ప్రార్థన సమయంలో 'వైష్ణవ జన' పాడాము. ప్రార్థన తర్వాత నేను బాపూజీని వసారాలోకి పిలుచుకొని వెళ్ళాను. నీటిబుగ్గమీద, కటకటాలమీద దీపాలవరుస పెట్టారు. సుందర దృశ్యం! "శంకర్ (మహాదేవభాయీ) సమాధివద్ద కూడా దీపాలు పెట్టించిరండి" అన్నారు కస్తూర్బా. నేను, అన్నయ్య వార్డర్లతోపాటు వెళ్ళి దీపాలు పెట్టించాము.

రాత్రి మేమందరం ఐస్‌క్రీం తిన్నాము. దానివల్ల నా కడుపు కొంచెం చెడింది. బాపూ రాత్రి పక్కమీద పడుకున్నప్పుడు "మీరు ఇదంతా చేశారే, దీనిలో ఎంత ఔచిత్యం ఉందా అని నాకు అనుమానంగా ఉంది" అన్నారు. మనం ఖైదీలం. ఖైదీలు ఇలా ఉత్సవాలు చేయడం ఉచితమేనా?—అని ఆయన వ్యథ.

3, అక్టోబర్ 42.

ఉదయం ప్రార్థన తర్వాత నేను మళ్ళీ నిద్రపోయాను. రాత్రి తిన్న ఐస్‌క్రీం స్వాస్థ్యాన్ని పాడుచేసింది. వాహ్యాళిలో ఉదయం లేవలేదేమని బాపూ అడిగారు. కారణం చెప్పవలసివచ్చింది. (కాని, సరోజినీ నాయుడు అన్నారు గదా, "ఏమిటుంది? ప్రతి రోజూ ఇలాగే అవుతూ ఉంటుందా? ఈ విషయమై బాపూజీకి గాని, మీరాకుగాని చెప్పనక్కరలేదులే. మీరా సంవత్సరం పొడుగునా, తర్వాత గూడ ఐస్‌క్రీం తినడంవల్ల ఇది అయింది అని చెప్తూనే ఉంటుంది.") బాపూ విని నవ్వి, "నామాట విని నీవు తినకుండా ఉంటే ఇంత కష్టం ఉండేది కాదు. దీనివల్ల ఇకమీద ఇలాటి పొరపాటు చేయవులే. ఇంతకూ ఇలాటి తినుబండారాలు తయారుచేసినవారు వాటికోసం పాత్రలు కూడా తయారుచేశారు. ఐస్‌క్రీం పెద్ద పెద్ద పాత్రలనిండా తినరు. షెర్రీ (దక్షిణ స్పెయిన్‌లో తయారుచేసే తెల్లసారా) తాగే గ్లాసు వేరుగా ఉంటుంది. పోర్ట్ (మరొక రకం సారా) తాగే గ్లాసు మరొక విధంగా ఉంటుంది. విస్కీని విడిగా తాగరు, సోడా కలుపుకొని తాగుతారు. వాళ్ళను అనుకరించే మనకు ఇవన్నీ తెలియవు. గిన్నెలు నింపుకొని మస్తుగా తాగుతాము. తర్వాత కష్టపడుతాము" అన్నారు. తర్వాత ఊరుకున్నారా? ఇలా అన్నారు: "మీరు చేసినదంతా చేయదగింది కాదు. సరోజినీ నాయుడు ఏ పనైనా గొప్పగా చేస్తుంది. కాని,

దాని విలువ నిజమైన సంస్కృతి. నేను చెప్పే వాటిలో నిజమైన సంస్కృతాా? ఉంటుంది. మీరు చేసిన దానినంతా హాస్యం చేయడానికి కూడా అవకాశం ఉంది. మనం జైలులో ప్రభుత్వం వెన్న తినక, పాలు తాగక ఎండిన రొట్టెలు తింటే, ఎవడు హాస్యం చేస్తాడు? నేను ఇదంతా సహించాను. మొండి కెత్తితే, మీరు చేయలేరు. కాని, నేను ఏమనుకున్నానంటే, దీనిలో ఉన్నది పరిశుద్ధమైన ప్రేమే కదా అని జరుగనిచ్చాను. ఖైదీలకు ఇవన్నీ ఇవ్వడం బాగుండదనుకో. అయినా ఇదంతా మన హద్దునుమించిన విషయాలు."

మీరాబహన్ నిన్న బాపూజీ వద్దకు తీసుకొని వచ్చిన మేకపిల్లలలో ఒక్కటి చచ్చిపోయినదని సాయంకాలం 5—0 గంటలకు తెలిసింది. 4—0 గంటల వరకు బాగుంది. 5—0 గంటలకు చచ్చి పడి ఉంది. ఏదో విషపు పాము కాటు వేసిందనే అనుమానం కలిగింది. నిన్న బాపూ చేతి రొట్టె తినడానికే అది నేటిదాక బతికి ఉందని అందరి మనస్సులలోను భావం మెరిసింది. ఖైదీలు, వార్డర్లు— అంతమందీ దానికి మంచిగతి కలుగుతుందని అన్నారు.

మహాదేవభాయీ మరణించి నేటికి ఏడు వారాలు పూర్తయాయి.

4, అక్టోబర్ 42.

నేను వ్రాయ మొదలు పెట్టిన ఇంగ్లీషు వ్యాకరణం చాల కొద్దిగానే అయింది. 7వ తేదీ వరకు ఎలా ముగుస్తుంది? పూర్తి కావడం కష్టమనే తోస్తుంది. ఈ విషయం నా మనస్సును చాల బాధించింది. తమకు చేస్తున్న ఉపచారమంతా మానివేసి సమయమంతా వ్యాకరణానికే వినియోగించమని బాపూజీ నాతో అన్నారు. అయితే నేను ప్రస్తుతం ఆయన కోసం చేస్తున్న సేవ చాల కొంచెమే. కస్తూర్బా సేవ ఉంది. అది వదలుకొనేది కాదు. దినమంతటికీ చాల కొద్దిగా వ్యవధి దొరుకుతుంది. చదవడానికే తీరిక ఉండదు. ఈ మధ్యను కండ్ల నొప్పివల్ల రెండు రోజులు వృథా అయాయి ఇదంతా నా మొదటి ఎమ్. డి. పరీక్షలాగ అయింది.

బాపూజీ ఇక్కడికి వచ్చి నేటికి ఎనిమిది వారాలు పూర్తయాయి. చూడాలి! ఇంకా ఎన్ని వారాలు నిండుతాయో!

బాపూజీ సలహామీద నేను మిస్టర్ కటేలీతో మా యింటినుంచి వ్రాసిన ఉత్తరాలు చేరాయని, నేను జవాబు వ్రాయదలచుకోలేదని మా యింటికి తెలియజేయవలసిందిగా అన్నాను. ఈ విషయాన్ని ఆయన బొంబాయి ప్రభుత్వం దేశీయాంగశాఖ కార్యదర్శికి వ్రాశాడు. ఎందుకంటే ఆయన సరాసరి మా యింటికి ఉత్తరం వ్రాయడానికి వీలులేదు.

5, అక్టోబర్ 42.

ఈ సందేశాన్ని తాము పంపలేమని, నేనే స్వయంగా ఈ విషయమై వ్రాయవచ్చునని బొంబాయి ప్రభుత్వం దేశీయ శాఖనుంచి

# గాంధీజీ కారాగార గాథలు

నేడు ఉత్తరం వచ్చింది. ఉత్తరం వ్రాయవని బాపూ అన్నారు.

బాకు రెండు రోజులుగా సరిగా నిద్రపట్టడం లేదు. నేడు బా దోమతెర లేకుండ గదిలో పడుకున్నారు. గదిలో గాలి బాగ వస్తుంది. అన్నయ్య ఆమెకు సమీపంలో పడుకున్నారు. బాపూజీ రాత్రిళ్లు మేల్కొన్నప్పుడు ఏ వస్తువైనా కావలసి వస్తుందేమో! అన్నయ్య త్వరగా లేవడేమో! నేనైతే త్వరగా మేల్కొంటాను. అందువల్ల బా నన్ను బాపూ దగ్గర నుంచి కదలనిచ్చేవారు కారు. బా నేడు బాగా నిద్రపోయారు. బాపూ అర్ధరాత్రి నన్ను మేల్కొలిపి, కస్తూర్బా నిద్రపోయారా అని అడిగారు. ఆమె అలికిడే వినిపించడం లేదు. "నిద్రపోకపోతే, ఏమి అయ్యారని అనుకుంటారు?" అని అడిగాను. "ఎవరేమి చెప్పగలరు?" అని ఎదురు ప్రశ్న వేశారు ఆయన. నేను లేచివెళ్ళి చూచి వచ్చాను. బా గాఢ నిద్రలో ఉన్నారు. బానుకూడా ఇక్కడే పోగొట్టుకోవలసి వస్తుందేమోనని బాపూజీకి భయం ఏర్పడింది. కాని, బా ఆరోగ్యం కుదుటబడి వెలుపలికి వెళ్ళాలి అన్న నిశ్చయం దృఢంగా ఉంటే, అంతా సవ్యంగానే జరుగుతుంది.

6, అక్టోబర్ 42.

నిన్న బాపూజీ మౌన దినం. కర్నల్ శాహ రావలసింది నిన్ననే. కాని, ఆయన నిన్న కాక నేడు వచ్చాడు. రేపు భండారీతోపాటు వస్తారు.

"ఇప్పుడు నా పుట్టిన రోజుకోసం ఎలాటి బాహ్యాడంబరాలూ వద్దు" అని బాపూ అన్నారు. దేశీ పంచాంగం తిథి ప్రకారం రేపు ఆయన జన్మ



అభిసారిక

చిత్రం—వై. బాలయ్య (నారాయణరావుపేట)

దినం. మనకు కార్యక్రమం కొనసాగించడానికి, భోజన స్థలంలో పూవులు అలంకరించడానికి ఆయనతో అనుమతి పొందాము.

ప్రభుత్వం మిస్టర్ కటేలీకి కూడా ఉత్తరం వ్రాసింది: ఉత్తరాల విషయమై నేను పంపిన సందేశం నా యింటివారికి పంపలేక పోయామని, నేనే స్వయంగా వ్రాయాలని. నేను ప్రభుత్వానికి వ్రాయదలచిన జవాబు ముసాయిదా అన్నయ్య తయారు చేశాడు. బాపూ దానిని ఒప్పుకోలేదు. "బిల్కుల్ సామాన్యంగాను, సంక్షిప్తంగాను ఉండాలి" అన్నారు.

నేడు మాతాజీ (అమ్మ) మొదలయిన వారి ఉత్తరాలు వచ్చాయి. వాహ్యాళి సమయంలో బాపూ "బొంబాయి ప్రభుత్వం కార్యాలయంలో నీవంటే మంచి గురి ఏర్పడినట్టు ఉంది" అన్నారు. నాకు ఆయన మాటలు అర్థం కాలేదు. "ఎలాగ?" అని అడిగాను. "ఈసారి ఉత్తరం త్వరగా ఇచ్చివేశారు. కోతలు గీతలు లేవు. ఈమె సక్రమంగా ప్రవర్తిస్తున్నది; మన పనిగూడ చేస్తున్నది: అని అనుకుని ఉంటారు. నీవు లేకపోతే బాను ఇక్కడ ఉంచరు" అన్నారు బాపూ. బా జబ్బు మనిషి. డాక్టర్ వెంట ఉన్నారు. ఇందువల్ల ప్రభుత్వానికి చాల సౌకర్యం.

7, అక్టోబర్ 42.

నేడు దేశీ పంచాంగం తిథి ప్రకారం బాపూ జన్మదినం. ఉదయం ప్రార్థనకు బా కూడా వచ్చారు. బాపూ నేడు కేవలం అపక్వాహారం పుచ్చుకొనడానికి నిశ్చయించారు. ఉదయం ఫలహారానికి బత్తాయి పళ్లరసం పుచ్చుకున్నారు. ఉదయం ప్రార్థనకు ముందు వేడినీళ్ళలో తేనె కలిపి పుచ్చుకున్నారు. మధ్యాహ్నం కూడా ఇదే. 11—0 కొట్టేవేళకు టొమాటో పళ్ళరసం, బాదం పప్పులు, ముంత మామిడి పప్పులు, గాజర్ (కేరెట్), ముల్లంగి గడ్డలు రుబ్బిన ముద్ద, తడిపిన కిస్‌మిస్ పండ్లు ముందు పెట్టాను. అన్ని పదార్థాలు బత్తాయి పళ్ళ డిప్పలలో పెట్టాను. చాల అందంగా కనిపించింది. భోజన స్థలంలో జాతీయపతాకను, 'భారత్ మాతాకీ జయ్' అనే వాక్యాన్ని పూవులతో అమర్చాను. అతి సుందరంగా కనిపించింది.

మీరాబహన్, బా, అన్నయ్య, నేను నూలు దండలు బాపూజీకి వేశాము. బా చెప్పడం వల్ల నేను బాపూజీకి తిలకం దిద్దాను. మధ్యాహ్నం అరగంటసేపు వడుకు పోటీ జరిగింది. బాపూ, అన్నయ్య, మీరాబహన్, నేను— నలుగురం వడికేవారం. నేను ప్రథమురాలుగా వచ్చాను.

భండారీ, కర్నల్ శాహ వచ్చారు. మాకొక జింకను ఇమ్మని భండారీని కోరాము. అది ముండ్లతీగల మా ప్రాంతానికి వెలుపల తిరుగుతూ ఉండేది; మేము వాహ్యాళి వెళ్ళుతున్నప్పుడు మావైపే చూచేది. అది మా దగ్గరికి వస్తే, దానికీ లాభం, మాకూ లాభమని మేము అనుకున్నాము.

(తరువాయి 64 వ పేజీలో)

# ఉత్తరాలు

(2 వ పేజీ తరువాయి)

తెలుగు పాఠకులు చదివి తన్మయులై మహాత్ముని జీవిత పథమును అవగాహన చేసికొను భాగ్యమును కలుగజేసిన శ్రీ తిరుమల రామచంద్రగారు, ఈ శీర్షికను ప్రచురణార్థము ఎంచుకొని అశేషఆంధ్ర పాఠకులకందజేసిన ఆంధ్రప్రభ సచిత్ర వార పత్రిక సంపాదక వర్గము ఎంతయు అభినంద నీయులు. ఇటువంటి విజ్ఞానాత్మకమగు వ్యాసావళి జాతి మనోవికాసానికే వెలుగు బాటగా చిరకాలము నిలిచి పోగలదని నా విశ్వాసము.

—షేక్ మొహిద్దీన్
(అనంతపురం)

* * *

'గాంధీజీ కారాగారగాథలు' ఆంధ్రప్రభసచిత్ర వారపత్రికలో ప్రచురించడంఆంధ్రుల అదృష్టం. ఇట్టి రచనల బహుళ ప్రచారము అత్యంత ఆవశ్యకం. ప్రతి తెలుగింటిని అలంకరించతగిన ఉత్తమ పత్రిక ఇది అనడంలో అతిశయోక్తి లేదు.

—అన్నెపు వరాహనరసింహం
(బొడ్డేపల్లిపేట)

* * *

మీ ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రికలో వెలువరించే 'గాంధీజీ కారాగార గాథలు' శీర్షిక నాకు చాలా బాగా నచ్చింది. దానికితోడు మీ వివరణలు అర్థం కావడానికి చాలా తోడ్పడ్డాయి. 1—7—64 వ తేదీ సంచిక అయిదవ పేజీలోని మూడవ కాలంలోని 9 వ వరసను "ఈ స్నానాల గదిలో కమోడ్‌కు పైన దీపం ఉంది. బాపూ మరుగు దొడ్డికి వెళ్లేటప్పుడూ చదివేవారు. కనుక ఈ స్నానాల గది ఆయనకు నచ్చింది" అని వ్రాశారు. అనగా బాపూ మరుగుదొడ్డికి వెళ్లే త్రోవవెంట చదివేవారని అర్థమవుతుంది. కాని కమోడుకుపైన దీపం ఉండటం, గది వారికి నచ్చటం అంటే దొడ్డిలోనే చదివేవారని అనిపిస్తుంది. ఏది నిజమో నాకు అర్థం కాలేదు.

—అకునూరు లక్ష్మీనరసింహారావు
(వట్టిబ్రహ్మంతపాడు)

* * *

8—7—64 వ తేదీ సంచిక ముఖచిత్రం 'కపోత సందేశం' చాలా బాగుంది. ఆ చిత్రం ఈ వారం ప్రభ కెంతయో శోభను చేకూర్చిన దనుటలో సందేహం లేదు. దానిని చిత్రించిన శ్రీ శేలినీడి వారికి, ప్రచురించిన మీకు నా ధన్యవాదములు.

—గుండుమల్ల వెంకటరామారావు
(శ్రీకాకుళం)

* * *

24—6—64 వ తేదీ సంచికలో ఉపనిషత్కథ 'సత్యకామ జాబాలుడు'లో తన కుమారుడగు సత్యకామునితో తల్లియగు జాబాల చెప్పిన వాక్యములిట్లున్నవి: "నాయనా! మన గోత్రం ఏమిటో నాకు తెలియదు. నా యౌవనంలో దాసీగా పనిచేస్తూ చాలాచోట్ల తిరిగాను. చాలా మందిని సేవించాను. నిన్ను కన్నాను. కాని నీ తండ్రి ఎవరో నాకు తెలియదు."

జాబాల దాసీగా పనిచేసినట్లును, చాలా మందిని సేవించియుండుటచే సత్యకామునితండ్రి ఎవరో ఆమెకు తెలియనట్లును, ఆ ఉపనిషద్వాక్యమునకు అర్థము వ్రాయుట చాల ఆశ్చర్యముగా ఉన్నది. అట్టి అర్థమును రచయిత ఎచ్చటనుండి స్వీకరించి వ్రాసిరో తెలియకున్నది. ఛాందోగ్యోపనిషచ్ఛాంకర భాష్యములోను, బ్రహ్మసూత్రశాంకర భాష్య వ్యాఖ్యానములగు రత్నప్రభా, భామతీ, న్యాయనిర్ణయాదులలోను, జాబాల తన భర్త జీవించి ఉన్న కాలములో సర్వదా తన భర్త సేవలోను, వచ్చిన అతిథ్యభ్యాగతులను భోజనాది సత్కారములచే పూజించుటలోను నిమగ్నురాలై ఉండుటచే తన భర్తను తమగోత్రమేదియో అడిగి తెలిసికొనెడమను బుద్ధికూడ కలుగలేదనియు, అందుచే గోత్రము తెలియదని గౌతమునితో చెప్పుమని తనపుత్రున కాదేశించెననియు సుస్పష్టముగా వ్రాయబడి ఉండెను. శ్రీ శంకర భగవత్పాదులచే నిట్లు పూర్వోత్తర వాక్య సందర్భ సంప్రదాయానుసారముగా వ్రాయబడిన అర్థమును పరిత్యజించి తమకు తోచిన విధముగా ఉపనిషత్తులకు అర్థమువ్రాసి భారతీయసంస్కృతికిని, సమాజ వ్యవస్థకును, మహర్షి భార్యయగు ఒక మహాపతివ్రతకును మహాపచార మొనరించుట అనుచితము, అన్యాయము.

—ఘండికోట సుబ్రహ్మణ్య శాస్త్రి
(న్యూఢిల్లీ—3)

* * *

24—6—64 వ తేదీ సంచికలో శ్రీ నాయని సత్యనారాయణరావ్ గారు వ్రాసిన 'సబ్బుబిళ్ల' కథ చదివాను. అతను తీసుకున్న కథావస్తువు అతని సొంతం కాదనీ, కాపీచేసినదనీ చెప్పడానికి చాలా విచారిస్తున్నాను. ఆంగ్లంలో శ్రీ హెచ్. హెచ్. మన్రో (సాకీ) వ్రాసిన 'డస్క్' అనే కథను కొద్ది మార్పులు చేసి తెలుగులోకి అనువదించేసి, కనీసం 'ఆంగ్ల కథకు అనుకరణ' అనైనా చెప్పకుండా, తన సొంత పేరు కింద ప్రచురణకు పంపించడం నిజంగా దుస్సాహసం.

గొప్పకోసంపోయి, మూలం సంగతి మరుగు పరచడానికి ప్రయత్నించకుండా ఉండినట్లయితే, శ్రీ నాయని సత్యనారాయణరావ్‌గారి అనువాద క్రమం, భాషాపటిమ చాలా బాగున్నాయని సంతోషించగలిగి ఉండేవాడిని.

—పి. బి. రావు
(రేణుకూట్)

* * *

మీరు ప్రచురించిన 'తిరుపతయ్య కథ'లో గేదె గురించి విపరీతంగా వ్రాశారు. కొంపతీసి

మీకు తెలుసా?

## జవాబులు

1 సాల్ట్ లేక్ సిటీ.

2 జెకోస్లవేకియా.

3. జార్జి వాషింగ్టన్.

4. కాలి మడమ పైన ఉండే నరం.

5. ఆర్టిక్ తీర ప్రాంతాలలో.

6. సుమారు 2 1/3.

రచయిత పశువుల డాక్టరు కాదు కదా! చివర 'విట్టు' బాగుంది. మొత్తానికి కథ చాలబాగుంది. వారికి మా అభివందనలు.

—గాదె ప్రసాద్
(మాదేపల్లి)

* * *

24—6—64 వ తేదీ సంచిక నుండి 8—7—64 వ తేదీ సంచిక వరకు ప్రచురించిన ఉత్తరాలన్నిటిని క్షుణ్ణంగా పరిశీలించాను. చాలా మంది, నా తోడి పాఠకులు పి. మల్లికార్జునరావుగారి— 'దీపం వెలిగింది' గూర్చి కథ బాగుందనో; రచన, శైలి మొదలగునవి బాగున్నవనో అభిప్రాయం వెలిబుచ్చారు. కాని వారొకవిషయం గమనించలేదు. అది ఇది: జానపద సౌందర్యంతో తొణికిసలాడు గౌరి; ఆమె అమాయకమైన ప్రేమ దూరంకాగానే అతిగా హృదయ వేదనతో కుమిలి తుదకు తనకు సర్వస్వం అర్పించే భార్యను నిరాకరించే రామప్పదొరలాంటి మనస్తత్వంగలవారు; భర్త అన్యమనస్కుడని తెలిసి కూడ, అతని అనురాగమూ, ఆదరణా పొందటానికి ప్రయత్నించేసి చివరకు గౌరిలాగ వేషం వేసి భగ్నమనోరథయైన విజయరాణిలాంటి సహన శీలురూ, త్యాగమూర్తులూ మనకీనాటి సంఘంలో కన్పించరు. ఇది వాస్తవానికి కొంత దూరంగానే అనిపిస్తుంది.

—కోట లింగమూర్తి
(హైదరాబాద్)

* * *

కోడూరి కౌసల్యాదేవిగారు రచించిన 'శంఖు తీర్థం' నన్ను ఎంతో ఆకర్షించింది. రచయిత్రికి ఇందుకు నా హృదయపూర్వక నమస్కారములు. ఆమెచే భగవంతుడు గొప్ప కథలను వ్రాయింప జేయునని నా కోరిక.

—దేవభక్తుని సుబ్బారావు
(తురుమెళ్ల) ★

# కొత్త పుస్తకాలు

## మహాదాత కర్ణ

[రచన: శ్రీ పురాణపండ రాధా కృష్ణమూర్తి. ప్రచురణ: అధ్యాత్మ ప్రచారక సంఘము, రాజమండ్రి. క్రౌన్ 260 పేజీలు. వెల. మూడు రూపాయలు.]

భారతేతిహాసంలో మరువరానివ్యక్తి కర్ణుడు. ఆయన గాథను చక్కని శిష్టవ్యావహారికంలో రచించారు శ్రీ పురాణపండ రాధాకృష్ణమూర్తి. ఈ పుస్తకాన్ని పదిహేడు ప్రకరణాలుగా విడగొట్టి వ్రాశారు. కర్ణుని జననమాది నిర్యాణందాకా ఉంది. ప్రభుదత్త బ్రహ్మచారి రచించిన 'మహాభారత్‌కే ప్రాణ్ మహాత్మా కర్ణ' అన్న గ్రంథం ఇందుకు ఆలంబనం అని రచయిత గ్రంథాదిన చెప్పారు. రచన రమణీయంగా ఉంది. ఇటీవల కొన్ని రచనలు మూలానికి విరుద్ధంగా—రావణుణ్ణి మహాత్ముడుగా, రాముణ్ణి తక్కువవాడుగా, కర్ణ దుర్యోధనాదులను సత్యవాదులుగా, పాండవులను అసత్యవాదులుగా చిత్రిస్తూ వెలువడుతున్నాయి. కుతర్కమయమైన అట్టి రచనలు స్వకపోల కల్పితాలేగాని పురాణాలపై ఆధారపడి వ్రాసినవి కావు. ప్రస్తుతరచనలో అట్లుగాక, తనకు తోడ్పడిన దుర్యోధనుని కోసం మంచి, చెడు ఏదైనా చేయడానికి సిద్ధపడిన కృతజ్ఞతామూర్తి కర్ణుణ్ణి నిష్పక్షపాతంగా చిత్రించారు రచయిత. ఇది హర్షించదగిన విషయం. రచనలో కొన్ని ప్రయోగాలు బాగుండలేదు. ఉదా: విలువిద్యా వైదుష్యం (53), అత్యంతగారాబంగా(1), ప్రమాదమొచ్చినా (31) వంటివి. 'ధనుర్విద్యా వైదుష్యం, ఎంతో గారాబంగా, ప్రమాదం వచ్చినా' అని సవరించుకుంటే బావుంటుంది.

## తేజోమూర్తులు

[వ్యాస సంపుటి. రచన: శ్రీ దశిక సూర్యప్రకాశరావు. ప్రచురణ: గోదా గ్రంథమాల. ముసునూరు, కృష్ణాజిల్లా. క్రౌన్ 90 పేజీలు. వెల. 1-35.]

గోదాగ్రంథమాల ఇదివరకే ఎన్నో చక్కని గ్రంథాలను ప్రచురించి ప్రశంసలనందుకున్నది. ఇది మరొక చక్కని ప్రచురణ. బాలబాలికలకు సుబోధకంగా ఉండేరీతిని శ్రీ దశిక సూర్య ప్రకాశరావుగారు నాలుగు వ్యాసాలు రచించారు. కందుకూరి వీరేశలింగము, రఘుపతి వేంకటరత్నమునాయుడు, కొండ వెంకటప్పయ్య, స్వామి సీతారాంగారలను గూర్చిన నాలుగు వ్యాసముల సంపుటే ఈ తేజోమూర్తులు. ఆంధ్ర దేశంలో ఆశేషఖ్యాతి నార్జించిన ఈ మహానుభావుల జీవిత విశేషాలను బాలబాలికలకు తెలియజేయడం ఎంతో అవసరమైన విషయం. సరళ గ్రాంథికంలో సులభశైలిలో రచించిన ఈ చిరుపొత్తము బాల సాహిత్యానికి ఒక కానుక.

—శ్రీరామ్

## గాంధీజీ కారాగార గాథలు

(8 వ పేజీ తరువాయి)

భండారీ సరే నన్నారు. కాని, తర్వాత సరోజినీ నాయుడు కోపగించుకున్నారు: "అది లోటను పొడుచేస్తుంది. దాని బాధ్యత ఎవరు వహిస్తారు?" అని. అందువల్ల భండారీ తమ అభిప్రాయం మార్చుకున్నారు.

సాయంకాలం బాపూ పండ్లు, ముంతమామిడి పప్పు పలుకులు, బాదంపప్పుపలుకులు, టొమాటో పండ్లరసం పుచ్చుకొన్నారు. పండ్ల పళ్ళెం కూడా బాగా అలంకరించాము. బా కూడా నేడు పండ్లు, పాలు మాత్రమే పుచ్చుకున్నారు.

సాయంకాలం ప్రార్థనలో మీరాబహెన్ "ప్రేమల్ జ్యోతి" (Lead kindly light) భజనగీతం గానం చేసింది. సరోజినీ నాయుడు "సంధ్యా ప్రార్థనాహ్వానం" (Call to Evening Prayer) అనే తన కవితను చదివారు. నేను, అన్నయ్య కొన్ని ప్రార్థన శ్లోకాలు పఠించాము. శ్లోకాలు చాల బాగున్నాయి. ప్రార్థనానంతరం అన్నయ్య ఛాందోగ్యోపనిషత్తు లోని కొన్ని మంత్రాలు చూపారు. వాటి అర్థం— ఎవని పనులన్నీ యజ్ఞమయమవుతాయో అలాటి వాడు 116 సంవత్సరాలు జీవిస్తాడని.

బాపూ వ్యాకరణ విషయంలో నాకు మరి పదిహేను రోజులు గడు విచ్చారు. శ్లోకాల విషయంలో హాస్యం చేశారు: "వాటి అర్థాలు నీకు తెలుసా, లేక భట్టుగారు—వంకాయ కథలాగానా?" అని. నేను కావాలనే నాకేమీ తెలియదన్నాను.

"ఇది మంత్రం. దీనిని జపించడం వల్ల సిద్ధి కలుగుతుంది; గాయత్రీ మంత్రంలాగా. అయితే, అర్థం చేసుకొని జపిస్తే. నీకు 116 సంవత్సరాల వరకు బతకాలని ఉందా?" అని అడిగారు. "అబ్బే. లేదండి. అది మీకోసం. నాబోటివారు 116 సంవత్సరాలు బతికి ఏమి చేస్తారు?" అని అన్నాను. "అయితే మంత్రాలు తప్పక ఫలదాయకమని మీరు భావిస్తారా?" అని ప్రశ్నించాను.

బాపూ ఈవిధంగా సమాధానం చెప్పారు: "నేను రామనామం గురించి చెప్పగలను. అది నా నిత్యానుభవం. రోజూ కొత్త అనుభవం. నేడు కూడా. నేను ఎందరో బాల బాలికలకు చెప్పాను, రామనామం జపించమని. చెడ్డభావాలు మనస్సులో వస్తున్నాయండీ అని వారు అంటారు. వాటిని తొలగించడానికీ ప్రయత్నించవద్దని నేనంటాను. 'వెళ్ళిపో! వెళ్ళిపో!' అని చెడ్డ భావాలను త్రోసి వేయడం కూడా ఒక విధంగా వాటిని పూజించడమే. వాటికి మారు మంచి అభిప్రాయాలను మనస్సులో నింపుకోండి; రామనామం జపించండి. చెడ్డ అభిప్రాయాలు వాటంతట అవే పారిపోతాయి. నేను ఎనిమిదేళ్ళ వాడిని. భూతప్రేతాలంటే, భయపడేవాడిని. 'రామనామం జపించావంటే భూతాలన్నీ పరుగెత్తి పోతాయి' అని నా దాది రంభ చెప్పింది. అప్పటినుంచి ఈ జపం ప్రారంభమయింది. తర్వాత రామాయణం చదవడం అలవాటయింది. ఈవిధంగా చిన్ననాటి ఆ సంస్కారం నాలో వేళ్ళు పాతుకు పోయింది. అప్పుడు భూతాలు పారిపోయాయో లేదో నాకు జ్ఞాపకం లేదుగాని, ఇప్పుడు అనవసరమైన భావాలను తొలగించడానికి రామనామం అద్భుతంగా పని చేస్తుంది. ఏమీ పనిచేయడం లేదని అనేవారికి నా సలహా ఏమిటంటే, ఇంకా జపం చేయండి—అని. ప్రయోజనం లేకపోదు." తర్వాత ఆయన ఇంజనీర్ స్టీవెన్‌సన్ కథ చెప్పారు. ఇక్కడ చాల లోతు. దీనిని పూడ్చి వంతెన కట్టడం సాధ్యం కాదు అని ఎవరో అన్నారు. ఎంత లోతయినా సరే, పూడ్చివేయక తప్పదన్నాడు స్టీవెన్‌సన్. తర్వాత అక్కడ వంతెన వేయనే వేశాడు.

(సశేషం)

(1) ఆశ్రమంలో భోజన సమయంలో భోజనానికి ముందు ఈ మంత్రం పఠిస్తారు:

"సహ నావవతు, సహ నౌ భునక్తు, సహ వీర్యం కరవావహై, తేజస్వినా వధీతమస్తు, మా విద్విషావహై."

Printed and published on behalf of Andhra Prabha Ltd., by S. V. SWAMY, B.A., at the Dinamani Press, Express Estates, Madras-2. Editor: NILAMRAJU VENKATASESHAIAH

సచిత్ర వారపత్రిక

మద్రాసు

ఎడిటర్: నీలంరాజు వెంకటశేషయ్య

# అవినీతి నిర్మూలనం

అవినీతి నిర్మూలించడానికి ఈనాడు తీవ్రమైన కృషి జరుగుతున్నది ఇందుకు కేంద్ర దేశాంగ శాఖ మంత్రి శ్రీ గుల్జారీలాల్ నందా కంకణం కట్టుకొన్నారు. రెండు సంవత్సరాలలో అవినీతి నిర్మూలించడం సాధ్యమని ఆయన నమ్ముతున్నారు ఇది జరిగితే ఆనందించని వారు ఉండరు

దేశంలో ఒక కోటి మంది అవినీతి పరులు ఉన్నారని భారత సాధుసమాజ్ అంచనా. ఈ అంచనాకు గల ఆధారాలు ఏమిటో తెలియదు దేశంలో అవినీతి నిర్మూలించడానికి సాధువులు కృషి చేస్తారని కూడా అదే వార్తలో ఉన్నది. సాధువులలో నిజాయితీ పరులు ఎందరు అన్నది వేరు. ఏమైనా ఈలాంటి కార్యక్రమం సాధువులకు అప్పగించితే భగవంతుడే ప్రజలను కాపాడవలసి ఉంటుందంటూ ఒరిస్సా మాజీ ముఖ్య మంత్రి శ్రీ బి. పట్నాయిక్ చేసిన విమర్శలో అర్థం ఉంది. అవినీతి నిర్మూలించడానికి అవలంబించవలసిన పద్ధతులను సహేతుకము. సమగ్రము అయిన ప్రాతిపదికపై రూపొందించడం అవశ్యకమని శ్రీ పట్నాయిక్ విమర్శ స్పష్ట పరుస్తున్నది.

యుద్ధం ఎలా ప్రారంభం అవుతుంది అన్న ప్రశ్నకు ఒక ప్రఖ్యాత రచయిత ఒక విధంగా సమాధానం చెప్పాడు అమెరికాలో ఒక గ్రామం అది. ఒక వీధిలో పిల్లలు ఆడుకొంటూ ఉంటారు అదే వీధిలో ఒక జర్మన్ కుటుంబం నివసిస్తున్నది. జర్మన్ బాలుడు తన జాతికి సహజమైన విధంగా ఠీవిగా సైనికుని వలె నడుస్తుంటాడు దానిని ఏ విధంగానూ అర్థంచేసుకోలేని అమెరికన్ బాలురు — అధిక సంఖ్యాకులు—ఆ జర్మన్ బాలుని కొట్టుతారు.

ఇది అవినీతికి కూడా వర్తిస్తుంది. యువకులు, ఉత్సాహపరులు, నిజాయితీ పరులు ప్రభుత్వోద్యోగాలలో చేరుతారు తోడివారిలో అధికసంఖ్యాకులు లంచగొండులయినప్పుడు కొత్త వారు ఎప్పటికో ఒకప్పటికి వారితో కలవనైనా కలవాలి. లేకపోతే అవినీతి పరులుగా చూపబడి ఉద్యోగాల నుండి తరిమివేయబడడం సంభవం. ఇది పలువురి అనుభవం.

ఈ విధంగా మొదట్లోనే చాలా వరకు అవినీతికి అంకురార్పణ జరుగుతున్నది ఆర్థికమైన ఇబ్బందులు, సుఖాపేక్ష దానిని పోషిస్తున్నవి.

అవినీతి పరులను శిక్షించవలసిందే. అనుమాన మేమీ లేదు. కాని అవినీతికి ఆస్కారం లేకుండా చూడడం అంతకన్న ముఖ్యం.

క్రింది తరగతి ప్రభుత్వోద్యోగులకు తగు వేతనాలు ఇవ్వడం ద్వారా వారు అవినీతికి ఒడిగట్టకుండా చూడడం శ్రేష్ఠమైన మార్గం. నీతి పరులను గుర్తించి గౌరవించడం కూడా అవసరం. ★

# కారాగారంలో ఈద్, దీపావళి, మీరాబహన్ పద్మజల జన్మదినం

10, అక్టోబర్ '42

పగలంతా వేడి కొంచెంతక్కువగా కనిపించినా, సాయంకాలానికి హెచ్చింది. కాని, మబ్బులుకూడా ముసురుకున్నాయి. అయితే,నిన్నటి కారుమబ్బులు ఒక్క చినుకూ కురవకుండా పటాపంచలై పోయి నప్పుడు నేటి మబ్బులపై ఎలాటి ఆశ పెట్టు కోగలం?

కస్తూర్బా ఆరోగ్యం చాల బాగుపడింది. ఆమె ఇప్పుడు అన్నిచోట్ల తిరుగుతున్నారు. ప్రతి పనిలోను ఆమె ఏదో చెప్పవలసిఉంటుంది. ఆమెకు భోజనంలోను అభిరుచి కలిగింది.

సాయంకాలం మహాదేవభాయీ సమాధికి సమర్పించడానికి కొద్దిగా పూవులు తీసుకొని వెళ్ళాము. నేడు ఎండ తక్కువ గదా, ఉదయం పెట్టిన పూవులు ఎండిపోయి ఉండవని అను కున్నాను. కాని, అవి ఎండిపోయి ఉన్నాయి. స్వస్తికాకారంలో పూవులు అమర్చడానికి తగినన్ని పూవులు లేవు. కాని, ఒక క్రాసు మాత్రం తయారు చేయగలిగాము. బాపూజీకి అది చాల బాగుందని అనిపించింది. ఆ క్రాసును బాపూ జీయే అమర్చారు.

నేడు, చాల రోజుల తర్వాత మహాదేవభాయీ మరణదృశ్యం రోజంతా నాముందు కనిపించింది.

సాయంకాలం "తస్మా దపరిహార్యేర్థే న త్వం శోచితు మర్హసి" అనే గీతాశ్లోకం మననం చేయ వలసిందని బాపూ చెప్పారు. మనవారిలోని దోషా లను మనం సమత్వం కోల్పోక అందంగా సహించా లని దానిని బాపూజీ వివరించారు.

నా గొంతుక నేడుకూడా నొచ్చింది.

## ఈద్-ఉల్-ఫితర్

11, అక్టోబర్ '42

నేడు ఉదయం మహాదేవభాయీ సమాధిపై కొత్త పూవులు సమర్పించడానికి వెళ్ళాను. దానికి ఐదారు నిమిషాలు పట్టింది. సామాన్యంగా మేము ప్రార్థనలోనే చాల కాలం గడుపుతాము. పూవులు సాయంకాలం అలంకరిస్తాము. అవి మరునాటి ఉదయం వరకు తాజాగా ఉంటాయి.

బాపూ నేడు తల తాకితేనే నొప్పి అన్నారు. రక్తపుపోటువల్ల ఇది కలిగిందేమో అనుకుని, పరీక్షించాను. రక్తపుపోటు 166—100 ఉంది. కనుక నొప్పికి కారణం మలబద్ధకం అయి ఉంటుంది. నిన్నరాత్రి ఆయన నిద్రకూడా బాగా లేదు. ఇదికూడా కారణం కావచ్చు.

"రేపు ఈద్ పండుగ. సేమియాలు తినండి" అనిసరోజినీనాయుడు బాపూతో అన్నారు. బాపూ అన్నారు: "నన్ను ఖర్జూరాలు తిననివ్వండి. హజ రత్ మహమ్మద్‌కు అవేకదూ, ఆహారం?" సరోజినీనాయుడు అంగీకరించారు. ఈ సంగతి కస్తూర్బాకు తెలిసి "రేపు మీరు ఫలాహారంచేయ డం ఎందుకు?" అని అడిగారు. బాపూ సోమవారం మౌనవ్రతం కావడంవల్ల "ఈద్ కోసం" అని వ్రాసి చూపారు. "ముసల్మానులు రేపు అన్నీ భుజిస్తారు. మీరెందుకు ఉపవాసం వంటిది చేయడం?" అని ప్రశ్నించారు బా. "దక్షిణాఫ్రి కాలో రంజాన్ నెలంతా నేను ఉపవాసం ఉండడం నీకు తెలీదూ? ఇప్పుడు ఒక్కనాడైనా ఉపవాసం చేయలేదు. కనుక రేపు, ఈద్‌నాడైనా కొంత త్యాగం చేద్దామని, పైగంబర్‌కు ఇష్టమైన ఖర్జూరప్పండ్లు, పాలు పుచ్చుకుంటాను; నాకు ఇష్టమైన రొట్టె, కూర వదలిపెడుతాను" అన్నారు బాపూ.

# గాంధీజీ కారాగార గాథలు

బా నేడు రాజకీయ విషయాలు చాల మాట్లాడారు. "ఎవరీ అంటున్నాడు, గాంధీ జిన్నా ఒకరితో ఒకరు మాట్లాడుకోడమే లేదని. గాంధీ జిన్నా ఇంటికే వెళ్ళి పలకరించి వచ్చారు. మహాదేవభాయీ ఈవిషయాలన్నీ వ్రాసిపెట్టాడు. నేను వ్రాతమూలకమైన సాక్ష్యం అందరిఎదుటా పెడుతాను" అన్నారు ఆమె. "అందువల్లనే అందరూ ఎవరీని అబద్ధాలకోరు అంటున్నారు" అన్నాను నేను. "ఔనౌను. వీరంతా చాల చెడ్డ వారు" అన్నారు ఆమె.

రాత్రి నేను బాపూ సేవను అన్నయ్యకు అప్ప గించాను. మీరాబహన్ తలనొప్పితో బాధపడు తున్నది. కనుక ఆమె తల మాలిష్ చేశాను. సరో జినీనాయుడు కాళ్ళకు నూనె రాచి మాలిష్ చేశాను.

మూలం :

**డాక్టర్ సుశీలానైయర్**

అనువాదం :

**తిరుమల రామచంద్ర**

చేసేది. పదిన్నర గంటలకు పడుకున్నాను.

సాయంకాలం రంజాన్ నెలవంకను బాపూజీ అందరికన్నా ముందు చూచారు. మౌనంగా ఉన్నారు. నన్ను పిలిపించి నెలవంక చూపారు. జైలులోమహమ్మద్‌ఖాన్ అనే ముస్లింవార్డరు ఉన్నాడు. అతనికి నెలవంక చూపించి, నాతో అతనికి బత్తాయి పండ్లు ఇప్పించారు. మేమే రంజాన్ ఉపవాసం చేశామన్నట్టుగా అందరం నెల వంకను చూచి సంతోషించాము.

12, అక్టోబర్ '42

నేడు ఈద్‌ఉల్ ఫితర్. బాపూ ఉదయం 3–10 నిమిషాలకే ప్రార్థనకు వచ్చారు. ప్రార్థన తర్వాత పడుకున్నారు. ఆయన నేడు కాగిన పాలు మినహాగా తక్కినవన్నీ అపక్వ పదార్థాలే ఆర గించారు: ఖర్జూరాలు, టొమాటో, బత్తాయి పళ్ళు, ముల్లంగి, బాదంపప్పు మొదలయినవి. సాయంకాలం ప్రార్థనలో అన్నయ్య ఖురాన్ షరీఫ్ ఆయతులు ( వాక్యాలు ) పఠించాడు. సరోజినీ నాయుడు తన కవితను వినిపించారు. సాయం కాలం ప్రార్థన తర్వాత బాపూ కస్తూర్బాకు ఒక భజన గీతం స్వరం నేర్పించారు. సరోజినీనాయుడు ఇది చూచి నవ్వారు. "74 సంవత్సరాల ముసలి దంపతులు నవ వధూవరుల లాగ ఆనందిస్తు న్నారు" అన్నారు ఆమె.

నేను 7వ తేదీ 'టైమ్స్ ఆఫ్ ఇండియా' పత్రికలో పడిన వింత వివాహ వార్తను—91 సంవత్సరాలపురుషునికి, 74 సంవత్సరాలస్త్రీకి— ఆమెకు చదివి వినిపించాను. ఆమె నవ్వుతూ "వీరిద్దరి ముందు 74 సంవత్సరాల యువతి పిల్లవాళ్ళతో సమానం" అన్నారు. చాలసేపు అందరూ బాగా నవ్వుకున్నాము.

మీరాబహన్ మహాదేవభాయీసమాధికి నిత్యం రావడానికి మూరు వారానికి ఒకమారు రావడానికి బాపూ అనుమతి కోరింది. ఆయన సంతోషంగా అనుమతించారు.

వాహ్యాళి సమయంలో బాపూ నేను ఇలాటి సమయంలో బొంబాయి చేరడం, ఇక్కడికి రావడం మొదలయిన ఘటనలకు ఆశ్చర్యం ప్రక టిస్తూ, "వీటిని ఈశ్వరుని చమత్కారం అనడం కన్నా ఏమనగలం? ఇంత పెద్ద సామ్రాజ్యంతో నేను పోరాడుతూ ఉండడం, వారు ఎంత బెదిరిం చినా, నాపై ఆ బెదిరింపుల ప్రభావం పడక పోవడం ఈశ్వరుని చమత్కార లీలలే. నాకు భయ మన్నది లేదు; నిరాశ అంతకన్నా లేదు; వారిపై నాకు కోపం లేదు; నా హృదయం నుంచి వారి విషయంలో శాపనార్థాలువంటివి బయలుదేరడం లేదు." అన్నారు.

## విజ్ఞానశాస్త్రజ్ఞురాలికి జోహార్లు

23, అక్టోబర్ '42

ఈరోజు కస్తూర్బా చాల ఖిన్నురాలుగా కనిపించారు.

బాపూనేడుంక్యూరీ పుస్తకం చదువుతున్నారు.

"ఆమె నిజమైన తపస్విని. పారిస్‌కి వెళ్ళి ఆమె ఇంటిని చూద్దామని ఆశ కలుగుతున్నది. మన దేశంలోని ఒక్క విజ్ఞాన శాస్త్రజ్ఞుడైనా ఇలాటి కష్టం అనుభవించాడా? నా అభిప్రాయంలో, పరిణామం ఏమిటంటే, మనస్సైన ఆంగ్లేయుల మెహర్బానీ ఉన్నందువ వారి పద్ధతినే మనం పనిచేయుడం నేర్చుకున్నాము. పరిశోధన అంటే ఒక వెల్ల ఏనుగనే భావం ఏర్పడింది. ఎంతో డబ్బు ఖర్చవుతున్నది. టాటా ఎన్నో పెద్ద ప్రయోగ శాలలు కట్టించారు. ప్రభుత్వమూ నెలకొల్పింది. అయితే వాటిలో ఎంత పని జరుగుతూంది?" అని ప్రశ్నించారు బాపూ.

సాయంకాలం బాపూ ఇలా అన్నారు: "వ్యాకరణం నేర్చుకొనేవాడు ఒక పదం సారం గ్రహించినంతమాత్రాన సంతోషపడడు." ఈమాట వర్డ్స్‌వర్త్ "కర్తవ్యం" (Ode to Duty) అనే కవితపై జరిగిన చర్చపై అన్నారు. "వ్యాకరణం చదవదలచిన వాడు ప్రతిపదం అర్థాన్నీ లోతుగా తెలుసుకొంటాడు. సూక్ష్మాతిసూక్ష్మంగా అన్ని అంశాలూ తెలుసుకొనడానికి అలవాటు చేసుకొంటాడు. ఈవిధంగా ఒక్కొక్క పద చర్చలో ఘంటలు గడచిపోతాయి" అన్నారు ఆయన.

బా విషయంలో బాపూజీకి తీరని చింత. కాని ఏమి చేస్తారు? ఆమె అనారోగ్య కారణంగా నేడే విడుదల కావచ్చు; విడుదల అవుతారు. కాని, విడుదలయితే ఆమె ఇంకా గాభరా పడుతారు. బాపూజీ లేక వెలుపల ఆమెకు ఏదీ బాగనిపించదు. బాపూ వియోగం సహించకనూ పోవచ్చు; మరణించనూ వచ్చు. బాపూ అరెస్టయిననాడు ఆమెకు విరేచనాలు పట్టుకున్నాయి. ఇక్కడికి వచ్చినమీదట ఆమె ఆరోగ్యం దానంతట అదే బాగయింది. ఒకటి రెండు రోజులలో ఆమె ఇక్కడికి రాకపోయి ఉంటే, బహుశా ఆమె సంగతి ముగిసిపోయేదే.

24, అక్టోబర్ '42

బాపూ నిన్నరాత్రి చాల తక్కువసేపే నిద్రపోగలిగారు. బాలో ఖిన్నత చాల కనిపించింది. బాపూ ఆమె చింతతో నిద్రపోలేక పోయారు. ఆయన బా మంచాన్నే కనిపెట్టుకొని ఉండడానికి వీలుగా తమ మంచం ఇటువైపుగా తిప్పుకున్నారు.

మేడమ్ క్యూరీ పుస్తకానికయితే బాపూ అతుక్కుపోయారు. ఆమె కూతురు ఒకామె ఢిల్లీలో బాపూను కలుసుకొనడానికి వచ్చింది—ఆమె పేరు ఈవ్‌క్యూరీ—ఈ పుస్తక రచయిత్రి. "ఆమె ఢిల్లీకి వచ్చినప్పుడు ఆమెతో బాగా పరిచయంచేసుకోలేకపోయినందుకు విచారిస్తున్నాను" అన్నారు బాపూ. "ఈ పుస్తకాన్ని నీవు హిందీలో సుందరంగా అనువదించాలి" అన్నారు నాతో సాయంకాలం. తర్వాత భాషను గంభీరంగా అవలోడనం చేయవలసిన అవసరం, దాని మహత్వం వివరించారు.

నేడు ఉదయం గీతా పారాయణం సమయంలో చాలసార్లు నిద్ర తూగు వచ్చింది. "గీతా పారాయణం వదలిపెడితే మంచిదని నేను అనుకుంటున్నాను" అని బాపూ దుఃఖంతో అన్నారు. ఈ విధంగా ఆయన అనే అవకాశం రాకూడదని



సరస్వతి (బ్రిటిష్‌మ్యూజియమ్)

చిత్రం—ఓ. వి. నరసింహులు గుప్త (మదనపల్లి)

నేను నిశ్చయించేసుకొని, అలాటి అవకాశం ఇవ్వనని బాపూతో అన్నాను.

"ప్యారేలాల్‌ను చూస్తే మా అబ్బాయి బాబా జ్ఞాపకం వస్తాడు. నీవు లీలామణిని జ్ఞాపక పరుస్తున్నావు" అన్నారు నేడు సరోజినీ నాయుడు. "ఇది మంచిదే. మీకు మా గృహ వాతావరణం ఏర్పడింది" అని నేనన్నాను. పాపం! ఆమె చాల వరకు మాకు అమ్మలాయి కూర్చున్నారు. అమ్మలాగ మా అందరి తిండితిప్పలసంగతి చూసేవారు.

## మీరాబహన్ పుట్టినరోజు

5, నవంబర్, 42.

బాపూ, లార్డ్ హేలీఫాక్స్ కుమారుని మరణానికి సంతాపం తెలుపుతూ లార్డ్ లిన్‌లిత్‌గోకు లేఖ వ్రాశారు. దానిలో ఆయన ఆంగ్లేయుల బహాదురీని స్తోత్రంచేస్తూ, "యుద్ధంలో పాల్గొనని ఒక్క ఉమ్రావ్ కుమారుడైనా ఉన్నాడా? రాజ పరివారంలోని, ప్రభువుల పరివారంలోని వారందరూ యుద్ధంలో పాల్గొన్నప్పుడే, ప్రజా సామాన్యంలో త్యాగబుద్ధి, ఉత్సాహంకలుగుతాయి" అని వ్రాశారు. "అక్కడ బలవంతంగా సైన్యంలో భర్తీ కావలసి ఉంది. లార్డులు తమ పిల్లలను ఇంట్లో అట్టిపెట్టుకోలేరు. త్యాగ మేమిటి?" అన్నాను నేను. "ఆ విషయం వేరు. తమ కుమారులను ఇంట్లోనే పెట్టుకోదలచుకుంటే ఎన్ని సాకులన్నా చూపగలరు" అన్నారు బాపూ.

నేను పది రోజులుగా జబ్బుపడ్డాను. డాక్టర్

శాహ్ నేను మరొక క్వైనా ఇంజెక్షన్ ఇచ్చారు. ఆయనకూడా మలేరియాతో బాధపడుతున్నారు. "నేనుకూడా ఈరోజు ఇంజెక్షన్ తీసుకోవలసింది. కాని, స్త్రీలే ఈ విషయంలో పరాక్రమవతులు. నేను ఇంజెక్షన్ తీసుకుందామని నిశ్చయించుకోలేక పోయాను" అన్నారు డాక్టర్ శాహ్. తర్వాత ఆయన తను అహమదాబాద్ జెయిలు సూపరింటెండెంటుగా ఉన్నప్పటి అనుభవాలను తెలిపారు. ప్రభుత్వ కార్యాలయాలలో ఎంత మందకొడిగా పనులు జరుగుతాయో వివరించారు.

ఇన్ని రోజుల తర్వాత బాపూ నేడు నన్ను మహాదేవభాయి సమాధివద్దకు పిలుచుకొని

## గాంధీజీ కారాగార గాథలు

వెళ్లారు. నాకు ఎంతో హాయి అనిపించింది. సమాధిమీద చిన్న చిన్న శంఖాలతో 'ఓం' లాగ అమర్చారు. ఆ ఓం పూవులతో అమర్చిన ఓం అంత సుందరంగా లేదు. కాని, పూవులు వాడిపోతాయి. రోజూ తాజా పూవులు దొరకవు. దొరికినవి శంఖాలపైనే పెడుతున్నారు.

సాయంకాలం బాపూజీ వ్రాసిన ఒక ఉత్తరం నకలు దొరకలేదు. బాపూ చింతానిమగ్నులయారు. నేను వెదకగా దొరికింది. బాపూజీకి చూపించాను. ఆయన పరిహాసంగా, "ఇది శుభచిహ్నం. నేను దాని ఆశ వదలుకున్నాను. జ్ఞాపకం చేసుకుని మరొక నకలు వ్రాసుకుందామనుకున్నాను. ఇంతలో నీవు వచ్చావు. ప్రస్తుత పరిస్థితి నిరాశాజనకంగా ఉన్నప్పటికీ, ఆరు నెలలలో మన నావ గట్టెక్కుతుంది" అన్నారు.

రాత్రి మీరాబహెన్ అన్నయ్యాతో చర్చ జరుపుతున్నది—"సామ్యవాదం, గాంధీవాదం ఒక్కటే. రెండింటికీ సాదృశ్యం ఉంది. రెండూ దరిద్రాతి దరిద్రులకు సేవచేయ దలిచాయి. రెండు సిద్ధాంతాలలోని సమాన లక్షణాలు ప్రజల ముందు పెడితే, చాల ప్రయోజనకరం." అన్నయ్య

అన్నాడు: "నిజమే. కాని, ఈ సమానత్వం సామ్యవాదులు అంత ముఖ్యంగా పాటించరు. ఇంతకూ, సామ్యవాదంలోని అన్ని మంచి విషయాలు లేక పెక్కు మంచి విషయాలు బాపూజీ కార్యక్రమంలో ఉన్నాయి. కాని, భేదమంతా సాధనాలలోనే. సామ్యవాద మనేది నేడు ప్రత్యేక పద్ధతికి, జీవన మీమాంసకు నామధేయ మయింది." ఆ మాటకు మీరాబహన్ "ఔను. బాపూ పెట్టుబడిదార్ల వెంట అంతగా పడలేదు. పెట్టుబడిదారీ విధానం నశించక తప్పదు. ధర్మకర్తృత్వ సిద్ధాంతం కార్యరూపంలో కొనసాగడం కష్టం" అన్నది. సంపత్తి అంటే ఏమిటి? పెట్టుబడిదారీ పద్ధతి నశించాలంటే ఏమిటి?—మొదలయిన విషయాలను అన్నయ్య వివరిస్తూ, ఈ విషయంలో బాపూజీ సాధన మార్గం విభిన్నమని, సత్యాహింసల ద్వారా బాపూ పనిచేయాలని, కనుకనే ఆయన కార్యాచరణ విధానమూ విశిష్టమైనదని, విశిష్టంగా ఉండక తప్పదని తెలిపాడు. మరొక మార్గం లేదని చెప్పాడు.

మీరాబహన్ సామ్యవాద సిద్ధాంతం అర్థం చేసుకొనడానికి కంకణం కట్టుకుంది; మార్క్స్ పుస్తకాలను చదవడం మొదలు పెట్టింది.

రెండు రోజులుగా రాత్రి చాల చలి. కాని, ఋతువును నమ్మలేము. సాయంకాలాలలో విపరీతమైన వేడి. ఇక రేపో మాపో దీపావళి. దీపావళిని మా వైపు చలికాలపు పండుగగా చేస్తారు. దీపావళి అనే మాటలో ఇంటి తలపులు, కాలేజీ తలపులు నవనవోన్మేషంగా రేకెత్తుతున్నాయి. పాపం! అమ్మకు ఆ రోజు మేము చాల జ్ఞాపకం వస్తాము.

6, నవంబర్ '42.

ఎల్లుండి దీపావళి. నిన్న మీరాబహన్ బాపూ వద్దకు వచ్చింది. దీపావళినాడు ఆమె పద్దెనిమిదవ పుట్టిన రోజు పండుగ. మీరాబహన్ జన్మదినోత్సవం, దీపావళిపండుగ కలిపి చేద్దామని సరోజినీ నాయుడు అన్నారు. మీరాబహన్‌కు పుట్టిన రోజు పండుగ బహుమానంగా ఆమెకు పచ్చని ఆంధ్ర ఖద్దరుచీర ఇవ్వదలచారు. కుంకుమభరిణె, ఏలక్కాయలు తెప్పించారు. "వేణువు వాయించే కృష్ణుడు" అనే తన కవితను ఒక కాయితంపై నకలు చేశారు. అన్నిటినీ ఒక చుట్టచుట్టారు. నేను బజారునుంచి సీతారాముల విగ్రహాలు, ఊదువత్తులు ఒక పాకెట్ తెప్పించాను. బాదం పప్పు మొదలయినవి వేసి టాఫీ తయారుచేశాను. దానిని పొట్లంలో చుట్టాను. ఇవన్నీ ఆమెకు నా తరపున, అన్నయ్య తరపున బహుమతులు. మిస్టర్ కటేలీ మీరాబహన్‌కోసం ఒక ఏక్ తార చేయించారు. అన్నయ్య ఒక సందేశపు ఉత్తరం టైప్‌చేశాడు. భారత ప్రభుత్వం దేశీయ శాఖవారు మీరాబహన్ పేర ఒక బంగీ పంపినట్టు. దానిమీద "దేవత్వానికి ఇవతలిమెట్టు పారిశుద్ధ్యం (Cleanliness is next to Godliness). దానిని మీకు పంపుతున్నాము" అని వ్రాయబడి ఉంది. ఇవన్నీ మేము రాత్రి



జలక్రీడ చిత్రం—ఎస్. రాజారావు (ఖరగపూర్)

దాచి ఉంచాము. మేము ఇవన్నీ చేస్తున్నట్టు మీరాబహన్‌కు కొంచెమైనా అనుమానం కలుగలేదు.

నిన్న భోజనాలవేళలో బా బాపూజీకోసం కాచుకుని ఉండిపోయారు. ఆమెకు చాల ఆకలివేసింది. బాపూ అరగంట ఆలస్యంగా భోజనానికి లేచారు. ఆమె చాల కోపగించుకున్నారు. బాపూజీ తన ఆలస్యానికి కారణం చెప్పడానికి ప్రయత్నించారు. కాని, బా వింటారా?

నేడు ఉదయం నేను అరగంటసేపు తోటలో తిరిగాను. శరీరంలో తగినంత బలం వచ్చింది. అలసిపోలేదు. రఘునాథ్ జమాదారుకు నేడు మరల జ్వరం వచ్చింది. "కొయినా ఇంజెక్షన్ చేసిన తర్వాత కూడ జ్వరం వస్తే, ఇక ఇంజెక్షన్ ఎందుకు?" అన్నారు బాపూ. "మలేరియా దోమలు ఉన్నచోట, రెండవసారి దోమలు కుట్టినప్పుడు, పది రోజులలో మలేరియా వస్తుంది. కొయినా నిరంతరం రక్తంలో ఉండదు. రోగంతో పోరాడడానికి మనలో శక్తిని వృద్ధిచేసుకోడం, దోమలు కుట్టినా జ్వరం రాకుండా ఉండడం వేరే విషయాలు" అన్నాను. అయినా, బాపూజీ అనుమానం తీరలేదు.

మహాదేవ భాయీ సమాధికి చెదలు పట్టింది. చెప్పరానంత చెదలు! పుట్టలు పుట్టలు! పేడతో అలకడం మానిపించిన తర్వాత చెదలు తగ్గిపోయింది. ఈసారి మట్టిలో కొంచెం సున్నం కలిపి సమాధిపై మెత్తించాము. మెత్తిన తర్వాత సమాధి చాల సుందరంగా కనిపించింది.

7, నవంబర్ '42

నేడు ఉదయం నాస్తా (ఉపాహారం) సమయంలో సరోజినీ నాయుడు మీరాబహన్‌తో "మీకు ఒక జాబు, పార్సెల్ వచ్చాయి. పాలు తాగిన తర్వాత విప్పుదూ? ఎలాంటి సమయానికి వచ్చాయి!" అని అన్నారు. ఉపాహారం తర్వాత మీరాబహన్ పార్సెల్ విప్పింది. జాబు ప్రభుత్వం నుంచి వచ్చినట్లే మొదట అనుకుంది. తర్వాత తెలుసుకుంది. "అవును. నిన్న రాత్రి ప్యారేలాల్ టైపుచేశారు" అన్నది ఆమె. పార్సెల్ విప్పుతూ ఉండగా, బాపూ వచ్చారు. వాహ్యాళికి బయలుదేరుతూ వచ్చారు. అందరూ నవ్వుతున్నారు. ఇంతలో మీరాబహన్ చేయి తగిలి ఏక్‌తార కింద పడింది. నేను వెంటనే దానిని జమాదార్ రఘునాథ్ చేతికిచ్చి, బాగుచేయించుకొని రమ్మన్నాను. తెగినట్టు మీరాబహన్‌కు తెలిస్తే అపశకునమని అనుకునేది! సాయంకాలానికి రఘునాథ్ కొత్త ఏక్‌తార తెచ్చాడు. మీరాబహన్ చాల సంతోషించింది.

మధ్యాహ్నం ఖైదీలకు తేనీరు, తినుబండారాలు, అరటిపండ్లు మొదలయినవి పంచాము. బాపూ వచ్చి ఖైదీలను అడిగారు: "ఇవన్నీ మీకు ఎందుకు ఇస్తున్నారో తెలుసా? మీరాబహన్ ఇక్కడికివచ్చి మనలాగా అయిపోయింది. ఆమెకు పదిహేడు సంవత్సరాలు నిండాయి. దీపావళి పండుగ కూడాను. ఇవన్నీ మీకు పంచాలని సరోజినీ నాయుడు ఆలోచించారు." ఒక ఖైదీ ఈ రోజే జెయిలుకు వచ్చాడు. బాపూజీని ముందు ఎప్పుడూ చూడలేదు. అతడు లేచి బాపూజీకి పాదాభివందనం చేయడానికి వచ్చాడు. ఓహ్! ఇకనేమి? పెద్దబారు తయారయింది పాదాభివందనం చేసేవారిది. ఖైదీలు వరుసగా వచ్చి పాదాభివందనం చేశారు.

తర్వాత సరోజినీ నాయుడు "ఈ బీదఖైదీలకు విందుచేయడం అంటే బాపూజీకి ఎంతో సంతోషం. ఆయనకు రాజులవిందులలో సంతోషం ఉండదు. బీద విందులో సంతోషం కలుగుతుంది. మనం ఈ ఖైదీలపట్ల శ్రద్ధ వహిస్తున్నాము. అందుకు బాపూజీ చాల ఖుషీ అయిపోతున్నారు" అన్నారు.

నేడు వాహ్యాళిలో బాపూజీ భగవద్గీత పన్నెండవ అధ్యాయంపై చర్చ జరిపారు.

"శ్రేయో హి జ్ఞాన మభ్యాసాత్
జ్ఞానాత్ ధ్యానం విశిష్యతే,
ధ్యానాత్ కర్మఫలత్యాగః

త్యాగా చ్ఛాంతి ర్నిరంతరం''
అనే శ్లోకంపై చర్చ జరిగింది. బాపూ ఈవిధంగా అన్నారు: "అభ్యాసః అనే మాటకు అర్థం హఠయోగం. జ్ఞానమంటే శ్రవణ మననాది. ధ్యానమంటే నేను ఉపాసన అంటాను. కస్తూర్బా వంటి స్త్రీ—మూడు వందలకు ముందు రెండు వందలు అని చెప్పలేనిది—హవేలీ (దేవాలయం)లో దీపాలు ముట్టించడం, ఊడ్చడం వంటి పనులను ప్రేమతో చేస్తుంది. ఇది భక్తి. ఇలాటివారికోసం ధ్యానం కావాలి. నాల్గవది కర్మఫలం ఉండనే ఉంది. శ్రేయః అనేదానికి నా అర్థం సులభం అని. జ్ఞానం కంటే ధ్యానం సులభం, అన్నిటికన్నా సులభం కర్మఫలత్యాగం. ధ్యానమనేదానికి ఈ అర్థం నాకు వినోబా తెలిపారు. నేను అనాసక్తియోగం వ్రాసినప్పుడు, దానిని చదవడానికి వినోబాకు ఇచ్చాను. దానిలో పెక్కుచోట్ల ఇద్దరం చర్చించుకున్నాము. ఆ చర్చలలో ఈ శ్లోకం కూడా ఒకటి.

8, నవంబర్ '42.

మహాదేవభాయీ సమాధి పైన నేడు శంఖాలతో కొత్తగా ఓం అమర్చాము. బాపూ బంకమట్టితో మొట్టమొదట ఓం తయారు చేయించారు. దాని పైన శంఖాలు అతికించాలి. బాపూ ఉదయం సరిగా ఏడున్నరకు కిందికి వెళ్లుతారు. నేడు ఏడుంబావుకే బయలుదేరారు. మీరాబహెన్‌ను పిలిచారు. ఆమె వచ్చి "బంకమన్ను సరిగాలేదు. చాల మెత్తబడి, బురదగా ఉంది. దీనితో ఎలా చేయడం?'' అన్నది. అయితే ఈరోజే చేయాలని బాపూ అనుకున్నారుగనుక, ఆఖరుకు ఓం తయారుచేశాము. చాల అందంగా తయారయింది.

ఓం తయారయ్యే వేళకు ఎనిమిది కొట్టారు. మొత్తం ముప్పావు గంట పట్టింది. బాపూ చాల ఆనందించారు. "ఈ శుభదినాన పనిచేయలేక విఫలుడిని అయి వెళ్లదలచలేదు'' అన్నారు. వాహ్యాళిలో మీరాబహెన్ కనిపించింది. ఓం చాల సుందరంగా తయారయిందని ఆమెతో బాపూ అన్నారు. ముళ్ల తీగలగుండావే దూరంనుంచి చూపడానికి ఆమెను పిలుచుకొని వెళ్లారు. "అప్పుడే తయారయ్యేది. కాని, చాల కచ్చాగా తయారయేది. అందువల్లనే నేను తయారు చేయదలచలేదు'' అన్నది మీరాబహెన్. "నాకు కచ్చాగా ఉన్నా పరవాలేదు. ఒక్క రోజు నిలిచినా చాలు. మనం తయారుచేసి చూడాలి. అంతే. చేసి అనుభవించడం మంచిది కదా'' అన్నారు బాపూ.

సాయంకాలం బా నాతో అన్నారు, బాపూ జన్మదినంనాడు నేననేక ముగ్గులతో ద్వారాల వద్ద అలంకారాలుచేసి, స్వస్తికం వేయమని. నేను మన్నంతో ఓం వ్రాశాను, కాని, బాకు నచ్చలేదు. వార్డర్లు తులసిచెట్లవద్ద ఎర్రమట్టితో చిత్రాలు వేశారు. అవి బాకు నచ్చాయి.

సాయంకాలం ప్రార్థనానంతరం, నేను, అన్నయ్య, సరోజినీ నాయుడు మహాదేవభాయీ

# గాంధీజీ కారాగార గాథలు

సమాధివద్దకు వెళ్లాము. శంఖాలమధ్య ఊదువత్తులు వరుసగా గుచ్చాము. చీకటి రాత్రిలో అది ఎంతో అందంగా కనిపించేది. ఏమని చెప్పను! "ఓహో! ఇదొక సుందర కవితలాగా ఉందే?'' అన్నారు సరోజినీ నాయుడు. వెనకకు వచ్చిన తర్వాత ఆ సంగతి బాపూజీకి తెలిపాము. "మీరు ఆ అందంచూడడానికి మరొక రోజు అగరువత్తులు వెలిగించాలి'' అన్నారు సరోజినీ నాయుడు.

మిస్టర్ కటేలీ వెలుపలికి వెళ్లారు. ఎన్ని రోజుల తర్వాత ఈ రోజు వెలుపలికి అడుగు పెట్టారో ఎవరికి తెలుసు? ఆయన తిరిగిరాగానే సరోజినీనాయుడు అన్నారు: "నేడు మీరు ఒక సుందర దృశ్యం పోగొట్టుకున్నారు.''

## మరొక ఉత్సవం

9, నవంబర్ '42.

మేము అరెస్టయి నేటికి మూడు నెలలు పూర్తయాయి. ఆరునెలలకన్నా ఎక్కువ ఇక్కడ ఉండనవసరం లేదని బాపూజీ విశ్వాసం.

నేడు గుజరాతీలకు నూతన సంవత్సరం ఆరంభమవుతుంది.

భండారీ, డాక్టర్ శాహ పదిన్నరకు వచ్చారు. బాపూ వారికి మీరాబహెన్‌కోసం చేసిన టాఫీలు కొన్ని ఇచ్చారు.

సరోజినీనాయుడు కస్తూర్బాకు ఒకచీరబహూకరించారు. నాకోసమూ ఒక చీర, ఒక బ్లౌజు తీసుకొని వచ్చారు. కాని, తీసుకోవడానికి ఒప్పుకోలేదు నేను. ఆమె చాల బలవంతం చేశారు. కాని, ఈవిధంగా బహుమానాలు తీసుకోవడం, ముఖ్యంగా ఈ పరిస్థితిలో, ఈ వాతావరణంలో —నాకు ఉచితమని తోచలేదు. బాపూ నన్ను సమర్థించారు.

నిన్నటినుంచి నూలు వడకడం మళ్లీ ప్రారంభించాను. "నీవు బాగయ్యావు. ఇక నూలు వడకడం ప్రారంభించవలసిందే!'' అన్నారు బాపూ. రాత్రిళ్లు బాపూ నిద్రపోయేవేళకు— అంటే తొమ్మిది, తొమ్మిందింబావుకు—నిద్రపోతున్నాను. ఉదయం ఆరు గంటలకు మేల్కొంటున్నాను. మధ్యాహ్న ప్రార్థనకోసం ఒక గంట లేస్తున్నాను. ప్రార్థన తర్వాత నిద్రపోకూడదు. కాని, బాపూ నిద్రపొమ్మని బలవంతం చేస్తున్నారు. నాకు కూడ మళ్లీ జ్వరం వస్తుందేమోనని భయమే. అందువల్ల చాల తక్కువ పని చేస్తున్నాను. చాలినంత సమయం విశ్రాంతితో గడుస్తున్నది.

## పద్మజానాయడు పుట్టినరోజు పండుగ

13, నవంబర్ '42

సరోజినీ నాయుడు కుమార్తె పద్మజ పుట్టిన రోజు వచ్చే మంగళవారం. "దానికోసం మనం ఏమైనా చేయాలి'' అన్నారు బాపూజీ. ఇద్దరు జేబురుమాళ్లు తయారుచేయాలని ఆఖరుకు నిశ్చయమయింది. బాపూజీకి ఒక సోదరి ఇద్దరు ధోవతుల చాపు బహూకరించింది. బాపూజీ ఆ ధోవతులనుంచి కొద్దిగా కత్తిరించివేశారు. ఉత్తరీయంగా ఉపయోగించే ధోవతిమాత్రం అట్లే ఉంది. కత్తిరించిన ముక్క ఇప్పుడు పనికి వచ్చింది. దానితోఐదు జేబురుమాళ్లు కుట్టాము. దానిపైన అల్లవలసిన బుటేదారీ పని నా తల మీద పడింది. దానికి రెండు రోజులు పట్టింది. కొన్ని చాకొలెట్లు తయారుచేసి, వాటితోపాటు జేబురుమాళ్లు పంపితే బాగని నిన్న తోచింది.

రాజాజీ బాపూజీతోమాట్లాడడానికి వైస్రాయి అనుమతించలేదు. ఆ విషయమై చర్చ జరిగింది.

17, నవంబర్ '42.

నేడు పద్మజానాయుడు జన్మదినం. ఉదయం సరోజినీనాయుడు స్నానాల గదిలో ఉన్నప్పుడు, మీరాబహెన్ ఆమె గదిని అలంకరించింది. తర్వాత 'ఖాఖరే' తయారుచేసింది. నేను పులావ్, కూర వండాను. ఖైదీలకు నేడు కిచిడీ, ఆమ్లెట్, అరటివళ్ళు, ముల్లంగి, కూర, అప్పడాలు మొదలయిన పదార్థాలు వంచాము. వార్డర్లకూ భోజనం పెట్టాము. పగలల్లా ధూమ్‌ధామ్‌గా గడిచిపోయింది. వంటచేయడం ఆలస్యం కావడంవల్ల ఖైదీలు రెండు గంటలకు భోజనాలకు కూర్చున్నారు. వార్డర్లు, తర్వాత ఆరుగంటలకు. ఖైదీలకోసం వార్డర్లే వండారు. వార్డర్లకోసం సరోజినీ నాయుడు, వార్డర్ల ఇంట్లోవారికోసం నేను, మీరాబహెన్ వండాము.

(సశేషం)



నిరుపేదలు

చిత్రం—సి. ఎస్. ప్రభాకర రెడ్డి (కాకినాడ)




## వైస్రాయికి బాపూజీ లేఖ

14, జనవరి 1943

ఈ రోజు ఒక కొత్త కేలెండర్ వచ్చింది. దానిమీద భారతదేశపటం, దానిమీద బాపూజీ చిత్రం ఉన్నాయి. బాపూ కస్తూర్బాకు భూగోళం నేర్పేటప్పుడు ఈ కేలెండర్‌ను ఉపయోగించవచ్చు. బాపూజీ చిత్రం బాగా లేదు. అందువల్ల దానిమీద మీరాబహన్ కాయితం అతికించింది. ఇప్పుడు దేశపటం చూచి కస్తూర్బా భూగోళం నేర్చుకోసాగింది. బాపూజీ కస్తూర్బాకు బాల మహాభారతం వినిపించే పనిని నేడు పూర్తి చేశారు. రేపటినుంచి ఏమి ఆరంభించాలో ఆలోచిస్తున్నారు. 'బలిదాన్' ఆరంభిస్తానన్నారు. 'శరణాగతి రహస్యం' చదవండని అన్నయ్య చెప్పారు.

బాపూ నిన్నటినుంచి వైస్రాయికి ఉత్తరం వ్రాస్తున్నారు. పూర్తి అయ్యేవరకు ఎవరూ చదువవద్దన్నారు. అన్నయ్య దానిని టైప్ చేయడం దాదాపు పూర్తయింది. నా సమయమంతా తన కివ్వమన్నాడు అన్నయ్య. నేను ఒప్పుకున్నాను. కాని, ఇంతవరకు నేను నా పని చేసుకోగలుగలేదు; అతడు నా సమయాన్ని ఉపయోగించుకోనులేదు.

భన్సాలీ నిరశనవ్రతం విరమించడం విషయంలో ప్రభుత్వ ప్రకటన, డాక్టర్ ఖరే పాత్ర మొదలయిన విషయాలు పత్రికలో చదివాము. సర్వజనీన పరిశీలన జరగాలనే అభ్యర్థనను వదులుకోవలసి వచ్చినందుకు నాకు చాల దుఃఖమయింది. కాని, అన్నయ్య "ఈ విషయంలో నిర్ణయం జరిపే అధికారం మనకు లేదు. అక్కడివారికి సంతోషం కలిగింది. ఈ విషయం బాగా తెలుసుకోవాలి" అన్నాడు.

ఈ విషయమై బాపూజీని అడిగితే, ఆయన కూడ "ఇక్కడ మనం కూచొని ఈ విషయమై తీర్పు చెప్పడానికి అధికారం లేదు" అన్నారు.

ఒకటి రెండు రోజులుగా డాక్టర్ కూనే స్నానం పరిశీలనార్థం జరుగుతున్నది, కాని, అది నాకు మెచ్చుగా వచ్చలేదు.

15, జనవరి 43

సాయంకాలం కూర్చుని స్కెచ్ వేసుకుంటుండగా, అన్నయ్య వచ్చి, వైస్రాయికి బాపూ వ్రాసిన లేఖ చూపాడు. ఆ లేఖలో ఫిబ్రవరి 1 వ తేదీనుంచి, ఫిబ్రవరి 21 వరకు చేయదలచిన నిరశనవ్రతం గురించి ప్రస్తావన ఉంది. ఈ లేఖ అందరూ చదివి తమ తమ అభిప్రాయాలు స్వేచ్ఛగా తెలుపాలని బాపూజీ కోరారు.

సాయంకాలం వాహ్యాళిలో "వైస్రాయికి రెండవ లేఖ పంపేటప్పుడు గాని, మొదటి లేఖకు సమాధానం వచ్చినప్పుడు గాని మౌనం వదలిపెడతానని అన్నాను. నేడు రెండవ లేఖ వ్రాయడం పూర్తి అయింది. కనుక మౌనం వదలినాను" అన్నారు బాపూ.

డాక్టర్ లాజరస్ లేఖ ప్రస్తావనలో బాపూ వైస్‌రాయ్ లేఖను గురించి చర్చించడం ప్రారంభించారు: "సభ్యులయిన వారి ఒక పద్ధతి ఏమిటంటే, ఈ ఉత్తరానికి సమాధానం ఇవ్వక పోవడం. వారి పనులవల్లనే, మనం వారి అభిప్రాయం తెలుసుకోవాలి" అన్నారు ఆయన. నేను సమాధానం చెప్పడానికి అనుమతి కోరి ఇలా అన్నాను: "వైస్రాయికి మీ జాబు చేరి పది రోజులకంటే ఎక్కువ అయిఉండదు. ఏదో శుష్కమైన సమాధానం ఇవ్వడానికైనా పది హేను రోజులు పడుతుంది. ఆయన ఏదో సమాధానం పంపుదామని ఆలోచించేలోగా మీ రెండవ ఉత్తరం చేరితే, ఆయన చికాకు పడరా? మరికొంత వ్యవధి ఇవ్వలేరా?"

"పది రోజులే అయిందనుకో. అయినప్పటికీ ఉత్తరం చేరినట్టయినా తెలియాలికదా! వీరి పద్ధతి ఏమిటంటే, మొదట ఉత్తరం చేరినట్టు రసీదువంటిది పంపి, తర్వాత పూర్తి సమాధానం వ్రాయడం. అయినప్పుడు చికాకు పడవలసిన అవసరం ఏమిటి? ఉపవాసం ప్రస్తావన మొదటి జాబులోనూ ఉంది. ఈ జాబులో వ్రాయడం దాని అనుబంధమే" అన్నారు బాపూ.

"అయినప్పటికీ, దీనివల్ల కష్టం కలుగవచ్చు.

# గాంధీజీ కారాగార గాథలు

అంతేకాక, తక్కిన ఉత్తరాలలాగ ఈ ఉత్తరం హృదయస్పర్శిగా లేదు" అన్నాను.

"దీనిని హృదయస్పర్శిగా తయారుచేసే అవసరం లేదు. ఇది కరకు గుండెతో మొదటి జాబుకు అనుబంధంగా వ్రాసిన జాబు" అన్నారు బాపూ.

వాహ్యాళినుంచి తిరిగి వచ్చినతర్వాత సరోజినీ నాయుడు మాతో చేరారు. చేయి నొప్పివల్ల ఆమె ఈ లేఖపై తన అభిప్రాయం వ్రాత మూలకంగా కాక, వాఙ్మూలంగా తెలియజేశారు. "వైస్రాయికి మరికొంత వ్యవధి ఇవ్వాలి. ఉన్నాలీ భాయీ నిరశనవ్రతం విరమించడాన్ని బట్టి కూడా ప్రభుత్వం కొంచెం కదిలిందని తెలుస్తున్నది. కనుక వారిని తమ మార్గంలో నడవనివ్వాలి. రెండవది, ఈ లేఖ భాష మీరు ఎప్పుడూ వ్రాసే భాష కాదు. ఇది ఆగి ఆగి వ్రాసినట్టు, అసంపూర్ణంగా ఉన్నట్టు తోస్తున్నది. మీరు శాంతచిత్తంతో ఈ లేఖ వ్రాసినట్టు తోచదు. నేను ఉప్పు, నీళ్ళు మాత్రం పుచ్చుకుంటానని ఎందుకు వ్రాయాలి? మీరు నిరశనవ్రతం చేసేవారు. ఏది మీకు నచ్చితే, అది స్వీకరించండి. ఇతరులకు ఇవే పుచ్చుకుంటాను, అవే పుచ్చుకుంటాను అని చెప్పవలసిన అవసరం ఏముంది? అంతేకాకుండా నాపైన దయ చూపవద్దు అని వ్రాయడమా? దయతో చేసే పనులలో చాలసార్లు పొరపాట్లు కూడా జరుగుతాయి. మీ ఉత్తరం భాష నాకే అర్థం కాలేదంటే, వైస్రాయికి ఎట్లా అర్థమవుతుంది?" అన్నారు సరోజినీ నాయుడు.

"ఇది మీకు బాగా అర్థమవుతున్నది. దయ చూపవద్దని వ్రాయవలసిన అవసరం ఏమిటంటే, ఈ విషయమై హరిజనులకోసం నిరశనవ్రతం చేసినప్పుడు నేను వ్యాఖ్య చేశాను. నా ప్రాణం కాపాడడానికే అంబేద్కర్ ఆ ఫార్ములాను అంగీకరించానని అన్నారు" అన్నారు బాపూ.

"నిజమే. వైస్రాయికి ఇదంతా ఏ మర్మమౌతుంది? నిరశనవ్రతమే చేసేటట్లయితే మహాదేవభాయి సమాధివద్దకు వెళ్ళడం మాని వేయండి. అక్కడికి వెళ్ళడం ఎందుకు? ఆయన మీకోసం ప్రాణత్యాగం చేశారని నాకు తెలుసు. నేను దీనిని న్యాయస్థానంలో నిరూపించలేకపోయినా, విషయం వాస్తవం. ఇప్పుడు మీరు ఉపవాసం చేస్తే మహాదేవభాయీ బలిదానం నిరర్థకమౌతుంది. మీరు ఉపవాసం చేసేటట్లయితే ప్రతి రోజూ సమాధిపైన స్వస్తికం అమర్చడం ఎందుకు? మీరు స్వతంత్రులు కారని మరొకమారు చెబుతున్నాను. మీకు ఉపవాసం చేసే హక్కు లేదు" అని వాదించారు సరోజినీ నాయుడు.

సాధ్యమైతే ఉత్తరం రేపే వెళ్ళాలని బాపూ అన్నారు. అన్నయ్య "ఉత్తరం మీ అంతరంగం నుంచి బయలుదేరిందని మీరు అంటున్నారు. అయినా, వ్రాయడానికి నాలుగు రోజులు పట్టింది. కొన్ని గంటలలో మా అభిప్రాయం చెప్పమంటున్నారు. ఇలా ఎలా సాధ్యం?" అని ప్రశ్నించాడు.

"ఇంకా దాదాపు 24 గంటలుంది" అని అన్నారు బాపూ. "అయితే మేము రాత్రంతా మేల్కొని ఆలోచించాలా?" అని మరల అడిగాడు అన్నయ్య. "మీరు తప్పక మేల్కొంటారు" అన్నారు బాపూ.

అయితే రేపు శనివారం. జాబు పదకొండు గంటలకు వెళ్ళాలి. అంతలోపల ఉత్తరం తయారుకాలేకపోయె! మీరాబహన్ తన అభిప్రాయం వ్రాసి ఇచ్చింది. అన్నయ్య రాత్రి రెండు కొట్టినతర్వాత కూడా మేల్కొని ఉన్నాడు.

బాపూ మరల మౌనం అవలంబించారు. ఈ ఉత్తరంమీద నిర్ణయం జరుగనంతవరకు మౌనంగా ఉంటారు.

16, జనవరి' 43

మీరా బహన్ వ్యాఖ్యానం బాపూ ఉదయం చదివారు. మొదటి ఉత్తరానికి వైస్రాయి త్వరగా సమాధానం వ్రాయనీయుండని, తర్వాత వ్రాయండని మీరాబహన్ తన అభిప్రాయం తెలిపింది. ఇప్పుడే ఉపవాసం మాట వ్రాయకండి అనీ అన్నది. "ఇప్పుడు పంపే జాబులో ఉపవాసం సంగతి తప్పక ఉంటుంది. ఈ జాబునే నాలుగైదు రోజులు ఆపి పంపవచ్చును గాని, మధ్యన మరొక రకం జాబు పంపడానికి వీలుపడదు" అని బాపూ వ్రాసి చూపారు.

తర్వాత అన్నయ్య తన అభిప్రాయం వ్రాసి తెచ్చియిచ్చాడు. బాపూ వ్రాయవలసిన ఉత్తరం ముసాయిదా కూడా వ్రాసి తెచ్చాడు. ఈ ముసాయిదా ప్రకారం జాబు వ్రాయవలసివస్తే వ్రాయండని అన్నయ్య అన్నాడు. ఆ ముసాయిదా భావం మీరాబహన్ చెప్పిన అభిప్రాయం వంటిదే. వేరే విధంగా వ్రాయబడింది. ఉపవాసం బెంగాల్ కరువుకోసం కాదు. కాని, ఆ కరువుకు మూలమైన కారణంకోసం—అని స్పష్టపరిచాడు.

నేడు వాహ్యాళి సమయంలో బాపూతో ఈ విషయం గురించే అన్నయ్య మాట్లాడారు. బాపూ మౌనంగా ఉన్నారు. వింటున్నారు. తర్వాత అన్నయ్య నాతో "అంతా మన్నుటి కుండపై నీళ్ళు పోసినట్లే అయింది" అన్నాడు.

బాపూ తమ లేఖ మరొకమారు చదివారు. 'ఎవరూ నామీద దయ చూపకండి' అనే మాటలు తీసివేశారు. 'ఎందుకు ఉపవాసం చేస్తున్నారు' అని తెలిపే భాగమూ తీసివేశారు. ఈ స్పష్టీకరణం ఉండాలనే అన్నయ్యకు తోచింది. "అయితే, ఉండనివ్వు" అన్నారు బాపూ. అన్నయ్య ముసాయిదానుంచి రెండు వాక్యాలు తీసుకున్నారు. ఆ వాక్యాలు 'కరువులు పరిస్థితిని చాల అసహ్యంగా చేస్తున్నవి. అవి ఉపవాసానికి మూల కారణం కాదు' అని స్పష్టపరిచాయి.

"మీరు కరువుకు ఇంత ప్రాధాన్యం ఎందుకి

ఇస్తున్నారు? కరువు తొలగించే కృషిలో మీ సహాయం సంతోషంగా స్వీకరిస్తానని ప్రభుత్వం చెబుతున్నది. అయితే విడుదల తర్వాత 'క్విట్ ఇండియా' ఆందోళనం చేయరాదని షరతు. అప్పుడు మీరేమి చేస్తారు?" అని ప్రశ్నించాను.

"మనం అలా సహాయం చేయలేము. సహాయం చేయడానికి గాని, కరువు తొలగించడానికి గాని ఏకైక ఉపాయం ప్రభుత్వాధికారం ప్రజల హస్తగతం కావడం" అన్నారు బాపూ.

తర్వాత బాపూ అన్నయ్య ముసాయిదా ఇచ్చివేశారు. క్రింద ఈ విధంగా వ్రాశారు: "నేను పైన వ్రాసినదంతా జీర్ణించుకున్నాను. చింపడానికి మారు, నీకు వెనక్కు ఇచ్చివేస్తున్నాను."

'శరణాగతి రహస్యం' లో బాపూజీకి ఎక్కువ సత్యం లభించలేదు. దానిని కూడా తిరిగి ఇచ్చివేశారు. "శరణాగతి రహస్యంలో నాకు ఏమీ లభించలేదు. అది కేవలం పాండిత్య ప్రకర్ష" అని వ్రాశారు.

"వైస్రాయినుంచి సమాధానం రాకపోవడానికి అర్థం అతడు ఏమీ చేయరాదనే నియమానికి సూచనగా భావించి మీరు అన్యాయం చేయడం లేదా? జవాబు రాకపోవడానికి ఉదారమైన అర్థం చెప్పడం సాధ్యం కాదా? ఉపవాస ప్రస్తావన లేకనే మీరు సమాధానం కోసం ఎందుకు వ్రాయరు?" అని అన్నయ్య ప్రశ్నించాడు. బాపూ మౌనంగా ఉన్నందున వ్రాసి చూపించారు: "వైస్రాయి మౌనాన్ని నేనేమి అర్థం చేసుకున్నానో నీవు తెలుసుకోదలచినట్టు భావిస్తున్నాను. ఇంగ్లీషు పాలకుల నీతి ఏమిటంటే, ఎవరికైనా కఠినమైన జవాబు ఇవ్వదలచినప్పుడు, వారి చర్యలతోనే ఆ అర్థం అవగతమయ్యేట్టు చేయడం. ఈ నీతి పలుమారు సభ్యతారూపం ధరిస్తుంది. జ్ఞాపకం చేసుకుంటే ఎన్నో ఉదాహరణలు లభిస్తాయి. ఈ అనుభవాన్ని అవలంబనం చేసుకునే నేను ఈ వాక్యం వ్రాశాను. ఆయన జవాబు ఇవ్వదలచుకుంటే, నేను వ్రాసిన పై వాక్యం నన్నూ కాపాడుతుంది; వైస్రాయినీ. ఆయన నిజంగానే నన్ను సంతోషపెట్టదలచుకుంటే, నేను వ్రాసిన ఆ వాక్యం ఆధారంగా నా లేఖను ఉపసంహరించుకోమని చెప్పగలరు; నేను ఉపసంహరించుకోవలసి వస్తుంది. నన్ను సంతోషపెట్టడం అతనిఉద్దేశం కానప్పుడు, నా వాక్యం అతనిని విషమ పరిస్థితినుంచి రక్షిస్తుంది."

మధ్యాహ్నం భోజనానంతరం మీరాబహన్ బాపూజీతో "మీరు లేఖను ఇప్పుడే పంపకండి; జనవరి 26వ తేదీ స్వాతంత్ర్య దినోత్సవం సందర్భంగా పంపండి. ఉపవాసం తేదీన బెంబులుకువచ్చి ఆరు నెలలు పూర్తి అయిన తరువాత, ఫిబ్రవరి 9 వ తేదీ నిర్ణయించండి" అని కోరింది.

బాపూ ఒప్పుకున్నారు. ఇప్పుడు అందరి ఆశీర్వాదాలు లభించాయని బాతో చెప్పారు. "ఎంత మాత్రమూ లేదు. ఏమీ చేయలేనప్పుడు, మరి



తల్లి - బిడ్డ

చిత్రం — కె. ధర్మారావు (విజయనగరం)

కొంత వ్యవధి దొరికితే మంచిదని మీరాబహన్ అలా అన్నది" అని నేను అన్నాను. ఇంతలో సరోజినీనాయుడు వచ్చారు. "మీ ఉపవాసానికి ఎవ్వరూ అంగీకారం ఇవ్వలేదు. ఉపవాసం చేయడం పొరపాటు. ఈ పొరపాటు మీరు చేయరాదు" అన్నారు ఆమె.

బాపూ నవ్వారు.

సరోజినీనాయుడు తర్వాత నాతో మాటాడుతున్నప్పుడు "బాపూ ఉపవాసం చేయవలసిన అవసరం ఉండదని నా అంతరాత్మ చెబుతున్నది. నేను చెప్పలేదూ, ధన్సారీ వావడని, అలాగే అయింది" అన్నారు. "ఈ సమయంలోనూ మీ అంతరాత్మ నుంచి ఈ మాటలే వెలువడాలని ప్రార్థిస్తున్నాను" అన్నాను నేను.

సాయంకాలం వాహ్యాళి సమయంలో బాపూ అన్నయ్యకు మధ్యాహ్నం మాటను నచ్చచెప్తున్నారు; ఉదయం వ్రాసి చూపిన సంగతే.

రాత్రి మీరాబహన్ నిద్రపోయే ముందు 'లీడ్ కైండ్లీ లైట్' భజనగీతం పాడింది. నాకు చాల బాగనిపించింది. ఆమె ఇప్పుడు వారానికి రెండు రోజులు ప్రార్థనలో భజన గీతాలు పాడాలని, తక్కిన ఐదు రోజులు నిద్రపోవడానికి

ముందు బాపూజీకోసం ఇంగ్లీషు భజనగీతాలు పాడాలని నిర్ణయమయింది.

17, జనవరి '43

బాపూ నేడు భగవద్గీత నేర్పుతున్నారు. తర్వాత నాతో మాట్లాడుతున్నప్పుడు ఇలా అన్నారు: "నీవు చిత్రాలకోసం ఎందుకు అంత సమయం వినియోగిస్తావు? నీకు తక్కిన పనులు తగ్గించడానికి కారణమేమిటంటే, నీవు ప్యారేలాల్‌కు సహాయపడుతావని. నీకు రెండు ముఖ్యమైన పనులున్నాయి. మొదటిది: వైద్యంలో పరిశ్రమ చేయడం. నీనుంచి నేను అలౌకికమైన పనులు కోరుతున్నాను. బా దగ్గు ఎందుకు పోదు? పాత బొమ్మ పడిసెపు వేరుపోదని అనడం నాకు ఇష్టంలేదు. మాలవీయజీ, శివప్రసాద్‌జీ మొదలైనవారికి డాక్టర్లు కుదరదని సమాధానం చెప్పారు. కాని, ఆయుర్వేద వైద్యుల చికిత్సతో వారు బాగయారు. నాకు ఆయుర్వేద వైద్యం పైన మోహం ఉన్నదని అనుకోకు. నాకు దాని లోపాలు తెలుసు. అయితే ఇలాటి ఏజబ్బయినా అసాధ్యమనుకోడం సరికాదని నీవు గ్రహించాలి. బా ఉన్నది. సరోజినీనాయుడూ ఉన్నారు. వీరి జబ్బులను నీవు తప్పక బాగు చేయాలి. రోగులు నీ మాటలు విని, నీవైపు ఆకర్షితులయేటంతటి శక్తి నీకు ఉండాలి. నీవు చేయవలసిన రెండవ పని భాషలో పరిశ్రమ. డాక్టరికి భాష అవసరంకూడ ఉంది; అంతకంటే నాకు అవసరం ఎక్కువ. మహాదేవ్ పని నీవు నిర్వహించాలని నీతో అన్నాను. ఎంతవరకు నీవు నిర్వహించగలవో నాకు తెలియదు. ప్యారేలాల్ ఉన్నాడనుకో. కాని ఒంటరిగాడికి ఆ పని ఎక్కువ కావచ్చు. నీవు తయారు కావాలి. అందువల్లనే నీవు వ్యాకరణంపై పూర్తి అధికారం పొందాలని చెప్తాను."

బా నేడు చాల నీరసంగా ఉన్నారు. ఉపవాసపు కత్తి తలపై వ్రేలాడుతున్నది. ఆమె సాయంకాలంలో ఒంటరిగా తోటలో కూర్చుంటున్నారు. ప్రభుత్వం ఎక్కువ రోజులు బాపూతో ఉపవాసం చేయించరని మీరాబహెన్ నచ్చజెప్పుతున్నది. కాని, ఆ ఆశపై భరోసా ఏమిటి?

అన్నయ్య ఈరోజుకూడా బాపూజీ లేఖ పట్టుకొని పరిశీలిస్తున్నాడు. ఆ లేఖవల్ల ఆతనికి సంతోషం కలుగలేదు. ప్రభుత్వం ఉపవాసానికి విలువ ఇవ్వకపోతే?— అనే ఆలోచన కూడా కలుగుతున్నది.

ఆయన విన్నటి మంచి పంటినొప్పితో బాధపడుతున్నారు. పండ్లు చెడిపోయాయి; అయినా తీయించుకోరు. ఏమి చేయడం? మన దేశంలో పండ్లంటే మోహం ఎక్కువ!

ఉదయం భండారీ వచ్చినప్పుడు కొన్ని పుస్తకాలు తెప్పించి పెట్టమని ఆయనను కోరాను. వాటిలో ఒకటి 'లే మిజరబుల్.' అది బాపూజీకోసం.పుస్తకం సాయంకాలానికి వచ్చింది. బాపూజీ చదవడం కూడ ప్రారంభించారు.

# గాంధీజీ కారాగార గాథలు

18, జనవరి '43

నేడు సోమవారం, మౌన దినం. ఉదయం నేను కొంచెం సేపు బొమ్మలు గీచాను. మహాదేవ భాయీ సమాధి చిత్రం గీచాను. వాహ్యాళికి వెళ్ళలేదు. మీరాబహెన్ వచ్చి డ్రాయింగును గురించి కొన్ని విషయాలు చెప్పి వెళ్ళింది. నేను ఎప్పుడూ బొమ్మలు గీయలేదు. చిత్రకళ కొంచెమైన తెలియక పోవడం ఎంతో బాధ కలిగిస్తున్నది.

బాపూ తమ లేఖను, అన్నయ్య ఇచ్చిన సవరణ ముసాయిదాను పరిశీలిస్తూ, కొంతసేపు ఆలోచిస్తున్నారు. సోమవారం కావడం వల్ల నాకు ఈరోజు చదువు చెప్పడం లేదు. అందువల్ల మధ్యాహ్నం త్వరగా నిద్రపోయారు. మేల్కొగానే,మిస్టర్ కటేలీ వైస్రాయి ఉత్తరం తీసుకొని వచ్చారు. లేఖ బాగుంది; మిత్రభావంతోనే ఉంది; ఉత్తర ప్రత్యుత్తరాలకు దారి తీస్తుంది. బహుశా ఏదైనా దారి ఏర్పడితే బాగుండును. సరోజినీనాయుడుకు చాల మంచిదనిపించింది. మీరాబహెన్‌కు సరోజినీ



గొలంత

చిత్రం—వి. మగుణ (కరీంనగర్)

వాయుడుకు కలిగినంత ఉత్సాహం కలుగలేదు. నాకు అంతకన్నా తక్కువ ఉత్సాహం కలిగింది. బాపూ తటస్థులుగా ఉన్నారు.

ఆయన సమాధానం వ్రాయడం ప్రారంభించారు. రోజా మూడున్నరకు అరగంటసేపు ఆయన ధ్యానం చేస్తారు. సమాధానం అంతలోపల సిద్ధంచేసి ఇచ్చారు. అందరూ తమ తమ అభిప్రాయాలు తెలిపారు. రాత్రి బాపూ మళ్ళీ ఆ సమాధానం కొంచెంసేపు చూస్తూ ఉన్నారు. "రేపు సమాధానం వెళ్ళిపోవాలి. ఉదయం పూర్తి చేద్దాము" అన్నారు.

పడుకోడానికి ముందు మీరాబహెన్ రెండు ఇంగ్లీషు భజన గీతాలు పాడింది— 'ఓ గాడ్! అవర్ హెల్ప్ ఇన్ ఏజెస్ పాస్ట్', 'వెన్ ఐ సర్వే ది వండరస్ క్రాస్'. బాపూ ఆనందం పట్టలేక "రెండవ భజన గీతంతో సమానమైంది మరొక ఇంగ్లీషు భజన గీతం లేదు" అన్నారు.

బాపూజీకి రక్తపుపోటు చాల ఎక్కువయింది. ఏడున్నర, ఏడు ముప్పావుకు చూడగా 204—116. ఉంది.

19, జనవరి '43

బాపూ రాత్రి బాగా నిద్ర పోలేకపోయారు. ఉదయం ప్రార్థన తర్వాతకూడ పడుకోలేదు. లేచి లేఖ తయారు చేయడం మొదలుపెట్టారు. నాతో వ్రాయించడం ఆరంభించారు. ఏడు గంటలకు ఉత్తరం పూర్తిచేసి, అల్పాహారం సేవించారు. అటూ ఇటూ పచారు చేశారు. మాలిష్, స్నానం అయిన తర్వాత, భోజనంచేసి, ఉత్తరం నకలు తామే తయారు చేయడం మొదలుపెట్టారు. నేను స్నానంచేసి వచ్చేంతలోపల ఒక వాక్యం వ్రాశారు. తక్కింది నేను చెప్పగా వ్రాశారు.

బాపూజీ మౌనం ఇప్పుడు ఆగిపోయింది. నాకేమో బాగుంది. కాని, మధ్యాహ్నం అరగంటసేపు ఇంకా ధ్యానంలో ఉంటున్నారు. మధ్యాహ్నం రెండు మూడు గంటలు మౌనంగా ఉండాలని కూడ అంటున్నారు.

ఆయన రక్తపుపోటు ఉదయం బాగా ఎక్కువయింది. సాయంకాలానికి ఎక్కువయింది. ఆయన మనస్సు శాంతంగా లేదు. ఆశించి కూర్పో లేదు; నిరాశాభావమూ లేదు. భగవంతుడు ఏమి చేయదలచుకుంటే అది అవుతుంది— ఇది ఆయన భావం.

నిన్నటినుంచి నా గొంతు చెడిపోయింది. కొద్దిగా జ్వరంకూడ తగిలింది.

20, జనవరి '43

ఉదయం ప్రార్థనసమయంలో నేను బాపూను "ఇంకా ఎన్నిరోజులు ఇక్కడ ప్రార్థన చేయవలసి ఉంటుంది?" అని అడిగాను. "చాలరోజులు. నేను ఆలోచించినకొద్దీ వైస్రాయి ఉత్తరం చెడ్డదిగా తోస్తున్నది. నేడు నేను వ్రాసిన ఉత్తరానికి ఆయన తీక్ష్ణంగా సమాధానమిస్తాడు" అన్నారు బాపూ.

(తరువాయి 61 వ పేజీలో)

నుండి శుభవార్తలంది శుభములగూర్చి ప్రయాణాలు సాగుతవి. కుటుంబ విషయాలలో శుభములు కూడివచ్చి సుఖ సంతోషాలు లభిస్తవి.

## ధనుస్సు (మూల.పూ.షా., ఉ. షా 1 పా.)

తొందర పనికిరాదు. ప్రస్తుతం విరుద్ధంగా తోచిన వ్యవహారాలన్నీ క్రమంగా దారికి వస్తవి. అనవసరమైన ఆందోళనతో ఆరోగ్యం భంగం కలిగించుకోవద్దు. ఆలసటతోకూడిన పనులను, ప్రయాణాలను సాధ్యమైనంతవరకు తగ్గించుకోవటం మంచిది. ఉద్యోగంలో భయకారణాలు, బదిలీ సూచనలు వాటంతటవే తొలగిపోతవి. అవకాశం చూచుకోకుండా వ్యాపారంలో భారాన్ని పెంచుకోవద్దు. తలవని తలంపుగా ద్రవ్యము సమకూరి తొందరలు తీరుతవి. విద్యార్థులు పరీక్షలలోనెగ్గి, నూతనోద్యోగములను సంపాదించుకోగలుగుతారు. బంధు వర్గాలనుండి శుభవార్తలు అందుతవి.

## మకరం

(ఉ.షా.2,3,4 పా., శ్రవ., ధని 1. 2 పా.)

అపుడపుడు మీ ఆరోగ్యంలో వచ్చే మార్పులు మీ ఉత్సాహానికి, ఉద్దేశ్యాలకు అడ్డు వస్తుంటవి. కాని, సమయంలో పట్టుదలచూపి పనులను సాధించుకోగలుగుతారు. వృత్తి మార్గాలలో విశేషమైన ఫలితాన్ని ఆశించి వృథా శ్రమ పడకండి. దైవికంగా జరిగే మార్పులు కొన్ని మీ అనుకూలతకు, అభివృద్ధికి మార్గములవుతుంటవి. లభించిన అవకాశాలను చేజిక్కించుకొని ఆటుపైన అభివృద్ధికి ఆలోచించండి. విద్యారంగంలో ప్రోత్సాహం లభిస్తుంది. ఎదురుచూస్తున్న ఆదాయం చేతికంది అవసరములు తీరుతవి. కుటుంబవిషయాలలో ఏవో సామాన్యమైన ఇబ్బందులు తప్పవు. శుభముల గూర్చి ప్రయాణ సూచనలు ఉన్నవి.

## కుంభం

(ధని 3.4 పా., శత. పూ. భా. 1.2. 3 పా.)

ఎవరినీ అతిగా నమ్మవద్దు. ముందు కొంత ఆశ చూపెట్టి మీ వల్ల ధనలాభం పొందచూచే వారుఉంటారు. ముఖ్య స్నేహితులతో ఏర్పడిన విభేదాలు తొలగిపోతవి. వ్యవహారరంగంలో పెద్ద మనుష్యుల సాయమున కొంత మేలు జరుగుతుంది. వృత్తికి సంబంధించిన పనులు, ప్రయాణాలు సుముఖంగా సాగుతవి. ఉద్యోగ వ్యాపారాలలో కొంది అనుకూలత లభిస్తుంది. స్పెక్యులేషన్ వంటి వ్యాపారాలలో పరిమితి అవసరం. సాహిత్య పరిశ్రమలలో మీ ఆశయములకు తగిన అవకాశాలు, గౌరవ ధన లాభాలు సమకూరుతవి. వివాహాది శుభకార్యములు నెరవేరే అవకాశాలు అందివస్తవి.

## మీనం (పూ భా. 4 పా., ఉ. భా., రేవతి)

యోగ్రప్రదమైన కాలం. వృత్తి మార్గాలలో మీ శక్తి సామర్థ్యములు రాణించగల సమయం. వ్యవహార రంగంలో తొందరపాటు కలుగుతుంది. ధైర్యం, అంతకు మించిన సహనం అవసరం. పర్యవసానంగా జయం మీకే సమకూరుతుంది. శత్రువులు చెప్పినట్లు విని, చేతిక్రిందికి రాకతప్పదు. తరుచు ప్రయాణాలు, ఖర్చులు విశేషంగా ఉంటవి. వ్యాపారం భారీ ఎత్తున సాగుతుంది. నూతన వ్యక్తులతో, వాణిజ్య సంస్థలతో ఎగ్రిమెంట్లు అనుకూలంగా కుదురుతవి. ఋణరూపంలో మీ పెట్టుబడులకు కావలసిన ధనం సమకూరుతుంది. ఉద్యోగంలో హోదా అధికారాలు పెరిగే అవకాశాలు లభిస్తవి. కుటుంబ విషయాలు సంతోషంగా సాగిపోతుంటవి. ★

# గాంధీజీ కారాగార గాథలు

(8 వ పేజీ తరువాయి)

పగలు ఆయన 'లే మిజరబుల్' చదువుతున్నారు. మధ్యాహ్నం బాకు భూగోళం పాఠంచెప్పి, కథ చదివి వినిపించారు. సాయంకాలం రోజులాగే రామాయణం చదివి అర్థం చెప్పారు. సాయంకాలం వాహ్యాళిలో నాకు గీత నేర్పారు; రాత్రి అన్నయ్యతో మాట్లాడుతూ గడిపారు.

నేడుకూడా నేను త్వరగా పడుకున్నాను. పగలు కలెక్టర్ మిస్టర్ హ్యాలన్, డాక్టర్ శాహ్ వచ్చారు. బా ఉమ్మిని ఆటోవేక్సీన్ చేయడానికి, సరోజినీనాయుడు మలం పరీక్షకు పంపారు.

22, జనవరి '43

నేడు శుక్రవారం. భగవద్గీత కొత్త పారాయణం ప్రారంభమయ్యే రోజు.

మూలం :
డాక్టర్ సుశీలానైయర్
అనువాదం :
తిరుమల రామచంద్ర

నేడు కూడా చలి హెచ్చుగానే ఉంది. మధ్యాహ్నం అందరం ఎండలో పడుకున్నాము.

సాయంకాలం డాక్టర్ శాహ్ వచ్చారు. సరోజినీనాయుడు మలంలో నులిపురుగులు హెచ్చుగా కనిపించాయన్నారు. నేను మొదటే దానికోసం మందు తెప్పించాను. పరీక్షించిన మీదట చికిత్స చేద్దామనుకున్నాను. ఆమెకు గుండెజబ్బు కూడా ఉందని తెలిసింది. దీనివల్ల విషయం మరింత పేచీదా అయింది.

మధ్యాహ్నం కొంచెంసేపు వ్యాకరణం నేర్చుకున్నాను. బాకు కొద్దిగా అనువాదం చదివిచెప్పాను. నాలుగున్నర అయింది.

బాడ్మింటన్, పింగ్‌పాంగ్ వలలు తయారు చేయించాలనే చర్చ వచ్చింది. సరోజినీనాయుడ నన్ను అడిగితే నేను అన్నాను: "అనుకోడం బాగుంది. ఆడేవారెవరు?" అని. "నీవు, ప్యారేలాల్, మీరా, బాపూ, కస్తూర్బా. బాపూ ఇప్పుడు నవలలు చదువుతున్నారంటే, ఎందుకు ఆడరు?" అన్నారు సరోజినీ నాయుడు. అందరం నవ్వాము.

23, జనవరి '43

నేడు శనివారం. మీరాబహన్, సరోజినీ నాయుడు మహాదేవభాయీ సమాధివద్దకు వచ్చారు. బా రాలేక పోయారు. నిన్నటినుంచి ఆమె స్వాస్థ్యం సరిగా లేదు.

వాహ్యాళి సమయంలో బాపూ అడిగారు: "నవలకు సాహిత్యంలో స్థానం ఏమిటి?" అని. అన్నయ్య సమాధాన మిచ్చారు: "సాహిత్యంలో మూడు విభాగాలున్నాయి— కవిత, నాటకం, కాల్పనిక నవలలు. అందువల్ల నవలల స్థానం పెద్దది." "ఎంత విచిత్రమైన విషయం! కాల్పనిక విషయాలకైతే పెద్ద స్థానం. జీవితానికి సంబంధించిన అసలు విషయాలకు స్థానమేలేదు!" అన్నారు బాపూ. అన్నయ్య తన వాదాన్ని నిలుపుకొనడానికి పూనుకున్నాడు: "నవలలలో ఆదర్శం వ్యక్తీకరించబడుతుంది. ఆదర్శం ఆధారం జీవితానుభవం. స్టో వ్రాసిన 'అంకుల్ టాం కుటీరం' అనే నవల విప్లవం కలిగించింది. దాని పరిణామంగా బానిసతనం రూపుమాసింది. అప్టన్ సింక్లైర్ నవల 'జంగిల్' కారణంగా కొత్త చట్టం పుట్టింది. కనుక నవలల వల్ల చాల ప్రయోజనం ఉంది."

"సదుపయోగం ఏ వస్తువుతో కాకపోతుంది? ఏ వస్తువయినా పూర్తిగా లాభకరమా, నష్టకరమా అన్న సంగతి చూడాలి. నవలలు ఎక్కువ నష్టం కలిగించాయని నా అభిప్రాయం" అన్నారు బాపూ.

"తులసీదాస్ రచించిన రామాయణం వంటి ధర్మగ్రంథం కూడా కాల్పనికమే కదా?" అని ప్రశ్నించాడు అన్నయ్య. "ఆలాటి తర్కంలో నేను పడదలచుకోలేదు. ఇది వితండవాదం. తులసీదాస్ రామాయణాన్ని ఎవ్వరూ నవల అని చదువరు. నేను సామాన్యమైన నవలల స్థానం తెలుసుకొనడానికి మాట్లాడుతున్నాను" అన్నారు బాపూ.

'అంకుల్ టాం కుటీరం' పై జరిగిన చర్చలో లించింగ్ దురాచారంపై చర్చ ఆరంభమయింది. లించింగ్ ఏమిటో బాపూ వివరించారు. లించింగ్ అంటే జన సముదాయం ఆవేశంలో ఎలాటి న్యాయవిచారణా లేక, నిందితుణ్ని ఆడవికి తోలివేయడం. ఇది అమెరికా మొదలయిన దేశాలలో అలవాటులో ఉండేది. లించ్ అనే న్యాయాధీశుని పేర ఈ మాట బయలుదేరింది.

## ఉత్తరాలు

(2 వ పేజీ తరువాయి)

ప్రోత్సహిస్తున్నందుకు మిమ్మల్ని అభినందించకుండా ఉండలేను.

—డి. వి. గోపాలకృష్ణ
(భువనేశ్వర్—2)

* * * *

నిత్యనూతనంగా కొత్త అందాలను సంతరించుకొనే మా ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రికలో ఈమధ్య ముత్యాల్లాంటి వ్యాసాలు ప్రచురింపబడుతున్నాయి. 22—7—64 వ తేది సంచికలో 'స్త్రీకి ప్రథమ శత్రువు స్త్రీ' అన్న వ్యాసము ఆణిముత్యము వంటిది అనుటలో సందేహము లేదు. వ్యాసకర్తతో చాలావరకు ఏకీభవిస్తున్నాను. 'క్రమంగా సంసారంలో రాటుతేలిన తరువాత నాపసాని బుద్ధులు అబ్బుతాయి' అనుట ఎంతయో సమంజసము. స్త్రీల స్వభావములను చక్కగా వర్ణించారు.

గాంధీజీ కారాగార గాథలు చదువుతుంటే నేడు మన మనుభవించే ఈ స్వాతంత్ర్యము ఎంత విలువైనదో, ఎందరు మహానుభావుల త్యాగఫలమో, కృషి శ్రమల ఫలితమో తెలియవస్తున్నది.

శ్రీ కె. శ్యామసుందరంగారి 'చరిత్రపుటలు' నిజంగా చక్కటి గేయం.

—కుమారి శ్రీవత్సవాయి సత్యవతీదేవి
(విశాఖపట్టణము—4)

* * *

నం. పా. సా. గారు వ్రాసిన 'స్త్రీకి ప్రథమ శత్రువు స్త్రీ' అన్న వ్యాసం ఆడవాళ్ళను దుయ్యబడుతూ హాస్యధోరణిలో సాగినా కొంతవరకు వాస్తవానికి సన్నిహితంగా ఉందని ఒప్పుకోక తప్పదు. కట్నాలు, కానుకలు అంటే ఆడవాళ్ళకు కొంచెం ఆశ, మోజు ఉన్నా మగవాళ్ళకేమీ తెలియనట్లు, ఇందులో పురుషుల పాత్ర ఏమీ లేనట్లు చక్కగా తప్పించుకోచూచారు రచయిత. తమ కుమారునికి వివాహం చేసేటప్పుడు భార్యాభర్తలు ఇద్దరు ఈ విషయం సమంగా ఆలోచించరా? భార్య తప్పకుండా కట్నం తీసుకోవాలని ఒకవేళ పట్టుబట్టిందనుకోండి. మగవాడుగా, భర్తగా అధికారం చెలాయిస్తాడే, ఈ విషయంలో భార్య నోరుమూయించే శక్తి లేదా? కట్నంవస్తే తేరగా పుచ్చుకోవచ్చని స్త్రీజాతి మీద తప్పుతోసి పరోక్షంగా ఈ నాటకం నడిపించేది మునుమ్మాటికి పురుషుడే.

ఆడవాళ్ళే తలు లమీద తిరగబడటం మంచిదని వ్రాశారు. కాని అదెంత సమంజసమో రచయిత ఆలోచించి ఉండరు. హిందూ కుటుంబాలలో అందులోనూ మన ఆంధ్రలో, మగవారికిచ్చే ఆధిక్యం, స్వేచ్ఛ స్త్రీలకు లేవు. తనేమిటో తాను తెలుసుకోని స్థితిలో సాధారణంగా స్త్రీకి వివాహమవుతుంది. అటువంటప్పుడు ఏమని ఎదిరిస్తుంది? ఎదిరించినా ప్రయోజనం శూన్యం.

—కుమారి మన్నెం శారద
(కాకినాడ)

* * * *

'ఎవరు మారాలి?' అన్న వ్యాసంలో కొందరు పురుషులు కూడా వెలువరించని అభ్యుదయ భావాలు వెలడించినందుకు శ్రీమతి రామలక్ష్మి గారు అభినందనీయులు. కాని నేటి సంకుచిత మనస్కులైన యువకులపై కసితీర్చుకొనేందుకు గాను ప్రాచీన సంప్రదాయాలను ఆసరా తీసుకొని మెచ్చుకోవడంలో సమంజసమూ, పైపెచ్చు అర్థమూ లేదు. నాటి, నేటి పరిస్థితులను బేరీజు వేసికొని చూస్తే స్త్రీల పరిస్థితి నేడు అభ్యుదయ పంథాలో (ప్రారంభ దశే అనుకోండి) ఉన్నదని చెప్పాలి. నేటి నవనాగరిక ప్రపంచంలో ఉండే మూఢ సంప్రదాయాలు వదులుకోలేని యువకులు నేటి పరిస్థితులతో జరిగే ఘర్షణ ఘాటికి తట్టుకోలేక కలిగే మానసిక రుగ్మతవల్ల, నమ్మకాల నాశనం కావడమో, దానిని వదిలించుకోవడానికి ముందుగా నాగరికపుటలవాటు నలవరచుకోవడమో తప్పదు కాబట్టి, ఈ సంకుచితాభిప్రాయాలు ఎంతోకాలం మనమధ్య విహరించలేవని, స్త్రీ పురుషభేదం లేకుండా సంఘంలో స్వేచ్ఛగా సంచరించే అవకాశం, తద్వారా పురుషులతోబాటు సమానావకాశాలు, సమాన ప్రతిపత్తి స్త్రీలకు సుదూర భవిష్యత్తులోనైనా లభింపగలవని ఆశిద్దాము.

—గానుగపాటి శ్రీరామారావు
(వాల్తేరు)

* * * *

'తెగిన తీగలు' ముగింపులో ఏదో వెలితి కన్పిస్తూంది. తొందరగా తెలియకుండానే ముగించివేశారు రచయిత్రి. ఈ నవలలో ఏదో తెలియని కొత్తదనం, పాఠకుల్ని ఆకర్షించే శైలి ఉన్నాయన్పిస్తూంది. మంచి భావాలు కలిగించే భాష ఈమెలో ఉంది. ఏమైనా రచయిత్రి అభివందనీయురాలు.

—వై. ఎస్. ప్రసాద్
(పూనా)

* * *

గాంధీజీ కారాగార గాథలు చదువుటవలన మేము ఎన్నో కొత్త సంగతులు తెలిసికొనినాము. వ్రాసిన డాక్టరు సుశీలానైయర్‌గారికి, అనువదించిన తిరుమల రామచంద్రగారికి, ప్రచురించిన మీకు నా అభినందనలు.

—జి. కృష్ణవేణి
(న్యూజల్పాయ్‌గురి)

* * *

'తెగిన తీగలు' సీరియల్ చదవడం పూర్తయింది. కథ మొత్తం సహజమైన వ్యక్తులతో, సంఘటనలతో చక్కగా ఉంది. రాఘవయ్యలాంటి తండ్రులు, ఛాయవంటి అక్కయ్యలు, భారవిలాంటి బావలు మన సంఘంలో లేకపోలేదు. జీవితంలో ఒక ప్రత్యేకమైన పథంలో తన వ్యక్తిత్వాన్ని మలచుకున్న నీలాసుందరి, చివరకు ఇతరుల స్వార్థానికి బలియై, పరాజితగ మారడం చదువుతుంటే మనస్సు వికలమై పోతుంది. అటువంటి వ్యక్తుల జీవితాలు అంతేనేమో అనిపిస్తుంది ఈ సీరియల్ చదివాక. మరో వ్యక్తిని పెళ్ళి చేసుకొనకుండా, తన్ను తాను 'ఆత్మవంచన' చేసుకోకుండా ఉండటం ఆ పాత్ర గొప్పతనానికి నిదర్శనం.

రచనను చక్కటి భాషలో, తక్కువ పాత్రలతో పాఠకులకు అందించిన రచయిత్రి డి. ప్రమీలాకుమారి గారిని అభినందిస్తున్నాను.

—డి. మధుసూదన్
(హైదరాబాదు—4)

* * *

'తెగిన తీగలు' ముగింపు చదివిన తర్వాత నా మనస్సు అవ్యక్తమైన వేదనతో నిండిపోయింది.

## గాంధిజీ కారాగార గాథలు

"నన్ను కూడ ఆఫ్రికాలో లించ్ వేయడానికి పూనుకున్నారు. ఈశ్వరుడు రక్షించాడు. అఖరుకు ఛాంబర్‌లేన్ తంతి ఇచ్చాడు, నామీన దాడిచేసిన వారికి శిక్ష విధించాలని. నన్ను మంత్రి పిలిపించి అడిగితే, నా ఫిర్యాదు ఏమీ లేదన్నాను. ఆరోజునుంచి, అతని మనస్సులోను, దక్షిణాఫ్రికా అంతటాను నా విలువ పెరిగింది" అన్నారు బాపూ.

నేడు వరోటివినాయుడు కోసం కొంత వంట వలసి వచ్చింది. ఒకటింపావు గంటసేపు వంటకు పట్టింది. బాపూనూ వొంగలికూగ గొట్టె తిన్నారు. ఒళ్ళు కొంచెం బరువుగా ఉంది. సాయంకాలానికి కొద్దిగా జ్వరం తగిలింది.

సాయంకాలం మీరాబహెన్‌తోపాటు నేను అన్నయ్య ఖ్లీప్ చేసిన ఉత్తరాలను తైఫారు చేశాను. ఒక ఉత్తరం వ్రాయించాను. సంగీత సాధనకు సమయం లేకపోయింది.

తర్వాత అన్నయ్య నాతో అన్నాడు: బాపూ మాలిష్ సమయంలో రాబర్ట్ బ్రౌనింగ్ కవిత "శక్రీ బెన్ ఎజ్రా" లోని ఒక పాదం "Heaven's success found on earth's failure" పునశ్చరణ చేస్తూ తమ ఉపవాస భావనను స్పష్టపరిచారు: "ప్రపంచం దేనిని సఫలత అంటున్నదో దానివిషయమై నేనెప్పుడూ ఆశపడలేదు. ప్రపంచం నింది స్తుందనే భయంతో నేనెప్పుడూ నా ధ్యేయం వదలలేదు."

(సశేషం)



# గాంధీజీ కారాగార గాథలు

26, జనవరి '43

నేడు స్వాతంత్ర్య దినోత్సవం జరపడంకోసం సరోజినీ నాయుడు మొన్ననే 'స్వాతంత్ర్య ప్రతిజ్ఞ' వ్రాసిపెట్టవలసిందిగా బాపూజీని కోరారు. బాపూజీ నిన్న మౌనంలో దానిని వ్రాసిపెట్టారు. ఆ ప్రతిజ్ఞ చిన్నది, చాల చక్కగాను తయారయింది. "ఇది సంపూర్ణమైనది. సమగ్రమైనది. ఈ ప్రతిజ్ఞను నేను అంతఃప్రేరణ పరిణామంగా భావిస్తున్నాను. ఇది సరాసరి హృదయంనుంచి వెలువడింది" అని సరోజినీ నాయుడు అన్నారు.

బాపూ నిన్న రాత్రి దానిని అనువదించడానికి కూర్చున్నారు. "మీరు పడుకోండి. నేనుఉదయం దానిని అనువదించి మీకు అందజేస్తాను. మీరు దానిని చక్కదిద్దండి" అని నేను అన్నాను. కాని, ఉదయం వాహ్యాళికి వెళ్ళడానికి ముందు కొంచెం కూడా పురసత్తు దొరకలేదు. మనసుకూడా కుదరలేదు. మాలిష్ అయిన తర్వాత బాపూ రాగానే ఇచ్చివేద్దామని అనుకున్నాను. కాని, నా స్నానం ఇంకా సగమన్నా అయిందో లేదో, బాపూజీ మాలిష్ పూర్తిచేసుకొని వచ్చారు. నేను పని చేస్తూ చేస్తూ అనువాదం చేయాలని అనుకుంటూనే ఉన్నాను. కాని, అనువాదం చేయలేను. స్నానంచేసి వెలుపలికి రాగానే సరోజినీ నాయుడు ఏదో వండిపెట్టమన్నారు. వంటలో ఉండిపోయి, అనువాదం సంగతే మరచిపోయాను. అనువాదం బాపూజీకి ఇవ్వాలనే సంగతి జ్ఞాపకమే ఉంటే, ఐదారు నిమిషాలు ఎలాగో సర్దుబాటు చేసుకొని చేసేదాన్ని.

బాపూ ఉపవాసం చేశారు. ఆయన రెండు సార్లు—ఉదయం, మధ్యాహ్నం—బెల్లం, వేడి నీళ్ళు, బత్తాయిపళ్ల రసం పుచ్చుకున్నారు. నేను తేనీరు తీసుకున్నాను. అన్నయ్యపూర్తిగా ఉపవాసం చేశారు—మంచినీళ్ళుమాత్రం పుచ్చుకున్నారు. సరోజినీనాయుడు, కటేలీకోసం బటాణీలపులావు, షల్‌గమ్ (ముల్లంగివంటి గడ్డ) కూర, బేసన్ మిఠాయి తయారుచేశాను. అన్నీ తయారుచేసిన తర్వాత బాపూజీ పాదాలు తోమడానికి వెళ్లినప్పుడు ఆయన అనువాదం ఇమ్మన్నారు. "ఐదు నిమిషాలలో వ్రాసి ఇస్తాను" అన్నాను. బాపూ పది నిమిషాలలో నిద్రపోయి లేచారు. నేను అనువాదం చేశాను. దానిని ఆయన చూచి, అవసరమైన చోట సవరించారు. నేను ఇంగ్లీషు అనువాదం దగ్గరపెట్టుకొని అనువదించడం వల్ల, మూలంలోని కొన్ని పదాలు వదలిపోయాయి. ఇంగ్లీషులో వ్రాసిన ప్రతిజ్ఞ అనువాదం ఈ ప్రకారంగా ఉన్నది:

"భారతదేశం అన్నివిధాల సత్యాహింసల ద్వారా సంపూర్ణంగా స్వతంత్రం కావాలి. ఇది నా ఇప్పటి ఉద్దేశమే కాదు; సంవత్సరాలుగా ఉన్న ఉద్దేశం. ఈ ఉద్దేశ పూర్తికి, నేను, నేడు, స్వాతంత్ర్య దినోత్సవపు పదమూడవ సంవత్సరపు రోజున, భారతదేశం తన ఉద్దేశ్యం సాధించేటంత వరకు విశ్రమించనని, నా పలుకుబడి ఏమాత్రమైనా ఉన్నవారిని కూడ విశ్రమించ నివ్వనని ప్రతిజ్ఞ చేస్తున్నాను. నా ఈ ప్రతిజ్ఞ సఫలం అగుగాక! ఈ సాఫల్యంకోసం నేను, గాడ్ అని, అల్లాహ్ అని, పరమాత్మ అని పరిచిత నామధేయాలతో వ్యవహరించే అదృశ్య మహాశక్తిని తోడ్పడవలసిందని ప్రార్థన చేస్తున్నాను."

ఝండా తయారుచేయడానికి పసుపు, సోడా కలిపి నారింజరంగు తయారుచేశాము. పసుపు రంగును పేస్టల్‌తో సిద్ధపరచాము. తెల్లగుడ్డమీద పెన్సిల్‌తో మీరాబహెన్ చర్ఖా బొమ్మ గీచింది. తోటలో మామిడిచెట్టుకింద చిన్న స్తంభం నాటాము. దానిమీద మీరాబహెన్ చక్కగా ఝండా కట్టింది. ఝండాను తయారు చేసిందీ ఆమే.

సభాధ్యక్షతను బాపూ సరోజినీ నాయుడుకు అప్పగించారు. ఆమె "మీరు ఉండగా, ఈ పదవి ఎవరు తీసుకోగలరు?" అంటూ ఆఖరుకు అంగీకరించింది.

ఆరుగంటలకు బాపూ వాహ్యాళినుంచి తిరిగి వచ్చారు. సరోజినీ నాయుడు ఆయనతో ఝండా అభివాదనం చేయించారు. మొదట మేము "సారే జహాఁసే అచ్ఛా హిందోస్తాఁ హమారా" పాడాము. తర్వాత బాపూ ఝండా ఎగురవేశారు. పిదప "ఝండా ఊంచా రహే హమారా" గీతం పాడాము. స్వాతంత్ర్య ప్రతిజ్ఞను పఠించి, వందేమాతరం గీతం గానం చేశాము. సుందరమైన దృశ్యం! "లక్షమందిచేరినా, చేసే పని ఇదే కదా?" అన్నారు సరోజినీ నాయుడు. "ఇన్‌కిలాబ్ జిందాబాద్ నినాదాలు చెలరేగుతాయి" అన్నాడు

# జెయిలులో బాపూ జరిపిన తొలి స్వాతంత్ర్య దినోత్సవం

అన్నయ్య. "బాపూ ఉన్నంతవరకు ఇన్‌కిలాబ్ వర్ధిల్లుతూనే ఉంటుంది" అన్నారు సరోజినీ నాయుడు.

ప్రార్థన సమయంలో "వందే శ్రీహరి పద సుఖదాయీ" పాడాను. రాత్రి త్వరగా పడుకున్నాను. చాల అలసిపోయాను.

నేను చిత్రకళకోసం ఎక్కువ సమయం వినియోగించడం బాపూజీకి ఇష్టంలేదు. ఆయన ఎంతో నచ్చజెప్పారు. కాని, గడువు పెట్టుకొని బొమ్మలు గీచడం కొంచెం కష్టమైన పని.

రాత్రి బాపూ నాతో మాట్లాడుతున్నప్పుడు "ఈవేళ అందరం కలిసి నూలు వడుకుదామని అనుకున్నాను. కాని, అందరూ పనిలో ఉండిపోయారు. అందువల్ల చెప్పలేదు" అన్నారు. "నాకుకూడా అలాటి అభిప్రాయమే కలిగింది. కాని, ఊరికే ఉండిపోయాను" అన్నాను. "ఇప్పుడు వడుకుదాం" అన్నది మీరాబహెన్. అయితే, ఎనిమిది కొట్టింది. బాపూజీ పడుకోడానికి చాల ఆలస్యమవుతుందని రేపు సమష్టిగా నూలు వడకడం (సూత్రయజ్ఞం) సాగించాలని నిశ్చయించాము. బాపూజీకి ఈ నిర్ణయం చాల నచ్చింది. రేపు రెండున్నరనుంచి మూడువరకు సూత్రయజ్ఞం కార్యక్రమం ఏర్పాటయింది. "స్వరాజ్యం ఈ వడుకునూలుకు బంధించబడి ఉందని నేను ఇదివరకే అన్నాను. కాని, ఈ మాటను ఒప్పుకునేవారు చాల కొద్దిమంది. అయినా, మనం వడుకుదాం" అన్నారు బాపూ.

## ఉపవాసనిశ్చయంతో చింత

6, ఫిబ్రవరి '43

ఈ రోజు శనివారం. ఉదయం సరోజినీ నాయుడు మహాదేవభాయీ సమాధి వద్దకు వచ్చారు. "ఆమె నియమపాలనం అత్యద్భుతం. ఏమైనా కానీండి; శనివారం రాకమానరు" అన్నారు బాపూ. మీరాబహెన్ కూడా వచ్చింది. కస్తూర్బా రాలేదు. ఈ మధ్య ఆమె అలసిపోయినట్టు ఉంటున్నారు. ఆమెను చింత తినివేస్తున్నది.

బాపూ బైబిల్ న్యూ టెస్టమెంట్‌కు మఫేట్ వాలా అనువాదం తెప్పించారు. "సాయంకాలం న్యూ టెస్టమెంట్ చదువాలి సుమా! నీవు బైబిలు పట్టుకుని కూచో. నేను అనువాదం పట్టుకొని కూర్చుంటాను. ఓల్డ్ టెస్టమెంట్ నీ అంతట నీవే చదువుకో!" అన్నారు బాపూ. కాని, సాయంకాలం నన్ను మొదట బాడ్‌మింటన్ ఆడడానికి పంపారు. తర్వాత, రామాయణంలో కొట్టివేతలు చూపించి, మరి రెండు రామాయణాలలో గుర్తులు పెట్టమన్నారు. దానితోనే సమయమంతా గడచిపోయింది.

వైస్రాయినుంచి జవాబు నేడు కూడా రాలేదు. సాయంకాలంవాహ్యాళిలో బాపూ, "బహుశా జవాబు పంపరేమో! జవాబుకు బదులు, ఆయన చేయవలసిన పని సరాసరి ఖండారీ మొదలయిన వారికి తెలుపుతారు" అంటూ అన్నయ్యతో ఇలా అన్నారు: "ఈ ఉపవాసంలో నేను నశించిపోతాననుకో. మీ అందరినుంచి నేను ఏమిటి ఆశిస్తానో తెలుసుకో. మహాదేవ్‌ను నేను భట్రాజులాగ పొగడుతాను. అయితే, నా మనసు అతనిపై దోషారోపణలుకూడా చేస్తుంది. అతనిదృష్టాంతం సంపూర్ణమనిగాని, ఆదర్శమనికాని అనుకోరాదు. 'నేను బాపూజీ తర్వాత ఏమిచేస్తాను? బాపూజీకి ముందే వెళ్ళిపోతే మంచిది' అని జపంచేస్తూ అతడు వెళ్ళిపోయాడు. ఈ దృఢసంకల్పం అతనిని మరణంనుంచి నివారించేదే. నేను ఈ ఉపవాసంలో మరణిస్తే, నా సందేశాన్ని అరకొరగా వదలిపోయినట్టే. సత్యాగ్రహ విజ్ఞానాన్ని నేను పూర్తిగా దేశం ఎదుట ఇంకా పెట్టలేకపోయాను. నాతర్వాత నాసందేశాన్నిజనతకుఎవరుఅందిస్తారు? ఎవరు నాతోపాటు ఉండరో, నన్ను ఎరుగనే ఎరుగరో అలాటివారు ఆ పని చేస్తారా? మీరా? ఇది మీ పనే అని నాకు తెలుసు. మనం ఏమిచేయగలమో చెప్పడం ఉచితంకాదు. ఈశ్వరునిపై శ్రద్ధపెడితే, నా సందేశం పూర్తిచేయ్యగలగడానికి శక్తినిస్తాడు. నేను ఎలాచేశానో, నేను ఏసిద్ధాంతం అందరి ఎదుట పెట్టానో, ఏ సిద్ధాంతం ప్రకారం ఆచరిస్తున్నానో, వాటి నన్నిటినీ, మీరు జీవనంలో ధారణచేసుకోవాలని నేను చెబుతున్నాను. మీ మార్గం దానంతట అదే మీముందు వికసిస్తూ, విస్తరిస్తూ పోతుంది. ఈ విషయంలో నీవు, సుశీల తయారు కావాలి. సత్యాగ్రహులు జడులుగా ఎందుకు కనిపిస్తారని నీవు నన్ను ఒకమారు ప్రశ్నించావు. నేను ఆ నాడు ఏమి సమాధానం చెప్పానో జ్ఞాపకపరచుకో. సత్యాగ్రహులు జడులుగా ఉండరని నా వాదం. దారి చూపేవాడు ఉన్నంతవరకు అందరూ అతనివైపే చూస్తూ ఉంటారు. అతడు లేకపోతే, తమంతట తామే తమ కాళ్ళపై నిలబడుతారు. మనవారంతా తమంతటతాము తమ కాళ్ళపై నిలబడితే, భగవంతుడు వారికి ముందడుగు చూపిస్తాడు. ఈ రోజు నుంచి ఆ విషయమే ఆలోచించగూడదు."

అన్నయ్య సవినయంగా సమాధానం చెప్పాడు: "మీ పనికోసం జీవించడమో, మరణించడమో ఉండనే న్నాయి. ఇంతకంటె ఎక్కువ ఇప్పుడు ఏమి చెప్పగలను? అడగవలసింది ఎంతో ఉంది కాని, ధైర్యమే కలగడం లేదు. మరేదైనా విశేష సందేశం ఇవ్వదలచుకొంటే, నాకు చెప్పండి. లేకపోతే వ్రాసి ఇవ్వండి. నేను గూడ కొన్ని మాటలు మీ సమక్షంలో వ్రాసిపెట్టుకుంటాను."

మూలం :

డాక్టర్ సుశీలానైయర్

అనువాదం :

తిరుమల రామచంద్ర

## వైస్రాయి జవాబు

7, ఫిబ్రవరి '43

శనివారం వైస్రాయినుంచి జవాబు రాలేదు గనుక ఇక సోమవారమే వస్తుందని మేమందరం అనుకున్నాము. నేడు 10—0 గంటలకు డాక్టర్ శాహ వచ్చారు. ఆయనతో మాట్లాడడానికి గదినుంచి వెలుపలికి అడుగుపెట్టానో, లేదో, ఎదుట సూపరింటెండెంట్ మిస్టర్ కటేలీ వస్తున్నారు. నేను ఆశ్చర్యపడి, "మీకు కిందికి దిగడానికి ఎవరు అనుమతి యిచ్చారు?" అని ప్రశ్నించాను. (ఆయనకు బాడ్‌మింటన్ ఆటలో కాలు బెణికినందున కాలువాచి చికిత్స పొందుతున్నారు కొన్నాళ్ళుగా. కనుక మేడమీదిగదినుంచి కిందికి దిగవద్దన్నాను.) ఆయన నవ్వుతూ "బాపూజీ ఎక్కడ ఉన్నారు?" అని అడిగారు. బాపూజీ మాలిష్‌లో ఉన్నారు. అక్కడికి వెళ్ళి మిస్టర్ కటేలీ ఒక చిన్న లిఫాఫా (కవరు), ఒక పెద్ద లిఫాఫా బాపూజీకి అందజేశారు. రాత్రి పది గంటలకు బొంబాయినుంచిఒకసందేశహరుడు వచ్చి, ఈ ఉత్తరాలు ఇచ్చాడని, నేను 11—0 గంటలకు మీకు అందజేయమన్నాడని మిస్టర్ కటేలీ బాపూతో అన్నారు. దాదాపు 11—0 గంటలకు ఆయన ఆ ఉత్తరాలు అందజేశారు. ఆ ఉత్తరాలను నేను బాపూజీకి చదివి వినిపించాను. వైస్రాయి జవాబు ఏమీ బాగులేదు. కోపం తొణికిసలాడుతున్నది. చిన్న లిఫాఫా లాట్‌వెట్ వ్రాసినది. ఉత్తర ప్రత్యుత్తరాలు ముద్రించడానికి అనుమతి అడిగారు. సమాధానం ఏదైనా పంపదలచుకుంటే, ప్రత్యేక సందేశహరునితో పంపాలని వైస్రాయి హుకుమని మిస్టర్ కటేలీ తెలిపారు. రైలు బొంబాయికి మధ్యాహ్నం 2—0 గంటలకు, రాత్రి 8—0 కి వెళ్ళుతుంది. మధ్యాహ్నం 2—0 గంటల బండికి వెళ్ళడానికి వార్తాహరుడు సిద్ధంగా ఉండాలని బాపూజీ అన్నారు. భోజనానంతరం అన్నయ్యతో ఉత్తరం వ్రాయించారు. అంతా పూర్తయే వేళకు అరగంటే వ్యవధి ఉంది. ఇంతలోగా సాపు నకలు వ్రాయడం పడదు గనుక, బాపూ వార్తాహరున్ని రాత్రి 8—0 గంటల బండికే పంపడానికి నిశ్చయించారు.

బాపూ విశ్రాంతి తీసుకోదానికి పడుకున్నారు. కాని, ఏదో ఒక్క మాట చెప్పడంకోసం రావలసివచ్చేది; అందువల్ల నిద్రపోలేక పోయారు. లాథ్‌వెట్‌కు అన్నయ్యతో ఉత్తరం వ్రాయించారు. జపంచేశారు; నూలు వడికారు. వడికేటప్పుడు అన్నయ్య, మీరాబహన్ కొన్ని సూచనలిచ్చారు. మూడుంబావుకంతా అన్ని పనులూ ముగించుకొని లేచారు. నాతో ఉత్తరాలు వ్రాయించమని మొదట అన్నయ్యతో అన్నారు. కాని, తర్వాత అభిప్రాయం మార్చుకున్నారు. అన్నయ్య లాథ్‌వెట్‌కు ఉత్తరం టైప్ చేశాడు. నేను పళ్లరసం తయారుచేశాను. నాలుగున్నర గంటకు బాపూ భోజనానికి కూర్చున్నారు. అప్పుడు నాతో ఉత్తరం వ్రాయించారు. చెబుతూ, చెబుతూ ఎన్నో సవరణలు కూడా చేశారు. గంటలో పని పూర్తయింది. వాహ్యాళిలో ఆ ఉత్తరం బాపూజీ చదివి చూచారు. తిరిగి వచ్చిన తరువాత నేను, మీరాబహన్ ఉత్తరం నకలు తయారు చేశాము. ఆరుముప్పావుకంతా ఉత్తరం సిద్ధపరచి మిస్టర్ కటేలీకి అందజేసి, ప్రార్థనకు కూర్చున్నాము. బాపూజీ సమాధానం చాల బాగుంది. దానంతట అది హృదయంనుంచి వెలువడింది. ఒక ఊపిరిలో దానిని ఆయన వ్రాయించారు.

మిస్టర్ కటేలీ నిన్న రాత్రి చాలసేపు నడిచినందున రాత్రల్లా మోకాలు నొప్పితో నిద్రపోలేక పోయారు. పగలూ నిద్రపోలేదు. నేటి రాత్రి ఆయనకు మార్ఫియా ఇంజెక్షన్ ఇచ్చాను. నిద్రపోయారు.

సరోజినీ నాయుడు చాల సహకార భావంతో ఉన్నారు. నాతో ఆమె అన్నారు: "సుశీలా, నీవు నాకు ఏదైనా హుకుం చేయడానికి సంకోచ పడవద్దు. నేను నీ ఆదేశం ప్రకారం పనిచేసేదాన్ని. జిమ్మేదారీ నీది. చెప్పు. ఏమేమిటి కావాలి?" అని. నేను చెప్పాను.

8, ఫిబ్రవరి' 43

ఉదయం భండారీ, డాక్టర్ షా వచ్చారు. నేను అవసరమైన వస్తువుల జాబితా వారికి అందజేశాను. ఉపవాసానికి ముందు బాపూజీ రక్త పరీక్ష, గుండె ఫోటో తీయడం జరుగాలని చెప్పాను. డాక్టర్ షా కోపంతో "వీటివల్ల ప్రయోజనం ఏమిటి? నాకు వీటిమీద విశ్వాసమే లేదు. నేను పాతకాలపువాణ్ని. లేబరేటరీకంటె, నా చేతుల వేళ్లమీద, నా కళ్లమీద నాకు విశ్వాసం ఎక్కువ" అన్నారు.

"మీరు పెద్దలు. నామాట కొట్టివేయగలరు. ఇవి జరుగాలని నేను సలహా ఇచ్చాను. అంతే" అన్నాను.

"అబ్బే! లేదు. మీకు అన్నీ దొరికేటట్లు నేను ప్రయత్నిస్తాను. కాని, కొంతకాలం పడుతుంది. ఎవరితోనూ ఉపవాసం గురించి చర్చించవద్దని నాకు ఉత్తరువులు వచ్చాయి. కనుక, నా స్థితి కొంచెం క్లిష్టమైంది" అన్నారు డాక్టర్ షా.

"ఇదంతా ఎందుకు జరుగాలని అంటున్నారు? ఇంతకుముందు జరిగిన ఉపవాసాలప్పుడు ఈ పరీక్షలన్నీ చేయించారా?" అని ప్రశ్నించారు భండారీ.



మీనలోచన

(చిత్రం—వీరిశెట్టి అచ్యుతరావు గారు)

"ఊఁ! చేయించాము" అన్నాను అన్నయ్య. ఇద్దరూ చాల గాభరా పడ్డారు.

నేను బాపూ మౌనం. అందరం అనుకున్న వేళకు దారం వడికాము. పగలు మా మా పనులు చేసుకున్నాము. రేపటి నుంచి ఉపవాసం ప్రారంభమవుతుంది. అందువల్ల అందరి హృదయాలూ కుంగిపోయాయి. సాయంకాలం భోజనం తీసుకొని వస్తున్నప్పుడు, 'మళ్లీ బాపూజీకి భోజనం ఎప్పుడు తెస్తానో! ఎప్పుడు భోజనం ఆయన ముందు పెడతానో!' అనిపించింది మనసులో.

అన్నయ్య టైపు పనిలో ఉన్నాడు. సాయంకాలం బాపూజీకి భోజనం పెట్టి, మేము నాలుగున్నరకు భోజనానికి కూర్చున్నాము. ఇంతలో నాలుగుముప్పావయింది. కర్నల్ భండారీ, మిస్టర్ అర్‌విన్ ప్రభుత్వపు సమాధానం తెచ్చారు. బాపూ సమాధానం చదివి, మౌనం వదలకుండానే, అర్‌విన్‌కు వ్రాసి చూపారు ఈవిధంగా:— "ఈ సమాధానంలో నా సహచరుల ప్రస్తావన ఉంది. కనుక, నేను వారితో సంప్రతించవలసి ఉంటుంది. మీరు కష్టమనుకోకుండా 9—0 గంటలకు వస్తే, మంచిది."

అర్‌విన్ 9—0 గంటలకు వస్తానని చెప్పి వెళ్లిపోయారు. ఆయన 9—0 గంటలకు వచ్చారు. బాపూ తమ సమాధానం ఆయనకు అందజేశారు. దానిని అర్‌విన్ చదివి "అవసరమైతే ఉపవాసం ఒక్కరోజుపాటు అపుతానని మీరు వ్రాశారు. మీరు ఈ ప్రకారం తప్పక చేయండి. దీనివల్ల మాకు చాల సహాయం కలుగుతుంది" అని అన్నారు.

బాపూ ఆమోదించారు.

(సశేషం)

# గాంధీజీ కారాగార గాథలు



ప్రభుత్వానికి అందజేసిన సూచన ప్రకారం బాపూ నేడు ఉదయం అల్పాహారానంతరం ఉపవాసం ప్రారంభించారు. ఉపవాసం ఆరంభమయ్యేటప్పుడు ప్రార్థన జరగడం మామూలు. నేడు కూడా అల్పాహారానంతరం మేము కొంచెం సేపు ప్రార్థన చేశాము. బాపూజీ పగటి కార్యక్రమం మామూలుగా, రోజూలాగే జరిగిపోయింది. ఉదయం, సాయంత్రం వాహ్యాళి, సమాధికి పుష్ప సమర్పణ, పగలు చదవడం, వ్రాయడం, నూలు వడకడం, ఇవన్నీ బాపూజీ నిర్ణీత కార్యక్రమం ప్రకారం నిర్వర్తించారు.

నన్ను పిలిచి "ఉపవాస సమయంలో నా సేవాబాధ్యత హెచ్చుగా నీదే. కనుక ఈ సమయంలో చదవడం, వ్రాయడం, డైరీ వ్రాయడం వగైరా అంతా మరచిపో" అన్నారు. అన్నయ్యను పిలిచి "ఉపవాసపు రోజుల డైరీ నీవు వ్రాయదలచుకుంటే వ్రాయి. సుశీలపై ఆ ఆశ పెట్టుకోవద్దు. ఆమెకు ఈ రోజులలో డాక్టర్ పని చాల ఉంటుంది. ఆమె నిద్ర కట్టి వ్రాత పని చేయడం నా కిష్టంలేదు" అంటూ, నావైపు తిరిగి "నీవు గనుక వ్రాతపనులు చేస్తేవంటే, నీ సేవ నాకు అవసరంలేదు" అన్నారు. అందువల్ల ఉపవాస సమయం డైరీని అన్నయ్య యాదాస్తుల ద్వారాను, డాక్టర్ల సమావేశ నివేదికల ద్వారాను వ్రాశాను.

ఉపవాస సమయంలో సహాయ పడడానికి బాపూ తనకు ఇష్టమయిన డాక్టర్లను పిలిపించుకోవచ్చునని ప్రభుత్వం తెలియజేసింది. "సుశీల వాదర్ద ఉంది. ఆమె చాలు. మరొక డాక్టర్ అక్కరలేదు. ఆమె ఎవరి సహాయమున్నా కావాలనుకుంటే కోరుకోని" అని బాపూజీ వ్రాశారు. ఉపవాససమయంలో బాపూజీని చూచుకునే బాధ్యత నేను ఒక్కతే భరించాలా? పరిస్థితి విషమిస్తే, ఒక అమ్మాయి ప్రకటించే ఆరోగ్య కరపత్రాలకు ప్రభుత్వం విలువ ఇస్తుందా? ఉపవాససమయంలో మందు ఇవ్వడానికి వీలులేదు. ప్రత్యేకమైన చికిత్స చేయడానికి లేదు. అయినా, చిన్న చిన్న విషయాలపై డాక్టర్ల సహాయం అవసరమౌతుంది. మరి కొందరు డాక్టర్లు ఉంటే అయ్యే గొప్ప సేవ ఏమిటంటే, దేశానికీ, ప్రభుత్వానికీ, బాపూజీ పరిస్థితిని యథాతథంగా తెలుపవచ్చు—ఈ ఈ ఆలోచనలను, చిక్కులను నేను బాపూజీ ఎదుట పెట్టాను. "నీ బరువు తగ్గించుకో డానికి ఇతరులను పిలిపించడం మంచిది" అన్నారు ఆయన.

అందువల్ల నేను డాక్టర్ గిల్డర్, డాక్టర్ విధాన చంద్రరాయ్, డాక్టర్ జీవరాజ్ మెహతా—వీరిని పంపవలసిందిగా ప్రభుత్వానికి తెలియజేశాను. ఇంతకుముందు ఉపవాసాలలోను వీరు బాపూజీని చూచుకున్నారు. మాలిష్ మొదలయిన వాటికోసం ప్రకృతి చికిత్సా గృహం తాలూకు డాక్టర్ దీన్ షా మెహతాను పిలిపించాలను కున్నాను.

11, ఫిబ్రవరి '43

నేడు ఉదయం బాపూ మహాదేవ భాయీ సమాధివద్దకు నడిచివచ్చారు. తర్వాత మాలిష్ మొదలయినవి జరిగాయి.

నేడు ఉదయం డాక్టర్ గిల్డర్‌ను యరవదా జెయిలునుంచి ఆగాఖాన్ మహల్ జెయిలుకు తీసుకుని వచ్చారు. డాక్టర్ సాహెబ్ జెయిలుకు వచ్చిన తర్వాత గడ్డం పెంచారు. చూచి మేమంతా బాగా నవ్వాము. "డాక్టర్ సాహెబ్, మీరు సినిమాలో లాయీ ఫాక్సర్‌లాగ కని పిస్తున్నారు కొద్ది కొద్దిగా" అన్నాను.

బాపూజీ పగలెల్లా మంచినీళ్ళు తాగారు. ఇంతవరకు మంచినీళ్ళు తాగడానికి ఎలాటి ఇబ్బందీ కలుగలేదు. తలతిరుగుడు, వాంతులు ప్రారంభం కాలేదు గాని, నీరసం ప్రారంభమయింది.

ఉపవాస సమయంలో ఎవరెవరిని చూడాలి, మొదలయినవాటిని గురించి ప్రభుత్వం నిర్ణయాలను కర్నల్ భండారీ బాపూజీకి తెలియజేశారు:

(1) ఎవరెవరిని కలుసుకోవాలనే విషయం బాపూజీ నిర్ణయించుకోవాలి. ఆయన ఎవరిని ఇష్టపడితే వారిని పిలిపించుకోవచ్చు.

(2) ఏ విషయం గురించైనా వారితో మాట్లాడవచ్చు. ఎలాటి నిర్బంధమూ ఉండదు.

(3) ఈ సంభాషణ సమయంలో ఒక ప్రభుత్వోద్యోగి హాజరయి ఉంటారు.

(4) సంభాషణల వార్తలు పత్రికలలో ప్రకటించడానికి వీలులేదు.

10, ఫిబ్రవరి '43

దీనికి బాపూ సమాధానం వ్రాస్తూ, తనను కలుసుకొనేవారి బరువు తనపై వేయవద్దని, తనను కలుసుకోదలచుకొనేవారికి తనను అడగకుండానే ప్రభుత్వం అనుమతి ఇవ్వవచ్చునని

# గాంధీజీ కారాగార గాథలు

స్పష్టపరచారు. "ఇంతకుముందు జరిగిన ఉపవాసాల సమయంలో సేవచేసిన ఆశ్రమవాసులందరూ, ఈ ఉపవాసంలోనూ నాకు సేవ చేయడానికి అనుమతి ఇవ్వాలి" అని ఆయన కోరారు. శ్రీ మథురాదాస్ భాయీ ఆరోగ్య విషయం తెలుపవలసిందనీ బాపూజీ కోరారు. బాపూతోపాటు భన్సాలీ భాయీ కూడ ఉపవాసం ప్రారంభించినట్టు పత్రికలలో చదివాము. భన్సాలీ భాయీ వెంటనే ఉపవాసం మానవలసిందిగా తన సందేశం టెలిఫోన్ ద్వారా తెలియపరచాలని ప్రభుత్వాన్ని బాపూజీ కోరారు.

12, ఫిబ్రవరి '43

బాపూజీకి నేడు నీరసం ఎక్కువయింది. రోజుకు రెండు పౌనుల ప్రకారం బరువు తగ్గుతూ వస్తున్నది. కాని, మంచినీళ్ళు తాగగలుగుతున్నారు. ఒక్కొక్క సమయం తల తిరుగుతున్నది గాని, వాంతి కావడంలేదు. సమాధివరకు వెళ్ళి పూవులు సమర్పించే శక్తి ఆయనలో లేదు. మేము సమాధికి పూవులు సమర్పించి, ప్రార్థనచేసి వచ్చాము.

ఉపవాస వార్తలను పెద్ద పెద్ద శీర్షికలతో ప్రచురించవద్దని, ఉపవాసవార్త ఏదైనా రెండు కాలాలకు మించరాదని, ఉపవాసవార్తలు ప్రభుత్వం ద్వారా వచ్చినవి తప్ప మరేవీ ప్రచురించరాదని "హిందూస్థాన్ టైమ్స్" పత్రికకు ప్రభుత్వం తాకీదు పంపింది.

కేంద్ర శాసనసభ బడ్జెట్ సమావేశానికి ఢిల్లీకి వచ్చిన పలువురు నాయకులు శ్రీ హృదయనాథ కుంజ్రూ ఇంటలో సమావేశమయి, సాధ్యమైనంత త్వరలో నాయకుల మహాసభ ఏర్పాటు చేయాలని నిర్ణయించారు. రాజాజీకి, సర్ తేజ్‌బహదూర్ సప్రూజీకి తంతి పంపారు. బాపూజీ ఉపవాస వార్తతో దేశమంతా ఉడికిపోతున్నట్టు పత్రికలవల్ల తెలియవచ్చింది.

ఎండవేడిమి అకస్మాత్తుగా ఎక్కువయింది. వరండాలో ఉన్న బాపూ మంచం మధ్యాహ్నానికి లోపల వేయవలసివచ్చింది.

అమ్మాజాన్ (సరోజినీ నాయుడు) ఎంతో ప్రేమతో మమ్మల్ని చూస్తున్నారు. తమ జబ్బు సంగతే మరచిపోయి, బాపూ సేవకు నడుం బిగించారు. దినమంతా బాపూవద్ద కూర్చుంటున్నారు. సూపరింటెండెంట్ కటేలీ సాహెబ్ మోకాలినొప్పిని కూడా లెక్కచేయక దినమంతా కిందికి, పైకి లెక్కలేనన్నిసార్లు ఎక్కి దిగుతున్నారు. కర్నల్ శాహ్, కర్నల్ భండారీ నేడు వచ్చి బాపూజీని కుశల ప్రశ్నలు వేశారు. ఈ సర్కారు ఉద్యోగులకు రెండు వైపులా బరువు పాపం! ప్రతి భారతీయునికీ బాపూజీపైన ప్రేమ ఉండడం సహజం. ఈ సర్కారు ఉద్యోగులు ప్రభుత్వాన్ని కూడ సంతోష పెట్టవలసిఉంది. తమ పొట్టకూటి సంగతి మరి!

13, ఫిబ్రవరి '43

డాక్టర్ విధాన్ చంద్రరాయ్ మరొకరితోపాటు నేడు సాయంకాలం కలకత్తానుంచి బయలుదేరారని వార్త వచ్చింది.

కర్నల్ భండారీ మూడుసార్లు వచ్చారు. బాపూజీని చూడదలచుకొన్నవారి విషయమై చర్చలు జరిగాయి.

14, ఫిబ్రవరి '43

ఈ రోజు బాపూజీకి వికారం, వాంతులు ఎక్కువయ్యాయి. అందువల్ల ఆయాసం ఎక్కువయింది. మంచినీళ్ళలో కొన్నిబొట్లు నిమ్మకాయ రసం, ఉప్పు, సోడాలో కలిపి తాగడానికి ప్రయత్నించారు. నీరసం, ఆయాసంవల్ల పడ సం కూడా తగ్గిపోయింది. ఆయనకు చెవిపోటు తగిలింది. చెవిలో ఏదో గుల్ల లేచినట్టుంది.

భన్సాలీభాయీ ఉపవాసం విరమించినట్లు వార్త వచ్చింది.

బొంబాయి సర్జన్ జనరల్ కేండీ ఈ రోజు పూనా వచ్చారు. పలువురు బాపూజీ మిత్రులు, బంధువులు పూనా వచ్చారు. ఆయనను కలుసుకొనడానికి ప్రభుత్వం అనుమతికోసం వేచిఉన్నారు. ఠక్కర్ బాపాకూడా వచ్చినట్లు తెలిసింది.

15, ఫిబ్రవరి '43

వికారం, వాంతి చాల బాధిస్తున్నాయి. నిమ్మపండ్లరసం, ఉప్పు కలిపిన మంచినీరు తాగడం కూడ కష్టమవుతున్నది.

ఉదయం సర్జన్ జనరల్ కేండీ, భండారీ, శాహ్, మాజిస్ట్రేట్ బాపూ దర్శనానికి వచ్చారు. రాత్రి డాక్టర్ విధానచంద్ర రాయ్ వచ్చారు. ఆయనను కలుసుకోగానే చాల సంతోషమయింది. వెలుపలి తాజా గాలి లభించింది.

మహాదేవభాయీ సతీమణి దుర్గా బహెన్‌కు, కుమారుడు నారాయణ్‌కు ఆగాఖాన్ మహల్‌లో వచ్చిఉండడానికి అనుమతి దొరికింది. వాళ్ళు రావడం నాకు ఎంతో మంచిదనిపించింది.

# మూడువారాల ఉపవాసాగ్ని పరీక్ష నుంచి గట్టెక్కిన బాపూజీ

ఆమెను మహాదేవభాయీ సమాధివద్దకు పిలుచుకొని వెళ్ళేటప్పుడు అందరి గుండెలూ చెరువులయాయి. కళ్ళు మేఘాలయాయి. దుర్గా బహెన్ ఈ సమయంలో బాపూవద్దకు రావడం ఆమెకు ఔషధప్రాయం. ఉపవాసం పూర్తయేవరకూ వాళ్ళు ఇక్కడే ఉంటారు.

16, ఫిబ్రవరి '43

డాక్టర్ గిల్డర్ నేడు ఉదయం బాపూ రక్తం, మూత్రపిండాల పరీక్షకోసం వచ్చారు. బాపూ పరిస్థితి ఈ రోజు మరింత అధ్వాన్నమయింది; మంచినీళ్ళ గ్లాసు కూడా పట్టుకోలేకపోయారు. ఆయనను చక్రాల మంచంపై పడుకోబెట్టాము.

"గాంధీజీ బ్రతుకుతారా?" అని పత్రికల వారు డాక్టర్ రాయ్‌ను అడిగారు.

"గాంధీజీ అప్పుడప్పుడు డాక్టర్లను కూడా బోల్తా కొట్టిస్తారు. కనుక కచ్చితంగా ఏమీ చెప్పలేను" అన్నారు డాక్టర్ రాయ్.

నేడు గాంధీజీ పరిస్థితిని గురించి బులెటిన్ (కరపత్రం) వ్రాసేటప్పుడు ఆరుగురు డాక్టర్లం—సర్జన్ జనరల్ కేండీ, డాక్టర్ విధాన చంద్ర రాయ్, డాక్టర్ గిల్డర్, కర్నల్ భండారీ, కర్నల్ శాహ్, నేను—ఉన్నాము. మా కరపత్రం ప్రభుత్వానికి చేరుతుంది. మొదట్లో నా సంతకంతోను, డాక్టర్ గిల్డర్ సంతకంతోను మాత్రమే వెళ్ళేది. ఇప్పుడు అందరి సంతకాలతోనూ వెళ్ళుతుంది. దానిలో తనకు బాగని తోచిన అంశాలను ప్రభుత్వం ప్రచురిస్తుంది. ఉపవాసం ప్రారంభించి ఈ రోజుకు వారమయింది.

20, ఫిబ్రవరి '43

బాపూ పరిస్థితి మరింత అధ్వాన్నమయింది. ఉదయం సర్జన్ జనరల్ కేండీ వచ్చినప్పుడు బాపూ పడుకునిఉన్నారు. కేండీసరోజినీనాయుడుతో "ఈయన మరి రెండు సంవత్సరాలు బ్రతికితే భారతదేశంలో ఎంత మార్పు వచ్చిని? ఇలాటి వ్యక్తి ప్రాణాలు ఆపత్తులో పడడం ఎంత దుఃఖకరమైన విషయం! ప్రజలపై ఈయనకు ఎంత గొప్ప పలుకుబడి ఉంది? ఇలాటి పలుకుబడి ఉండడానికి తగిన యోగ్యత ఈయనకు ఉంది" అన్నారు.

నేను ఢిల్లీలో జరిగిన నాయకుల మహాసభలో "భారతదేశ హితంకోసం, వివిధ దేశాల పరస్పర స్నేహంకోసం గాంధీజీని వెంటనే విడుదల చేయాలి" అని డాక్టర్ జయకర్ ప్రతిపాదించిన తీర్మానం ఆమోదించబడింది. సర్ తేజ్‌బహదూర్ సప్రూ మొదలయిన పెద్దలు ప్రసంగించారు.

వైస్రాయి నుంచి బాపూజీకి సమాధానం వచ్చింది. "ఫిబ్రవరి 10 వ తేదీన ప్రభుత్వం చేసిన ప్రకటనలో ప్రభుత్వం తన నీతిని స్పష్టపరిచింది. అటు తర్వాత కొత్త ఘటన లేమీ జరుగలేదు. ఉపవాసపు బాధ్యత అంతా గాంధీజీదే. దానిని విరమించే బాధ్యత కూడ ఆయనదే. ప్రభుత్వానిది కాదు" అని ఆ జవాబులో స్పష్టపరచబడింది.

25, ఫిబ్రవరి '43

ఈ రోజు భూలాభాయీ, మున్షీ, రాజాజీ బాపూ దర్శనానికి వచ్చారు "ప్రభుత్వం మొండి పట్టుదలతో ఉంది. ఏ వాదం కూడా వినడానికి సిద్ధంగా లేదు. ఏలాటి సమాధానపు మాట ఎత్తినా, ప్రభుత్వం రకరకాల షరతులు, హామీల మాట ఆరంభిస్తుంది. ఒకవైపు మీ ధ్వని జెయిలు నాలుగు గోడలమధ్య బందయిపోయింది. మరొకవైపు దేశ పరిస్థితి నానాటికీ విషమిస్తున్నది" అన్నారు భూలాభాయీ బాపూతో. మున్షీ భూలాభాయీని సమర్థించారు.

బాపూజీ పేరంటేనే వైస్రాయి లిన్‌లిత్‌గో మండి పడుతున్నాడని రాజాజీ తెలిపారు. ఒకరు లిన్‌లిత్‌గోతో మాట్లాడతుండగా, గాంధీజీ ప్రస్తావన రాగానే ఆయన (లిన్‌లిత్‌గో) కోపంతో లేచి గదంతా తిరగడం ప్రారంభించాడని రాజాజీ తెలిపారు.

27, ఫిబ్రవరి '43

అణే (అనే) బాపూజీతో ముచ్చటించడానికి వచ్చారు. ఆయన లేడీ లిన్‌లిత్‌గో సందేశంతో వచ్చారు. "మీ సిద్ధాంతాలకు భంగం లేకపోతే ఉపవాసం మానుకోండి" అని ఆమె సందేశం పంపింది. పలువురు మిత్రులు ఉపవాసం మానుకోవలసిందని ఉత్తరాలు వ్రాశారు. సర్ మోరిస్‌గ్వాయర్ కూడ ఉపవాసం విరమించవలసిందని కోరుతూ ఉత్తరం వ్రాశారు.

రాజాజీ మరలా బాపూజీని కలుసుకొన్నారు. గురుదేవ్ (రవీంద్రనాథ్ టాగూర్) పుత్రుడు రథీబాబూ నమస్కరించి వెళ్ళాడు.

ఈ రోజు బాపూజీ క్షౌరం చేయించుకున్నారు. అందరికీ బాగనిపించింది. ఎండిపోయిన ముఖమయినా, క్షౌరం తర్వాత మెరిసినట్టయింది.

28, ఫిబ్రవరి '43

నేడు బాపూజీని రాజాజీ మరల కలుసుకొని జాతి సమస్యకు సంబంధించిన ఫార్ములాపై చర్చ జరిపారు.

మూలం :

**డాక్టర్ సుశీలానైయర్**

అనువాదం :

**తిరుమల రామచంద్ర**

ఉపవాసం పూర్తయిన తర్వాత జెయిలు తలుపులు బందవుతాయని నేడు బాపూజీ దర్శనానికి చాలమంది వచ్చారు.

బాపూ పరిస్థితి ఈ రోజు బాగుంది.

2, మార్చి '43

నేటితో ఉపవాసం ఆరంభమై మూడు వారాలు పూర్తయాయి. ఆగంతుకులందరూ కలుసుకొనడానికి జెయిలు ద్వారాలు ఆఖరుసారిగా తెరువబడ్డాయి. లక్ష్మీ బహెన్ ఖరే, తక్కినవారు సెలవు తీసుకుంటున్నప్పుడు బా కళ్ళు చెమ్మగిల్లాయి. "అచ్చా! ఇదే ఆఖరు రామ్ రామ్ సోదరీ!" అన్నారు బా. "బా, ఎందుకు అలా అంటున్నారు? మనమంతా విడుదలయి వెళ్ళి అందరినీ కలుసుకుంటాము" అన్నాను.

"అవును. మీరంతా వెళ్ళుతారు" అన్నారు ఆమె. ఆమె గొంతులో కరుణ, నిరాశ ఉన్నాయి.

## ఉపవాస సమాప్తి

3, మార్చి' 43

నిన్న రాత్రినుంచి మా అందరి హృదయాలూ ఈశ్వరునికి ధన్యవాద గీతం ఆలపిస్తున్నవి. 21 రోజుల క్రితం 9 వ తేదిరాత్రి మాలో ఎక్కువమంది సరిగా నిద్రపోలేదు. చింత, మనసులో బరువు—21 రోజులు ఎలా గడుస్తాయని. బాపూ ఒకరే గాఢంగా నిద్రపోయారు. నిన్న రాత్రి ఆయన చాల కొద్ది సేపే నిద్రపోయారు. బాపూ అగ్ని పరీక్ష పూర్తయేట్టు కనిపించింది. డాక్టర్ల అభిప్రాయం ప్రకారం బాపూజీ 21 రోజులు ఉపవసించడం అసంభవమైన విషయం.....బాపూ నిన్న డాక్టర్ విధానచంద్ర రాయ్‌తో మాట్లాడుతున్నప్పుడు "ఈ ఉపవాసాన్ని పూర్తిచేసే శక్తి భగవంతుని నుంచే నాకు లభించిందని నాకు స్పష్టమవుతున్నది ఆలోచించినకొద్దీ" అన్నారు. అందువల్ల ఆయన భగవంతుని ఆయన చర్యలలో దర్శించుకుంటూ పడుకుని ఉన్నారు.

ఉదయం 4-0 కొట్టగానే బాపూ ప్రార్థన కోసం లేచారు. ప్రార్థన తర్వాత సామాన్యంగా ఆయన నిద్రపోయేవారు. కాని, ఈ రోజు నిద్రపోలేకపోయారు.

మేమంతా స్నానాది కాలకృత్యాలు ముగించుకొని ఉపాహారం స్వీకరించి, పూవులతో మహాదేవభాయీ సమాధివద్దకు వెళ్ళాము. నిన్న పూవుల హారాలు చాల వచ్చాయి. అవన్నీ తీసుకొనివెళ్ళి సమాధిని అలంకరించాము. దృశ్యం సుందరంగా ఉంది.

బాపూజీ గది బాగుచేసి ఆయనను కొవిటి

పిలుచుకొని వచ్చాము. ఒకవైపు డాక్టర్ల కోసం కుర్చీలు వేశాను. మరొకవైపు చూడడానికి వచ్చినవారు కూర్చోవడంకోసం స్థలం విడిచాను. కొంతసేపటికి డాక్టర్ రాయ్ వచ్చారు. "నేను నేలమీదే కూర్చుంటాను" అన్నారు. "అయితే మీరు ప్రార్థనలోనూ పాల్గొనవలసిఉంటుంది" అన్నారు బాపూ. పాపం! డాక్టర్ రాయ్ అటూ ఇటూ దిక్కులు చూచారు. అక్కడ గీతాంజలి కనిపించింది. దానినుంచి రెండు సుందరమైన గీతాలు ఏరుకున్నారు.

8—50 కు ప్రార్థన ప్రారంభిస్తే, 9-0 గంటలకంతా ఉపవాసం విరమించవచ్చునని బాపూ మొదట అనుకున్నారు. కాని, తర్వాత అభిప్రాయం మార్చుకున్నారు. సర్జన్ జనరల్ కేండీ మొదలయినవారు ప్రార్థనలో పాల్గొంటే బాగుంటుందని సరోజినీ నాయుడు సూచించారు. వారు వచ్చేవరకు కనుగాంధీ, నారాయణ్ దేశాయి 'ఆనందలోకే, మంగళాలోకే' గీతం పాడారు. 'వైష్ణవ జనతో' పాడండని సరోజినీ నాయుడు కోరగా, అదీ పాడారు. ఇంతలో సర్జన్ జనరల్ కేండీ మొదలయినవారు వచ్చారు. ప్రార్థన ప్రారంభమయింది.

డాక్టర్ రాయ్ గీతాంజలినుంచి 'వేర్ ది మైండ్ ఈజ్ విథౌట్ ఫియర్', 'దిస్ ఈజ్ మై ప్రేయర్ టు దీ, మై లార్డ్' అనే రెండు గీతాలూ చదివి వినిపించారు. చాలా బాగున్నాయి. తర్వాత బాపూజీ నిర్ణయించిన క్రమం ప్రకారం ప్రార్థన జరిగింది. ఆఖరున 'వెన్ ఐ సర్వే ది వండరస్ క్రాస్' భజన గీతం పాడాము. భజన ముగించి పళ్ళరసం తెద్దామని నేను లేచాను. కాని, అలాగే నిలుచుండిపోయాను. బాపూ కళ్ళు మూసుకుని పడుకున్నారు. ఆయన పెదవులు కదులుతున్నాయి. కళ్ళు చెమ్మగిల్లాయి. ఈ భజన గీతం ఆయనను ఎప్పుడూ కరిగించివేస్తుంది. నేడు మరీ ఎక్కువగా. మరొక సిలువను వెదకవలసిన అవసరం ఏముంది? అది మన కళ్ళ ఎదుటే ఉందికదా!—అనిపించింది. ప్రార్థన అందరినీ కదిలించివేసింది. వాతావరణం గంభీరంగాను, సౌమ్యంగాను, కరుణాత్మకంగాను పరిణమించింది.

బాపూ శాంతించారు. నేను గిన్నెలో పళ్ళరసం పోశాను. ఆరు ఔన్సుల రసంలో ఒక ఔన్సు నీళ్ళు కలపాలని బాపూ అన్నారు. ఆ విధంగానే కలిపి నేను గిన్నెను కస్తూర్బా చేతికి అందించాను. బాపూ మంచం తలవైపు పైకి ఎత్తాము. బాపూ దాని ఆసరాతో కూర్చుని నెమ్మదిగా "నేను డాక్టర్లకు ధన్యవాదాలు సమర్పించ గోరుతున్నాను" అన్నారు. ఆయన గొంతు గద్గదమైంది. ఒకటి రెండు నిమిషాలు అందరూ మౌనంగా నిలబడ్డారు. బాపూజీ కొంచెం సర్దుకుని "వారు నన్ను ఎంతో శ్రద్ధతో, ప్రేమతో చూశారు" అన్నారు. మళ్ళీ ఆయన కంఠం

# గాంధీజీ కారాగార గాథలు

రుద్ధమయింది. కొంచెం సేపయినతర్వాత ఆయన వాక్యం పూర్తి చేశారు: "సాఫల్యం వారివల్లనే సిద్ధించింది. కాని, ఈ అగ్ని పరీక్షలో ఉత్తీర్ణుడిని అయి జీవించాలనేది ఈశ్వరేచ్ఛ. ఆ ఈశ్వరుడే నాకు ముందు వేయవలసిన అడుగు చూపిస్తాడు. నా ఈ దౌర్బల్యాన్ని మీరు మన్నించాలి."

బాపూజీ నాడి సీరసంగా ఉంది. గతి తీవ్రంగా ఉంది. డాక్టర్ గిల్డర్ ఆయనను పడుకోబెట్టడానికి ప్రయత్నించారు. కాని, బాపూ నిరాకరించారు. చెప్పవలసిన మాటలు చెప్పి కస్తూర్బా చేతినుంచి పళ్ళరసం గిన్నె అందుకున్నారు.

అన్నయ్య భండారీకి, కేండీకి, శాహ్‌కు వేడివేడి ద్రాక్షరసం అందించి నవ్వుతూ "ఇది మీ షాంపైన్" అన్నారు. విన్న కేండీ పరిహసించారు "రేపు షాంపైన్ దొరుకుతుందా?" అని. మేము 'సహనావవతు' మంత్రం పఠించాము. బాపూ పండ్లరసం పుచ్చుకున్నారు. డాక్టర్ తమ పానీయం పుచ్చుకున్నారు. సర్జన్ జనరల్ కేండీ బాపూజీ నాడి చూచి, "బయలు దేరండి" అంటూ బయటికి నడిచారు. భండారీ ఉపవాసం ముగిసిందని బొంబాయి ప్రభుత్వానికి టెలిఫోన్ చేయడానికి బయలుదేరారు.

నేను బయటికివచ్చి, ఆరుగురి సంతకంతో బులెటిన్ వ్రాశాను. కేండీ వెలుపల నిలబడి మాట్లాడుతున్నారు. నేను ఆయనకు ధన్యవాదాలు సమర్పిస్తూ "సర్జన్ జనరల్ కేండీ, సెలవు! మీ సహాయానికి చాలా చాలా ధన్యవాదాలు" అన్నాను. "వద్దు. వద్దు. మీరు లేకపోతే మేము ఏమి చేసేవాళ్ళమో నాకు అర్థం కావడంలేదు" అన్నారు కేండీ. ఇంతలో సరోజినీ నాయుడు వచ్చారు. కేండీ మాటలు విని, ఆ విధంగానే ఆమె సమాధానం చెప్పారు. నేను లోపలికి వెళ్ళిపోయాను.

అందరూ వెళ్ళిపోయారు. ఆగాఖాన్ మహల్ శూన్యంగా కనిపించింది. బాపూ పగలు రెండు మూడుసార్లు పళ్ళరసం, తేనె, మంచి నీళ్ళు తాగారు. 'టేల్ ఆఫ్ టు సిటీస్', 'హౌండ్ ఆఫ్ హెవెన్' చదువుకుంటూ పడుకున్నారు.

సాయంకాలం భోజనానంతరం మహాదేవ భాయీ సమాధికి పూలు సమర్పించి వచ్చి, బాడ్మింటన్ ఆడుతున్నాము. ఇంతలో దేవదాస్ భాయీ వచ్చారు. రోజూ చాలమంది వచ్చేవారు. కాని, నేడు మహల్ తలుపులు మూసివేశారు. కనుక, దేవదాస్ భాయీని, రామదాస్ భాయీని మాత్రం లోపలికి వదిలారు. వెలుపల మాతాజీ, బాపూజీ సోదరి ఫయాబా కారులో ఉన్నారు. మేము వారిని చూడడం కాలేదు.

రాత్రి బాపూ బాగా నిద్రపోయారు. ఉపవాసం పూర్తికాగానే, ప్రభుత్వం వైఖరి మారిపోయింది. మరల అదే తీవ్రమైన నిగా; మాట మాటకూ మొండి వాదం. ఉపవాసం పూర్తిగా ఎందుకు సఫలమయిందని ప్రభుత్వం విచారపడుతున్నట్లు అనిపించింది.

(సశేషం)



# ఆంధ్రప్రభ

## సచిత్ర వారపత్రిక

మద్రాసు

ఎడిటర్: నీలంరాజు వెంకటశేషయ్య


# హక్కులు, బాధ్యతలు

హక్కులకు, బాధ్యతలకు అవినాభావ సంబంధం ఉన్నది హక్కులు కాపాడుకొనడం ఎంత ముఖ్యమో బాధ్యతలను నిర్వర్తించడం కూడా అంతే ముఖ్యం బాధ్యతలను విస్మరించితే హక్కులకు భంగం కలిగే ప్రమాదం ఉన్నది.

ఇటీవల ఉత్తరప్రదేశ్ శాసన సభలోను, మహారాష్ట్ర శాసన సభలోను జరిగిన సంఘటనలను పరిశీలిస్తే అలాంటి ప్రమాదం నెలకొని ఉన్నదన్న అభిప్రాయం కలుగక మానదు.

ప్రజాస్వామ్యంలో, ముఖ్యంగా పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో శాసనసభలు నిర్వహించవలసిన పాత్ర కీలకమైనది శాసనసభల పైనే ప్రజాస్వామ్యం మనుగడ ఆధారపడి ఉంటుంది.

ప్రజలచే శాసనసభలకు ఎన్నుకొనబడిన వారి బాధ్యత గురుతరమైనది.

శాసనసభల హక్కులను కాపాడవలసినవారు సభ్యులే. ప్రజల హక్కులను, స్వాతంత్ర్యాన్ని కాపాడవలసినవారు కూడా వారే

ఈ బాధ్యతలను శాసనసభల సభ్యులు ఎంత చక్కగా నిర్వహించగలిగితే అంతగానూ వారు తమను ఎన్నుకొన్న ప్రజల ఆదరాభిమానాలు చూరగొనగలరు అంతగానూ ప్రజాస్వామ్యం బలపడుతుంది.

ఇక శాసనసభల సభ్యుల హక్కులు కాపాడే బాధ్యత ఆయా సభల అధ్యక్షుల పై ఉన్నది ఇది సభ్యులు తమంత తాముగా వారికి కట్టబెట్టిన బాధ్యత

సభాపతుల గౌరవాన్ని కాపాడడము, వారి నిర్ణయాలను శిరసావహించడము, తద్వారా తమ గౌరవాన్ని, హక్కులను కాపాడుకొనడము శాసనసభల సభ్యుల కనీస బాధ్యత క్రమశిక్షణకు కట్టుబడలేనివారు దేశంలో క్రమశిక్షణను కాపాడలేరు. ఆనాడు ప్రజలలోనూ క్రమశిక్షణ లోపించడానికి, ప్రజాస్వామిక వ్యవస్థలపట్ల ప్రజల విశ్వాసం సడలడానికి శాసనసభల సభ్యులే కారకులవుతున్నారు.

ఇది ఏలాంటి విషపరిణామాలకు దారితీయగలదో ఊహించడం కూడా వెరగుపుట్టిస్తుంది.

కనుక శాసనసభలలో తల ఎత్తిన ఈ విషబీజాలను సమూలంగా నిర్మూలించడం ప్రజాస్వామ్య ప్రియులందరి విధి ★

# గాంధీజీ కారాగార గాధలు



4, మార్చ్ '43

**ఉదయం** 5—0 కు ప్రార్థనకోసం లేచాము. ప్రార్థన తర్వాత అన్నయ్య బాపూజీ పాదాలు పట్టడం ప్రారంభించాడు. బాపూ ఉపవాసం సంగతి ప్రస్తావించి "ఈ ఉపవాసంలో నేను భగవంతుని దర్శించినంత స్పష్టంగా మరే ఉపవాసంలోను దర్శించలేదు. ప్రతి ఉపవాసమూ ఈశ్వరదత్తమే. వాటిలో నేను భగవంతుని దర్శించాను కూడ. కాని, ఈ దర్శనం రాను రాను స్పష్టం కాసాగింది. నా శక్తి ఏమిటి? ఈశ్వరుడు శక్తి ప్రసాదించాడు. ఈ ఉపవాసంలో నాకు ఎక్కువ కష్టం కలుగదని నాకు మొదటినుంచి దృఢ విశ్వాసం. విజ్ఞానికి అలాగే, ఎక్కువ కష్టం కలుగలేదు" అన్నారు. "మొదటి రెండు వారాలు వదిలితే" అన్నాను నేను. "అవును. అది నిజమే" అన్నారు బాపూ.

నేడూ డాక్టర్ డిన్‌షా మెహతా పత్నితోసహా వచ్చారు; బాపూజీకి మాలిష్ వగైరా చేయడానికి. భండారీ, శాహ కూడా వచ్చారు. బాపూ పడుకొని ఉన్నారు. ఆయన మేల్కొన్న తర్వాత బులెటిన్ (ఆరోగ్య ప్రకటన పత్రం) వ్రాశాము—ప్రజలకోసం ఒకటి, ప్రభుత్వం కోసం ఒకటి. వాటిని పంపాము.

ఈ రోజు కూడా బాపూ పండ్లు, గ్లూకోజ్ మాత్రమే పుచ్చుకున్నారు. కాలోరీల విలువ 750 అయింది.

మధ్యాహ్నం రామదాస్ భాయీ వచ్చారు. ఆయన నేడు మాతాజీని, ఫంయాదాసు బొంబాయికి పిలుచుకొని వెళ్ళుతున్నారు. బాపూతో కొంచెంసేపు ముచ్చటించారు. బాపూ ఆయనకు అహింసాత్మక హింసాత్మక సైన్యాలను గురించి వివరిస్తున్నారు.

సాయంకాలం మీరా బహన్ చాలసేపు కవిత మొదలయినవాటిని గురించి చర్చించింది.

భోజనానంతరం మేము బాడ్‌మింటన్ ఆడుతుండగా, దేవదాస్ భాయీ వచ్చారు. ఆయనను ఆడమని కోరాము. ఆయన ఒప్పుకోలేదు. ఆయన ఇక్కడ ఎంతసేపు పడితే అంతసేపు ఉండడానికి అనుమతి ఉన్నంతవరకు ఆడేవారు. ఇప్పుడు జెయిలు అధికారులు ఆయనను మామూలు ఆగంతుకునిలాగ చూడడం ఆరంభించారు. ఆడడానికి వ్యవధి ఏది?

అటూ ఇటూ తిరిగిన తర్వాత గది చేరాము. దేవదాస్ భాయీ ప్రార్థనలో భజన గీతం పాడారు. ప్రార్థనానంతరం ఆయన కొంచెంసేపు బాపూజీతో మాట్లాడి, అన్నయ్యవద్దకు వచ్చి నిలబడ్డారు. ఆయన నేడు బొంబాయినుంచి వచ్చారు. కనుక నేను ఆయనను భోజనం చేయమన్నాను. ఉపవాస సమయంలో అన్నయ్య ఒక్కరినీ భోజనానికి లేపేవాడు కాడు. ఎందుకంటే, వచ్చి పోయేవాళ్ళు ఎక్కువ మంది ఉండేవారు. ఇప్పుడు దేవదాస్ భాయీ ఒకరే వస్తున్నారు. కనుక భోజనానికి పిలుద్దామని నాకూ అనిపించింది. ఆయనకూ నా ఆహ్వానాన్ని మన్నిద్దామని అనిపించింది. రెండు మూడు నిమిషాలలో ఆయన భోజనం ముగించి లేచారో లేదో, బాపూజీ చెప్పి పంపారు దేవదాసును త్వరగా పంపివేయమని. ఆయన వెంటనే లేచి వెళ్ళిపోయారు. నేను దర్వాజావరకు వెళ్ళి సాగనంపాను. కాని, బాపూ ఈ సంగతికి చాల కోపపడ్డారు. ఇలా అతిథులు ఆగడంవల్ల ప్రమాదం ఉందని ఆయన భావించారు. దేవదాస్ భాయీ ఏడు గంటలకు రావలసినవారు, ఎనిమిదికి వచ్చారు. కనుక వెళ్ళడంలోను రోజుకంటె కొంచెం ఆలస్యమయింది. బాపూజీకి అది నచ్చలేదు. నాకు చాల విచారం కలిగింది. బాపూ ఇంత చిన్న విషయానికి కోపగించుకోడం ఎందుకు? భోజనానికి ఐదు నిమిషాలు కూడా అయివుండదు. ఈ గందరగోళంలో ఒంటి గంటవరకు నాకు నిద్ర పట్టలేదు. బాపూజీ కూడా ఒంటి గంటకు పడుకున్నారు. ఆయన చాల అలసిపోయారు.

6, మార్చ్ '43

దేవదాస్ భాయీ నేడు మధురాదాస్ భాయీ ఆపరేషన్‌కోసం మిరజ్ వెళ్ళదలచారు. మిరజ్ వెళ్ళితే మరునటి సాయంకాలంవరకు రాలేనని ఆయన నిన్ననే అన్నారు.

ఇక్కడ నేటి ఉదయం కార్యక్రమం యథారీతిగానే జరిగింది. భండారీ, శాహ వచ్చారు. "రేపటినుంచి బులెటిన్ అవసరం ఏమిటి?" అని భండారీ నన్ను ప్రశ్నించారు. అవసరం లేదని మేము ఒప్పుకున్నాము. విశేషావసరం ఉంటేతప్ప, ఇకమీద బులెటిన్‌లు ఉండవు—అని నేటి బులెటిన్‌లోనే వ్రాశాము. రేపటినుంచి తాము రామని భండారీ అన్నారు. డాక్టర్ శాహ వస్తారని, ప్రభుత్వానికి వార్తలు తెలియజేస్తారని ఆయన అన్నారు.

# పరివారానికి వీడ్కోలు: సరోజినీనాయుడు విడుదల

డాక్టర్ దిన్‌షా మెహతా, ఆయన సతీమణి వచ్చి మాలిష్‌చేసి వెళ్ళిపోయారు.

బాపూజీకి భోజనం పెట్టి నేను స్నానం చేశాను. భోజనంచేసి గదికి వచ్చేవేళకు ఒంటి గంట కొట్టింది. ఇంతలో కటేలీ వచ్చి, "దేవదాస్ వచ్చి గంటలతరబడి బాపూజీవద్ద ఉండేవారని పత్రికలలో పడింది. కనుక రేపటినుంచి దేవదాస్‌కు ఇక్కడికి రావడానికి అనుమతి ఉండదు. నేడు ఆఖరు రోజు" అన్నారు. నాకు చాల కష్టం అయింది. ఈవేళ రావడానికి అవకాశం ఉంటుందో లేదో ఎవరికి తెలుసు? దేవదాస్‌ను కలుసుకోడం ఆపడానికి ముందుగా తెలియజేస్తామని జెయిలు అధికారులు మొదట తెలిపారు. కాని నేడు హఠాత్తుగా అంతా మారిపోయింది. బాపూజీ కటేలీ వచ్చినప్పుడు నిద్రపోతున్నారు. ఆయన లేచినతర్వాత ఈ సంగతి తెలియజేశాను. మొన్న దేవదాస్ వెళ్ళడం ఆలస్యమయింది. అదే కారణమయి ఉంటుందని బాపూ అన్నారు. కాని, నాలుగు రోజులు రావడానికి మాత్రమే దేవదాస్‌కు అనుమతి ఇచ్చినట్లు మొదటే పత్రికల్లో వచ్చిందని, నేను నాలుగవరోజుని నేను బాపూజీకి జ్ఞాపకం చేశాను. దేవదాస్ మొన్న ఉన్నది రెండు గంటలు మాత్రమే. అంతసేపు ఉండడానికి అతనికి అనుమతి ఉండనే ఉంది. "నీవు చెప్పేది సరే. కాని, మన తరఫున కారణం ఏద్కైనా ఉంటే పట్టుకోడం నా స్వభావం" అని బాపూ అన్నారు.

బాపూ దుర్గా బహెన్‌ను, బాబలాను పిలిపించి, "దేవదాస్‌కు యకాయకీని ఇలాటి ఉత్తరువు వచ్చింది. మీరు కూడా వెళ్ళిపోవలసి ఉంటుందని సర్కారు యకాయకీని ఉత్తరువు చెప్పవచ్చు. కనుక నేడే మీతో కొన్ని మాటలు చెబుదామనుకున్నాను" అని అన్నారు. తర్వాత, బాబలా ఏమి చేయాలి, ఎక్కడ ఉండాలి—అనే విషయాలు గురించి మాటలు జరిగాయి.

రేపటినుంచి దేవదాస్ రారనే సంగతి నాలో ఏదో నిరాశను వ్యాపింపజేసింది.

దేవదాస్ భాయీ మిరజ్ వెళ్ళలేదు. ఎందుకంటే మధురాదాస్ ఆపరేషన్ వాయిదా పడింది గనుక. ఆయన సాయంకాలం వచ్చారు. రామదాస్ భాయీ కూడా బొంబాయినుంచి వచ్చారు. గాంధీజీ స్వాస్థ్యం సరిగా ఉందని ఆయనకు సెక్రెటేరియట్‌లోనే తెలిసిందట.

ప్రార్థన తర్వాత రామదాస్ భాయీ బాపూతో "ఇంకొకమారు ఉపవాసం చేయకండి, మాన్నైన దయ ఉంచండి. మేము పామరులమనే విషయం కూడ మీరు గుర్తుంచుకోవాలి" అని విన్నవించుకున్నారు. "ఈ సంగతి నీవు ఈశ్వరుణ్ణి అడుగు. నేనెవడిని చెప్పడానికి? నా యజమాని ఏమి చెబితే అది చేసేవాడిని నేను. నేను ఈ ఉపవాసం కూడ ఎక్కడ చేశాను? నేను బతకాలనే కోరుతున్నాను. ముందు ఈశ్వరేచ్ఛ" అని బాపూ సమాధానం చెప్పారు. సోదరు లిద్దరూ వెళ్ళిపోయారు. కటేలీ అంతసేపూ మాతోనే ఉన్నారు. సోదరు లిద్దరినీ సాగనంపడానికి మేము గదినుంచి వెలుపలికి వచ్చాము. బర్సాతీనుంచి ముందు వెళ్ళవద్దని కటేలీ అన్నారు. అందువల్ల మేము అక్కడే ఆగాము.

బాపూ మాలిష్ చేయించుకుంటుండగా, కటేలీ వచ్చి "శ్రీమతి దేశాయీ (దుర్గా బహెన్), ఆమెకుమారుడు సోమవారానికి వెళ్ళిపోవాలని భండారీ టెలిఫోన్ చేశారు" అని తెలిపారు. ఇది రెండవ దెబ్బ. కాని, మేము ముందులాగ కాక, ఈ విషయానికి ఎక్కువ సిద్ధంగానే ఉన్నాము. ఈ విషయం వారికి తెలియజేశాను. దుర్గా బహెన్‌కంటె బాబలాకు (నారాయణ్‌కు) ఎక్కువ కష్టమనిపించింది. అతనికి ఇక్కడ చాల హాయిగా ఉంది. మొదట వాళ్ళిద్దరికీ త్వరగా వెళ్ళిపోదామని ఉండింది. ఇక్కడ ఎన్ని రోజులున్నా వెళ్ళిన వెంటనే మరల పట్టుబడవచ్చుననే అనుమానంతో త్వరగా వెళ్ళిపోదామనుకున్నారు. మరొక కారణం: మహాదేవ భాయీ అస్థికలను గంగలో కలపడం కోసం త్వరగా వెళ్ళదలచారు. కాని, బాపూజీ భండారీతో కను గాంధి మాత్రం కొన్నాళ్ళపాటు ఉంటాడని భండారీతో అన్న తర్వాత బాబలాకు కూడా కనుతోపాటు ఇక్కడే ఉందామనిపించింది. కాని, ఇప్పుడు ఎలా?

**7, మార్చ్ '43**

చాల రోజులతర్వాత నేడు మహాదేవ భాయీ సమాధికి వెళ్ళాను. తిరిగివచ్చిన కొన్ని నిమిషాలకే భండారీ, డాక్టర్ శాహ వచ్చారు. కస్తూర్బాను చూడడానికి ఒక నర్సు కావాలని, ఆమె సేవకు మనుగాంధిని కాని, మణిబహెన్ పటేల్‌ను కాని పంపాలని బాపూ భండారీతో అన్నారు.

మధ్యాహ్నం బాపూ దుర్గా బహెన్‌తోను, నారాయణ్‌తోను కొంచెంసేపు మాట్లాడారు. తర్వాత దుర్గా బహెన్ చాలసేపు నాతో మాట్లాడుతూ ఉంది. ఆమె పాత విషయాలు చెబుతూ ఉంది. మాట మాటకూ కన్నీళ్ళు కురిశాయి.

**మూలం:**
**డాక్టర్ సుశీలానైయర్**
**అనువాదం:**
**తిరుమల రామచంద్ర**

రాత్రి బాపూ మౌనం అవలంబించడానికి ముందు తల్లికొడుకులను పిలిపించి, "చెప్పవలసింది ఏమైనా ఉందా?" అని అడిగారు. దుర్గాబహెన్ వినయంగా "మరేం చెప్పను? మీరు త్వరగా జెయిలునుంచి వెలుపలికి రావాలి. ఉపవాసం మాట మరి తలపెట్టకండి" అన్నది. "ఈ ఉపవాసం కూడ నేను చేయలేదు. నేను రాముని అధీనంలో ఉన్నవాణ్ణి. కర్తవ్య పాలనకు ఒక్క తార్కాణం ప్రపంచానికి చూపగలిగినా చాలు" అని సమాధానమిచ్చారు బాపూ.

బాబలాతో నేను సాయంకాలం బాడ్మింటన్, రింగ్ టెన్నిస్ బాగా ఆడాను. నిన్న ఆడలేను. అందువల్ల అతను నిరాశపడ్డాడు. అందుకని నేడు ఆడాను. చాల సంతోషించాడు.

**8, మార్చ్ '43**

దుర్గాబహెన్ వెళ్ళిపోయేముందు బాపూజీ ఆమెను పిలిచారు. "త్వరగా వెలుపలికి వచ్చి వేయండి" అని అన్నది దుర్గాబహెన్ మళ్ళీ. "ఈ పాపులు వదిలితే కదా! వారు ఎవరి మాటా వినరు" అన్నారు కస్తూర్బా. బాపూ మౌనంగా ఉన్నారు. కనుక వ్రాసి చూపారు: "సర్కారు వినకపోవచ్చు. ఈ సర్కారుకు పైన మరొక పెద్ద సర్కార్ ఉంది. అది అందరి మాటా వింటుంది. అది దుర్బలులకు బలం." మూడున్నర గంటల బండికోసం రెండున్నరకే వారు బయలుదేరారు. మేము బర్సాతీవరకు వాళ్ళను సాగనంపవచ్చాము. వెలుపలివరకు వెళ్ళితే, కటేలీ వద్దంటారని మేము ముందుకు వెళ్ళలేదు. కాని, కస్తూర్బా వెలుపలివరకు వెళ్ళి సాగనంపారు.

మహలంతా శూన్యంగా కనిపించింది. అన్నయ్య దిగాలు పడిపోయాడు. రాత్రి తొమ్మిది తొమ్మిదిన్నరకు బాపూ సేవ పూర్తయింది. తర్వాత కను భజన గీతాలు పాడుతూ, అన్నయ్యతో ఏవో కబుర్లు చెబుతూ నవ్విస్తూ ఉన్నాడు. పదిన్నరకు అందరూ నిద్రపోయాము.

**18, మార్చ్ '43**

ఈ రోజు ఉదయం భండారీ వచ్చారు. డాక్టర్ దిన్‌షా మెహతా, కనుగాంధి మార్చి 26, 27 కు వెళ్ళిపోతే మేలని తెలిపారు. "మీ మాట చాలవరకు ఉచితం" అని నేనన్నాను. "ఇక చాలవరకు అనే మాట మానండి" అన్నారు ఆయన. "డాక్టర్ గిల్డర్ ఇక్కడే ఉంటారు. మను వస్తారు. అయితే, మనోజ్ఞ, మమలరో ఎవరిని పిలిపించుకుంటారో తనకు తెలియడం లేదు. అందువల్ల అడగడానికి వచ్చాను" అని అన్నారు ఆయన.






# గాంధీజీ కారాగార గాథలు

కస్తూర్బా ఆరోగ్యం నేడు చాల బాగుంది. ఉదయం విశ్రాంతి తీసుకోమని చెబితే నాపైన కోపగించుకున్నారు. ఆరోగ్యం బాగున్నప్పుడు, ఆమెను ఒకేచోట కూర్చోపెట్టడం కష్టం.

మధ్యాహ్నం ఎండలు చాల తీవ్రంగా ఉన్నాయి. రాత్రి చల్లగాలి తిరిగింది. చాల హాయి అనిపించింది.

నిన్న డాక్టర్ గిల్డర్‌కు వైద్య విషయక మైన పత్రికలు వచ్చాయి. ఒకదానిని నేను చదివాను.

## సరోజినీనాయుడు అస్వస్థత, విడుదల

19, మార్చి '43

సరోజినీ నాయుడు ఆరోగ్యం బాగులేదు. తల తిరుగుడు. వళ్ళుని విరేచనాలు. నాడి తీవ్రంగా ఉంది. నీరసం హెచ్చింది. రాత్రి ఆమె వద్ద కనును పడుకోబెట్టాను, అవసరమైతే సేవ చేయడానికి. "మీ బాపూటికి అవసరమేమో!" అన్నారు ఆమె. ఎంతో బతిమాలినమీదట కనును పడుకోనిచ్చారు.

పగలు ప్రత్యేకమైన పనేమీ చేయలేక పోయాను. సరోజినీ నాయుడు పరిస్థితి అమధ్య బాగానే ఉంది. కాని, చాలకాలంగా ఆమె జబ్బు మనిషిలాగే ఉన్నారు. "ఆమె వెళ్ళిపోతే మిమ్మల్ని చూసుకొనేవారు ఎవరు?" అనే వారు డాక్టర్ శాహ్. అందుకని ఆమెను ఆప గలమా? ఆమె శరీర పరిస్థితినిబట్టి చూస్తే, ఆమెను విడుదల చేయడం అవసరం.

20, మార్చి '63

నేడుకూడా సరోజినీ నాయుడు జబ్బుగా ఉన్నారు. జ్వరం కూడా కొద్దిగా తగ్గింది. మైకం ఉండనే ఉంది. ఉదయం భండారీ, శాహ్ వచ్చారు. సరోజినీ నాయుడు చాల జబ్బుగా ఉన్నారని గ్రహించాలంటూ ప్రభుత్వానికి నివేదిక పంపారు. వారు సాయంకాలం మళ్ళీ వచ్చారు. ఆమెను ఆస్పత్రికి వెళ్ళమని కోరారు. సరోజినీ నాయుడు నిరాకరించారు. వారు చాలసేపు బలవంతం చేశారు. కాని, ఆమె ఒప్పుకోలేదు. అప్పుడు వారు బాపూజీవద్దకు ఆమెను తీసుకొనివెళ్ళారు. "ఆస్పత్రికి వెళ్ళడంకన్నా ఇంటికి వెళ్ళడం మెరుగు!" అని అన్నారు ఆమె. అయితే ఇంటికి వెళ్ళడం సర్కార్ చేతిలో ఉంది. లేని స్నానాల గదికి వెళ్ళనని మాత్రం ఆమె మాట ఇచ్చారు.

మను సాయంకాలానికి వచ్చి చేరింది. నాగపూర్ జెయిలు సంగతులు తెలిసింది.

డాక్టర్ దీన్‌షా మెహతా రాకపోకలు సోమ వారంతో ఆపివేయ దలచినట్లు భండారీ నేడు తెలియజేశారు. "ఆయనకు మారు ప్యారేలాల్‌జీ మాలిష్ చేయవచ్చు" అన్నారు భండారీ. కాని, దీన్‌షా స్థానం తను ఎందుకు తీసుకోవో అన్నయ్య మధ్యాహ్నం భండారీకి ఉత్తరం వ్రాసి తెలిపాడు.

21, మార్చి '43

నిన్నరాత్రి సరోజినీ నాయుడువద్ద పడు కున్నాను. ఆమె బాగా నిద్రపోయారు. కాని, మధ్య మధ్య లేచి కూర్చునేవారు. జ్వరం ఉండనే ఉంది. ఉదయం చూస్తే, 101 ఉంది. పగలు జ్వరం ఎక్కువయి, మధ్యాహ్నానికి 105 అయింది. డాక్టర్ శాహ్ వచ్చారు. భండారీ బొంబాయికి వెళ్ళారట. సరోజినీ నాయుడుకోసం ఒక నర్సును నియమించవలసిందని బాపూ డాక్టర్ శాహ్‌ను కోరారు. "పదిన్నరకు భండారీ బొంబాయి చేరుతారు. పదకొండు పన్నెండుకు ఫోన్‌చేసి కనుక్కుంటాను" అన్నారు డాక్టర్ శాహ్. కాని, ప్రభుత్వం సరోజినీ నాయుడును విడుదల చేసినట్లు మధ్యాహ్నం భండారీనుంచి టెలిఫోన్ వచ్చింది. ఆమె ఎక్కడికి వెళ్ళదలచుకున్నారో తెలుపమన్నారు ఆయన. సరోజినీ నాయుడు 'పర్ణ కుటీరానికి' వెళ్ళుతా నన్నారు.

ఉదయం శ్రీమతి దీన్‌షా మెహతా వచ్చి, సరోజినీ నాయుడును పరీక్షించారు. జ్వరం తీవ్రంగా ఉంది. సరోజినీ నాయుడుకు విశ్రాంతి ఉండాలని మేము భోజనాల బల్లను ఆమె గది నుంచి నేడు ఉదయం తీసివేశాము. సామాను బీరువాను కూడా మరొక చోటికి మారుద్దామనుకుంటుండగా విడుదల వార్త అందింది. ఆమె సామాను సర్దాము. నేను ఆమెకు గిచ్చిన బొమ్మలమీద ఏదో వస్తువు పెట్టినందున మరకలు పడ్డాయి. వాటిని సరిచేశాను. సాయంకాలం 5 గంటలకు డాక్టర్ శాహ్ వచ్చారు. ఏంబులెన్స్ కారు తెప్పించారు. దాదాపు ఆరున్నరకు సరోజినీ నాయుడు బయలుదేరారు. జ్వరం 102 కు తగ్గింది కాని, వాంతులు విపరీతంగా ఉన్నాయి. డాక్టర్ దీన్‌షా మెహతా, ఆయన సతీమణి, డాక్టర్ శాహ్ సరోజినీ నాయుడు వెంటవెళ్ళారు. ఆమె 'పర్ణ కుటీరానికి' వెళ్ళారు. ఆమె వెళ్ళిపోయిన తర్వాత ఆగాఖాన్ మందిరం మరింత శూన్య మనిపించింది.

డాక్టర్ దీన్‌షా మెహతా నేడు ప్రభుత్వానికొక లేఖ వ్రాశారు. దానిలో ఉపవాసం గురించి తన అనుభవం వివరిస్తూ, గాంధీజీ సేవకోసం తను ఇంకా చాల నాళ్ళు ఉండడం అవసరమని తెలిపారు.

(సశేషం)

ఆంధ్రపత్రిక

సచిత్ర వారపత్రిక

మద్రాసు

ఎడిటర్: నీలంరాజు వెంకటశేషయ్య

# చలనచిత్రాలు, సెన్సార్ విధానం

సృజనాత్మకమైన కార్యకలాపాలు కేవలం స్వేచ్ఛాపూరితమైన వాతావరణంలో మాత్రమే కొనసాగగలవు. అనాడే వాటివల్ల ఆశించగలిగిన సత్ఫలితాలూ చేకూరగలవు.

ఈ స్వేచ్ఛను అరికట్టినంత మట్టుకు సృజనశక్తి నశిస్తుంది. మానవ జీవితం వికసించదు. మనుగడ సారహీనమౌతుంది. భవితవ్యం నిజంగా అంధకార బంధురం అవుతుంది.

పరిపూర్ణత్వం దేనిలోనయినా ఒక ఆదర్శం మాత్రమే. ఇది ఏనాటికి సఫలం అవుతుందో ఎవరూ చెప్పలేరు.

సృజనాత్మకమైన కార్యకలాపాలకు సంపూర్ణమైన స్వేచ్ఛ లభ్యం కావడం సంభవం కాదు. అంతటి స్వేచ్ఛ అనుభవించడానికి తగిన యోగ్యత ఉన్నదా అన్నది అంతకన్న ముఖ్యమైన ప్రశ్న.

కాగా సృజనాత్మకమైన శక్తికి నిరోధం లేకుండా; సంఘ క్షేమము, అభివృద్ధి కుంటుపడకుండా చూడడానికి తగినంత మట్టుకు స్వేచ్ఛను పరిమితం చేయవలసిన అవసరం ఉంది; ఉంటుంది.

సృజనాత్మకమైన కార్యకలాపాలలో ముఖ్యమైనది చలనచిత్ర నిర్మాణం ప్రజలకు వినోదంతోపాటు విజ్ఞానం కూడా హృదయంగమమైన విధంగా అందజేసే మహత్తర సాధనం.

టెలివిజన్ అధికంగా వ్యాప్తి చెందిన దేశాలలో ఈనాడు చలనచిత్రం ద్వితీయ స్థానం ఆక్రమిస్తున్నది. కాని మనదేశంవంటి పేదదేశాలలో ఇంకా చాలాకాలం సినిమా ప్రాధాన్యానికి, అది క్యానికి ఏలాంటి భంగమూ వాటిల్లే అవకాశం లేదు

ప్రజలందరికి అందుబాటులో ఉండడంతో మనదేశంలో చలనచిత్రం విలువ మరీ అధికం. కనుక ఈ సాధనాన్ని ఎంత బాగా వినియోగించుకొంటే అంతటి అధికమైన ప్రయోజనం పొందవచ్చు.

ప్రస్తుతం దేశంలో అమలులో ఉన్న సినిమా సెన్సార్ విధానం సవరించవలసిన అవసరం ఉన్నదని కేంద్ర ప్రభుత్వ సమాచారశాఖ మంత్రి శ్రీమతి ఇందిరా గాంధి అభిప్రాయ పడుతున్నారు

నిర్మాణాత్మకము, సృజనాత్మకము అయిన విధంగా ఈ విధానం అమలుపరచవలసిన అవసరం ఉంది.

చలనచిత్ర నిర్మాతలు తమంతట తాముగా కొన్ని సూత్రాలను, సంప్రదాయాలను రూపొందించుకొని, వాటికి కట్టుబడి, గురుతరమైన తమ బాధ్యతలను సక్రమంగా నిర్వర్తించడానికి పూనుకొనడం మరీ ముఖ్యం.

విధి నిషేధాల ఆవశ్యకతను, స్వేచ్ఛను సమన్వయపరచుకొనడంలో ప్రదర్శించే విజ్ఞతపై చలనచిత్ర రంగం అభివృద్ధి, ప్రయోజనము ఆధారపడి ఉంటవి. ★

# గాంధీజీ కారాగార గాథలు

5, ఫిబ్రవరి '44

**కస్తూర్ బా** పరిస్థితి చాల వికటించింది. నిన్న రాత్రయితే, ఆమె లేచి కూర్చుని, నేను వెళ్ళి పోతున్నానని అంటూ, గీతా పారాయణం, భజన చేయించారు. బాపూజీ కూడా దాదాపు గంటసేపు మేల్కొని కూర్చున్నారు; తర్వాత రెండు గంటల సేపు నిద్రపోలేదు.

## విషమ పరిస్థితి

8, ఫిబ్రవరి '44

నిన్నరాత్రి బా చాల బాధపడ్డారు. నేడు ఉదయం కాళ్ళ మీద వాపు స్పష్టంగా కనబడింది. దీన్‌షా మెహతా ఎనిమా ఇచ్చారు. కాని, మలమేమీ వెలువడలేదు. బా నన్ను పిలిచి "నీవు ఎనిమా ఇవ్వు" అన్నారు. డాక్టర్ మెహతాకన్నా బాగా ఇవ్వలేనని నేను ఎంతగానో ఆమెకు నచ్చజెప్పాను. కాని, ఆమె ఒప్పుకోలేదు. ఆఖరుకు నేను ఎనిమా ఇచ్చాను. కొద్దిగా మలం వెలువడింది. నేను ఇచ్చిన ఎనిమాలో విశేషమేమిటంటే, నీళ్ళ నెమ్మదిగా ఎక్కించడం.

డాక్టర్ మెహతాకు, డాక్టర్ గిల్డర్‌కు 'ఎలిమినేషన్ క్రైసిస్' (శరీరశుద్ధివలన రోగిలో కొన్ని లక్షణాలు తీవ్రరూపం ధరిస్తాయి. ఇదే ఎలిమినేషన్ క్రైసిస్. ఇది స్వాస్థ్యానికి పూర్వ లక్షణమని ప్రకృతి చికిత్సకుల సిద్ధాంతం.) పైన చర్చ ఆరంభ మయింది; అతి తీవ్రంగా పరిణమించింది. నేను వెళ్ళి ఇద్దరినీ సమాధాన పెట్టాను. వారిని శాంతపరచ గలిగాను; ఎంతో హాయి అనిపించింది.

20, ఫిబ్రవరి '44

రాత్రి బా బాగా నిద్రపోయారు. దాదాపు రాత్రల్లా ఆక్సిజన్ ఇస్తూనే ఉన్నాము. అడుగడుగుకు 'రామ్ రామ్' అని కేకలుచేస్తున్నారు. మూడున్నరకు ఆమె ఆక్సిజన్ గొట్టం తీసి వేశారు. ఉదయం ఐదుంబావునుంచి మరల ఆయాసం హెచ్చింది. అప్పుడు నేను మళ్ళీ ఆక్సిజన్ గొట్టం పెట్టాను. ఆయాసం కొంత తగ్గింది. బాపూవచ్చి, ఆమె మంచంమీద కూర్చునే ప్రార్థన ప్రారంభించారు. నిన్న ఇచ్చిన సెలిగ్గన్ ఇంజక్షన్ గుణం ఏమీ ఇవ్వనందుకు నిరాశ వ్యాపించింది. ఆయాసం హెచ్చడం చింతకు మరింత కారణమయింది. రెండు గంటలకు బాపూ నన్ను బావద్ద నుంచి పంపించారు.

ఇక బా వెళ్ళిపోతున్నారని అందరికి తెలిసిపోయింది. ఆమె మహా కరుణస్వరంలో చేసే రామస్మరణ వినలేకపోతున్నాము.

ఒంటిగంటకు నాడి తప్పింది. కాని, కొంచెం సేపటికి మళ్ళీ దక్కబడి, పగలల్లా ఏదోవిధంగా కొట్టుకుంటున్నది. రామధూన్, భజన ఆమెవద్ద పగలల్లా జరుగుతూనే ఉన్నాయి. ఆమెకూడా మధ్యన అడపా దడపా పెదగా పాడేవారు. బాపూ చాలసేపు ఆమెవద్ద కూర్చున్నారు.

ఉదయం తొమ్మిదింబావుకు మెదడు చల్లబడడానికి మందిచ్చాము. దానివల్ల ఆమె గంటన్నర నిద్రపోయారు. లేవగానే పళ్ళు తోముకొనడానికి పుడక తెమ్మన్నారు. బాగారుద్దుకొని పళ్ళు తోముకున్నారు. ముక్కుతో నీరు పీల్చారు. తర్వాత, చాయ్ తాగారు.

ఆమెకు ఇంత బలం ఎక్కడినుంచి వచ్చిందని అందరికీ ఆశ్చర్యమయింది. కాని, అంతలోనే ఆయాసం ఆరంభమయింది. మూత్రం తగ్గిపోయింది.

బా సాయంకాలం ఎనిమా ఇవ్వమన్నారు. "ఇక బాకు రామనామం తప్ప మరొక మందు లేదు. తక్కిన ఉపచారాలన్నీ మానివేయండి" అని బాపూ అన్నారు. నాకు ఆ మాట నచ్చలేదు. ఆమె కోరుతున్నప్పుడు ఎనిమా ఇవ్వడం ఉచితమన్నాను. బాపూ ఒప్పుకున్నారు. ఎనిమా ఇచ్చిన తర్వాత ఆమె రెండు గంటలసేపు బాగా నిద్రపోయారు.

కాని, రాత్రి తొమ్మిదిన్నరకు మరల ఆయాసం ఎక్కువయింది. మీరాబహెన్ రామధున్ ఆరంభించింది.

## అంతిమరాత్రి

21, ఫిబ్రవరి '44

నిద్రకు మందివ్వడం వల్ల బా రాత్రి పన్నెండు గంటల వరకు బాగా నిద్రపోయారు. కాని, మరల ఆయాసం ఆరంభమయింది. ఆక్సిజన్ ఇవ్వడంవల్ల తగ్గింది.

ఇప్పుడు బా వద్ద ఒక్కరుమాత్రం ఉండడం వల్ల ప్రయోజనం లేదు. మను పట్టుపట్టడం వల్ల నేను పన్నెండు గంటలకు ఆమెను (మనును) మేల్కొల్పాను. మెహతా ఒకటింబావుకు వచ్చారు. ఒకటిన్నరకు నేను మనును నిద్రపొమ్మన్నాను. బాపూ రాత్రి రెండుమార్లు వచ్చి చూచారు. ఒంటిగంటనుంచి అరగంటసేపు ఆమెవద్ద కూర్చున్నారు. కాని, ఆమె బాపూను కూర్చోనివ్వలేదు. ఇంత జబ్బులోను బాపూ విశ్రాంతి విషయమే ఆమె ఆలోచన. బాపూ ఒకటిన్నరకు లేచి వెళ్ళిపోతూ, ఆమె ఎంగిలి తుడుచుకున్న రెండు జేబు రుమాళ్లను పులిమివేయడానికి తీసుకుని వెళ్లారు. "నేను పులుముతాను ఇవ్వండి" అని అడిగాను. "నన్నుకూడా కొంత పని చేయనివ్వు" అన్నారు ఆయన.

మూలం :

**డాక్టర్ సుశీలానైయర్**

అనువాదం :

**తిరుమల రామచంద్ర**

22, ఫిబ్రవరి '44

ఆఖరు గడియలలో దేవదాస్ వచ్చినందుకు బా చాల ఆనందించారు. "బా, రామదాస్ భాయీ వచ్చారు" అన్నారు దేవదాస్ తల్లితో. "అవసరమేమిటి?" అన్నారు బా. రామదాస్‌కు ప్రయాణపు ఖర్చు తగలకూడదని ఆమె మొదటినుంచి అభిప్రాయపడుతూనేఉన్నారు. దేవదాస్‌భాయీతో మాట్లాడినతర్వాత ఆమె కళ్ళు మూసుకుని "హే కృపాళో, రామా, ఇక నాకు కావలసింది నీ భక్తి ఒక్కటే. నీ ప్రేమే కావాలి" అని, తర్వాత "హే భగవాన్! పశువులాగ కడుపుకు కుక్కుకున్నాను. మన్నించవయ్యా!" అనిఅన్నారు. ఆమె ప్రవర్తన పూర్తిగా సాత్వికమైపోయింది. ఆమె ముఖం అప్పుడు ఎంతో దర్శనీయంగా ఉంది.

సాయంకాలం ఐదున్నరకు భండారీ, శాహ పెన్సిలిన్ తెచ్చారు. బాపూ అభిప్రాయం తెలిసినందున డాక్టర్ గిల్డర్ పెన్సిలిన్ ఇంజక్షన్ ఇవ్వడానికి సంకోచపడ్డారు. భండారీ, శాహ బాపూను అడిగారు. "సుశీలా, డాక్టర్ గిల్డర్ ఇవ్వదలచుకుంటే ఇవ్వనీ" అన్నారు బాపూ. కొంచెంసేపటికి డాక్టర్ గిల్డర్ నా వద్దకు వచ్చి, బాపూజీ కోప్పడుతున్నారని తెలిపారు. పెన్సిలిన్ ఇంజక్షన్‌లు పలుమార్లు ఇవ్వాలనే సంగతి బాపూజీకి తెలియదు. బా మృత్యుశయ్య మీద ఉన్నారు. పెన్సిలిన్ ఎందుకని బాపూ ఉద్దేశం. ఊపిరి ఉన్నంత వరకు ఉపాయాలు ఆలోచిస్తూనే ఉండాలని ఇతరుల అభిప్రాయం. ఇంతలో బాపూ నన్ను చూచి "ఏమిటి నిశ్చయించావు?" అని అడిగారు. "పెన్సిలిన్ ఇవ్వదలచాము" అన్నాను. "ఇవ్వక తప్పదని నీవూ, డాక్టర్ గిల్డరూ ఒప్పుకుంటున్నారా?" అని అడిగారు బాపూ. నేను "అవును" అనలేకపోయాను. దేవదాస్‌భాయీతో మాట్లాడుతున్నప్పుడూ ఈ విషయమే చర్చకు వచ్చింది. బాను కాపాడుకొనే ఉపాయాలు ఉన్నప్పటికీ, వాటిని ఉపయోగించుకోలేక పోయామనే నిరాశ కలిగింది నాకు. కాని, వృథాగా ఆమె శరీరాన్ని ఇంజక్షన్‌లతో తూట్లు పొడవ నవసరంలేదన్న శాంతి కూడా కలిగింది.

ప్రభావతీ బహెన్ బా వద్దనే కూర్చున్నది. బా కరుణ స్వరంతో "బాపూజీ!" అని పిలిచింది.

"పిలవనా?" అని అడిగింది ప్రభావతీ బహెన్. బా సమాధానమివ్వలేదు. బాపూ ఏడున్నర గంటలకు వాహ్యాళి వెళ్ళుతారు. వెళ్ళడానికి సిద్ధంగా ఉండగా ప్రభావతీబహెన్ పిలిచింది. బాపూ వచ్చి బా పక్కన కూర్చున్నారు. బా రెండుసార్లు లేచి సరిగా కూర్చున్నారు. చాల ఆయాస పడుతున్నారు. "ఏమిటి జరుగుతున్నది?" అని అడిగారు బాపూ.

# ఆగాఖాన్ మహల్ జైలులో మరొక మహావ్యక్తి మరణం

అపరిచిత ప్రదేశంలో నిలబడిన చిన్న పిల్లవాడు అత్యంత కరుణ స్వరంతో, తడబడుతున్న మాటలతో అన్నట్టు ఆమె "ఏమీ తెలియడం లేదు" అన్నారు.

నేను నాడి చూచాను. చాల నీరసంగా ఉంది. కాని, ఇలా చాలసార్లు అయింది గనుక, ఈసారి కూడా ప్రమాదం లేదనే అనుకున్నాను. అందువల్ల వరండాలోకి వెళ్ళి ఇప్పుడు ఫోటో తీసుకోవచ్చునని కను గాంధీతో అన్నాను. కాని, బాపూ వద్దన్నారని కను అన్నాడు.

బా సోదరుడు మాధవదాస్ వచ్చారు. బా ఆయనను గుర్తించారని బాపూ అన్నారు. బా కళ్ళు నీళ్ళతో నిండాయి. కాని, ఆమె సోదరునితో మాట్లాడలేకపోయారు.

ఇంతలో గదిలో ఏదో గడబిడ వినబడింది. బా ఆఖరుసారి లేవడానికి ప్రయత్నిస్తున్నారు. "పడుకునే ఉండూ!" అని బాపూ అంటున్నారు. బా బాపూ ఒడిలో పడిపోయారు. కళ్ళునిలిచిపోయాయి. గొంతులో గురగుర ఆరంభమయింది. ఇవన్నీ మృత్యువు స్పష్టలక్షణాలు. హఠాత్తుగా శ్వాస తీసుకొనడానికి నోరు తెరచుకుంది. రెండు మూడుసార్లు ఆమె ఊపిరి పీల్చుకుని, ఈ సంసార బంధనం నుంచి విముక్తురాలయారు.

బాపూ తలగడలన్నీ తీసివేసి, బా తలను తన చేతులలో పట్టుకున్నారు. మంచానికి మరుగుగా పెట్టిన స్క్రీను తీసివేశాము. అందరూ చుట్టూ నిలబడ్డారు. బాపూజీ కళ్ళు మూసుకున్నారు. అంతిమ సమయంలో అందరం "రాజా రామ రామ రామ సీతారామ రామ రామ" అని గానం చేశాము. నా నోటినుంచి ఒక్క శబ్దమూ వెలువడలేదు. కింకర్తవ్యతా విమూఢురాలినై నిలబడ్డాను. డాక్టరును అయి కూడా మృత్యువును తటస్థంగా చూడడం నేను నేర్చుకోలేదు.

ఈశ్వరుడు ఏదో విధంగా మానవుని పొగరు అణచివేస్తాడనే విషయం నా మనస్సులో రెండు మూడు రోజులుగా తిరుగుతున్నది. జమనాలాల్‌జీ మృత్యువార్త విన్నప్పుడు నేను దగ్గర ఉంటే, కాపాడేదాన్ని అనుకున్నాను. దాని తర్వాత ఈశ్వరుడు నిమిషాలలో రెండవ అవకాశం— మహాదేవభాయీ మరణం— ఇచ్చాడు. నా వద్ద అన్ని సాధనాలూ లేవు. జైలులో సాధనాలు ఎక్కడినుంచి వస్తాయి? అని అనుకున్నాను. నేడు ఈశ్వరుడు బాను నా కళ్ళముందే తీసుకొని వెళ్ళుతూ, చేయగలిగితే ఏమైనా చేయమన్నట్టు సవాలు చేశాడు; నేనేమీ చేయలేకపోయాను. గిల్డరు వంటి అనుభవశాలి అయిన డాక్టరు, శర్మ వంటి రాజవైద్యుడు, దీన్‌షామెహతా వంటి ప్రకృతి చికిత్సా నిపుణుడు— ఎవరూ బా కాలాన్ని ఆపలేకపోయారు.

రాత్రి 7—35కు కస్తూర్బా ఆత్మ ముక్తమయింది. రామధున్‌పూర్తయింది. దేవదాస్‌భాయీ వెక్కి వెక్కి ఏడుస్తూ, "బా బా" అని గోలపెట్టాడు. బాపూ అతనిని శాంతపరచడానికి ప్రయత్నించారు. అందరి కళ్ళూ చెమ్మగిల్లాయి గాని, నా కళ్ళు ఎండిపోయాయి. ఇంతవరకు నా మూర్ఖత పోలేదు. అవసరం వచ్చినప్పుడల్లా ఇదే నా పరిస్థితి. మహాదేవభాయీ మరణసమయంలోను ఇలాగే జరిగింది; మా పినతండ్రి మరణమప్పుడూ ఇలాగే.

ఆఖరుకు బాపూ లేచి, గది ఖాళీ చేయించమని నాతో అన్నారు. "నేనూ, నీవూ బాకు స్నానం చేయిద్దాము— మహాదేవభాయీకి చేయించినట్టు" అన్నారు.

కస్తూర్బాకు నేడు బాపూజీ వడికిన దారంతో నేసిన ఎర్రంచు చీర కట్టించాలి. ఈ ఎర్రంచు చీరను ఆమె బాపూతోపాటు సేవాగ్రామం నుంచి బొంబాయికి వచ్చినప్పుడు మనుకు ఇచ్చారు. ఆశ్రమాన్ని ప్రభుత్వం జప్తు చేస్తారని అప్పుడు వదంతులు వ్యాపించాయి. అందువల్ల బా "ఇదిగో! ఈ చీరను జాగ్రత చేయి. నేను మరణించినప్పుడు కట్టించాలి. బాపూ వడికిన నూలుచీర మరొకటి ఎప్పుడు దొరుకుతుందో ఎవరు చెప్పగలరు?" అని అన్నారు. మను ఈ చీరను జానకీబహెన్ వద్ద భద్రపరిచింది. బా దీనిని ఇక్కడికి తెద్దామనుకున్నారుగాని, ఎక్కడ ఉందో తెలీలేదు. మను ఇక్కడికి వచ్చిన తర్వాత ఆశ్రమానికి జాబు వ్రాసి, ఆ చీరను తెప్పించింది. నేడు కస్తూర్బా ఈ చీరను కట్టుకునే వేళ వచ్చింది.

బా భౌతిక దేహాన్ని బాపూ స్నానాగారంలో పెట్టాము. ఇంతలో భండారీ వచ్చారు. భౌతిక దేహం విషయమై బాపూ అభిప్రాయం ఏమిటో ప్రభుత్వం అడగమన్నదట. బాపూ మూడు ప్రతిపాదనలు చేశారు.

1. శవాన్ని నా కుమారులకు, బంధువులకు అప్పగించడం అన్నిటికన్నా ఉత్తమం. అంటే అంత్యకర్మలు ప్రజల సమక్షంలో జరుగుతాయి. ప్రభుత్వం అడ్డురాకూడదు.

2. ఇలా జరుగనప్పుడు మహాదేవభాయీ అంత్యక్రియలు జరిగినచోటే బా దహన సంస్కారమూ ఇక్కడనే జరుగనీ. బంధువులు మాత్రమే హాజరు కావాలని ప్రభుత్వం నిర్బంధం చేస్తే నేను ఒప్పుకోను. నా మిత్రులు— నా కుటుంబంలోని వారిలాగ కలసిమెలసిపోయినవారు— అంతా పాల్గొనాలి.

3. ప్రభుత్వానికి ఇదికూడా ఇష్టం లేకపోతే, బాను చూడడానికి అనుమతి పొందిన వారంతా వెళ్ళిపోతారు. ఇక్కడ వాళ్లతోపాటు డిటెన్షన్‌లో ఉన్నవారు మాత్రమే దహన కర్మలో పాల్గొంటారు."

ఈ సూచనలు చేసిన తర్వాత బాపూ భండారీతో అన్నారుగదా: "బా తన రాజ్యం తీసుకొని వెళ్ళిపోయింది. ఇప్పుడు నా రాజ్యం. ఆమె కోసం నేను ఎన్నో విషయాలు సహించాను. ఇప్పుడు అలా చేయనక్కరలేదు. మిత్రులకూ, బంధువులకూ తేడా ఏమీ లేదునాఅభిప్రాయంలో.

"నా భార్య దారుణ వ్యాధితో నేను రాజకీయంగా ప్రయోజనం పొందడానికి ప్రయత్నించలేదనడానికి మీరే సాక్షి. కాని, ప్రభుత్వం ఏమి చేయదలచినా చక్కగా చేయనీ అనే నేను కోరేది.

ప్రస్తుత ప్రభుత్వం అలా చేయడం లేదనే నా భయం. వ్యాధిగ్రస్తురాలు మరణించిన తర్వాత నన్నా ప్రభుత్వం సరిగా ప్రవర్తిస్తుందనే ఆశ పెట్టుకోవచ్చా?"

భండారీ అడిగారు, మిత్రులు ఎంత మంది ఉంటారని. దాదాపు వంద మంది ఉంటారని, ఎవరెవరు రావాలనే విషయం దేవదాస్ నిర్ణయిస్తాడని బాపూ అన్నారు. "దహనకర్మ సర్వజనీనంగా జరిగితే, ప్రజల ప్రదర్శనమూ శాంతిస్తుంది. నా కుమారులు మరణించనన్నా మరణిస్తారుగాని, అశాంతి వ్యాపింపజేయరు" అన్నారు బాపూ.

బా వెళ్ళిపోతున్నప్పుడు, మథురాదాస్‌భాయీ పరివారంతో దర్వాజావద్ద ఉన్నారు. కాని, ఆయనను లోపలికి రానివ్వలేదు. "ఆయన లోపలికి వచ్చి, తిరిగి వెళ్ళితే, వార్త వ్యాపిస్తుంది. నగరంలో కల్లోలం చెలరేగుతుంది" అన్నారు భండారీ.

"ఆయన లోపలికివచ్చి గంట రెండు గంటలు అక్కడే ఉండనివ్వండి. అంతలోగా మీరు ప్రభుత్వంతో ఉత్తరువుపొందితే అంతా సవ్యంగా జరిగిపోతుందిగదా? ఆయన రోడ్డు మీద కాచుకుని నిలబడడంకన్నా, లోపల ఉంటే మంచిది" అని బాపూ అన్నమీదట, మథురాదాస్ లోపలికి రావడానికి అనుమతి లభించింది.

బాపూ కస్తూర్బా భౌతిక దేహాన్ని స్నానం చేయించడానికి ముందు, కాళ్ళు చేతులు కడుగుతుండగా, కటేలీ వచ్చి బాపూతో "దహన కర్మ బహిరంగంగా జరిగితే, మీరు వెలుపలికి వెళ్ళగోరుతారా?" అని ప్రశ్నించారు.

"లేదు. నేను వెళ్ళను. నా కుమారులే అంతా చేస్తారు" అన్నారు బాపూ.

శవానికి స్నానం చేయించేటప్పుడు "లోపలికి రాదలచుకున్న సోదరీమణులు రావచ్చు" అన్నారు. నేనూ, బాపూ సబ్బు తోమాము. ప్రభా

వతీబహన్ నీళ్ళు పోశారు. మను, కను బా గదిలో ఫినైల్ చిలకరించారు. నేను బా ముడి విప్పి కడిగి, కాళ్ళు, వీపు తోమాను.

బాను స్నానం చేయించి, తుడిచి, జెయిలు దుప్పటిమీద పడుకోబెట్టాము. తర్వాత గంగా జలం చిలకరించాము. గంగాజలం దేవదాస్ భాయీ వచ్చినప్పుడు తెచ్చాడు. తర్వాత బాపూజీ వడికిన దారంతో నేసిన ఎర్రంచు చీర కట్టిం చాము. శ్రీమతీ థాకర్సీ పంపిన పచ్చరంగు చీరను గంగాజలంలో తడిపి ఆరవేసి కిందపరచాము. వెంట్రుకలు దువ్వాము. ముడివేయనక్కరలేదని బాపూ అన్నారు. ఆమె వెంట్రుకలు ముడివేసి కట్టుకునే దారాన్ని బాపూ తామే పులిమారు.

బా మెడలోని కంటె, చేతులలోని గాజులు తీసివేశాము. మనుజయసుఖ్‌లాల్ బా కంటెను, గాజులను బాపూనుంచి పుచ్చుకున్నది.

సంతోక్‌బహన్ తులసిదండ కొత్తది బా మెడలో వేసింది. బాపూ వడికిన దారపు దండ కూడా మెడలో వేసింది. బాపూ వడికిన నూలుకు రంగుపూసి, దండలులాగకట్టి చేతులకుచుట్టాము. మనుమశ్రూవాలా నొసటిపై కుంకుమ లేపం చేసి, చందనంతో తిలకం దిద్దింది. బా పడు కున్నట్టు కవిపించారు; ఎంతో అందంగాఉన్నట్టు కనిపించారు.

ఎత్తి వెలుపలికి తెచ్చాము. జెయిలుదుప్పటి పరచి, దానిమీద పడుకోబెట్టాము. మీరాబహన్ సున్నంతో పెద్ద చౌకీ గీసింది. దాని తలవైపు ఓం, కాళ్లవైపు స్వస్తికం వ్రాసింది. మరణించిన తర్వాత వ్యక్తి పాడుగవుతాడు. ఈ విషయం మహాదేవభాయీ మరణించినప్పుడు మొదటిసారి అనుభవమయింది. ఇప్పుడు రెండవసారి. బా కాళ్ళు స్వస్తికాన్ని కప్పివేశాయి. తల వద్ద, కాళ్ల వద్ద "హే రామ్" అనే చిత్రణ అందంగా కనిపించింది. మేము కంబళ్ళు పరుచుకుని బా చుట్టూ కూర్చున్నాము.

ఇంతలో భండారీ ప్రభుత్వం ఉత్తరువుతో వచ్చారు. "బహిరంగంగా ప్రజల ఎదుట దహన క్రియ జరుపడానికి ప్రభుత్వం అనుమతించదు. కాని, వందమంది వరకు బంధుమిత్రులు జెయిలుకు రావచ్చు. దేవదాస్ భాయీ దర్వాజా వద్ద నిలబడి, ఎవరిని లోపలికి పంపమంటే వారిని లోపలికి వదలవచ్చు" అని ఉత్తరువులో ఉంది. స్వామీ ఆనంద్, శ్రీమతి థాకర్సీ, శాంతికుమార్ కూడా దగ్గరికి వచ్చారు. మీరాబహన్, మను మొదలయినవారు శవాన్ని పూవులతో అలంక రించారు. కస్తూర్బా తులసిమొక్కవద్ద, రోజా వెలిగిస్తున్న నేయిదీపం నేడు ఆమె తలవద్ద వెలుగుతున్నది. రెండువైపులా ధూపం వెలిగిం చాము.

బాపూ ఆమె తలవద్ద ఓరగా కూర్చున్నారు. ప్రార్థనజరిపించారు. గీతాపారాయణంచేసేవారం—

# గాంధీజీ కారాగార గాథలు

జమునాదాస్‌భాయీ, కేశుభాయీ, రాధాబహన్, అన్నయ్య, కను, ప్రభావతీబహన్, మను, నేను— బా పాదాలవద్ద కూర్చున్నాము. అందరూ రెండు రెండు అధ్యాయాలు చదవండని బాపూ మొదట అన్నారు. ఇది నచ్చలేదు. అందరిగొంతులూ కలవవు గనుక బాగుండదని కను అన్నాడు. "దేవదాస్ భాయీ మొదట చదివితే, మేమంతా ఆయన వెంట పలుకుతాము" అని నేను అన్నాను. "పారా యణం చెవికి ఇంపుగా లేకపోతే, నేను ఎక్కడ బడితే అక్కడ ఆపివేస్తాను" అన్నారు బాపూ. తక్కిన భజనలతోపాటు గీత సంపూర్ణ పారా యణం గంట 25 నిముషాలలో పూర్తయింది. బాపూ దానిలో లీనమైపోయారు. "గీతా పారా యణం చాల బాగ జరిగింది. చాల మధురంగా ఉంది. దేవదాస్ ఈ పాత విషయం మరచిపోలేదు. నాకెంతో నచ్చింది" అన్నారు తర్వాత.

రేపు ఎవ్వరెవ్వరు వస్తారనే విషయమై చర్చ జరిగింది. బొంబాయినుంచి వచ్చేవారికోసం దహనక్రియ తొమ్మిదిగంటలకు మారు పద కొండు పన్నెండు గంటలకు జరుగకూడదా?— అని సూచించాము. "నేను స్నేహితులను పిలవాలి అని అనుకున్నప్పుడు నా మనస్సులో బొంబాయి సంగతి లేదు. పూనానుంచి వచ్చేవారి సంగతే అనుకున్నాను. అందువల్ల బొంబాయిసంగతి వదలి పెట్టండి" అన్నారు బాపూ.

"బాపూ, కస్తూర్బాను దర్శించడానికి జనం ఎంత ఆతురపడుతారో ఆలోచించండి. ఈ



నిమిత్తంతోనన్నా వారు మీా దర్శనం చేసుకొని సంతోష పడుతారు. ఈ రోజు తర్వాత ఆగాఖాన్ మహల్ సింహద్వారానికిజంటబీగాలు పడుతాయి" అని మేము ప్రార్థించాము.

"అయినా నేను బా మరణంతో ఈలాటి ప్రయోజనం పొంద దలుచుకోలేదు. జనానికి వార్త అందితే రావడానికే సిద్ధపడుతారు. మనం వాళ్లకు వ్యర్థంగా ఎందుకు ఇబ్బంది కలిగిం చాలి?" అని ప్రశ్నించారు బాపూ.

"కనీసం ఫోనుచేయనీయండి. ఎవరివద్ద కారుంటే, వారు వస్తారు" అని ఎవరో అన్నారు.

కాని, బాపూ వినలేదు. స్థానికులనుమాత్రమే పిలవవలసిందని ఆయన శ్రీమతి థాకర్సీతో అన్నారు. "తర్వాత మను, సంతోక్ బహన్ తప్ప తక్కిన వారిని వెలుపలికి పంపించివేయండి" అని కూడా అన్నారు.

దాదాపు ఒంటిగంటకు బాపూ మంచంమీాద నడుము వాల్చారు. బాకు పెన్సిలిన్ ఇంజెక్షన్ ఎందుకు ఇవ్వవద్దన్నదీ వివరిస్తూ బాపూ "ఈశ్వ రుడు నా శ్రద్ధను పరీక్షించాడు. నేను పెన్సిలిన్ వద్దని ఈశ్వరునిపై నా శ్రద్ధను, సిద్ధాంతం పట్ల దృఢ విశ్వాసాన్ని చూపాను. ఇలా చేయక పోయినా, బాకు ఇంజెక్షన్ ఇచ్చే వేళ మించి పోయింది" అన్నారు.

"ఔను. పిచికారీ (సిరింజి) ఇంకా వేడి నీళ్లలో ఉడుకుతూ ఉండగానే బా వెళ్లి పోయారు" అన్నాను నేను.

"కాగలిగిందేమీ లేదు. నేను వద్దనకపోతే, నా మానం పోయేది" అన్నారు బాపూ.

"ఫోటో విషయంలోను ఇంతే జరిగింది. బాపూజీ వద్దనక పోయినా, కను ఏమీ చేసేవాడు కాదు. కేమరాలో ఫిలిం లోడు చేసీ చేయగానే, బా వెళ్లిపోయేది" అని దేవదాస్ భాయీ అన్నారు.

ఒంటిగంటకు బాపూ మంచంమీాద నడుము వాల్చారు. రెండున్నర వరకు నేను దేవదాస్‌భాయీ వద్ద కూర్చున్నాను. ఇద్దరం బా సంగతులు జ్ఞాపకం చేసుకుంటూ గడిపాము. ప్రభావతీ బహన్, మనుమశ్రూవాలా, దేవదాస్‌భాయీ శవం వద్ద మూడు కొట్టేవరకు ఉన్నారు. మూడు నుంచి ఐదు వరకు కను, సంతోక్ బహన్ కూర్చున్నారు. ఐదునుంచి ఏడువరకు నేను, అన్నయ్య కాపలా ఉన్నాము. బాపూ అక్కడే ఉదయం ప్రార్థన జరిపారు.

(సశేషం)

# గాంధీజీ కారాగార గాథలు

23, ఫిబ్రవరి '44

బాపూ ఆరుగంటలకు లేచి, ప్రార్థన జరిపించి, పళ్ళరసం పుచ్చుకున్నారు; అందరూ అల్పాహారం పుచ్చుకోవచ్చునని అన్నారు. కాని, కస్తూర్బా భౌతిక కాయానికి దహన సంస్కారం అయిన తర్వాత, స్నానం చేయనిదే నీళ్ళుకూడా ముట్టుకోమని సంతోక్ బహన్ చెప్పింది. మేము ఏమీ పుచ్చుకోలేదు. డాక్టర్ గిల్డర్, కటేలీ మాత్రం చాయ్ పుచ్చుకున్నారు.

ఏడున్నరకు రాత్రి కూర్చున్న స్థలానికి వచ్చి కూర్చున్నాము. తర్వాత తోటనుంచి తాజా పూవులు తెచ్చి కస్తూర్బాను అలంకరించాము.

నేను, కను, కటేలీ దహన కర్మ జరిగే స్థలాన్ని చూడడానికి వెళ్ళాను. మహాదేవ భాయీ సమాధికి పడమట ఉన్న గోడ తొలగించారు. ఆ సమాధి సమీపంలోనే బా దహన సంస్కారానికి కూడా ఏర్పాట్లు జరుగుతున్నాయి. "నేను వెలుపలికి ఎక్కడ పోతాను? మహాదేవ్ దగ్గరే ఆఖరు నిద్ర తీస్తాను" అనేవారు బా. ఆమాటే నిజమయింది. బాను వెంటబెట్టుకొని వెళ్ళదామనే ఆశపడేదాన్ని. ఆ ఆశ మట్టిలో కలిసిపోయింది. స్వాతంత్ర్య వేదికమీద ఈ జెయిలులో మరొక బలిదానం జరిగింది. ఇలాటి బలిదానం ఏటా జరుగవలసి ఉందా? అలా జరగడం మాకు ఇష్టమే; సంతోషమే. కాని భగవంతుడు బాపూనుమాత్రం చెక్కు చెదరకుండా జెయిలునుంచి వెలుపలికి పంపనీ! పూర్ణ విజయసాధనకు శక్తి కలిగించనీ!—ఇదే అంతరాత్మలోని ప్రభువుతో నా విన్నపం.

క్రమంగా వెలుపలినుంచి జనం రాసాగినారు. అందరికంటె ముందు సర్గిస్ బహన్, తర్వాత అందరూ వచ్చారు. శ్రీనివాసశాస్త్రి, కేల్కార్, కృష్ణ హఠీసింగ్, ఆమె భర్త మొదలయినవారు వచ్చారు. శాంతికుమార్ సతీమణి వివాహంలో ఉన్నందున రాలేదని తెలిసింది.

మహాదేవభాయీ దహన కర్మ జరిపించిన బ్రాహ్మణులే నేడూ వచ్చారు.

## అంత్యేష్టి

కటేలీ శవాన్ని కప్పడంకోసం శుద్ధ ఖద్దరు తెప్పించారు. కాని, బాపూ దానిని వద్దన్నారు. "ఖద్దరును కాల్చడం ఎందుకు వ్యర్థంగా? అది బీదలకు ఉపయోగపడుతుంది" అన్నారు బాపూ.

రాత్రి శ్రీమతి ఠాకర్సీ చందనం చెక్కల విషయమై బాపూతో ప్రస్తావించగా, "బీద జను చందనపు చెక్కలతో కాల్చనప్పుడు, దరిద్రాతిదరిద్రుడుగా భావించే వ్యక్తి ధర్మపత్ని అయిన బా దహనానికి చందనపు చెక్కలు ఎక్కడ తెస్తాను?" అని బాపూ ఎదురు ప్రశ్న వేశారు.

"రెండు చందనపు చెట్లను పరికించాము. ఆ కర్రలు నావద్ద ఉన్నాయి" అన్నారు కటేలీ.

"మీరు ఏమి ఇచ్చినా పుచ్చుకుంటాను. వాటితోనే పని జరుగుతుంది. ఇంతకూ ఏర్పాట్లన్నీ చేయవలసింది ప్రభుత్వమేకదూ?" అన్నారు బాపూ.

బ్రాహ్మణులు, బంధువులు కలిసి పాడెను తయారు చేశారు. బ్రాహ్మణులు దేవదాస్ భాయీతో పూజ, కర్మకాండ చేయించడం మొదలుపెట్టారు. దానికి ముందు మనుమ్రాలు (?) కస్తూర్బాకుఆరతిఎత్తారు. 'వైష్ణవజనతో' పాడాము; రామధున్ జరిగింది. ఇదంతా అయిన తర్వాత అందరూ బాకు ప్రణామం చేశారు. నేను బా పాదాలపై తలపెట్టి తప్పులు మన్నించవలసిందని కోరాను. నన్ను నేను అదుపులో పెట్టుకోలేకపోయాను. కళ్ళనుంచి నీరు ధార గట్టింది. త్వరగా స్నానాల గదివైపు పరుగెత్తాను. "ఏడవడంవల్ల మరణించినవారి ఆత్మకు క్లేశం కలుగుతుంది" అని చిన్నటినుంచి నేను వినుకు, ప్రభావతీ బహన్‌కు నచ్చచెబుతున్నాను. కనుక నేను ఏడవడం వారు చూస్తే బాగుండదు.

లీలావతీ అసర్ వచ్చింది. పనిలల్లా పూనాలోనే ఉన్నది; బా బ్రతికిఉండగా చూచే భాగ్యం ఆమెకు లేకపోయింది. బాపూ ఒడిలో ఒరిగిపోయి వెక్కి వెక్కి ఏడ్చింది. జనం రావడం ఆరంభంకాగానే బాపూ దర్వాజావద్ద నిలబడ్డారు. మృదులా వచ్చింది. బాలాకాకా కాషాయవస్త్రాలు ధరించి ఏకతార మీటుతూ, చిటికలు వాయిస్తూ, కీర్తనలు పాడారు. వచ్చినవారు కస్తూర్బా దర్శనం చేసుకుని తోటలో వెళ్ళి కూర్చునేవారు.

తొమ్మిదిన్నర తర్వాత శవాన్ని పాడెపై పెట్టారు. బాలాకాకా తెచ్చిన త్రివర్ణ పతాకంతో శవాన్ని కప్పి, సిందూరంతో తడిపిన నూలు చిలపలతో బిగించాము. ఈ నూలు నేను వడికింది. త్రివర్ణ పతాకంపైన పూవులు అలంకరించాము.

కను అప్పుడు చాల ఫోటోలు తీశాడు. కను బా జీవించినప్పుడు, ఆమె పక్కన బాపూ కూర్చున్న ఫోటో తీసుకోలేకపోయాడు గాని, మరణించిన బా పక్కన కూర్చున్న బాపూ ఫోటో తీశాడు. ఫోటో తీసుకున్న తర్వాత కెమెరాను కటేలీకి అప్పగించాడు. ఆయనే అందరి సామానులూ తనవద్ద భద్రపరుస్తారు.

శ్మశానంలో జరుగవలసిన ఆవశ్యక కర్మకాండ తర్వాత కను, జయసుఖ్‌లాల్ భాయీ, శాంతికుమార్‌భాయీ, కమలనయన్ బజాజ్ మొదలయినవారు చితి పేర్చారు. శవాన్ని చితిమీద పెట్టిన తర్వాత, బాపూ ప్రార్థన జరిపారు. ఈశావాస్యమిదం సర్వం, అసతోమాసద్గమయ, అఉజా—న—బిల్లా, మజ్దా అహోష్ణ బిహిశ్తా, వెన్ ఐ సర్వే ది వండరస్ క్రాస్, మంగళ్ మందిర టోలో గీతాల గానం, రామధున్, గీతలోని 12 వ అధ్యాయం పారాయణం జరిగాయి.

తర్వాత దేవదాస్ భాయీ పదిన్నరకు చితికి నిప్పు ముట్టించారు.

బాపూ ఒక కర్ర పట్టుకుని నిలబడ్డారు. కొందరు పరుగెత్తుకొని వెళ్ళి కుర్చీతెచ్చి, కూర్చోండని ఆయనను బ్రతిమాలారు. కాని, బాపూ కూర్చోడానికి ఒప్పుకోలేదు. మీరా బహన్ బాపూజీకి ఎండ తగులకుండా గొడుగు పట్టింది.

చితి జ్వాల బాగా భగ్గుమన్న తర్వాత చుట్టూ మూగిన జనం వెనకకు తగ్గారు. బాపూజీ కూడా వెనక్కు వెళ్ళి ఒక చింతచెట్టుకింద కుర్చీలో కూర్చున్నారు. పన్నెండుగంటలకల్లా కర్మకాండ ముగుస్తుందని అనుకున్నాము; కాని దహన సంస్కారమే పదిన్నరకు ఆరంభమయింది.

బా శరీరం నీరు పట్టింది; చితి కూడా సరిగా పేర్చలేదు. అందువల్ల దహనానికి చాల సేపు పట్టింది. సగం కాలిన శవాన్ని వెదురు గడలతో చితిపై సరిగా సర్దించడానికి ప్రయత్నించినప్పుడల్లా శవం దొర్లిపోయేది. భయానకమైన దృశ్యం! తలదగ్గర మరికొన్ని మొద్దులు వేయడం అవసరమయింది. దూరంనుంచి కర్రలను విసిరివేయడంవల్ల కర్రలు చితిపై సరిగా పడక, చుట్టుపక్కల చెదురుగా పడేవి. ఆఖరుకు కను ధైర్యంచేసి, చితి దగ్గరికి వెళ్ళి కర్రలను జ్వాలలో వేసి వచ్చాడు. అతని కనురెప్పలు, ముఖం, చేతులు కందిపోయాయి. శాంతికుమారభాయీ చితి మండినంతసేపూ కర్రలు వేస్తూనే ఉన్నారు. సొంత కొడుకు కూడా తన తల్లి దహన సంస్కారంలో ఇంత ప్రేమతోను, భక్తితోను పనిచేయడు.

దాదాపు రెండుగంటల తర్వాత బాపూతో "మీరు వెళ్ళండి. మేము పూర్తి చేసి వస్తాము" అని అన్నాము. బాపూ లేచి వెళ్ళేవారేనా? "62 సంవత్సరాలు కలిసి ఉండి, ఆఖరులో ఇప్పుడేమి తొందరవచ్చింది? బా ఏమి అనదు?" అన్నారు బాపూ. ఈ మాటలకు అందరం ఊరికే ఉండిపోయాము. చాలమంది వెళ్ళిపోయారు;

మూలం:

డాక్టర్ సుశీలానైయర్

అనువాదం:

తిరుమల రామచంద్ర

చాలమంది కూర్చున్నారు. కాని, బాపూ లేవలేదు.

నాలు ా దహన సంస్కారం పూర్త యింది. అప్పుడు మేడమీదికి వచ్చారు. మూడున్నం తర్వాత నేను ఉండలేకపోయాను. ఎండలో నిలబడడంవల్ల దప్పి ఎక్కువవుతున్నది; అలసట కలిగి, తల తిరగడం మొదలుపెట్టింది. ఇంతలో వచ్చిన ఒక సోదరి తనను స్నానాల గదికి తీసుకొని వెళ్ళమంది. కటేలీని అడిగి నేను ఆమెను పైకి తీసుకొని వెళ్ళాను. పైకి వెళ్ళిన త ా నాటి నేలమీద పడు కున్నాను. వచ్చే చేయడంకోసం అలసట పోగొట్టుకు ్నానం చేశాను. తర్వాత కిందికి వెళ్ళాను. ా ని, తిరిగి రావలసి వచ్చింది. స్నానం చేసిన తర్వాత కూడా శ్మశా నంలో నిలబడే శక్తి కలుగలేదు. నాలుగు గంట లకు కృష్ణా హఠీసింగ్ పైకి వచ్చింది. ఆమెకు తలనొప్పి. ఏస్పిరిన్ అవసరమయింది. డాక్టర్ గిల్డర్ ఏస్పిరిన్ మాత్ర ఇచ్చి, చాయ్ ఇచ్చారు. రెండవసారి కిందికి దిగుతుండగా, బాపూ వస్తు న్నారు. ఆయన స్నానానికి ఏర్పాట్లు చేశాను. కాని, ఆయన మొదట అందరికీ వీడ్కోలు చెప్పవలసి ఉంది. అందువల్ల కొందరు వరం డాలో ఆయనను కలుసుకొని వెళ్ళడానికి నిల బడ్డారు. ఆఖరుకు ఒక్కరి తర్వాత ఒక్కరుగా అందరూ వెళ్ళిపోయారు. తర్వాత బాపూ స్నానం చేసి భోజనం చేశారు. శుక్రవారం అస్థి సంచ యనం చేయాలి గనుక దేవదాస్ భాయీ మాత్రం ఉండిపోయారు. శుక్రవారం వరకు ఆయన వెలుపలికి వెళ్ళలేరు.

రామదాస్‌భాయీ ఇంతవరకూ రాలేదు. వస్తే ఇక్కడ ఉండవచ్చు. ఆరుగంటలకు భండారీ వచ్చారు. బా సేవకోసం వచ్చినవారిలో కను కొన్నిరోజులు ఉండి వెళ్ళవచ్చునని బాపూ భండా రీతో అన్నారు. "అతనికి వెలుపల చాల పని ఉంది. మను ఇక్కడే ఉండి చదువుకొందామను కుంటూ ఉంది. ప్రభుత్వం ఒప్పుకుంటే, ఆమెను నావద్ద ఉండనివ్వడానికి సిద్ధంగా ఉన్నాను. లేక పోతే, ఆమెను నావద్ద ఉంచుకోడానికి మరొక కారణమేమీ లేదు. ప్రభావతీ బహన్ ఖైదీ. ఆమెను ఇక్కడే ఉండనివ్వండి. ఇక్కడినుంచి పంపివేసేటట్లయితే, బిహారుకు పంపివేయండి. మరొకచోటికి వద్దు" అన్నారు బాపూ. ఈ విషయాలన్నీ శ్రద్ధగా పరిశీలిస్తానని భండారీ మాట ఇచ్చారు.

దేవదాస్‌భాయీ, అన్నయ్యా ఆరున్నరకు భోజ నానికి కూర్చోబోతుండగా, రామదాస్‌భాయీ వచ్చారు. ఆయనకు చాల దుఃఖం కలిగింది. మనసారా ఏడ్చారు. తర్వాత దేవదాస్ భాయీ ఆయనను చితివద్దకు తీసుకొని వెళ్ళారు. పిదప రామదాస్‌భాయీ స్నానానికి వెళ్ళగా, దేవదాస్ భాయీ, అన్నయ్యా భోజనానికి కూర్చున్నారు. రామదాస్‌భాయీకి మను భోజనం వడ్డించింది. ఏడుంబావుకు మేమందరం కిందికి వెళ్ళాము. మహాదేవభాయీ సమాధికి, బా చితికి పూవులు సమర్పించాము. ఎనిమిదింబావుకు ప్రార్థన జరి గింది. బా మరణించినచోట నేతి దీపం పెట్టి, ధూపం, అగరువత్తులు వెలిగించాము. మహ లంతా శూన్యం. కస్తూర్బా గది శూన్యం. మా మనస్సు శూన్యం. బా మృత్యువు అదర్శప్రాయం కావచ్చు; చాల కరుణాత్మకం కూడా. ఒక్కసారి వెలుపలికి వెళ్ళి తమ కుమారులు, మనుమల మధ్య గడుపుదామని ఆమెకు తీవ్రమైన కోరిక ఉండేది. కాని, ఈశ్వరునికి అది ఇష్టంకాలేదు.

ప్రార్థన తర్వాత బాపూ నూలు వడికారు. కొన్ని తంతులు వచ్చాయి. అన్నయ్య వాటిని చదివి వినిపించాడు. కొ ంచెంసేపు ఏవో మాటలు జరిగాయి. పడుకోడానికి పన్నెండయింది. నేను పన్నెండున్నరకు మంచంమీద పడ్డాను. కాని, నిద్ర వస్తేనా? రెండుకొట్టిన గంట విన్న తర్వాత నిద్రపట్టింది.

## వియోగవేదన

24, ఫిబ్రవరి '44

ఉదయం ప్రార్థనకోసం అందరూ లేచాం. ప్రార్థన చాల మధురంగా ఉంది. తర్వాత చాల మంది పడుకున్నారు. కను, ప్రభ, మను నూలు వడకడం ప్రారంభించారు. ఉదయం వాహ్యాళి బా సామాను పరిశీలించాము. దేవదాస్‌భాయీ తోడ్పాటుతో ఏ వస్తువు ఎవరికి ఇవ్వాలో నిశ్చ యించాము. నిరుడు బా నాకు ఒక తెల్ల శాలువ ఇచ్చారు. దేవదాస్‌భాయీ దానిని ే ఇచ్చి వేశారు. ఇంటివారి కందరికీ పంచిన తర్వాత మిగిలితే నాకు ఇవ్వండి—అన్నాను నేను. అన్నయ్య వడికిన ఒక నూలు చీర బావద్ద ఉంది. దానిని దేవదాస్‌భాయీ నాకు ఇవ్వబోయారు. దానిని లక్ష్మి వదినెకు ఇవ్వమని అన్నయ్య అన్నారు. "నాకు చీర ఇవ్వదలచుకుంటే, రాజకుమారి వడికిన నూలు చీర ఇవ్వండి. దానిని నిరుడు బా నాకు ఇవ్వదలచారు" అని అన్నాను. దేవదాస్ భాయీ బా పక్క విప్పి, ఆ చీరతీసి నాకు ఇచ్చారు. ఆమె 'సమడా' (బొంత కంబళి) బాపూజీకోసం పెట్టారు.

బాపూ రాత్రి ిదకొండు గంటల వరకు మాట్లాడుతున్నారు. బా స్మరణకు సంబం ధించిన మాటలవి.

బా శ్రాద్ధం విషయం చర్చకు వచ్చినప్పుడు దేవదాస్‌భాయీ "గంగలో అస్థినిమజ్జనం చేయడంవల్ల లాభమేమీ లేదు" అన్నారు. కాని, "బా భక్తిశ్రద్ధలనుబట్టి, ఆమె అస్థులను గంగలో నిమజ్జనం చేయడం అవసరం'' అన్నారు

# డెబ్బై ఏళ్లసహచరి వియోగంతో బాపూజీ హృదయావేదన

సమయానికి తనను మేల్కొలుపవలసిందిగా దేవ దాస్‌భాయీ కోరారు. నేను ఒక్కమారు లేపాను. ఆయన లేచి పడుకున్నారు. రెండవసారి మేల్కొ ల్పడం ఎందుకని అనుకున్నాను. కాని, ఆయన తప్పక లేపమన్నందున, ఈ రెండు మూడు రోజులేకదా, మళ్ళీ బాపూజీతో ఎప్పుడు కలుసు కుంటాడో ఏమోననే ఆలోచనతో మరొక సారి మేల్కొల్పాను.

బాపూ ఉదయం వాహ్యాళికి బయలుదేరి నప్పుడు, అందరూ వెంట బయలుదేరారు. అది చూచి బాపూ "ఈరోజు పూర్తిగా గుంపు చేరింది. బాకు బతికి ఉన్నప్పుడు జరుగనిది, ఆమె వెళ్ళిపోయిన తర్వాత దానంతట అదే ఏర్పడింది" అన్నారు.

బా చితివద్దకు వెళ్ళాము. చితి ఇంకా మండు తూనే ఉంది. భస్మం తీసుకోదలచుకుంటే ఇప్పుడే తీసుకోండని బాపూ అన్నారు. ఇంకా 24 గంటలన్నా పూర్తి కావలెనని దేవదాస్‌భాయీ అన్నారు. కటేలీ, డాక్టర్ గిల్డర్ పూవులు తెచ్చారు. కొందరు వార్డర్లు కూడ పూవులు తెచ్చారు. సమాధిని అలంకరించి ప్రార్థన చేశాము.

సానుభూతి తంతులు 150 వచ్చాయి. భోజన సమయంలో బాపూజీకి వాటిని చదివి వినిపించాము. సాయంకాలం నాలుగు గంటలకు బాపూ.

26, ఫిబ్రవరి '44

నేడు మహాదేవభాయీ మరణించిన దినం. ఆయనవద్దకు బా కూడ చేరుకున్నారు.

బా మరణంవల్ల కలిగిన అఘాతంనుంచి బాపూ ఇంకా కోలుకోలేదు. 62 సంవత్సరాల సాహచర్యం. ఇంగ్లాండులో మూడు సంవత్సరాలు, జెయిలు యాత్ర మొదలయినవాటిలో కొంత కాలం మినహాగా బాపూ బాను విడిచి ఉండలేదు. చిన్ననాడు కూడా ఆమెతో ఆడుకున్నారు. పెండ్లికి ముందు కూడా—అంటే 62 సంవత్సరాల సాహచర్యానికి ఏడెనిమిదేళ్ళ ముందుకూడా ఇద్దరూ ఆడుకున్నవారు. ఇలాటి సహచరి వెళ్ళిపోవడం సామాన్య సంఘటన కాదు.

బా మరణంవల్ల దేశానికి పెద్ద దెబ్బ తగిలింది. వందలకొలది తంతులు అలా ఉండగా మాలవీయజీ దేవదాస్‌భాయీ పేర తంతి పంపారు—బా అస్థులు తీసుకొని త్రివేణికి రమ్మని. దేవదాస్‌భాయీ మొదటినుంచే సిద్ధంగా ఉన్నారు. ఆయన బా చితిభస్మం ఒక సంచిలో నింపి మోటారులో వేసుకొని ఇతరులతోపాటు వెళ్ళిపోయారు.

ఉదయం ఎనిమిదింబావుకు బాపూ వాహ్యాళికి బయలుదేరారు. ఆయన, మను మినహా తక్కిన

## ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక

# దీపావళి కథల పోటీ

## 2,000 రూపాయల బహుమతులు

ప్రతి ఏడాదివలెనే ఈ ఏడాది కూడా దీపావళి సందర్భంలో ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక కథల పోటీ నిర్వహిస్తున్నది.

క్రితం ఏడాది 1,500 రూపాయల బహుమతులు ఇచ్చాము. ఇతోధికమైన ప్రోత్సాహం ఇచ్చే నిమిత్తం ఈ ఏడాది 2,000 రూపాయల బహుమతులు ఇవ్వడానికి నిశ్చయించాము.

తెలుగు రచయితలు ఈ అవకాశం వినియోగించుకొని, పాఠకులకు ఉత్తమమైన కథలు సమర్పించాలనే మా పూనిక విజయవంతంగా నెరవేరడానికి తోడ్పడాలని అర్థిస్తున్నాము.

**మొదటి బహుమతి 850 :: రెండవ బహుమతి 500**

**మూడవ బహుమతి 350**

**రెండు కన్సోలేషన్ బహుమతులు : చెరొక 150**

### దీపావళి కథల పోటీ నిబంధనలు :

1. ఇతివృత్తం ఆంధ్రుల జీవితానికి సంబంధించినదై ఉండాలి.
2. స్వీయరచనలే కాని అనువాదాలు పంపరాదు.
3. రచన పాపుళావు సైజులో 12 పేజీలకు మించరాదు.
4. కాగితానికి ఒక వైపున మాత్రమే వ్రాయాలి.
5. బహుమతి పొందని కథలలో యోగ్యమైనవి ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రికలో ప్రచురించే హక్కు మాకు ఉన్నది.
6. పోటీకి రచన పంపేటప్పుడు కవరు మీద 'దీపావళి కథల పోటీకి' అని స్పష్టంగా వ్రాయాలి.
7. బహుమతి పొందని కథలలో ప్రచురణార్హం కానివి త్రిప్పి పంపే నిమిత్తం తగుమాత్రం తపాలాబిళ్ళలు అంటించిన, చిరునామా కలిగిన కవరు జతపరచి పంపవలసి ఉన్నది. లేకపోతే వాటిని త్రిప్పి పంపడం జరుగదు.
8. రచనలు 'ఎడిటర్, ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక, ఎక్స్‌ప్రెస్ ఎస్టేట్స్, మద్రాసు—2'కు పంపాలి.

**బహుమతి పొందిన కథలను ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక దీపావళి ప్రత్యేక సంచికలో ప్రచురించగలము**

దీపావళి కథల పోటీకి రచనలు మాకు చేరవలసిన ఆఖరి తేది — **1964 అక్టోబరు 3**

# గాంధీజీ కారాగార గాథలు

వారంతా స్నానం చేశారు. ఎనిమిది ముప్పావుకు మహాదేవభాయీ సమాధికి పూలు సమర్పించడానికి వెళ్ళాము. బాపూ బా సమాధిపైన గులాబిపూవు పెట్టారు. మీరాబహెన్ ఆ గులాబి పూవు నాలుగువైపులా పూవులు అలంకరించింది.

ఈరోజు సాయంకాలం బాపూ నాతో మాట్లాడుతున్నప్పుడు "నా మనస్సు ఇప్పుడు బా తప్ప మరొక విషయం ఆలోచించడంలేదు. ఈరోజు 'డాన్'లో ఒక వ్యాసం చదువుతున్నప్పుడు వేవెల్ ఎవరు? వైస్రాయా? కాదా? అని సందేహం వచ్చింది" అన్నారు.

"బాపూ, మీపైన మహాదేవభాయీ మరణం కంటే బా మరణం ప్రభావమే హెచ్చుగా పడిందనుకుంటాను" అన్నాను. "కావచ్చు. మహాదేవ్ క్షణంలో వెళ్ళిపోయాడు. బా ఎన్నోవారాల పాటు కఠిన వేదన అనుభవించింది. నాకు ఆ రోజులు మరుపురావు" అన్నారు బాపు. ఆయన రెండుకు పడుకొని, మూడుకు లేచారు. తర్వాత బా మృత్యువు విషయమై బొంబాయి గవర్నర్ వ్రాసిన జాబుకు సమాధానం వ్రాశారు. పిదప బంకమట్టి పట్టీ కడుపుపై పెట్టుకొని పడుకున్నారు. ఆయన రక్తపు పోటు ఆదర్శప్రాయం—ఉదయం 170/98, సాయంకాలం 156/96. కాని, అలసట విపరీతం.

బా తల ఆనించి కూర్చుని నిద్రపోయే బల్ల తనవద్ద ఉంచమని బాపూ ఆదేశించారు. ఆ బల్లమీద ఇప్పుడు బాపూ అల్పాహారం ఆరగిస్తారు. "ఈ బల్ల నాకు చాల అమూల్యమైపోయింది. ఈ బల్లమీద తలపెట్టి కూర్చునే బా చిత్రం నా కళ్ళఎదుటే ఉంటుంది సదా. బా నా చేతులమీదుగా వెళ్ళిపోవడం నాకు ఒకవైపు సంతోషం కలిగించినా, మరొకవైపు 62 సంవత్సరాల పైచిలుకు సహచరిని కోల్పోయి దిబ్భ్రాంతుడిని అయాను" అన్నారు. బా అంత్య సమయం సంగతి చెబుతూ, "బా ఈవిధంగా అంతిమ సమయంలో నన్ను పిలవడం, నా ఒడిలో ప్రాణాలు వదలడం అద్భుత విషయం" అన్నారు.

28, ఫిబ్రవరి '44

నేడు నేను కృష్ణాహతీసింగ్ వ్రాసిన 'విత్ నో రిగ్రెట్స్' అనే పుస్తకం చదివాను. చాల బాగుంది.

సాయంకాలం వెళ్ళి చూతునుగదా, మహాదేవభాయీ సమాధి పక్కన కస్తూర్బా సమాధి కూడా తయారయింది. కను అఖండ సూత్రయజ్ఞ కార్యక్రమం ఏర్పాటు చేశాడు.

(సశేషం)

ఏకాగ్రతకు అది కొంచెం భంగకరం కావచ్చు.

## కె. ఎస్. వేణుగోపాలరావు, వినగడప

"వివాహమైనప్పటినుండి ఏదో వేదన, తీరని వ్యధ నన్ను బాధిస్తున్నవి. ఏదో నాజీవితం నాశనమై పోతున్నట్లు భావిస్తాను. ఎంతో అభివృద్ధిలోకి రావలసినవాడను, కూపస్థమండూకం లాగ ఒక కుగ్రామంలో కూర్చుని వ్యవసాయదారుడుగా జీవించవలసి వస్తుందని నా కలలో కూడా ఊహించి ఎరగను"— మీరు దేశం నాలుగు మూలలూ తిరిగివస్తే, ఈ అశాంతి కొంతదాకా పోతుంది. పెద్ద చదువులు చదివి, మహా నగరాలలో ఉన్నంత మాత్రాన మనశ్శాంతి లభించదు. పది సంవత్సరాల క్రితం విరమించిన విద్యకోసమై ఈనాడు వ్యాకులపడటం విజ్ఞత కాదు. పట్టాలకోసం, పదవులకోసం చదువుగాక మీకు నిజమైన విద్యాతృష్ణ ఉంటే, మీ ప్రస్తుత పరిసరాలు మిమ్మల్ని ఏవిధంగానూ ఆటంకపరచవు సరికదా, ఆ ప్రయత్నం మీ జీవితానికి ఉత్తేజాన్ని సమకూరుస్తుంది.

## కె. సరస్వతి, హైదరాబాదు

"మా అబ్బాయికి నాలుగవ ఏడు. ఇంట్లో అల్లరి తప్పుతుంది కదా అని స్కూల్లో చేర్పించాము"— మీరు అమాయకులు గనక అంత తొందరగా ఒప్పుకుంటున్నారు. అందరూ అలా అనరు.

## ఎమ్. ఎస్. రావు, హనుమకొండ

"1964 మార్చిలో ఓ. యు. సి. పరీక్ష ఇచ్చి తప్పినానని మీకు వ్రాయుటకు సిగ్గుపడుతున్నాను. నా సమవయస్కులు, నాకంటె చిన్నవారు కొందరు గ్రాడ్యుయేషన్ చేసినవారు, కొందరు చేస్తున్నవారు, ఒకరిద్దరు ప్రిప్రొఫెషనల్ చదువుతున్నవారు ఉన్నారు"— ఒకసారి పరీక్ష తప్పినంత మాత్రాన అంత నిరుత్సాహం కూడదు. మళ్ళీ ప్రయత్నం చేయండి. మీకు చదువు అంటే యోగ్యత లేకపోతే, జీవనోపాధికి మరొక మార్గం అన్వేషించండి. సాహసంతో ముందుకు వెళ్ళగలవారికి చుట్టూ కావలసినన్ని అవకాశాలు. ఏ విశ్వాసమూ, ధృతిత్వమూ లేక మందలో పడిపోదలుచుకుంటే వ్యక్తిత్వమంటూ ఏనాటికీ ఏర్పడదు.

## సి. రామచందర్, కాజీపేట

"నేటియుగం డబ్బుకే విలువ ఇస్తుంది. కారణం?"— నేటి యుగం కాదు; ఎప్పుడూ అంతే! సృష్టి స్థితి లయాధిపతులైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులలో స్థితికారకుడైన విష్ణువు ఈ సృష్టిభారాన్ని వహిస్తున్నాడని కదా మనవాళ్ళనేది! ఆ విష్ణుమూర్తి భార్యామణి ఎవరు? లక్ష్మీదేవేగా! మనం ఈనాడు సిరిసంపదలు అనక, 'ఎకనమిక్ డిటర్‌మినిజమ్' అంటున్నాము.

## భ్రమరాంబ, హైదరాబాదు

"మీ చల్లనిమాటలతో నాకొక వెలుగురేఖ చూపిస్తారని ఆశించి ఈ ఉత్తరము వ్రాస్తున్నాను"— మాటలతో మీ బాధ తీరుతుందా? పోనీ, ఎవరైనా హోమియోపతి వైద్యుని సంప్రదించండి.

## పి. శకుంతల, చీపురుపల్లి

"నాకు 22 సంవత్సరాలు. ముగ్గురు మగపిల్లలు. భర్త ఆఫీసరు. జీతం 230. భర్త నన్ను ఎంతో ఆప్యాయంగా చూస్తారు. పిల్లల ముద్దుమాటలతో, భర్త అనురాగముతో, బంధుమిత్రుల రాకపోకలతో ఇల్లు కలకలలాడుతూ, జీవితము సుఖప్రదముగా ఆనందముగా ఉండవలసినది. కాని ఏదో అశాంతి,విరక్తి కలుగుతూ ఉంటుంది నాకు" — పిల్లలను మీ పెద్దవాళ్ళ దగ్గర విడిచి, మీరిద్దరూ సంవత్సరానికొకసారి విధిగా దూర ప్రదేశాలు చూడటానికో, తీర్థయాత్రలకో వెళ్తూ ఉండండి. ఈ స్థలం మార్పువల్ల మీ మనసు తేలికవుతుంది.

## పి. శ్యామల, నరసన్నపేట

"మా శ్రీవారు ఎన్. జి. ఒ. ఆయన జీతము తిండికి తప్పించి, పై ఖర్చులకు సరిపడటం లేదు. ఇంటికి ఎవరైనా బంధువులు వస్తే అప్పు. పండగవస్తే అప్పు. ఈవిధంగా ఉన్న మాయింటి పరిస్థితులు చక్కబరుచుటకు నేను సెకండరీగ్రేడు టీచరుగా చేరాను. నాకు ఇద్దరు పిల్లలు. పనిపిల్ల పిల్లలను కనిపెడుతుంది. వంట, కాఫీలు, టిఫిన్లు నేనే చేస్తాను. తీరిక దొరికినప్పుడు ఇంట్లోకీ, పిల్లలకూ కావలసిన బట్టలు చేతితో కుడతాను. పనిమనిషిపై కేవలము ఇంటిని, పిల్లలను ఒప్పజెప్పకుండా నేనుకూడా చూసుకుంటాను. 'ధన మూల మిదం జగత్' అన్నట్లు డబ్బు లేకపోతే అన్నీ చికాకులే! నేను ఉద్యోగములో చేరిన దగ్గరనుండి, ఆస్తి లేకపోయినా, అప్పులేకుండా సాఫీగా సంతోషంగా కాలక్షేపం అవుతూంది. మా యిల్లు ఒక క్రమపద్ధతిలో తయారైంది. అనవసరపు గొడవలు, ఇరుగుపొరుగువారితో కల్పించుకోవడానికైనా అవకాశము లేకుండా, శ్రీవారితోనూ పిల్లలతోనూ సరదాగా గడుస్తూంది. స్వానుభవం ప్రకారం స్త్రీ ఉద్యోగమువలన గృహమును స్వర్గముగా మార్చుకోవచ్చు"—నేటి సమాజంలో మీది ఒక నూతనవర్గము. ఆర్థికావసరానికి విద్యనూ, కాలాన్నీ సద్వినియోగం చేస్తున్న మీవర్గము నవభారతంలోని సిసలైన మధ్యతరగతి కాగలదు. ధనికుల ఆర్థిక బలము, కార్మికుల సామూహిక శక్తి ముందు మీవాక్కు వినబడక పోవచ్చు. కాని, మన జాతీయ జీవనానికి పట్టుగొమ్మ ఈ సామాన్య మధ్య తరగతే అని ముందు ముందు పెద్దలు గుర్తిస్తారు.

అడ్రసు:
**ప్రమదావనం**
ఆంధ్రప్రభ
సచిత్ర వారపత్రిక
ఎక్స్‌ప్రెస్ ఎస్టేట్స్
మద్రాసు-2

## ఎమ్. జయలక్ష్మి, పొదలాడ

"పశ్చిమ గోదావరి జిల్లా, తణుకు తాలూకా, పెనుగొండ సమితిలోని పొదలాడ పంచాయతీకి ఇటీవల జరిగిన ఎన్నికలలో, అందరూ మహిళలే ఏకగ్రీవంగా ఎన్నికైనారు. ఈ పంచాయతీ 1957 లో ఏర్పడినది. ఆనాటినుంచి ఎన్నికలు అన్నీ ఏకగ్రీవంగానే జరగడం, ప్రతిసారీ శ్రీమతి ఎమ్. జయలక్ష్మి అధ్యక్షురాలుగా ఎన్నిక కావడం విశేషం"— అది విశేషమే. ఎవరు కాదంటారు? కాని, మీరు మీ గ్రామానికీ, గ్రామంలోని వారికీ చేసిన ఉపకారాలేమిటో చెప్పండి. మీ గ్రామాభివృద్ధికి మీరు ఏవిధంగా సహాయ పడ్డారు? అటువంటివి చెబితే, విని సంతోషిస్తాము.

## కె. లక్ష్మి, గుంటూరు

"నాకీ జీవితం అంటే విరక్తి, అసహ్యం కలిగినవి. నేను నాకు తెలిసి ఎవ్వరికీ కీడు చేయలేదు. ఒకళ్ళు కష్టపడుతూంటే వాళ్ళతో సమానంగా బాధ పడ్డానేగాని ఎదుటివాళ్ళు సుఖపడుతూ ఉంటే చూచి ఈర్ష్య పడలేదు"—మీకు కలిగిన విరక్తికి మూలహేతువు అనురక్తి. ఈ జీవితంలో దాంపత్యానురాగమొక్కటే ముఖ్యం కాదు. అది లోపించినప్పుడు సేవాధర్మంలో శాంతి వెతుక్కోవాలి. ఫలాపేక్ష లేని సేవలో—స్వజనసేవ, మానవసేవ, ప్రభుసేవ; ఈ మూడింటిలో ఏదైనా కావచ్చు—ఎంతటి చిత్తశాంతి లభిస్తుందో అనుభవంవల్లగాని తెలియదు.

## సోదరి, శ్రీకాకుళం

"సంఘములో గౌరవింపబడువారికి కావలసినది ప్రేమకాదు, వివాహబంధమని నా ఉద్దేశము. చదివాను. ఉద్యోగ ముంది. కాని, నాకు కావలసిం గౌరవ జీవనము. ప్రేమించారే కాని ఏ త్యాగమూ చేయలేని పిరికిమనిషి"—అతని పిరికితనమేకాదు, చట్టం మీ ప్రేమను ఆమోదించదు. భా అతనికి విడాకులివ్వదు. అనవసరంగా మీ అల్లరి పాలవుతారు. వివాహం మాట ప్రస్తుతానికి మరిచిపోయి, మరొక ఊరు బదిలీ చేయిం కోండి. అదొక్కటే మిమ్మల్ని ఈ విషమ సమ నుంచి తాత్కాలికంగా బయట పడేస్తుంది.

14, ఏప్రిల్' 44

**ఈరోజు** ఉదయం ఎప్పటిలాగే ప్రార్థన కోసం లేచాము. బాపూజీ ఉపాహారం తర్వాత వాహ్యాళికి బయలుదేరారు. భోజనానంతరం నేను ఆయనతో పాటు రామాయణం, తర్వాత అన్నయ్యతోపాటు షేక్స్పియర్ చదివాను. తర్వాత నిద్రపోయాను. రెండున్నరకు నిద్ర లేచి చూడగా, అన్నయ్య మోహన్‌లాల్ వ్రాసిన ఉత్తరం బాపూజీకి ఇచ్చాడు. దానితోపాటు మరి కొన్ని కాయితాలూ ఉన్నాయి. నేను మనుకు పాఠం చెప్పడానికి మరొక గదిలోకి వెళ్ళాను. బాపూ పొట్టమీద బంకమట్టి పట్టీ వేసుకొని ఉత్తరం చదువుతున్నారు. అప్పుడే వచ్చి అన్నయ్య నన్ను సతాయించసాగాడు; ఉత్తరం చదువుతున్నప్పుడే బాపూ చేతులు వణుకుతున్నా యని.

## బాపూజీకి మలేరియా

మూడు గంటలకు బాపూజీ గొంతు విన బడింది. అన్నయ్యతో మాట్లాడుతున్నారేమో నని అనుకున్నాను. కాని, మను అన్నది–"అన్న య్యతో మాట్లాడడం లేదు. నిన్ను పిలుస్తు న్నారు" అని. నేను వెళ్ళాను. "పూరా పది పౌన్ల కేకవేశాను. మూత్రపుసీసా తీసుకొనిరా" అన్నారు బాపూ. నాకు చాల దుఃఖం కలిగింది. బాపూ వణుకుతున్నారు. "ఏమైంది బాపూ?" అని అడిగాను. "జ్వరం వస్తుంది. మూత్రపు సీసా తెచ్చావా?" అన్నారు. తర్వాత నేను బాపూ వీపు, మను ఆయన కాళ్ళు పట్టాము. కడుపు మీద బంకమట్టి పట్టీ వేయగానే బాపూజీకి జలుబు పట్టుకుంది. బాపూ లేచి, ఏదో విధంగా వెనుక ఉన్న తలుపు మూసి వచ్చారు. కాని, స్నానాలగది తలుపు మూయడానికి వెళ్ళే సాహసం లేకపోయింది. పడిపోతానని తోచింది. కనుకనే నన్ను కేకవేశారు. ఏమైనాసరే బాపూను ఒంటిగా వదలిపోవడం మంచిదికాదని మనస్సు లోనే అనుకున్నాను.

కొంతసేపటికి బాపూ వణకడం తగ్గింది. జ్వరం 98.6 ఉంది. బ్లడ్ స్లయిడ్ తెద్దా మనుకున్నాము. కాని స్లయిడ్లు నా గదిలో లేవు. కటేలీకి చెప్పి ఆస్పత్రినుంచి తెప్పించాను. నాలుగు గంటలకు రక్తపు ఫోటో (**Blood Smars**) తీసుకున్నాము. అప్పటికి జ్వరం 102.6 డిగ్రీలు. ఐదుగంటలకు భండారీ వచ్చారు. అప్పటికి జ్వరం 103.6. క్వైనా తీసుకోండని భండారీ, డాక్టర్ గిల్డరు బాపూను కోరారు. "రేపుకూడా జ్వరంవస్తే తీసుకుం టాను" అన్నారు బాపూ. "రేపు ఎలాగూ జ్వరం వస్తుంది" అన్నాము అందరమూ. "అయితే ఎల్లుండి. ఎల్లుండి జ్వరం వస్తే క్వైనా తీసుకోడంలో సంకోచపడను. నేను ఈ మధ్యా హ్నం ఏమీ తినకుండా ఉంటే బాగుండేది. జ్వరం వచ్చేదికాదు. ఇప్పుడు భోజనం వదలి పెడితే ఎలా ఉంటుందో చూడనివ్వండి" అన్నారు బాపూ. ఆఖరుకు మేము పట్టుదల మాని వేశాము. జ్వరంలో ఆయనతో వాదించి అలసట కలిగించడం మంచిది కాదనిపించింది.

రాత్రికి 99.6 డిగ్రీలు. చెమట పట్టింది. నిద్రకూడా బాగా పట్టింది. నిమ్మరసం, తేనె పుచ్చుకున్నారు.

17, ఏప్రిల్ 44

నేడు బాపూజీకి మూడు డోసుల క్వైనా ఇచ్చాము. (జ్వరం మొన్న 102.1 డిగ్రీలు, నిన్న 104.8 డిగ్రీలు ఉంది) జ్వరం మామూలు కన్నా దిగిపోయింది. కాని, రాత్రికి 99 డిగ్రీ లకు ఎక్కింది.

బాపూ జబ్బును గురించి ప్రభుత్వం చిన్న ప్రకటనను పత్రికలకు పంపింది. 'టైమ్స్' పత్రిక దానిని మొదటిపుటలో ప్రకటించింది. ఎంత చిన్న టైపులో ప్రకటించిందంటే, మొదట చూస్తే కంటికే కనిపించదు. ఆ ప్రకటనలో ఇలా ఉంది: " మూడు రోజులుగా గాంధీజీకి మలేరియా. నీరసంకూడా హెచ్చు. పరిస్థితి ఈ వయస్సులో ఎలా ఉండాలో అలా

# గాంధీజీ కారాగార గాథలు

ఉంది." ముందు ముందు ఏదైనా తీవ్ర పరి స్థితి ఏర్పడితే జాగ్రత పడడంకోసమే ఆఖరు వాక్యం చేర్చినట్లు కనిపించింది.

## ప్రభుత్వం ఆందోళన

29, ఏప్రిల్ '44

పదిన్నరకు బాపూజీకి బత్తాయి పళ్ళరసం ఇచ్చాము. తర్వాత 12–30 కు భోజన సమ యంలో అలసిపోయినట్లు కనిపించారు. భోజనం చేస్తుండగా, కటేలీ వచ్చి, సర్జన్ జనరల్ కాండీ వచ్చారని తెలిపారు. నేను నోటుబుక్కు తీసుకొని ఆయనవద్దకు వెళ్ళి బాపూ పరిస్థితి తెలిపాను. ఇంతలో డాక్టర్ గిల్డర్‌కూడా వచ్చారు. సర్జన్ జనరల్ కాండీ వచ్చి బాపూజీని చూచి, మరికొంచెం హెచ్చుగా క్వైనా పుచ్చుకోవాలని, ఐరన్ టానిక్ తీసుకోవాలని అన్నారు. క్వైనా డోసులు ఎలా పెంచాలో కూడా వివరిం చారు. తర్వాత కొంతసేపటికి "పైకి బాగున్నట్లే కనిపిస్తున్నారు. కాని, దానివల్ల ప్రయోజనమేమీ లేదు. రక్తపుపోటు 140 డిగ్రీలకంటే తగ్గక పోతే ఆందోళన పడవలసిన అవసరం లేదు" అన్నారు కాండీ.

ఇన్ఫ్లుయంజా యేమో అని కాండీ అనుకు న్నారు. కాని, రక్తంలో మలేరియా క్రిములు కనిపించాయని మేము తెలిపాము. టానిక్ మొదలయినవి ఇవ్వడం గురించి చెప్పిన మీదట ఆయన వెళ్ళిపోయారు.

బాపూ అస్వస్థత మూలంగా ప్రభుత్వం చాల గాభరా పడుతున్నట్లు మధ్యాహ్నం పత్రికలలో చదివాను.

రాత్రి 9–0గంటలకు దీపాలు ఆర్పి దోమ తెరలలో పండుకోవాలని ఉత్తర్వులు అందాయి. తేనెటీగలను తరిమివేయడానికి ఒక మనిషికూడా వచ్చాడు.

30, ఏప్రిల్' 44

బాపూ "హౌ గ్రీన్ వాస్ మై వ్యాలీ" చదివి ముగించారు. ఎలా ఉందని నేను అడుగగా "బాగుంది. కాని, నీవు చెప్పకపోతే నా అంతట నేను చదివేవాడిని కాను. అయినా, చదవకపోతే అయ్యో చదవలేకపోయామే అన్నంతటిది ఏమీ కాదు" అన్నారు.

రేపు డాక్టర్ విధాన చంద్రరాయ్ బాపూను చూడడానికి వస్తున్నారని రాత్రి కబురు వచ్చింది. 5–0 గంటల బండికి వచ్చి, ఎనిమిది గంటల బండికి తిరిగి పోతారట. ఇక్కడికి ఉదయం 5–30 కు చేరుతారు.

నిన్నటినుంచి బాపూ ప్రార్థనలో తులసీ దాస్ రామాయణంలోని ఒక చౌపాయీ తప్పక చదవాలని నియమం చేశారు. డాక్టర్ గిల్డర్ కూడా చౌపాయీని బాగా అర్థం చేసుకోడానికి గుజరాతీలో అర్థం చెప్పాలనికూడా నిర్ణయిం చారు.

1, మే '44

డాక్టర్ విధానచంద్రరాయ్ నేడు 5–30 కు మారుగా 7–0 గంటలకు వచ్చారు. "నిన్న నేను ఈ ప్రాంతం మీదుగానే వెళ్ళాను. అప్పుడు బాపూను చూడాలని నాకు తెలుపలేదు" అని అన్నారు రాయ్. "12–0 వరకు ఉండండని నేను నిన్ననే చెప్పలేదూ? కాని, మీరు ఉండలే లేదు" అన్నారు భండారీ. "ఉపవాసం తర్వాత కలిగిన తీవ్రానుభవంతో నేను ఎలా ఆగగలను?" అన్నారు రాయ్.

బాపూను విడుదల చేయాలని ఇంగ్లండులో పెద్ద గందరగోళం జరుగుతున్నదని విధాన్ రాయ్ తెలిపారు. బాపూ అస్వస్థతతో ఉన్నారని ఇండియా సెక్రటరీకి కబురు అందింది. "బాపూ ముందుకన్నా బాగున్నారు. రక్తపు పోటు, రక్తహీనత మునుపటి 24 గంటలకన్నా చక్క బడింది" అని రెండవ రోజు కాండీ నివేదిక ప్రకటించబడింది. రెండవ వాక్యం వల్ల జనానికి, ముఖ్యంగా డాక్టర్లకు కాండీ నివేదిక విశ్వాస పాత్రం కాదని తోచింది. రక్తహీనత ఒక్క రోజులో ఎలా చక్క బడుతుంది? మూత్ర పిండాలు సరిగా పనిచేయడం లేదని డాక్టర్

# రెండేళ్లకు ఆగాఖాన్ మహల్ జెయిలునుంచి బాపూ విడుదల

గజ్జర్ నివేదికలో తెలుపబడింది. "ఈ పరిస్థితిలో బాపూ దేహస్థితి ఏమిటో స్పష్టంగా మాకు తెలుపవచ్చుగదా?" అని అడిగారు విధాన రాయ్. "మీరు రావాలని నేను ఎన్నోసార్లు కబురుచేశాను గదా" అన్నారు భండారీ. సరే, ఏది ఏమైనా, డాక్టర్ రాయ్ వచ్చారు. ఇది మంచిదనిపించింది.

డాక్టర్ రాయ్ బాపూను పరీక్షించిన మీదట మాతో సంప్రదించారు. డాక్టర్ గజ్జర్‌ను ఆయన రేపు మళ్ళీ పిలిపించదలచారు. 'యూరియా క్లియరన్స్' మళ్ళీ జరిపించి, తర్వాత తక్కిన పరీక్షలూ చేస్తారు. తర్వాత తమ నివేదిక ప్రకటిస్తారు.

ఏడు ముప్పావుకు డాక్టర్ రాయ్ వెళ్ళిపోయారు. డాక్టర్ గజ్జర్ నివేదిక వలన ప్రజలలో ఆందోళన ఎక్కువయింది. మూత్రపిండాలలో కలిగిన దోషం స్థిరంగా ఉండదనే ఆశ.

మనుకు గోరుచుట్టులాగ ఉన్నది. బాపూ కళ్ళను పరీక్షించడానికి కళ్ళ డాక్టరును, మాలిష్‌కు దీన్‌షా మెహతాను పంపవలసిందని నేను, డాక్టర్ గిల్డర్ భండారీతో అన్నాము.

2, మే '44

డాక్టర్ గజ్జర్ తన సహోద్యోగులతో పాటు ఉదయం 6—00 గంటలకు వచ్చారు. 6—20 కి బాపూ లేచారు. గజ్జర్ ఆయనను పరీక్షించి ఎనిమిదింబావు బండికి వెళ్ళిపోయారు. ఎనిమిదిన్నరకు జెయిలు జమాదార్ మూత్రం తీసుకొని 11—30 బండికి వెళ్ళాడు.

బాపూను మరొక జెయిలుకు బదిలీ చేయడం విషయమై ఆలోచనలు జరుగుతున్నాయని భండారీ తెలిపారు. తర్వాత భండారీ డాక్టర్ గిల్డర్‌తో మాట్లాడుతూ "వందమైళ్ళు మోటారు కారులో ప్రయాణం చేస్తారా? అహమద్‌నగర్ జెయిలుకు తీసుకుని వెళ్ళుదామని అనుకున్నాను. అలా వెళ్ళేటట్టయితే, ఎవరెవరిని వెంట తీసుకొని వెళ్ళాలి? అక్కడ వారు బాపూజీ కార్యవర్గంతోపాటు ఉంటారా లేదా?" అంటూ ఆలోచించారు.

3, మే '44

మధ్యాహ్నం భండారీ కంటి వైద్యుణ్ణి పిలుచుకొని వచ్చారు. ఆ వైద్యునికి "ఫండస్" (కంటిలోని ఒక అవయవం) లో ఏ దోషమూ కనిపించలేదు.

ఉదయం బాపూజీకి మాలిష్ చేయడానికి దీన్‌షా మెహతా వచ్చారు. మాలిష్ ద్వారా శక్తి ఒకరి శరీరంనుంచి మరొకరి శరీరానికి ఎలా పంపవచ్చునో చర్చ జరిగింది.

కను వస్తున్నారని భండారీ తెలియజేశారు.

## విడుదలకు ఉత్తర్వు

5, మే '44

భండారీ అకస్మాత్తుగా వచ్చి బాపూజీవద్ద కూర్చుని "రేపు ఉదయం 8—00 గంటలకు మిమ్ములను అందరినీ బేషరతుగా విడుదల చేస్తున్నాము" అన్నారు. మేము హైరాన్ అయ్యాము. "ఏమిటి, తమాషా చేస్తున్నారా?" అన్నారు బాపూ. "లేదండీ. నేడు ఉత్తరం వచ్చింది. ఇక దయచేసి తిరిగి రాకండి. చూడండి. ఆలోచనవల్ల నా తల తెల్లబడిపోయింది" అన్నారు భండారీ.

"నేనెందుకు వస్తాను? ప్రభుత్వం లాక్కుని వస్తున్నది" అన్నారు బాపూ నవ్వుతూ.

విడుదల వార్త వినగానే నేను "మూడు నెలలు ఆలస్యమయింది. మూడు నెలలకు ముందే బాపూజీకి మలేరియా వచ్చి, విడుదల అయిఉంటే, కస్తూర్బా జీవించేవారు" అన్నాను. "అవును. అది పూర్తిగా సంభవమే" అన్నారు బాపూ.

ప్రార్థన తర్వాత కటేలీ బాపూజీకి ప్రణామం చేయడానికి వచ్చారు. ఉదయమైతే ఆఫీసరయి నింబడవలసి ఉంటుంది. కనుక ఇప్పుడే వెళ్ళి ఆశీర్వాదాలు పొందారు. ఆయన సంతోషానికి హద్దులేదు. "ఇక్కడినుంచి ఖైదీలు వాళ్ళ ఇండ్లకు వెళ్ళడం నాకు ఇష్టం. మరొక జెయిలుకు వెళ్ళడం, విడిపోవడం నాకు ఇష్టం లేదు. అందరూ నా కుటుంబంలోని వారులాగ అయిపోయారు. కనుక వీరికి మరొక సూపరింటెండెంటుతో పనిపడకపోతే మంచిదని మనసులో అనుకుంటుంటాను. మంచిదే అయింది. ఇప్పుడు ఆ ప్రశ్నే లేదు" అంటూ ఉదయం ప్రార్థనకు తనను లేపవలసిందని కోరారు.

విడుదల వార్త బాపూజీకి ఎంత మాత్రమూ సంతోషం కలిగించలేదు. "నా తల తిరుగుతున్నది" అన్నారు. "బాపూ, వెలుపలికి వెళ్ళిన తర్వాత చాల జాగ్రత్తగా ఉండవలసి వస్తుంది" అన్నాను నేను. "నాకు తెలుసు; వెలుపలికి వెళ్ళిన తర్వాత నా మీద అన్నివైపులనుంచి దెబ్బలు పడతాయని. ఇక్కడి శాంతి ఇక లేదు. నాకు సాధ్యమైనంతవరకు విశ్రాంతి తీసుకుంటాను. కాని, కొంత విశ్రాంతి వదలుకోక తప్పదు" అన్నారు బాపూ.

కటేలీ ప్రార్థనలో మాతోపాటు రామాయణం పఠించేవారు. అందువల్ల దేవదాస్‌భాయీ తెచ్చిన రామాయణం ప్రతిని బాపూజీ ఆయనకు బహూకరించారు. కను ఒక భజనావళి ప్రతిని, అన్నయ్య "ఏపిక్ ఫాస్ట్" ప్రతిని కటేలీకి బహూకరించారు. బాపూజీ ఫోటోకూడా ఆయనకు ఇచ్చాము. వాటన్నిటి మీద కటేలీ ఇష్టానుసారం బాపూ సంతకాలు చేశారు.

తెల్లవారుజామున మూడు గంటల వరకు అందరి సామాను సర్దడం పూర్తయింది. బాపూజీ సామాను, మందులు మొదలయినవి సర్దికట్టడానికి చాలసేపయింది. అన్నయ్య సామాను ఉదయం కట్టవచ్చు. నాలుగు గంటలకు స్నానం చేసి మంచంమీద పడుకున్నాను. నాలుగు ముప్పావుకు ప్రార్థనకోసం లేచాను. ఒక్క నిమిషమూకూడ నిద్ర రాలేదు.

## విడుదల

6, మే '44

ఉదయం నాలుగు ముప్పావుకు అందరము ప్రార్థనకు కూర్చున్నాము. అన్నయ్య సామాను సర్దుతున్నాడు. కను గుర్రుపెట్టి నిద్రపోతున్నాడు. ఉదయం నాలుగు గంటలకు పడుకున్నాడు. మను నిద్రపోవాలనే లేదు. కొంచెం సేపు కన్ను మూసింది. బాపూజీకూడ అరగంట ముప్పావుగంట నిద్రపోయి ఉంటారు. అందరము స్నానంచేసి, ప్రార్థనకు వచ్చాము. 'వైష్ణవజనతో' గీతం పాడాము. నిన్న రాత్రి 'హరిభజతా' పాడాము. మీరాబహన్ 'వెన్ ఐ సర్వే ది వండరస్ క్రాస్' గానం చేసింది. నేటి ప్రార్థనకు ఆమె లేవలేదు.

ప్రార్థన తర్వాత జెయిలు సూపరింటెండెంట్ కటేలీ బాపూజీకి 75 రూపాయలు బహూకరించారు. చాల సంతోషంగా ఉన్నారు. "మీరు వెలుపలికి వెళ్ళితే చాల మంది బహుమతులు తెస్తారు. కాని, అందరికన్న ముందు కటేలీ కానుక మీ చేతికి అందింది" అన్నారు కటేలీ.

ప్రార్థన తర్వాత నేను కటేలీ వద్ద సెలవు పుచ్చుకుని, తప్పులు జరిగి ఉంటే క్షమించమని కోరాను. ఆయన కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. "క్షమాపణ కోరవలసినవాణ్ణి నేను" అన్నారు.

(తరువాయి 61 వ పేజీలో)

మూలం :
డాక్టర్ సుశీలానైయర్
అనువాదం
తిరుమల రామచంద్ర

# గాంధీజీ కారాగార గాథలు

(27 వ పేజీ తరువాయి)

ప్రార్థన తర్వాత బాపూ నిద్రపోలేదు. వెలుపలికి వెళ్ళడానికి సిద్ధంగా ఉన్నారు. కటేలీ చాయ్ తయారు చేశారు. నేను ఒక్కతెనే చాయ్ పుచ్చుకున్నాను. తక్కినవారు పాలు పుచ్చుకొనే అలవాటు గలవారు. మేమంతా తక్కిన సామాను సర్దుకొని వెళ్ళడానికి సిద్ధంగా ఉన్నాము.

ఏడున్నరకు సమాధివద్దకు వెళ్ళి ప్రార్థన చేశాము. నేటి ప్రార్థనలో 'నమ్యో హెూం', 'ఈశావాస్యమిదం సర్వం', 'అసతో మా సద్గమయ', 'అఉజ—అ—బిల్లా', 'మజదా', 'ఓ గాడ్ అవర్ హెల్ప్ ఇన్ ఏజెస్ పాస్ట్' మొదలయిన అన్ని భాషల గీతాలూ పాడాము. గీత 12వ అధ్యాయం పఠనం కూడ జరిగింది. అందరం ప్రార్థన తర్వాత, సమాధులకు, ఖైదీలుగా తుది నమస్కారం చేశాము.

ఏడు ముప్పావుకు భండారీ వచ్చారు. ఎనిమిదికి ముందుగా వెలుపలికి వెళ్ళే అవకాశం లేదు. ఏవో మాటలు జరుగుతుండగా, ఏయే సామాను వెంట తీసుకొని వెళ్ళాలో చూద్దామనుకుని, పోర్చులోకి వెళ్ళాను. అక్కడ జిల్లా కలెక్టర్, ఒక పోలీసు ఆఫీసరు కూర్చున్నారు. వెంట ఏ సామాను తీసుకోవాలనే విషయమై నేను చర్చ జరుపుతుండడం చూచి, ఆ పోలీసు ఆఫీసరు "అరగంటలో సామానంతా మీకు చేరుతుంది" అన్నాడు.

జెయిళ్ళ ఇన్‌స్పెక్టర్ జనరల్ భండారీ కారులో నేను, బాపూ కూర్చున్నాము. కారు తీగల కంచె దాటగానే, ఒక సిపాయి కారు ఆపి, నాకొక నోటీసు అందజేశాడు. "ఆగాఖాన్ మహలులో జరిగిన విషయాలపై మీరు వెలుపల చర్చించగూడదు" అని ఆ నోటీసులో ఉంది. సిపాయి ఆ నోటీసుపై సంతకం చేయమన్నాడు. నేను బాపూజీ వైపు చూచాను. "చేయి" అన్నారు ఆయన. నేను సంతకం చేశాను. "అతడు ఆ నోటీసును నాకు కూడా ఇచ్చి సంతకం పెట్టమనేవాడే. ఎందుకివ్వలేదో అర్థం కావడం లేదు" అన్నారు తర్వాత బాపూ. "అయితే నేను ఇక్కడినుంచి వెళ్ళను—అని మీరు ఎక్కడ మొండికెత్తుతారో అని అధికారులు భయపడి ఉంటారు. అయితే, ఈలాటి ఉత్తరువులను మనం స్వీకరించడం ఎలాగో చెప్పండి" అన్నాను. "మొదటి విషయం—సంతకం చేసినంత మాత్రాన అంగీకరించినట్టు కాదు; రెండవ విషయం— నేను మీతో ఎలాటి హానీ కలిగించగూడదనీ కాదు" అన్నారు బాపూ.

వెలుపలి దర్వాజా వద్ద నలభై యాభై మంది నిలబడి ఉన్నారు: శాంతికుమార్, స్వామిఆనంద్, జమనాదాస్‌భాయి, ముళీలాపై మొదలయిన వారున్నారు. బాపూ ఎవ్వరినీ చూడలేదు. కారు మమ్మల్ని సరాసరి పర్ణకుటీర్ చేర్చింది. నిన్న భండారీ బాపూతో అన్నారు: "మీరుఇక్కడఉండదలచుకుంటే ఉండవచ్చు. కాని, నా సలహా ఏమిటంటే, మీరు ఉండవద్దని. ఎందుకంటే ఇది మిలిటరీకింద ఉన్న ప్రదేశం. మీ బృందంవారు వస్తే, ఎవరితోనన్నా పోట్లాట రావచ్చు. పర్ణకుటీరానికి నేను కబురు చేస్తాను." బాపూ ఒప్పుకున్నారు. అందువల్ల మేము పర్ణకుటీరానికి వెళ్ళాము. అక్కడ బాపూజీ స్వాగతంకోసం వేచి ఉన్న జనంలో ఎక్కువమంది నాకు తెలిసినవారు కారు. బాపూతర్వాతనాతో మాట్లాడుతున్నప్పుడు "ఆగాఖాన్ మహల్‌లో జరిగిన విషయాలపై చర్చ జరుపవద్దనే నోటీసుపై తాముచేసిన వ్యాఖ్యానం తప్పని అన్నారు. నేను సంతకం చేసిన తర్వాత అన్నయ్య, డాక్టర్ గిల్డర్ కూడా ఆ నోటీసులో సంతకం చేశారు. డాక్టర్ గిల్డర్‌కు మొదట కొంచెం అనుమానం కలిగిందట. అన్నయ్య వచ్చి చెప్పిన తర్వాత సంతకం చేశారట. తర్వాత అందరూ చేశారు.

బాపూజీని కలుసుకొనడానికి వచ్చేవారి సంఖ్య ఎక్కువవుతూ ఉంది. కొందరయితే చాలసేపు మాట్లాడారు. దానితో సాయంకాలానికల్లా బాపూ అలిసిపోయారు. ఉదయం బాపూ రక్తపు పోటు 192—106. మాలిష్ చేయించుకున్న తర్వాత కూడ నిద్రపోలేదు. మధ్యాహ్నం గంటసేపు నిద్రపోయారు. తర్వాత రక్తపుపోటు తగ్గింది.

ఇక్కడ విపరీతమైన ఎండలు ఆగాఖాన్ మహల్‌లో వట్టివేళ్ళ తడకలు కట్టడంవల్ల బాపూ గది చల్లగా ఉండేది. ఇక్కడ అలాటి ఏర్పాటు ఏమీ లేదు. ఆయన కూర్చునే గది మెట్ల ఎదుట ఉంది. వచ్చే పోయేవారంతా ఆయనను చూచేవారు; దగ్గరికి వెళ్ళి కూర్చునేవారు. విశ్రాంతి అనేదే లేదు.

సాయంకాలం ప్రార్థనలో దేశపాండే "హరి తుమ హరో జనకీ పీర్" గీతం గానం చేశారు. బాపూ పైన మేడమీద కూర్చున్నారు. జనం కింద ముంగిట్లో కూర్చున్నారు. ప్రార్థన తర్వాత హరిజన నిధికి చందా వసూలు చేశాము. తర్వాత బాపూ కొంచెంసేపు పచారుచేసి వచ్చారు.

వేడినీళ్ళు తాగడానికి బాపూ తిరిగి వస్తుండగా, శ్రీ కన్హయ్యాలాల్ మున్షీ, శ్రీమతి లీలావతీమున్షీ, శ్రీ రామేశ్వరదాస్ బిడ్‌లా, మరికొందరూ వచ్చారు. రాత్రి పదిగంటలకు బాపూలేచిపచారుచేసి వచ్చారు. కొంతసేపటికి పృథ్వీసింగ్ పత్ని మొదలయినవారు మరి నలుగురు వచ్చారు. వారు వెళ్ళిపోయిన తర్వాతే బాపూ పడుకోడానికి సిద్ధమయ్యారు. సుమారు పన్నెండు గంటలకు మాలిష్ పూర్తిచేసి నా గదికి వచ్చి సామాను సర్దుకున్నాను. డైరీ వ్రాశాను. పన్నెండుకొట్టింది. పడుకోబోతూతొంగిచూస్తే, బాపూ వరాండాలో నిలబడి ఉన్నారు. ఆయన వెలుపల ఆరుబయట పడుకున్నారు. కాని, దోమల మూలంగా పడుకోలేక పోయారు. నేను బాపూ పక్క లోపల వేసి, దోమతెర కట్టి విసరడం ప్రారంభించాను. తర్వాత వరండాలో నేలమీద పడుకున్నాను. విపరీతమైన వేడి! ఉక్క! దోమలు పీడిచేస్తున్నాయి!!

### 27, మే, 44

దీన్‌షా మెహతా నేడు సాయంకాలం అందరినీ సమాధివద్దకు పిలుచుకొని వెళ్ళారు. వెంట చాల మంది వెళ్ళారు. పూవులు సమర్పించి, అగరు వత్తులు వెలిగించి ప్రార్థన జరిపాము. పర్ణ కుటీరంలో ఉన్నన్ని రోజులూ సమాధుల వద్దకు వెళ్ళి ప్రార్థన చేద్దామని ఇచ్ఛ కలిగింది. నిన్న చేశాము. నేడు చేశాము.

సమాధి నుంచి తిరిగివచ్చాము. బాపూ మౌనం అవలంబించారు.

మేము సమాధుల వద్ద ఉండగానే తుఫాను సూచనలు కనిపించాయి. రాత్రి కొద్దిగా వాన కురిసింది. వాతావరణం చల్లబడింది. బాపూ రాత్రల్లా బాగా నిద్రపోయారు.

(సమాప్తం)




చిత్రం—ఎమ్. సాంబు (మద్రాసు-33)



చిత్రం — పి. జి. రెడ్డి (నెల్లూరు)

# కోరాడ రామచంద్రశాస్త్రి

(35 వ పేజీ తరువాయి)

బాగానసది. ఆ శరుపురకు సంగమము ఆమె పక్షములో నుండును. ఇందు వృత్తి కైశికి. విమర్శ సంధి యుండదు."

ఈ లక్షణాలన్నీ మంజరీ మధుకరీయంలో చక్కగా గోచరిస్తున్నాయి. దీనిలోని కథ ఏ పురాణంలోనూ కనిపించదు. స్వకపోల కల్పితం. మంజరీ మధుకరులు ఇందులో నాయికా నాయకులు. మంజరి అనే రాజకుమార్తె ఉషాసుందరిలాగా ఒక రాజుతో కూడి నట్లు కల గంటుంది. ఆ రాజుకూ అలాంటి కలే వస్తుంది. మంజరిని, ఆమె ఉపాధ్యాయురాలిని ఒక రాక్షసుడు హరిణ రూపంలో ఎత్తుకుపోతాడు. ఆ రాజు బాణంతో రాక్షసుని కొడతాడు. ఆ రాక్షసుడు వారిద్దరినీ ఒక పెట్టెలో పెట్టి దూరంగా విసిరివేసి రాజుతో పోరాడి చనిపోతాడు. పెట్టె ఆ రాజు పట్టపురాణికి దొరుకుతుంది. రాజు మంజరిని చూస్తే మోహిస్తాడనే భయంతో ఆమెను అంతఃపురంలో దాస్తుంది. కాని మంజరీ మధుకరులు కలుసుకుంటారు. గాంధర్వ వివాహం జరుగుతుంది. ఈ సంగతి తెలిసి పట్టపురాణి మంజరిని చెరసాలలో వేయిస్తుంది. చివరకు మంజరి రాణికి పినతల్లి కూతురని తెలిసి రాజుకిచ్చి వివాహం చేస్తుంది. క్లుప్తంగా ఇదీ కథ.

ఈ కథను నాలుగంకాలలో సంభాషణల ద్వారా నడిపినా, నాటకీయత తక్కువ. చదువుతూంటే అష్టాదశ వర్ణనలతో కూడిన శృంగార శ్రవ్య ప్రబంధంలాగా ఉంటుంది. కథనభాగం ఎక్కువ. ఒకొక్కచోట సంభాషణ పేజీలకు పేజీలు వెళ్ళి ప్రదర్శనానికి ఆటంకంగా ఉండడమేగాక, అసలు చదవడానికే విసుగెత్తిస్తుంది. ఇందులో పాండిత్య ప్రకర్షే ఎక్కువగా కానవస్తుంది. అంకవిభజనలో కూడా ప్రబంధ ధోరణే పొడగడుతుంది. మొదటి అంకంలో రాజకుమార్తె మంజరికి యవ్వనం అంకురించింది. అందువల్ల శరీరమందు కలిగి[illegible] వికారాలు ఆమెకు అర్థం కాలేదు. అదేదో జబ్బు అనుకుని మందిప్పించవలసిందని తల్లిని అడు[illegible]తుంది. తల్లి అసలు విషయం గ్రహించి ఆమెకు అర్థమయేటట్లు చెప్పడానికి ఆ మోద రేఖ అనే ఆమెను నియోగిస్తుంది. దానితో అంకం ముగుస్తుంది. ఈ అంకంవల్ల నాటక దృష్ట్యా ఏమి సాధించినట్లు? మంజరి యవ్వనవతి అయిందని ప్రేక్షకులకు తెలిసింది. అంతే. ఈ అంకంలో నాటకబీజం స్థాపితం కాలేదు. మూడవ అంకంలో స్వప్న వృత్తాంతంలోగాని నాటకబీజం స్థాపితం కాలేదు. అంకాలలో కాల స్థలైక్యాలను పాటించలేదు. రెండవ అంకంలో మంజరి విద్యాభ్యాసం ప్రారంభమవుతుంది. అంకం సగం కాకుండానే ఆమె పండితురాలవుతుంది. అంకాలను రంగాలుగా ప్రత్యక్షంగా విభజించకపోయినా రెండవ అంకంలో నాలుగు రంగాలు, నాలుగవ అంకంలో ఎనిమిది రంగాలు ఉన్నాయి.

సంభాషణలు కొన్నిచోట్ల సరళంగా నడుస్తాయి. కొన్నిచోట్ల సమాస భూయిష్ఠంగా ఉంటాయి. కొన్నిచోట్ల ప్రబంధ ధోరణిలో నడుస్తాయి.

నాటకం ఆసాంతం ప్రత్యక్ష సంఘటనలతో గాక ఎక్కువగా కథనంతో నిండి ఉంటుంది. అయితే, కథా కథనంలో కవి ప్రతిభ గోచరిస్తుంది. కుతూహలం రేకెత్తుతుంది.

1860 నాటికి ఆంధ్రదేశంలో నాటక సమాజాలు లేవు. నటులు లేరు. ఈ కవిగారికి ప్రదర్శనదృష్టి లేదు. అందుచేతనే మంజరీ మధుకరీయం ప్రదర్శనానుకూలతను అంతగా సంతరించుకోలేదు. ఏమయినా, ప్రథమాంధ్ర స్వతంత్ర రూపకంగా మంజరీ మధుకరీయానికి; ప్రథమాంధ్ర నాటకకర్తగా కోరాడ రామచంద్ర కవిగారికి గౌరవస్థానం ఇవ్వవలసి ఉంది.

## ఇతర రచనలు

వావిలాల వాసుదేవ శాస్త్రిగారి ఉత్తర రామచరిత పీఠికనుబట్టి రామచంద్ర కవిగారే మొట్టమొదట సంస్కృత నాటకం అనువదించినటు తెలుస్తున్నది. అది వేణీసంహారం. ఇదిగాక ఈయన ఉత్తర రామచరితం, ఉన్మత్త రాఘవం, ముద్రారాక్షసం, శాకుంతలం అనువదించారు.

శృంగార సుధార్ణవం, రామచంద్రవిజయం, కమనానందం, త్రిపురాసురవిజయం అనే సంస్కృత నాటకాలు రచించారు.

వీరి గ్రంథాలు మూడు మాత్రమే అచ్చు అయినాయి. (1) ఉన్మత్తరాఘవం (1891). (2) శృంగార సుధార్ణవం (1899). (3) మంజరీ మధుకరీయం (1908). శాకుంతలం రెండంకాల అనువాదం రత్నాకరమనే పత్రికలో వెలువడిందట. ★